# తెలుగులో
# పంచతంత్ర చంపువు



డా॥ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి



క్షోణితలంబునన్ నుదురుసోఁకఁగ మ్రొక్కినుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాత భవచిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుకవారిజ పుస్తక రమ్యపాణికిన్.

# తెలుఁగులో పంచతంత్ర చంపువు

( ఆంధ్ర విశ్వవిద్యాలయము : డాక్టరు పట్టపరిశోధన నిబంధము )

డా॥ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
రీడరు, తెలుఁగుశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
వి శా ఖ ప ట్ట ణ ము.

1986

# TELUGULO PANCHATANTRA CHEMPUVU

[Thesis for which PhD was awarded by the Andhra University]

ప్రః

డా॥ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
శారదాపీఠం. 46-15-35, పండావారిపేట,
విశాఖపట్నం - 530 016, ఆంధ్రప్రదేశ్.

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1986

ప్రతులు : 500



మూల్యము : 65/-

The author respectfully acknowledges the receipt of financial assistance provided by the Government of Andhra Pradesh through the Dept. of Cultural affairs to meet the part of the expenditure in bringing out this work in print.

ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్, విశాఖపట్నం-16, ఫోన్ : 65880.

# అంకితము



తల్లి : శ్రీమతి వేదుల రాజ్యలక్ష్మి

తండ్రి : శ్రీ వేదుల కృష్ణమూర్తి

సాధ్వీ శ్రీ రాజ్యలక్ష్మి మజ్జనని కృష్ణ
మూర్తి జనకుండు వాత్సల్యమూర్తి బుధుండు
కంటినిన్ రెప్పలనంగ నన్గాచి ప్రోచు
తల్లిదండ్రుల కిదె యంకితమ్ము భక్తి.

**Prof. S. V. JOGA RAO**
M. A; Ph. D; D. Litt (Hony.)
National Professor of Telugu
Past Principal A. C. L. Colleges
Andhra University, Waltair.

Tel Off: PBX 64871,
Ext. 351

వాల్తేరు
18-9-1988.

# సహృదయ భూమిక

పంచతంత్రము ప్రపంచసారస్వతమున ఎన్నికయు మన్నికయు గల గ్రంథరాజము. ప్రాచీనకాలమునుండి ప్రపంచమున పలుతావుల పలుబాసల దీనికున్నంత ప్రచురప్రచారము బైబిలునకు తప్ప మరియే గ్రంథమునకును లేదు. భర్తృహరి సుభాషితమువలె సర్వమానవ సమాజైకతానమైన ఔపదేశిక ప్రతిపత్తి గలట్టిది. ఉపరి కాంతా సమ్మితమైన కథాసంహిత యిది. తెనుగునను ప్రాచీనకాలము నుండి అద్యతనకాలము దనుక ఏతదనువాదమున కెందరో కవులెగబడిరి. వాచికరచనా చణత్వమును ప్రదర్శించి కృతార్థులైరి. వారియొక్క రచనా రామణీయకము నొకవంక సమీక్షించుచు మాతృకయొక్క పరమార్థమును విశదీకరించు నుద్యమమే ఏతత్పరిశోధన నిబంధ రచనా సముద్దేశము.

ఏతద్గ్రంథ కర్త ఎవరందురా?

చిరంజీవి వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి అన్నచో చాలదు. మఱి ఏమన వలయును? ఆంధ్రసరస్వతికి మేడకట్టుచున్న మేస్త్రి అనవలెను. అతడు నామమాత్ర సుబ్రహ్మణ్యుడు గాడు. ఈనాటి అంతర్వాణులలో బ్రహ్మణ్యుడు. గీర్వాణాంధ్ర గిరాంధురంధరుడు. నా పర్యవేక్షణ

నిమిత్తమాత్రముగాని అప్రతిమానమైన ప్రతిభతో జన్మతః ప్రాప్త సంస్కారముతో విషయ కూలంకషమైన స్వయంకృషితో ఈ పరిశోధన నిబంధము నింత బహిరంతర బంధురముగ తీర్చిదిద్దినాడు. పరీక్షకత్రయముచే ఏకగ్రీవముగ అభినందనలంది డాక్టర్ పట్టభద్రుడైనాడు. అతడు గతములో నా ప్రియశిష్యుడు. ప్రకృతమున సహావ్రతుడు.

అతనికివే నా సౌహార్ద సాధువాదములు. మనఃపూర్వక మంగళాశాసనములు.

ఇదిగో దీపము. అదిగో దీధితి.

(సం) యస్వీ. జోగారావు

'కళాప్రపూర్ణ'
డా॥ దివాకర్ల వేంకటావధాని
ఎం.ఏ (ఆనర్స్) పిహెచ్. డి.
పూర్వాంధ్ర శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

18/4 RT, బర్కత్‌పుర
హైదరాబాద్-27.

# పరోచన

మిత్రులు డా॥ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన 'తెలుగులో పంచతంత్ర చంపువు' అను సిద్ధాంతవ్యాసమును బఠించి యమందమైన యానందము నొందితిని. ఈ సిద్ధాంతవ్యాసమున కాంధ్ర విశ్వ విద్యాలయము వారు పిహెచ్. డి. పట్టమును ప్రసాదించియుండి రన్న దీని వైశిష్ట్యమును గూర్చి వేఱుగా చెప్పవలసిన యవసరము లేదు. ఐనను మిత్రుల కోరికను కాదనజాలక యీ రెండు వాక్యములు వ్రాయుచున్నాను. ఈ సిద్ధాంత వ్యాస మాఱు అధ్యాయములుగా విభజింపబడినది. ఉపసంహారమున గ్రంథముయొక్క సారాంశము సంక్షేపముగా చెప్పబడినది.

సంస్కృతమున పంచతంత్రమున కపారమైన ప్రచారమున్నది. సంస్కృతాభిజ్ఞులలో నారంభమున దానిని చదువని వారుండరు. అది బహు భారతీయభాషలలోనే కాక పాశ్చాత్యభాషలలోనికి కూడ ననువదింపఁబడి ప్రపంచకథా సాహిత్యమున విశిష్టస్థానమును వహించుచున్నది. శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములు రెండింటియందును కూలంకషమైన పాండిత్యము కలవారు. విమర్శదృష్టితో బహుగ్రంథములను పరిశీలించిన విద్వద్వరేణ్యులు. అట్టివారు విశ్వజనీనమైన పంచతంత్రము యొక్క అంధ్రానువాదమును గూర్చి వ్రాయఁబూనుట సర్వసహృదయ సంతోష సంధాయకమైన విషయము. మొదటి అధ్యాయమున వారు

సంస్కృత పంచతంత్ర చరిత్రను సంగ్రహముగా తెలిపియున్నారు. నామౌచిత్యమును గూర్చి వారు తెల్పిన విషయములు రమణీయమును ఔచిత్య శోభితములై యున్నవి. పంచతంత్రమెప్పుడు రచింపఁబడినదో, విష్ణుశర్మయు నమరశక్తియు నే కాలమునకు చెందినవారో ఇదమిత్థమని నిర్ణయించుట కాధారములు లేవు. అది క్రీ. శ. 6వ శతాబ్దమున పహ్లావీభాషలోని కనువదింపఁబడియుండుట చేతను అందు మహాభారత ప్రసక్తియును, జాతక కథల ప్రభావమును కనవచ్చుచుండుటచేతను అది క్రీ. శ. 5వ శతాబ్ది తరువాత రచింపబడి యుండునని యూహింప వచ్చును. బైబిలు తరువాత పంచతంత్రమే ప్రపంచ వ్యాప్తమైన గ్రంథములలో మొదట పేర్కొనఁదగిన గ్రంథమని ఫ్రాంక్లిన్ ఎడ్గర్టన్ తన ఆంగ్లానువాద పీఠికలో తెల్పియున్నాడు. పంచతంత్రమేఁబదికి మించిన భాషలలో రచింపబడుటయు అందు పెక్కు భారతీయేతర భాషలేయగుటయు దాని ప్రపంచవ్యాప్తికి తార్కాణములు. శ్రీ శాస్త్రి గారీ యధ్యాయమున నెవరెవరు పంచతంత్రము నే యే భాషలలోని కే యే కాలమున ననువదించి యుండిరో తెల్పియున్నారు. ఈ విషయమును తెల్పుటకు వారెంత శ్రమపడియుండిరో పరికించిన వారిసిద్ధాంత వ్యాసరచనయందు ప్రకటించిన యుత్సాహమును, శ్రమయు తెలియవచ్చును. విష్ణుశర్మ సకలార్థ శాస్త్రసారమును సమాలోచనము చేసి పంచతంత్రములతో మనోహరమైన ఈ శాస్త్రమును రచించెను. అతఁడు మనువు, పరాశరుఁడు, శుక్రుడు, చాణక్యుఁడు, వ్యాసుఁడు మున్నగువారు రచించిన గ్రంథములన్నియు పరిశీలించి యుండెను. ఇందతఁడు నీతులతోపాటు పురుషార్థములకు సంబంధించిన విషయములను కూడ చేర్చియుండెను. అతడిందలి కథలను తిర్యక్కులతో నిర్వహించుట గణనీయమైన విషయము. మానవులను పాత్రలుగా చేసినచో నాయా కథలయందలి సందర్భములను బట్టి కొందఱికి గ్రంథమును చదువుటయందు వైముఖ్యము కలుగవచ్చును. అందుచే విష్ణుశర్మ పశుపక్ష్యాదులను పాత్రలుగా జేసి అన్యాపదేశముగ పెక్కు నీతులను బోధించెను. నిజమున కవియన్నియు మానవులనుద్దేశించి చెప్పఁబడినట్టివే. అతఁడు

చెప్పిన కథలలో కావ్యత్వము కూడ తొంగిచూచు చుండును. నారాయణ పండిత రచితమైన హితోపదేశమునకును పంచతంత్రమునకును సన్నిహితమైన సంబంధమున్నది. మిత్రభేదము, మిత్రలాభము, కాకోలూకీయము, లబ్ధప్రణాశము, అపరీక్షిత కారిత్వము అనునవి పంచతంత్రమునందలి పరిచ్ఛేదములు. హితోపదేశమున మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధి అనునాలుగు పరిచ్ఛేదములే కలవు. పంచతంత్రమునందలి చివరి మూడు పరిచ్ఛేదములును హితోపదేశమున సంధి విగ్రహములను రెండు పరిచ్ఛేదములలో సంగ్రహింపఁబడినవి. హితోపదేశమందలి పెక్కు కథలు పంచతంత్రము నుండియే గ్రహింపబడినవి. నారాయణ పండితుఁడు పంచతంత్రము నుండియే కాక ఇతర గ్రంథముల నుండి కూడ కొన్ని కథలను గ్రహించి యుండును. కథా స్వరూప స్వభావములను పంచతంత్రమున సమన్వయము చేసి చూపుటలో శ్రీ శాస్త్రిగారు ప్రకటించిన నేర్పు ప్రశంసా పాత్రముగా నున్నది.

మూఁడవ అధ్యాయమున శ్రీ శాస్త్రిగారు తెనుఁగున కనువదింపఁబడిన మూఁడు చంపువులను గూర్చియుఁ బరిశీలించిరి. వానిని రచించినవారు క్రమముగా దూబగుంట నారాయణకవి (క్రీ. శ. 15 వ శతాబ్ది) భానుకవి (క్రీ.శ 16 వ శతాబ్ది) బైచరాజు వేంకటనాథుఁడు (16 వ శతాబ్ది) అనువారు. భానుకవి తన పంచతంత్రిని కృష్ణరాయ కార్యభారధౌరేయుఁడును నాట్యాచార్యుఁడునైన లక్ష్మయామాత్యున కంకితముచేసెను. చతుర్థాధ్యాయమున పై మువ్వురు కవుల యనువాద విధానము వివరింపఁబడినది. వారు పంచతంత్రమందలి కథలను హితోపదేశమునందలి నీతి శ్లోకములను కావ్యపద్ధతిలో ననువదించియుండిరి. శ్రీ శాస్త్రిగారు కథానువాదము, నీత్యనువాదము అని యనువాద విధానమును రెండు తెఱఁగులుగ విభజించి కవులెచ్చట సంక్షేపించిరో, యెచ్చట విపులీకరించిరో, యెచ్చట నన్యథాకరించిరో తెల్పియున్నారు. ఇదివారి నిశిత పరిశీలనమును పాండితీపాటవమును ప్రకటించుచున్నది.

పంచమాధ్యాయము చంపువుల కావ్యత్వ సమీక్షకు సంబంధించి నది. సిద్ధాంతవ్యాసమునకిది హృదయము. శ్రీ శాస్త్రిగారి విమర్శన వైదగ్ధ్యమునకు నికషోపలము. ఆంధ్రకవులు పాత్రపోషణమునందును, వర్ణనములందును, తిర్యఙ్మనుష్య స్వభావ చిత్రణమునందును, అవి సందర్భానుగుణముగా పరివర్తనము చెందుటయందును ఔచిత్యమునకై కథాంశములను విపులీకరించుటయందును, మూలకర్త భావములకు మెఱుఁగులు దిద్దుటయందును, సంఘమునందలి మానవుల సంబంధ విశేషములను వివరించుటయందును, రసరసాభాస పోషణము నందును ప్రకటించిన నేర్పును శ్రీ శాస్త్రిగారు లెస్సగా ప్రదర్శించి యున్నారు. బైచరాజు వేంకటనాథుఁడు గురువు రాజకన్యను నిరాకరించిన కథలోని రాజకన్య పాత్రను భువనమోహిని జయసేనుని వివాహ మాడిన కథను వర్ణించిన తీరు పరమాద్భుతముగా నున్నది. కావ్యము లందష్టాదశ వర్ణనము లుండవలెనని లాక్షణికులందురు. కొందఱష్టాదశాధిక వర్ణనములను కూడ పేర్కొనిరి. శ్రీ శాస్త్రిగారు పంచతంత్రకవు లొక్కొక్క వర్ణ్యము నే యెట్లు వర్ణించియుండిరో సోదాహరణముగా నిరూపించిరి.

శ్రీ శాస్త్రిగారు శైలి యననేమో నిర్వచించి పంచతంత్రకవులు కేవల కథా కథనాత్మకముగనే గాక వర్ణనాత్మకముగను ప్రౌఢముగను దమకావ్యములను నిర్వహించిరనియు, వేంకటనాథుని శైలి యాద్యంత ప్రౌఢసుందరముగా నుండుననియు తెల్పి యుదాహరణము లొసంగిరి. వారి రచనలలో నచ్చటచ్చట నాటకోచితమైన సంభాషణశైలియు గోచరించును. వారే యేసందర్భములం దేయే వృత్తములనుపయోగించి యుండిరో కూడ శ్రీ శాస్త్రిగారు పరిశీలించి వేంకటనాథుని శైలిని గూర్చి కీ॥ శే॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి యభిప్రాయము నుగ్గడించిరి. వారా కవులు వాడిన జాతీయములను నుడికారములను సూచించియుండిరి. కథలయందలి పాత్రలయు, ప్రదేశములయు నామముల విషయమున తెలుఁగుకవులు కొంత స్వాతంత్ర్యము వహించిరి.

భాను వేంకటనాథులు తాము క్రొత్తగా రచించిన కథలలోని పాత్రలకు సార్థకములైన నామములుంచియుండిరి. శ్రీ శాస్త్రిగారు బైచరాజు కావించిన కొన్ని ప్రయోగములను గూర్చి వేంకట శాస్త్రిగారి యభిప్రాయమును తెల్పియుండిరి.

షష్ఠాధ్యాయమున శ్రీ శాస్త్రిగారు పంచతంత్రమునకుఁ గల యితరానువాదములను గూర్చి సంగ్రహముగా చర్చించిరి. వీనిలో కొన్ని లభ్యములు కొన్ని కతిపయపద్యమాత్రావశిష్టములు. రాజనీతి రత్నాకరమును గూర్చియు, చిన్నయసూరి నీతిచంద్రికను గూర్చియు, కందుకూరివారి సంధివిగ్రహములను గూర్చియు, మల్లాది లక్ష్మీపతి శాస్త్రిగారి యనువాదమును గూర్చియు శ్రీ శాస్త్రిగారు కొంత విపులమైన సమీక్ష కావించిరి. శ్రీ మల్లాదివారి నిర్వచన నీతిచంద్రిక చిన్నయసూరి గ్రంథమునకు పద్యానువాదము. పత్రికలలో ప్రచురింపఁబడిన అనువాదములను గూర్చియు, చిత్రాత్మకములైన రచనలనుగూర్చియు, నాంగ్లానువాదములను గూర్చియు కూడ శ్రీ శాస్త్రిగారు సంగ్రహముగా సమీక్షించి యుండిరి. ఎడ్గర్టన్ అనువాదము సరళము, రైడరుగారిది జటిలము. రైడరుగారి యనువాదమున శ్లోకములు పద్యరూపమున ననువదింపబడినట్లున్నవి. అంతు చంపూకర్తలనువదింపని కథలు కూడ కొన్ని గలవు. మూలపంచతంత్ర హితోపదేశములలో చిత్రాంగుని పూర్వచరిత్ర లేదు. దూబగుంట నారాయణకవి యనువాదమునను ఆంగ్లానువాదములందును అది కలదు. వారికి లభించిన సంస్కృత ప్రతిలో నదియుండియుండును. తమ సిద్ధాంత గ్రంథశీర్షిక చంపూకవులకే పరిమితమైనను శ్రీ శాస్త్రిగారితరములను కూడ సంగ్రహముగానైన సమీక్షించుట పంచతంత్రమును గూర్చి తెలిసికొనఁగోరు వారి కుపయోగకరముగా నుండుటయే కాక వారి గ్రంథమునకొక సమగ్రత్వమును కూడ కలిగించుచున్నది.

శ్రీ శాస్త్రిగారుభయ భాషలలో పండితులు. కుశాగ్రబుద్ధులు. సద్విమర్శకులు. అందుచే వారి గ్రంథము సర్వాంగసుందరమును, సద్వి

మర్శకాదర్శ ప్రాయమునునై యొప్పారుచున్నది. ఆనందవర్ధనాద్యాలంకారికుల గ్రంథములనుండి వారుద్ధరించిన భాగములు వారి పాండితీ పరిణాహమును సూచించుచున్నవి. పంచతంత్రమును గూర్చి యెవ్వారే భాషలో వ్రాసిన గ్రంథమునైనను వారుపఠించినట్లు కన్పించును. అది వారి జిజ్ఞాసకును, పరిశ్రమకును తార్కాణము. వారిశైలి నిర్దుష్టమును, విస్పష్టమును, సలక్షణమునై చదివినకొలంది చదువవలెనను నుత్కంఠ రేకెత్తించుచున్నది. సర్వప్రపంచాదరాభిమానములను చూఱగొను చున్న పంచతంత్రవాదములను గూర్చి యింత సర్వసంబోధమును, సమగ్రమునైన సిద్ధాంతవ్యాసమును రచించిన శ్రీ శాస్త్రిగారిని హృదయపూర్వకముగా నభినందించు చున్నాను.

పంచతంత్రనువాదానాం
చంపూనాం సద్విమర్శనమ్
సుబ్రహ్మణ్య కృతం జీయాత్
జగత్యాచంద్ర తారకమ్.

(సం) దివాకర్ల వేంకటావధాని

డాక్టర్ లకంసాని చక్రధరరావు
ఎం. ఏ., పిహెచ్. డి.
రీడరు, తెలుగు శాఖాధ్యక్షులు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం.

# ప్రశంస

దూబగుంట నారాయణకవి భానుకవి బైచరాజు వేంకటనాథుల పంచతంత్ర చంపూగ్రంథాలను ప్రధానంగా తీసుకొని సమగ్రంగా సమీక్షించి 'తెలుఁగులో పంచతంత్ర చంపువు' ను పరిశోధనాంశంగా స్వీకరించి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నుంచి పిహెచ్. డి పట్టాన్ని పొందిన డాక్టర్ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సహోద్యోగులే కాక సహృదయులైన ఆప్తమిత్రులు. గురుకులక్లిష్టులై పెద్దల నుంచి విద్యను సముపార్జించిన వారు వీరు. 'అనుపాసిత వృద్ధానాం విద్యా నాతి ప్రసీదతి' అని కదా భర్తృహరి వాక్యపదీయవాక్యం. వీరికి కల సంస్కృతాంధ్రాంగ్ల భాషా పాండితీ ప్రతిభా విశేషాలు ఈ గ్రంథ రచనకు అశేషంగా తోడ్పడ్డాయి.

వ్యక్తుల పేర్లు సార్థకాలు కావచ్చు కాకపోవచ్చు. కాని కావ్యాలపేర్లు నిరర్థకాలు కాజాలవు. గ్రంథంపేరు విన్నంతమాత్రాన కథాస్వరూపం మనోముకురంలో మూర్తిమంతమై ప్రతిబింబిస్తుంది. పంచతంత్ర నామౌచిత్యం గురించి సంస్కృత పంచతంత్ర ప్రాచీనతా వ్యాప్తుల గురించి సంస్కృతి పంచతంత్ర సంగ్రహ చరిత్రలో చక్కగా వివరించబడింది. ప్రాచ్యపాశ్చాత్య విమర్శకుల కథాలక్షణాలు పంచతంత్రకథల కేవిధంగా సమన్వయించవచ్చునో రెండో అధ్యాయంలో వీరు నిరూపించారు. మూడో అధ్యాయంలో ఆంధ్ర పంచతంత్ర చంపూ కర్తల వారి గ్రంథాల చరిత్ర వివరించబడింది. ఆంధ్రీకరించటంలో

ఆంధ్రపంచతంత్ర చంపూ కర్త లనుసరించిన తత్త్వ పునరుక్తులు కల కథల్ని వదలివేయటం చమత్కార రహితగాథల్ని విడిచి పెట్టటం, బ్రాహ్మణాపకర్ష ప్రభుత్వాన్నత్య భంజక కథానకాల్ని పరిత్యజించటం, అనౌచిత్యద్యోతక సన్నివేశాల్ని పరిహరించటం మొదలైన విధానాన్ని నాల్గో అధ్యాయంలో వివరించటంతోపాటు ఆయా అనువాద పద్ధతుల్ని డాక్టర్ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సోదాహరణంగా ప్రామాణికంగా నిరూపించారు. ఐదో అధ్యాయమైన 'పంచతంత్ర చంపువుల కావ్యత్వ సమీక్ష' ఈ సిద్ధాంత వ్యాసానికి 'జీవగఱ్ఱ'. సంస్కృత పంచతంత్ర గ్రంథం నీత్యుపదేశం ప్రధానంగా భావించగా తెలుగు కవులు కావ్యత్వాన్ని కాంక్షించారు. 'కవివృషభులు మహాకావ్యమనియు' భావించేటట్లుగా వ్యాస నన్నయ భట్టారకుల ఒరవడిని ఆంధ్ర కవులందరూ అలవరచుకొన్నారు. ఈ పద్ధతి ఈ తెలుగు పంచతంత్ర కర్తల పాత్రచిత్రణ రసపోషణ వర్ణన నిర్వహణ శైలీవిన్యాస పద ప్రయోగ వైచిత్ర్యాదుల్ని బట్టి మనకు అవగతమవుతుంది. వ్యాకరణాద్యనేక విశేషాలు వివరించబడ్డాయి. 'ఇతర పంచతంత్రానువాదముల సంగ్రహ పరిచయము' ఆరో అధ్యాయంలో భావిపరిశోధకుల ఉపయోగార్థం కావించబడింది.

తమ సిద్ధాంత వ్యాసాన్ని సంపూర్ణంగా ప్రకటించి ప్రత్యక్ష దైవ స్వరూపులైన తల్లిదండ్రులకు అంకితమిచ్చిన డాక్టర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ధన్యులు. వీరు ఇంకా అనేక సద్గ్రంథాల్ని రచించి ప్రచురించగలరని నమ్ముతున్నాను.

అభినందనలతో

8-11-1986 (సం) లకంసాని చక్రధరరావు

# కైమోడ్పు

చిన్ననాటనే వాత్సల్యముతో సాహిత్య మంత్రోపదేశ మొనరించిన విద్వత్పట్టభద్రులు బ్రహ్మశ్రీ వేదుల కృష్ణమూర్తి పితృపాదులకు నమస్సుమనోఽంజలులు.

సంస్కృతాంధ్ర సాహిత్య తత్త్వోపదేశ మొనరించుటయే గాక అస్మత్పరిశోధన వ్యాసంగ పర్యవేక్షకత్వమున కామోదించి నాచే నిర్వహింపజేసిన ఆంధ్ర విశ్వకళా పరిషత్తులోని మా తెలుగు శాఖకు అప్పటి అధ్యక్షులు ఆచార్య యస్వీ. జోగారావు గురుచరణములకు నమస్సుమనస్సులు. నా సర్వతోముఖాభివృద్ధికి ప్రముఖకారకులైన వారి యవ్యాజ శిష్య వాత్సల్య మత్యంత స్మరణీయము.

నా పరిశోధన విషయమున ఇంకొక్క మాట చెప్పవలసినది యున్నది. మొట్టమొదటగా నా పరిశోధనకు పర్యవేక్షకత్వము వహించినవారు ఆచార్య కె. వి. ఆర్ నరసింహంగారు. అనంతరము ఆచార్య తూమాటి దోణప్పగారు. దైవికములైన ప్రత్యూహముల వలన కొనసాగకుండుటచే నైరాశ్యముతో నున్న సమయమున అనుగ్రహించి ఈ పరిశోధన మహాధ్వరమును నాచే నిర్వహింపజేసిన గురుచరణులు ఆచార్య యస్వీ. జోగారావుగారు. వారికి పునః ప్రణామము లొనరించుట నావిధి. అట్లే పరిశోధనమునకు ఆశ్రయ మొసంగిన ఆ గురుద్వయమునకును కృతజ్ఞతాభి వందనములు.

విద్యాభ్యాసకాలమున ఉన్నత పాఠశాలయందును, కళాశాలయందును విశ్వవిద్యాలయమునను సంస్కృతాంధ్ర సాహిత్య వైభవమును బోధించిన దేశికోత్తము లెల్లరకును సభక్తి ప్రాంజలులు. అందును కళాప్రపూర్ణ ఆచార్య గంటి జోగి సోమయాజి మహోదయులకు కళాప్రపూర్ణ దుఫ్ఫ్వారి వేంకటరమణశాస్త్రి పూజ్య పాదులకు ప్రత్యేకాభివందనములు.

ప్రాచ్యశాస్త్ర పరిజ్ఞానమును ప్రసాదించిన పండిత పరమేశ్వరులు బ్రహ్మశ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ, M. A. P.O.L. (విశ్రాంతోపాధ్యాయులు, సంస్కృత విభాగము, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు) ప్రభృతులకు బద్ధాంజలులు. కలిగిన సందేహములను దీర్చిన గురుదేవులు బ్రాహ్మీభూషణ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి, M. A. P.O.L. (విశ్రాంత పండితులు, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు) గారికి ప్రాంజలులు.

ఈ గ్రంథ రచనావసరమున ప్రాచీనపండితులు, వివిధ విశ్వవిద్యాలయములందలి యధ్యాపకులు రచించిన పెక్కు విమర్శన వ్యాసములు, గ్రంథములు, పరిశోధన నిబంధములు నాకు మార్గదర్శకములైనవి. తత్కర్తలందఱకు నా సాధువాదములు.

మిసెస్. ఏ. వి. యన్. కళాశాలలో నేను ఆంధ్రోపన్యాసకుడుగా నున్న సమయమున నా పరిశోధన వ్యాసంగమున కనుమతించి ప్రోత్సహించిన నాటి కళాశాలాధ్యక్షులు విద్వాన్ దివాకర్ల రామమూర్తి M. A, గురుచరణులకును అట్లే ప్రోత్సాహప్రోద్బలముల నొసంగిన ఆ కళాశాలలో సహోపన్యాసకులు, పరమమిత్రులునైన శ్రీ పాటీలు తిమ్మారెడ్డి, M. A. గారికి గూడ కృతజ్ఞతాభి వందనములు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకీ పరిశోధన నిబంధమును సమర్పించునపుడు లిఖితప్రతిని సిద్ధపఱుచుటలో సహకరించిన చి॥సౌ॥ M. లలితాబాయి MA కిని అట్లే చేదోడై యుపకరించిన చి॥ రాచపూడి పద్మావతి MA కిని, చి॥ పులఖండం జగన్నాథరావు M. A (ఆంధ్రోపన్యాసకుడు, సిద్ధార్థకళాశాల, విజయవాడ)కి గూడ కృతజ్ఞతలు. మువ్వురును నాకు విద్యార్థులే యగుటచే వారికి శుభాశీః పరంపరలు.

ఈ పరిశోధన నిబంధమునకు డాక్టర్ పట్ట మొసంగుటకు ఆమోదము తెలిపిన ఆచార్య బిరుదరాజు రామరాజుగారికి, కీ॥ శే॥ ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారికి, శ్రీమతి డా॥ టి. సుశీలగారికి ముద్రణమునకనుమతించిన మా ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారికి బహు కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథ ముద్రణ విషయమున పట్టుపట్టి నాకంటె నెక్కువ శ్రద్ధాసక్తులు చూపిన సుహృద్వర్యులు డా॥ నడుంపల్లి శ్రీ రామరాజు ( ఉపన్యాసకులు, తెలుగుశాఖ, యూనివర్సిటీ ఆఫ్ హైదారాబాద్, హైదారాబాద్ ) గారికి ఎట్లు కృతజ్ఞతలు తెలుపవలయునో తోపకున్నది. వారి నిసర్గసౌహార్దమునకు హార్దిక మంగళాశాసనములు.

అట్లే ఈ నిబంధగ్రంథము నెచ్చట ముద్రింపవలయునో నిశ్చయమునకు రాలేని సమయమున వ్యాపారదృష్టిని వెనుకకునెట్టి ఆత్మీయతతో తమ ముద్రణాలయమున ముద్రింపవలెనని ప్రోత్సహించిన ఎక్వేరియన్ ముద్రణాలయాధిపతియు, మా పూర్వ విద్యార్థియునైన చి॥ పి. కృష్ణమోహన్ గారికి, అట్లే ఈ గ్రంథము సర్వాంగసుందరముగా ముద్రింపబడవలెనని శ్రద్ధచూపిన మిత్త్రులు శ్రీ వి. ధనంజయ కుమార్ గారికి కూడ కృతజ్ఞతాభినందనలు. ముద్రణ సందర్భమున ప్రూఫులు తెచ్చుట మున్నగు పనులందు సహకరించిన మా చిరంజీవులు వేంకట సుబ్రహ్మణ్యం, శారద, రామకృష్ణలకు శుభాశీస్సులు.

ఈ ముద్రితప్రతిపై అభ్యర్థింపఁగా దమ యమూల్యములైన యభిప్రాయములను దయతో నొసంగిన జాతీయాచార్యులు యస్వీ. జోగారావుగారికి, కళాప్రపూర్ణులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి, అస్మదాంధ్రశాఖాధ్యక్షులు డా॥ లకంసాని చక్రధరరావు గారికి కృతజ్ఞతాపూర్వక నమస్సుమనస్సులు.

నా సాహిత్య జీవితమునను అర్ధాంగియై అనేక విధములుగ సహకరించుచున్న శ్రీమతి వేదుల ప్రభావతి M.A. కి శుభాశీస్సులు.

పితౄణమును గొంతయైనను దీర్చుకోవలెనను సంకల్పముతో ఈ గ్రంథమును స్వీకరింప నర్థింపగా నంగీకరించుటయే గాక వాత్సల్యముతో ముద్రణకు ద్రవ్యసాహాయ్యమును గూడ గావించిన పితృదేవులకు మఱియొక పర్యాయము కృతజ్ఞతాంజలులు సమర్పించుచుంటిని.

రచయిత

వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

# అవతరణిక

పశుపక్షులను పాత్రలుగా జేసి సార్వజనీనమైన నీత్యుపదేశ మొనరించుచు విష్ణుశర్మ సంస్కృతమున రచించిన పంచతంత్రము ప్రపంచ కథానక శాఖలో ప్రముఖస్థాన మలంకరించు చున్నది. ఆ పంచతంత్రమునకు దూబగుంట నారాయణకవి, భానుకవి, బైచరాజు వేంకటనాథుడు తెనుగున గావించిన చంపూనువాదములు బహుళ ప్రచారమున నున్నవి.

కాలపౌర్వాపర్యమునుబట్టి బైచరాజు వేంకటనాథుడు కడపటి వాడేయైనను కవితా ప్రౌఢిమచే నగ్రగణ్యుడు. మొదట ఆ వేంకట నాథుని పండితైక వేద్యమైన అనువాదము నొక్కదానినే గ్రహించి పరిశోధన మొనరింప సంకల్పము గల్గినది, గాని విషయ సమగ్రతా సంపాదనమునకై చంపూవాంధ్రీకరణములను గ్రహించి యనంతరము తక్కిన యనువాదములను గూడ సమీక్షించితిని.

దూబగుంట నారాయణకవి యనువాదముపై 'దూబగుంట నారాయణ కవికృత పంచతంత్రం' అను శీర్షికతో శ్రీమతి పద్మినీలత బి. టి. (ఉస్మానియా విశ్వవిద్యాలయము), 'దూబగుంట నారాయణ కవి–పంచతంత్ర పరిశీలనము' అను శీర్షికతో శ్రీ యస్. సుబ్బారెడ్డి (ఆంధ్ర భారతి, శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయ కళాశాల, అనంతపురం) పరిశోధన నిబంధములు రచించినారు. ప్రతి పద్యము నందుఁ జమత్కృతి గలుగం జెప్పంగ నేర్చిన బైచరాజు వేంకటనాథుని యనువాదముపై ఇంకను నిశితముగ బరిశోధింపవలసిన యావశ్యక మెంతేని గలదు. నేడు లభించుచున్న వేంకటనాథుని యనువాదమున గొన్ని స్థలములందు యతిభంగములు గానవచ్చుచున్నవి. 1. యుం। ఢరెవారల గౌరవంబు గరిమవడియెనే (1ఆ–పద్య 176) 2. మర్మముల్।

ద్రివ్య మెఱుంగు మేని చెలువం బెడఁజేయక చూడ...(2అ-పద్య 248)
కావున (బౌర పరిష్కారము గావించి యెవ్వరైనఁ బరిశోధన మొన
రించినచో ఆ మహాకవి రచనకు సార్థక్యము చేకూరఁ గలదు.

ఈ నిబంధ రచనమున పంచతంత్రి పాశ్చాత్య సాహిత్య ప్రవేశ ప్రచారముల సమీక్షకు Franklin Edgerton గావించిన యాంగ్లాను వాదగ్రంథ పీఠిక యాధారమైనది. ఈ గ్రంథ రచనమున గ్రహింపఁ బడిన ముఖ్య గ్రంథముల ప్రచురణాదికము ముఖ్యోపజీవ్య గ్రంథ సూచికయందుఁ జేర్కొనఁ బడినది. ఆశ్వా, పద్య మన్నగు సంకేతములు అనావశ్యమను తలంపుతో వివరింపఁ బడలేదు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు సమర్పింపఁబడిన పరిశోధన నిబంధము ఆఱువందల ముప్పదిపుటలుగలది. ముద్రణ సందర్భమున సంక్షేపించి రచింపఁబడుటచేఁ బెక్కువిషయము లిందు విడువఁబడినవి. వివరములు వలయువారు ఆంధ్రి విశ్వవిద్యాలయమునకు సమర్పింపఁబడిన గ్రంథమును బరిశీలింతురు గాక. అట్లే పద్యముల నుదాహరించునపుడు ఇందుఁ గొంతభాగము మాత్రిమే యొసంగఁబడినది. తక్కిన భాగము పద్య సంఖ్యను బట్టి గ్రహింపనగును.

ఈ పరిశోధన ప్రబంధమును సరళమగు గ్రాంథిక భాషలో రచించుట కుపక్రమించుటచేఁ గొన్ని తావులందు విసంధులు పాటింపఁ బడినవి. ద్రుతసంధ్యాదికము విడువఁబడినది. అట్లే మొదట మూఁడు ప్రకరణముల వఱకు అర్థానుస్వారము ప్రయోగింపఁబడినను ముద్రాపకులు ప్రకటించిన క్లేశమును బురస్కరించుకొని మిగిలిన భాగమున అసంతృప్తికరముగనే యున్నను అరసున్న తొలగింప వలసి వచ్చినది. ఎంత జాగరూకతతో ప్రూపులు చూచినను గొన్ని ముద్రణ స్ఖాలిత్యములు తొలగినవికావు. పండితపట్టభద్రులు, సహృదయ శిరోమణులు నైన పాఠకోత్తములు వీనిని మన్నింతురు గాక.

"గుణదోషౌ బుధోగృహ్ణన్నిందుక్ష్వేడా వివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి"

ఇట్లు
బుధజన విధేయుఁడు

వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

# విషయానుక్రమణిక



# 1. సంస్కృత పంచతంత్ర సంగ్రహ చరిత్ర

కథానక కావ్యశాఖ పాశ్చాత్య సాహిత్యము లన్నింటను పేరు ప్రఖ్యాతులు సంతరించుకొనినది. సంస్కృత కథానక కావ్య బాహుళ్య మున పంచతంత్రము ప్రముఖ పాత్ర వహించుచున్నది. తెనుఁగులోని పంచతంత్రానువాదములను సమీక్షించునపుడు సంస్కృత పంచతంత్ర స్వరూప స్వభావములను సంగ్రహముగ ననుశీలించుట అత్యంతావ శ్యకము.

## నామౌచిత్యము :

మహా కవులు గ్రంథ రచనమునను, దన్నామకరణమునను గూడ నౌచిత్యమున కధిక ప్రాధాన్య మొసంగుదురు. అవతార పురు షుఁడైన రామచంద్రుని కథకు స్థాన మగుటచే రామాయణమను నామ మేర్పడినది. ఉత్పత్తి పరిపూతమైన సీత చరిత్రము గలది యగు టచే దానికి సీతా చరిత్రమను నామాంతరము గూడఁ గల్గినది. భరత వంశజుల మహత్తర జీవిత విశేషములభివర్ణింపఁబడుటచే మహా భారతమను పేరు సార్థకమైనది. అట్లే ధర్మ విజయ నిరూపకమగుట దానికి జయమను నామము గూడ వ్యాసోదిష్టమైనది. అభిజ్ఞాన శాకుం తలము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికమనువానిలోఁ దత్ తత్కథా గమనమున ప్రధాన పాత్ర వహించిన అంగుళీయకాదులఁ బట్టి యాయా నామములుంచఁబడినవి. మాలవికాగ్నిమిత్రము మాలతీ మాధవము వంటి గ్రంథములకు నాయికా నాయకుల పేరు మీఁదుగా ఆయా సంజ్ఞలు గల్గినవి. నామకరణమును బట్టి కావ్యగత గుణ దోషములు గ్రహింపఁ బడఁగలవను భావము క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చలో నామౌచిత్య వివరణ సందర్భమున నిట్లు పేర్కొనఁబడినది.

"నామ్నా కర్మానురూపేణ జ్ఞాయతే గుణదోషయోః
కావ్యస్య పురుషస్యేవ వ్యక్తిః సంవాద పాతినీ"

ఏ కావ్య నామము కర్ణపుటములఁ బడినంతనే ఆ కథా స్వరూపము మనోముకురమున ప్రతిఫలించునో యా కావ్య నామము సార్థకము.

విష్ణుశర్మయను పండితుఁడు తన రచనమునకు 'పంచతంత్ర'మను పేరు పెట్టినాఁడు. "పంచనాం తంత్రాణాం సమాహారః పంచతంత్రమ్, పంచతంత్రి మస్యాస్తీతి పంచతంత్రమ్" (కావ్యమ్) అని నామ రూప సాధనము. పంచ సంఖ్యగల తంత్రిముల సమాహారము పంచతంత్రము. పంచతంత్రము ఈ కావ్యమునకుఁ గలదు అను నర్థమున పంచతంత్ర మను నామ మేర్పడును.

తంత్ర్ —కుటుంబధారణే, తను— విస్తారే అను ధాతువుల నుండి తంత్రమ్—అను కృదంత రూప మేర్పడును. "తంత్రం ప్రధానే సిద్ధాంతే సూత్రవాయే పరిచ్ఛదే" అని తంత్ర శబ్దము నామలింగాను శాసనమున వివరింపఁబడినది. ప్రధానము, సిద్ధాంతము, నూలిపడుగు, పరివారము అని యర్థములు. ఆ సందర్భమున రచింపఁబడిన లింగాభట్టీయ వ్యాఖ్యానమున[1]

'అథతంత్రంస్యాత్ కుటుంబార్థే చ కర్మణి,
ర్తవ్యతాయాం చ సాధారణవిధౌ తథా
శిలాయామమృతాయాంచ తంత్రవీణాగుణేతనా

ఇతి శేషః" అనియు తంత్రం స్వరాజ్య చింతాస్యాదితి వైజయంతీ" యనియు నితర నిఘంటు నిరూపితార్థములు పేర్కొనఁబడినవి. ధనంజయ నిఘంటువున "తంత్రం ప్రధానే సిద్ధాంతే సైన్యేతంతౌ పరిచ్ఛదే" అని తంత్ర శబ్దము వ్యాఖ్యానింపఁబడినది. (శ్రీ) శీలప్ప రామకృష్ణ శాస్త్రిగారు నాయికా నాయకుల రతి క్రీడలకు సంబంధించిన యైదు విషయములకుఁ బంచతంత్ర వ్యవహారము స్మరస్మృతిలోఁ గలదని

1. పుట-817-18.

"ఘటితం కుట్టితం క్లీతం నామితం ఘట్టితం తథా
ఏతాని పంచతంత్రాణి భాషితాని స్మరస్మృతౌ"

అని యుదాహరించి వివరించినారు.[2]

పాలనమను నర్థమున 'రాజ్యతంత్రః పరంతప' అని వాల్మీకి రామాయణమునను,[3] 'అవిశ్రమోఽయం లోక తంత్రాధికారః,' 'ప్రజాః ప్రజా స్వా ఇవ తంత్రయిత్వా' అని కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతల పంచమాంకమునను ప్రయోగములు గలవు. ఇతికర్తవ్యతార్థమున కామ శబ్దము తోలగించి తంత్ర శబ్దము 'కామతంత్ర ప్రధానశ్చ' అని రామాయణమున[4] ప్రయోగింపఁబడెను. వశము, అధీనమను నర్థములలో స్వతంత్రము పర తంత్రమునను ప్రయోగములు గలవు. ఈ యర్థముననే దశకుమార చరిత్రలో 'దైవ తంత్రం దుఃఖమ్మ'ని ప్రయోగింపఁబడినది. గీతగోవిందమున ప్రధాన సిద్ధాంతమను నర్థమున "జితమనసిజ తంత్ర విచారమ్మ"ను ప్రయోగము గలదు. పరివారమను నర్థమున "తంత్ర సమేతులై ధరణీశు కడకు" అని సోమన బసవ పురాణమున ప్రయోగించినాఁడు. మేఘదూత మందలి "తంత్రీమార్ద్రాం నయనసలిలైః" అను ప్రయోగ మందలి తంత్రీశబ్దమునకు లోహపుఁ దీగెలు గలది వీణయని యర్థము. పూర్వ మీమాంస యను నర్థమున మల్లినాథసూరి సంజీవని వ్యాఖ్యాన పీఠికలో 'అంతస్తంత్ర మరంస్త' యని ప్రయోగించెను. ఈ యర్థముననే ధూర్జటి గూడఁ గాళహస్తీశ్వర శతకమున "పరిశీలించి మంత్ర తంత్రముల" అని ప్రయోగించె నన వచ్చును.

విష్ణుశర్మ పంచతంత్రమను గ్రంథ నామమునఁ దంత్ర శబ్దము నేయర్థమున ప్రయోగించెనో యెందును స్పష్టముగఁ జెప్పఁబడలేదు. గ్రంథారంభ మందలి కథా ముఖమున 'తంత్రైః పంచభిరేతచ్చకార

2. ఆర్షవిజ్ఞాన సర్వస్వము—ప్రథమభాగము, పుట 97.

3. అయోధ్య—సర్గ 112 శ్లోకము 25. 4. కిష్కింధ—సర్గ 18— శ్లోకము 12.

సుమనోహరం శాస్త్రమ్,' 'మిత్రభేద మిత్రప్రాప్తి కాకోలూకీయ లబ్ధ ప్రణాశాఽపరీక్షితకారకాణి చేతి పంచ తంత్రాణి రచయిత్వా' అని మాత్రము రచింపఁబడెను. దీనిని బట్టి పంచతంత్రమున మిత్రభేద మిత్రప్రాప్త్యాది విషయము లైదు ప్రకరణములలో రచింపఁబడిన వని నిశ్చయింపవచ్చును. ఇందలి తంత్ర శబ్దమునకు ప్రధాన సిద్ధాంతము, రాజ్య పాలనకు సంబంధించిన విషయము, కుటుంబ ధారణకు లేదా ఇతి కర్తవ్యతకుపయోగించు విషయము, ప్రకరణమను నర్థములు చెప్ప వీలున్నది. గ్రంథ విభాగము, పరిచ్ఛేదమను నర్థ మత్యంత సమంజస మైనది.

## ప్రాచీనత :

పంచతంత్ర రచనా కాలమును ఇదమిత్థముగా నిర్ణయించుటకు నాధారములు మృగ్యములు. గ్రంథమున విష్ణుశర్మ రచించెనని మాత్రమే గలదు. కథా భాగమునఁ బేర్కొనబడిన అమరశక్తియను ప్రభువు చరిత్రలో నెక్కడను గానరాఁడు.

పంచతంత్రము కాలానుగుణముగ ప్రక్షిప్తములతో బెక్కు మార్పులు పొందినదసియు దాని ననుసరించి యనంతర కాలమున రచింపఁబడిన తంత్రాఖ్యాయిక, పహ్లవిప్రతి, బృహత్కథ, దక్షిణ దేశ పంచతంత్రప్రతి, నేపాళ దేశప్రతి, పురాణభద్రప్రతి, మేఘవిజయుని ప్రతి, హితోపదేశము, అన్నంభట్టుప్రతి అను గ్రంథములఁ బట్టి పంచ తంత్ర స్వరూప స్వభావములూహించుటకు నవకాశము గలదని సాహిత్య విమర్శకులభిప్రాయ పడుచున్నారు. దీనిని బట్టియుఁ బంచ తంత్ర కాల నిర్ణయము బహు కష్ట సాధ్యమనుట స్పష్టము.

పంచతంత్రమున మహాభారత ప్రసక్తి యుండుటచేఁ దదనంత రము గ్రంథము రచింపఁబడి యుండు ననవచ్చును. పంచతంత్రమున జాతక కథా ప్రభావము గలదని మేగ్డనాల్ వంటి విమర్శకులు నిర్ణ

యించిరి.[5] జాతక కథలు క్రీ. పూ. 4వ శతాబ్ది నుండి క్రీ. శ. 5వ శతాబ్ది లోపున రచింపఁబడి యుండునని విమర్శకుల నిర్ణయము. పంచతంత్రము క్రీ. శ. 5వ శతాబ్ద్యనంతరము రచింపఁబడి యుండును.

క్రీ. శ. 7వ శతాబ్దికిఁ జెందిన శ్రీహర్షుని నాగానంద మందలి 'ధ్యానవ్యాజముపేత్య' అను నాందీ శ్లోకము పంచతంత్ర మందలి అపరీక్షితకారిత్వమను పరిచ్ఛేదమునఁ గలదు. అట్లే ఆ శతాబ్దికే చెందిన భర్తృహరి నీతి శతకమందలి 'ప్రారభ్యతే నఖలు విఘ్నభయేననీచైః' అను శ్లోకము పంచతంత్ర కాకోలూకీయముననూ, శృంగార శతక మందలి 'మధుతిష్ఠతి వాచి యోషితామ్' అను శ్లోకము మిత్రభేద తంత్రమునఁ గలదు. క్రీ. శ. 7వ శతాబ్దికే చెందిన దామోదరగుప్తుని కుట్టినీ మత మందలి 'పర్యంకేషాస్త్రరణమ్' అను శ్లోకము మిత్రభేద తంత్రమునఁ గలదు. అట్లే 8వ శతాబ్దికిఁ జెందిన రుద్రభట్టు రచించిన శృంగార తిలకమందలి 'సార్థం మనోరథ శతైః' అను శ్లోకము లబ్ధప్రణాశ తంత్రమునఁ గలదు. వీనిని బట్టి పంచతంత్రము క్రీ. శ. 7, 8 శతాబ్దుల తర్వాత రచింపఁబడి యుండునని చెప్పవలసి యున్నది. కాని పంచతంత్ర మందలి ఆ యా శ్లోకములు ప్రక్షిప్తములని భావించినచో నీకాల నిర్ణయమునకు వీలుపడదు.

క్రీ. శ. 531 – 579 సంవత్సరముల నడుమ రాజ్యమేలిన 'Chosrau Anosharvan' అను పారసీక ప్రభువు కాలమున పహ్లావి భాషలోని కనువదింపఁబడుటచేఁ బంచతంత్రము క్రీ. శ. 6వ శతాబ్ది నాటికే దేశాంతర వ్యాప్తి నొందినదనియుఁ గనీసమప్పటికి రెండు మూఁడు శతాబ్దులకుఁ బూర్వమే యది రచింపఁబడినదనియు నూహింప వచ్చును.

వ్యాప్తి :

భారత దేశము నందే గాక ప్రపంచవ్యాప్తములైన గ్రంథములలో నత్యంత ప్రముఖమైనది పంచతంత్రము. అది ఏయే దేశములం

5. Macdonell, A - A history of Sanskrit Literature - Motilal Banrrasidas, Delhi Page 313.

దేయే మార్పులతో వ్యాప్తి నొందినదో Franklin Eddgerton అనునతఁడు తన పంచతంత్రాంగ్లానువాద పీఠికలో సంగ్రహముగా వివరించినాడు.[6] అందతఁడు బైబిలు తరువాతఁ బంచతంత్రమే ప్రపంచ వ్యాప్తమైన గ్రంథములలో ప్రథమగణ్యమగునని నాఁడు. John Shertel మహాశయుఁడు పంచతంత్రమునకు సుమారు రెండు వందల ప్రతులు గలవనియు నవి యేఁబదికి మించిన భాషలలో రచింపఁబడిన వనియు నందు మూఁడు వంతులు భారతీయేతరములైన భాషలే యనియు సూచించినాఁడు.

11వ శతాబ్దికిఁ బూర్వమే పంచతంత్ర మైరోపా ఖండమున ప్రవేశించి 17వ శతాబ్దకిఁ బూర్వమే గ్రీక్, లాటిన్, స్పానిష్, ఇటాలియన్, జర్మన్, ఇంగ్లీషు ఓల్డుస్లేవోనిక్, చెక్ మొదలైన యితర స్లేవోనిక్ భాషలలో ననువదింపఁ బడినట్లు పరిశీలనపై తెలియఁగలదు. జావా ఐస్ లేండు ద్వీపములు పరిధులుగాఁ బంచతంత్రము వ్యాపించినది. పాశ్చాత్య పంచతంత్ర శాఖలకు Middle Iranian భాషయగు పహ్లావి భాషానువాద మాధారము. ఆ పహ్లావి ప్రతి క్రీ. శ 531 నుండి 579 వఱకునున్న Chosrau Anosharvan అను ప్రభుపోత్సాహమునఁ బారసీక వైద్యుఁడైన Burzoe or Burzuyeh అను వ్యక్తిచే రచింపఁబడినది.

ఆ పహ్లావి భాషానువాదము గూడ నేఁడలభ్యము. తదాధారముగఁ జేయఁబడిన రెండనువాదములు మాత్రము లభించు చున్నవి. అందొకటి old syrie భాషలోఁగలదు. అది చక్కఁగాఁ గూర్చబడి జర్మనీభాషలో నాధునిక పండితులచే రెండు పర్యాయములు ముద్రింపఁబడినది. బహుశః ఇదియే పహ్లావి ప్రత్యనువాదములలో మూలానుసారము సాగిన రచనము. తదనంతరము సుమారు క్రీ. శ 750లో నా పహ్లావి ప్రతి అరబ్బీ భాషలో Abdullah ibn-al-Moquaffa అను వ్యక్తిచే Kalilah and Dimnah యను నామముతో ననువ

6. ఈ సందర్భమునఁ జేర్కొనఁబడిన విషయమున కదియే యాధారము

దింపఁబడినది. సంస్కృత పంచతంత్ర మిత్రభేద మందలి 'కరటకదమన కుల'ను జంబుకముల నామములే యట్లు వికృతులుగాఁ బరిణమించి యుండునని యూహింప వీలున్నది ఈ గ్రంథ మరబ్బీ సాహిత్యమున మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. దీనికిఁ దాళపత్రప్రతులు, ముద్రిత ప్రతులు పెక్కులు గలవు. ఇంచుమించు దీనినుండియే పశ్చిమదేశ పంచతంత్ర ప్రతులేర్పడి యుండవచ్చునని యూహింప వచ్చును.

11వ శతాబ్దిలో నరబ్బీ ప్రతి గ్రీకులోనికి Symeon Seth అను మహాకవిచే Stephanites Kai Ichnelates యను శీర్షికతో ననువదింపఁబడెను. ఇది యాధారముగఁ బండ్రెండు పదుమూఁడు శతాబ్దుల మధ్య Old Slavonic (old Bulgarian) భాషకు సంబంధించిన యొక యనువాదము వెలువడినది. స్లేవోనిక్ భాషా కుటుంబమున నిదియే మొదటగాఁ బ్రచారమునకు వచ్చిన గ్రంథరాజము. అర్వాచీన కాలమున 18వ శతాబ్దిని గ్రీకు ప్రతి ఇటాలియన్, లాటిన్, జర్మన్ భాషలలోని కనువదింపఁ బడినది.

అరబ్బీ ప్రతి 13 వ శతాబ్దిని old spanish భాషలోనికి 12, 13 శతాబ్దుల మధ్యకాలమున హీబ్రూభాషలోనికి ననువదింపఁబడినది. అవి యజ్ఞాత కర్తృకములు. ఆధునిక కాలమున నీ రెండు ప్రతులు ముద్రితము లైనవి. రెండును సన్నిహిత సంబంధము గలిగి మూల ప్రతియగు అరబ్బీ ప్రతికి దగ్గరగా నున్నవి. ఈ హీబ్రూ ప్రతి నాధారముగ క్రీ. శ 1270వ సంవత్సరమున లాటిన్ భాషలో John of Capua మహోదయునిచే "Liber Kelilae et Dimnae, Directorium Vitae Humanae" అను శీర్షికతో ననువదింపఁబడెను. ఈ ప్రతికి మధ్యకాలమున నెక్కుడు ప్రసిద్ధి లభించినది. క్రీ. శ 1480కి ముందుగానే యీ ప్రతి రెండు పర్యాయములు ముద్రింపఁబడినది. అది భిన్న భాషలలో ననూదితమైనది. జర్మన్ భాషలో Anthonius von p for or p forr అను నతనిచే రచింపఁబడి మొట్టమొదట 15 శతాబ్ది చివర ముద్రించఁపబడినది. పునర్ముద్రణముగూడ నొందినది. లాటిన్ భాషలో John Capuaచే

రచింపఁబడిన ప్రతి ననుసరించి Doni అను నతనిచే నిటాలియన్ భాష లోనీ గ్రంథము రచింపఁబడి క్రీ. శ 1552లో ముద్రింపఁబడినది. ఇది లండన్‌కిఁ జెందిన Sir Thomas North చే The Morall Philosophie of Doni అను శీర్షికతో క్రీ. శ 1570లో నాంగ్లీకరింపఁబడి క్రీ. శ 1601లో పునర్ముద్రితమైనది. అట్లు మొదటి ఎలిజబత్ రాణి పరిపాలన కాలమునఁ బంచతంత్ర ప్రతి యాంగ్ల సాహిత్యమున నుద్భవించినది.

ఇట్లు ప్రాచీన సంస్కృత సాహిత్యము నుండి పహ్లావి ప్రతి దాని నుండి అరబ్బీప్రతి, దానినుండి హీబ్రూప్రతి, దాని నుండి లాటిన్ ప్రతి, దాని నుండి ఇటాలియన్ ప్రతి క్రమ క్రమముగా ప్రచారములోనికి వచ్చినవి.

ప్రంచతంత్ర మిట్లితర భాషలలో ననువదింపఁ బడుటయే గాక యందలి కొన్ని కథలు స్వతంత్ర ప్రతిపత్తిగలవై యితర దేశము లందు ప్రవేశించి యందలి కథా వాఙ్మయమున వింత రూపములను సంతరించు కొనినవి. అవి: 1. పంచతంత్ర కాకోలూకీయ మందలి గాడిద పులితోలు గప్పుకొని యారెకుని మోసగించి చివఱకుఁదన మోసము తెలియఁబడఁగా నాతనిచే మృతినొందిన కథ 2. లబ్ధప్రణాశతంత్ర మందలి కరాలకేసరమను సింహము కర్ణ హృదయ రహితగార్దభ మును దినిన కథ. ఈ రెండును గ్రీకునకుఁజెందిన ఈసపు కథలలో కొలఁది మార్పులతో ప్రవేశించినవి. పంచతంత్ర కథలో గాడిద పులి చర్మమును గప్పుకొనినట్లుండ గ్రీకు కథలో సింహపుఁదోలు గప్పుకొని నట్లు మారినది. జాతకథలలో నొకటి యిట్టిదే గలదు. అది గ్రీకు కథకు మాతృకగావచ్చును. అట్లే కరాలకేసరమను సింహము కథలోని రాసభము స్థానమున గ్రీకుకథలో లేడిగలదు. పంచ తంత్ర మందలి యపరీక్షిత కారిత్వమునఁగల బ్రాహ్మణుడు తొందరపాటు వలనఁ దన పెంపుడు నకులమును జంపుటయను కథ మధ్యకాలము (Middle age) న యూరోపియన్ సాహిత్యమున వ్యాపించినది. అది william

R. Spencer మహాశయునిచేఁ గథాగేయము (Ballad) గా రచింపబడిన Badd gellert అనునది. అది Welsh యువరాజైన Llewell-eyn అనునతనికి నతని కుక్కయగు gelert యనుదానికి సంబంధించినది. పంచతంత్ర కథలో ముంగిస పామును జంపి నట్లుండ నీకథలోఁగుక్కతో డేలును జంపినట్లు గలదు. కథాతత్త్వము రెండింటను సమానమే.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈసపు కథలను నీతికథా మంజరి యను పేర ననువదించినారు. అందును గొన్ని పంచతంత్ర కథలనుబోలినవి గలవు. అందలి నెమలిని బక్షిరాజుగఁ జేయుటయను కథ[7] కాకోలూకీయ మందలి యులూకమును బక్షులు ప్రభువుగాఁ జేయుటను బోలియున్నవి. అట్లే బంగారు గుడ్లు పెట్టు బాతుకథ[8] కాకోలూకీయ మందలి హారదత్తుఁడనుబ్రాహ్మణుఁడు – పాము – మణి యనుకథను, తపస్వి–భల్లూకమను కథ[9] మిత్రభేదమందలి రాజు–వానర సేవకమను కథను, సింహము–ప్రతిధ్వనియను కథ[10] మిత్రభేదమందలి మృగపతి శశకమను కథను బోలియున్నవి. ఇట్టివింకను నందుఁ గలవు

ఇట్లు పంచతంత్రము పాశ్చాత్య దేశములలో రూపాంతరములతో వ్యాప్తినొందినది. తెనుఁగుననేగాక యితర భారతీయ భాషలలోఁ గూడఁ బెక్కును వాదములు పొందినది. అందు మృత్యుంజయ విద్యాలంకారుని బెంగాలీ యనువాదము, జ్వాలా ప్రసాద్ మిశ్రాగారి హిందీఅనువాదము, పురాణభద్రుని గుజరాతీయనువాదము, వీరమార్తాండదేవుని తమిళానువాదము, దుర్గాసింహుని కన్నడానువాదము, సుప్రసిద్ధములు.

## రచనా ప్రణాళిక :

దాక్షిణాత్యజనపదమందలి మహిళారోప్య నగరమునకధిపతి యగు అమరశక్తికి బహుశక్తి, ఉగ్రశక్తి, అనంతశక్తియను ముప్పురు

7. ప్రథమ భాగము–పుట 10 8. ప్రథమ భాగము–పుట 14

9. ద్వితీయ భాగము-పుట 89. 10. ద్వితీయ భాగము–పుట 98.

పుత్రులు. వారు శాస్త్రవిముఖులు, వివేక రహితులు కాగా ప్రభ్వాభ్యర్థ నపై విష్ణుశర్మ యను పండితుఁడు ఆ రాజకుమారుల నాఱుమాసము లలో నయశాస్త్రమున నసదృశులఁ జేసెదనని ప్రతిన సల్పి వారికొఱకు మిత్రభేద మిత్రసంప్రాప్తి కాకోలూకీయ లబ్ధ ప్రణాశాపరీక్షిత కారిత్వములను నైదుపరిచ్ఛేదములతో పంచతంత్రమును రచించి నాఁడు. గ్రంథ రచయితయు నతఁడు నభిన్నులో కారో నిర్ణయించుటకు వీలుపడకున్నది. ఈ గ్రంథ రచనా ప్రణాళికలో రెండు విశేషములు గలవు. అవి: 1) బహువిధములైన నీతులను బోధించుట 2) పశు పక్షులఁ బాత్రలుగా గ్రహించి కథలఁ గల్పించుట.

విష్ణుశర్మ గ్రంథాదిని సమస్తమైన నీతిసారమును గ్రహించి తానీ నీతిశాస్త్రముచు రచించినట్లు చెప్పుకొనినాఁడు:

సకలార్థ శాస్త్రసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదం.
తంత్రైః పంచభిరేత చ్చకార సుమనోహరం శాస్త్రమ్.

దీనిని బఠించినవారు వినినవారు గూడ నిందున్నిండిమైన నెట్టి యవమానము పొందఁ జాలరనియు విష్ణుశర్మ యిట్లు పేర్కొనినాఁడు.

అధీతేయ ఇదం నిత్యం నీతిశాస్త్రం శృణోతి చ
న పరాభవమాప్నోతి శక్రాదపి కదాచన.

నీతి, ధర్మము–అనుపదములు భిన్నార్థకములేమైనను నించు మించు సమానార్థకములుగా వ్యవహరింపఁ బడుచున్నవి. పంచతంత్రా రంభమున విష్ణుశర్మ.

మనవే వాచస్పతయే శుక్రాయ పరాశరాయ ససుతాయ
చాణక్యాయ చ విదుషే నమోఽస్తు నయశాస్త్ర కర్తృభ్యః

అని సుప్రసిద్ధ ధర్మశాస్త్ర కర్తలైన మను పరాశరులను నీతి శాస్త్ర కర్తలఁగాఁ బేర్కొనినాఁడు.

పంచతంత్రమునఁ బెక్కుసందర్భములలో 'కర్తవ్యో ధర్మ సం గ్రహః, ధర్మోఽయం గృహమేధినామ్,' శునః పుచ్ఛమివ వ్యర్థం పొండి

త్వం ధర్మ వర్జితమ్, అని ధర్మప్రాశస్త్య ముగ్గడింపఁ బడినది. కాకోలూకీయ తంత్రమున ధర్మ[11] తత్త్వము విపులముగ నభివర్ణితము. అట్లే గ్రంథమునఁ బెక్కు సందర్భములలో మను బృహస్పత్యాది నీతి శాస్త్ర కర్తలును బేర్కొనఁ బడినారు. నిత్యజీవితమునకత్యంతోపకారకము లగు ధర్మములు, నీతులు పంచతంత్రమునఁ గోకొల్లలుగా ప్రయోగింపఁ బడినవి. సేవ్యసేవక స్వభావము, అతిథిసేవావైశిష్ట్యము, గృహమేధిధర్మము, దానమాహాత్మ్యము, దాతగొప్పదనము, అభయ ప్రదాన ప్రాశస్త్యము, సుజనదుర్జనస్వభావము, సాధు పురుష లక్షణము, మిత్ర ప్రయోజనము, అహింసా శరణాగత రక్షణ మాహాత్మ్యమున్నగునవి యుదాహరణీయములు. శత్రుసాధనోపాయమున ప్రభువవలంబింప వలసిన విధానమంతయుఁ గాకోలూకీయతంత్రమున ప్రభువగు మేఘవర్ణునకు ఉజ్జీవిసంజీవిప్రభృతి మంత్రుల యుపదేశమున వివరింపఁబడినది.

విష్ణుశర్మ భిన్నవిధములైన నీతులతో పాటు పురుషార్థములుగా గణింపఁబడిన అర్థ కామ మోక్షములకు సంబంధించిన విషయములను గూడ సందర్భోచితముగా బోధించిన విధము ప్రశస్యముగా నున్నది. అర్థాధ్యుని వైభవము, అర్థార్జనోపాయములు మిత్ర భేద తంత్రమున వివరింపఁ బడినవి. ధనహీనుని జీవితమెట్లుండునో మిత్రప్రాప్తి తంత్రమున హిరణ్యకోదంతమునను అపరీక్షితకారిత్వతంత్రమున బ్రాహ్మణ చతుష్టయ కథయందును విశదపఱుపఁబడినది. అపరీక్షితకారిత్వమందలి మణిభద్రుడు దారిద్ర్యమును గూర్చి విలపించుట మృచ్ఛకటిక మందలి చారుదత్తుని దారిద్ర్య దుఃఖచింతనమును దలపించు చున్నది. కామపురుషార్థానుభవమున ప్రముఖపాత్ర వహించు స్త్రీస్వరూప స్వభావములు, పరపురుషాసక్తి మున్నగునవి మిత్ర భేదతంత్రమున దంతిలుని కథయందుద్ఘోషింపఁబడెను. మిత్రప్రాప్తితంత్రమున మోక్ష పురుషార్థమునకు సంబంధించిన వైరాగ్య[12] కర్మసిద్ధాంతములు[13] సూత్రప్రాయముగా ప్రతిపాదింపఁ బడినవి.

11. శ్లోకములు 94-102 12. శ్లోకము 191 13. శ్లోకములు 132-134

పంచతంత్రరచనాపరిణాళికలో ప్రముఖపాత్రవహించుచు గ్రంథ ప్రచార ప్రసిద్ధులకు నాధారమైనది పశుపక్షులతోఁ గథ నిర్వహించుట. మానవ జీవితమునకుఁ బశుపక్షులకు నత్యంతసన్నిహిత సంబంధము గలదు. భాషోత్పత్తికి పశువుల యఱపులే మూలమని 'Bow vow theory' బోధించుచున్నది. కరికుంభస్తని, చక్రవాకస్తని, హంసగమన, సమదగజయాన, హరిణాక్షి, కంబుకంఠి, పురుషసింహ, పురుషవృషభ మున్నగు పదములందలి స్త్రీ పురుష సౌందర్య వైశిష్ట్య నిరూపక పశుశబ్ద ప్రయోగము గమనింపఁ దగ్గది. ఋగ్వేదసంహితలో సప్తమ మండలమునఁ బంచమాష్టకమున నింద్రసోములు బలిష్ఠములైన యశ్వద్వయముతో "ఇంద్రాసోమా పరివాంభూతు విశ్వత ఇయః మతిః కక్ష్యాశ్వేవ వాజినాం యాం వాం హోత్రాం పరిహినోతి మేధ యేమా బ్రహ్మాణి నృపతీవ జిన్వతమ్" అని పోల్పఁ బడిరి. ఋగ్వేద మండూక సూక్తమునఁ గప్పలయఱపులు బ్రాహ్మణుల కంఠధ్వనిని బోలియున్నదని.

"సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః
వాచం పర్జన్య జన్వతాం ప్రమండూకా అవాదిష్టుః"

అని రచింపఁబడెను. తైత్తిరీయోపనిషత్తులో జీవపరమాత్మల సంబంధ నిరూపకములగు.

"ద్వా సుపర్ణా సంయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరేకః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకసీతి"

అను వాక్యములు ప్రసిద్ధింగతములు. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామి బాలికథలో హంసలు మనుష్యభాషలో భాషించుటసత్యకామునకు ముసలియాఁబోతు, హంస తత్త్వోప దేశమొనర్చుట పరిశీలనార్హములు. క్రౌంచద్వంద్వ వియోగోత్థమైన శోకమే శ్లోకమై సంస్కృత కావ్యవాఙ్మయమునకు శ్రీకారమైనది. మహాభారత శాంతి పర్వ తృతీయాశ్వాసమందలి వ్యాఘ్రగోమాయుసంవాదము,

గృధ్రజంబుకోపాఖ్యానము ధర్మోపదేశ ప్రధానములు. ఆశ్రమవాస తృతీయాశ్వాసమందలి కపోతోపాఖ్యానము శరణాగతరక్షణ వైభవ మునుపదేశించును. రఘువంశమున మృగేంద్రము దిలీపునితోడను నాగానంద నాటకమున శంఖచూడుఁడను సర్పకుమారుఁడు గరుత్మంతుని తోడను సంభాషించుట, నైషధీయ చరితమున హంస దౌత్యము నెఱపుట మున్నగు వానిలో పశుపక్షుల ప్రాధాన్యము స్పష్టము.

విష్ణుశర్మ పశుపక్షులకే ప్రాధాన్యమొసంగి చిత్రములైన కథలతో ప్రకరణములనైదింటిని రచించుట తద్గ్రంథప్రశస్త్య ప్రచార ములకు ప్రబల కారణము. పంచతంత్రమునందలి కాకోలూకీయ తంత్ర మునకు మాత్రము మహాభారతము మూలమనఁదగును. అందలి సౌప్తిక పర్వమున నిద్రించుచున్న కాకములనులూకము చిత్రవధ గావించిన విధమిట్లు వర్ణింపఁబడినది:

సుప్తాన్ జఘాన సుబహూన్ వాయసాన్ వాయసాంతకః
కేషాంచి దచ్ఛిన త్పక్షాన్ శిరాంసి చ చకర్త హ
చరణాంశ్చైవ కేషాంచిద్బభంజ చరణాయుధః

ఆశ్వా-2- శ్లో 40-41

కార్యాకార్య విచక్షణ జ్ఞాన శూన్యములైన పశుపక్షులచే మానవ జీవిత తరణోపాయ నీతి మార్గమునుపదేశించిన విష్ణుశర్మప్రతిభ యను పమము.

పంచతంత్రమందలి కథ యొక నీతి శ్లోకమునకు సమర్థనాత్మక ముగా రచింపఁబడును. ఒక పాత్ర ఒకనీతి శ్లోకము వచింప మరియొక పాత్ర యదియెట్లని పృచ్ఛించును. దానిని సమర్థించుటకొఱకు కథ చెప్పఁ బడును. మిత్రభేదమున దమనకుఁడు గర్వముచే నుత్తమ మధ్య మాధ ములను బూజింపనివాఁడు రాజసమ్మాన యోగ్యుఁడైనను నశించునని

యో న పూజయతే గర్వా దుత్తమాధమ మధ్యమాన్
భూపసమ్మాన మాన్యోఽపి భ్రశ్యతే దంతిలో యథా।

అనిపలుక సంజీవకుఁడది యెట్లని ప్రశ్నించును. అప్పుడు దమనకుఁడు దంతిలుని కథను వివరించును. పంచతంత్రరచనా ప్రణాళికలో నిదియొక విశేషము. కథలను జిన్నవిగ రచించుట, కథాకథనమును ప్రసన్నతా బంధురముగ నిర్వహించుట, ప్రధానకథా తత్త్వోపదేశమున కవాంతర కథను బింబ ప్రతిబింబ సదృశముగఁ దీర్చిదిద్దుట మున్నగు విశేషములు పంచతంత్ర రచనా ప్రణాళికలోని విశిష్టగుణములు.

నీతిసారోపదేశమునకై పంచతంత్రము రచింపఁబడినను నీతులు కథల కంగములైనవి. కావ్యత్వము ప్రతికథయందు ప్రస్ఫుటమగు చున్నది. ఆషాఢభూతి, కరటక దమనకులు మున్నగుపాత్రలు లోక ప్రసిద్ధములైనవి. అట్లే వర్ణనలుగూడఁ గావ్యత్వము నినుమడింపఁజేయు చున్నవి. అమరశక్తి అను ప్రభువును బరిచయమొనర్చుచు విష్ణుశర్మ "త్రతసకలార్థ కల్పద్రుమః ప్రవర నృపముకుట మణి మరీచి మంజరీచయ చర్చితచరణయుగళః సకలకళాపారంగతోఽ మరశక్తిర్నామ రాజా బభూవ' అని రచించుట, ముని మూషికాంగన యను కథలో గంగా నదిని "అస్తి విషమశిలాతల స్ఖలితాంబు నిర్ఘోష శ్రవణసంత్రస్త మత్స్య పరివర్తన సంజనిత శ్వేతఫేనశబల తరంగాయా గంగాయాస్తటే" అని వర్ణించుట మహాకావ్యోచితము. చిన్నచిన్న కథలలోఁ గావ్యత్వపరి పోషణము విష్ణుశర్మ రచనా ప్రణాళికలోని విశిష్ట లక్షణము.

## హితోపదేశముతోఁ గల సంబంధము :

పంచతంత్రానువాదగ్రంథములలోఁ దంత్రాఖ్యాయికా హితో పదేశములు ముఖ్యములు. ఆ రెండింటియందును హితోపదేశము బహుళప్రచారమొందినది. పంచతంత్రమునకు హితోపదేశమను పేరే మొదటనుండియుండునని కొందరి అభిప్రాయము[14] పంచ

14. Preface to the first edition of M. R. Kala - the Hitopadesa Ed, M. R. Kala

తంత్రాంధ్రీ కర్తలు హితోపదేశమును గూడ గ్రహించి స్వచ్ఛందముగ నాంధ్రీకరించిరి. కావున పంచతంత్రి హితోపదేశములకుఁ గల యను బంధము పరిశీలనీయము.

హితోపదేశము నారాయణపండిత విరచితమని గ్రంథాంత మందలి

ప్రాలేయాద్రేః సుతాయాః ప్రణయనివసతి శ్చంద్రమౌళిఃసయావ
ద్యావల్లక్ష్మీ ర్మురారేర్జలద ఇవ తడిన్మానసే విస్ఫురంతీ
యావత్స్వ ర్ణాచలోఽయం దవదహనసమోయస్య సూర్యఃస్ఫులింగః
తావన్నారాయణేన ప్రచరతు రచితః సంగ్రహోఽయంకథానామ్

అనుశ్లోకమును బట్టి తెలిసికొనవచ్చును. అట్లేయతడు ధవళచంద్రుఁడను ప్రభువు నాస్థానకవి యనియు గ్రంథాంతమందలి

'శ్రీమాన్ ధవలచంద్రోఽసౌ జీయాన్మాండలికో రిపూన్
యేనాఽయం సంగ్రహో యత్నా ల్లేఖయిత్వా ప్రచారితః'

అని చెప్పఁబడెను.

రాజపుత్రులకు హితోపదేశము గావించుటకే హితోపదేశము గూడ రచింపబడినది. "హితస్య ఉపదేశః హితోపదేశః హితశ్చాసౌ ఉపదేశశ్చవా ఇతి సఏవ లక్షణయా తత్సంజ్ఞః గ్రంథః అని సమాసము వివరింపబడినది[15] హితము యొక్క యుపదేశము, లేక హితము నుప దేశమునైనది యని విగ్రహవాక్యము. లక్షణచే నదియే గ్రంథ నామ మైనది.

పంచతంత్రి మందలి మిత్రభేదమిత్రప్రాప్తి కాకోలూకీయ లబ్ధప్రణాశా పరీక్షితకారిత్వములనునైదు పరిచ్ఛేదములు హితోప దేశమున మిత్రలాభసుహృద్భేద విగ్రహసంధులను నాల్గు పరిచ్ఛేదము లలో గూర్పబడినవి. కాకోలూకీయ లబ్ధ ప్రణాశాపరీక్షిత కారిత్వ

15. హితోపదేశ వ్యాఖ్య – మోరేశ్వరుఁడు.

ములు విగ్రహము-సంధియను రెండు పరిచ్ఛేదములుగా హితోపదేశ మున రచింపబడినవి. అందలి ప్రధానకథలు మూడు నిందవాంతర కథలైనవి. కాకోలూకీయ కథనాధారముగ నారాయణకవి హిరణ్యగర్భుడను మరాళవిభునకు, జిత్రవర్ణుడను మయూర నాథునకుసంబంధించిన యుద్ధమును, గలిగినసంధిని రెండుపరిచ్ఛేదములుగాసంతరించినాడు.

మిత్త్రభేదతంత్రముతో బంచతంత్రమారంభింపబడినది. మిత్త్రలాభముతో హితోపదేశమారంభింపబడినది. మహిలారోప్య నగరాధిపుడైన అమరశక్తి యను ప్రభువుపుత్త్రులను విష్ణుశర్మ నీతి విద్యా విశారదులఁ జేయుటకు పంచతంత్రము రచింపఁబడినది. భాగీరథీ తీరమందలి పాటలీపుత్త్ర నగరమున సుదర్శన ప్రభు పుత్త్రులను నయకోవిదులఁ గావింప హితోపదేశము సంతరింపఁబడినది. మార్పునకెట్టి ప్రయోజనము గనుపింపదు.

పంచతంత్రమునుండి హితోపదేశమున బెక్కు కథలు గ్రహింపఁబడినవి. హితోపదేశమందలి నలువది మూఁడు కథలలో నిఱువదియైదు పంచతంత్రమునుండి స్వీకృతములని మేగ్డనల్ పేర్కొనినాడు.[16] హితోపదేశ మిత్త్రలాభమందలి వృద్ధ వ్యాఘ్రము-హేమకంకణము, మిత్త్రభేదమందలి రజకుని కుక్క-గాడిద, సింహము-ఎలుక-దధికర్ణమను పిల్లి, గోపి-జారద్వయము, ఘంటాకర్ణుఁడను రాక్షసుఁడు-కుట్టిని, విగ్రహ మందలి పాంథుఁడు - కాక హంసలు, సంధియందలి- వణిగ్భార్య సేవకరతి యను కథలు పంచతంత్రమున లేనివి. నారాయణ పండితుడు హితోపదేశారంభమున మిత్త్రలాభ మిత్త్రభేదవిగ్రహసంధిపరిచ్ఛేదములు పంచతంత్రమునుండియు నట్లే యితర గ్రంథముల నుండియు గ్రహించి రచింపఁబడునని యిట్లు పేర్కొనినాడు.

"మిత్త్రలాభః సుహృద్భేదః విగ్రహః సంధిరేవ చ
పంచతంత్రా త్తథాన్యస్మా ద్గ్రంథాదాకృష్య లిఖ్యతే."

16. A History of Sanskrit - Literature - A Magadonell, P 317

పై కథల నితర గ్రంథముల నుండి గ్రహించి వ్రాసెనో లేక స్వయముగా గల్పించి రచించెనో నిర్ణయింప శక్యముగాకున్నది. పంచతంత్ర మందలి కొన్ని కథలను కొలఁది మార్పులతో నారాయణ పండితుఁడు హితోపదేశమున రచించినాఁడు. మిత్త్రభేద మందలి టిట్టిభ దంపతుల కథ, కాకోలూకీయము నందలి కామాతురుఁడను వృద్ధ వణిక్పుంగవుని కథ, వీరధరుఁడను రథకారుని కథ యుదాహరణీయములు. పంచతంత్ర మందలి లోక ప్రసిద్ధములైన ఆషాఢభూతి కథవంటివి హితోపదేశమున విడువఁబడుట గమనింపఁదగిన విషయము. పంచతంత్రహితోపదేశములు రెండింటను నీతి బోధ సమానమేయైనను హితోపదేశమున హితోపదేశమునకుఁ గథాకథనముకంటెఁ గొంచెము ప్రాధాన్యమొసంగఁబడినట్లు పాఠకునకు విశదమగుచుండును. కథా రచనమునఁ గూడ సంక్షిప్తత గాననగును.



# 2. కథా స్వరూప స్వభావములు-పంచతంత్రమున సమన్వయము

పంచతంత్రమొక గద్య కావ్యము. అందలి యితివృత్తమేక నాయకాశ్రయము గాదు. అందుఁ గథలునవాంతరకథలు ననేకములు గలవు. మిత్త్రభేదాది ప్రకరణము లయిదు గలవు. ఆ గ్రంథము నీతి బోధక కథాకావ్యముగా లోక విశ్రుతి నందినది. అది యే గద్య ప్రభేదమునకుఁ జెందునో పరిశీలించుట యత్యంతావశ్యకము.

అగ్నిపురాణమున గద్య కావ్య భేదములు, వాని స్వరూప స్వభావములు వివరింపబడినవి.[1] అందు గద్యము ఆఖ్యాయిక కథ ఖండ కథ పరికథ కథానిక-యని యైదు విధములని యిట్లు పేర్కొనబడెను.

1. కావ్యలక్షణ ప్రకరణము-శ్లోకములు 11-20.

"ఆఖ్యాయికా కథా ఖండకథాపరికథా తథా
కథానికేతి మన్యంతే గద్యకావ్యం చ పంచధా"

ఇందు ప్రధానములైనవి ఆఖ్యాయిక కథ యనునవి. కృతికర్తృ వంశ ప్రశంస కలిగి కన్యాహరణ సంగ్రామాదులచే నలంకరింపబడి యుచ్ఛ్వాసములను బరిచ్ఛేదములచేఁ గథ విభక్తమై వక్త్రము, అపరవక్త్రము నను వృత్త విశేషములు గలది యాఖ్యాయికయని

"కర్తృవంశ ప్రశంసాస్యాద్యత్ర గద్యేన విస్తరాత్
కన్యాహరణ సంగ్రామ విప్రలంభ విపత్తయః
భవంతి యత్ర దీప్తాశ్చ రీతివృత్తి ప్రవృత్తయః
ఉచ్ఛ్వాసైశ్చ పరిచ్ఛేదో యత్రయా చూర్ణికోత్తరా
వక్త్రం వా పర వక్త్రం వా యత్రసాఽఖ్యాయికాస్మృతా"

అని వివరింపఁబడెను. కవి తనవంశమును శ్లోకములచే ప్రశంసించుచు ముఖ్య కథావతరణమునకుఁ గథాంతరము గల్పించి పరిచ్ఛేద విభాగము గావింపక, గావించినను లంబకములను వ్యవహారముతోఁ గావించుచు మధ్యనొకవృత్తమును రచించినఁ గథయగుననియునందు

శ్లోకైః స్వవంశం సంక్షేపాత్కవిర్యత్ర ప్రశంసతి
ముఖ్యస్యార్థావతారాయ భవేద్యత్ర కథాంతరమ్
పరిచ్ఛేదో న యత్ర స్యాత్ భవేద్వాలంబకైః క్వచిత్
సాకథా నామతద్గర్భే నిబధ్నీయా చ్చతుష్పదీమ్.

అని రచింపఁబడెను. అగ్నిపురాణ కాల కర్తృత్వములు వివాదగ్రస్తములు. అందలి యాలంకారిక విషయములు గల భాగము ప్రక్షిప్తము, నర్వాచీనము నగునని యాధునికసాహిత్యవిమర్శకులు భావించుచున్నారు.

ఆలంకారిక పితామహుఁడనదగుభామహాచార్యుఁడు ప్రవచించిన ఆఖ్యాయికా కథా లక్షణములు[2] అగ్నిపురాణోక్తముల కతిసన్ని

2. కావ్యాలంకారము - ప్రథమ పరిచ్ఛేదము శ్లో॥లు 15-19.

హితముగా నున్నవి. నాయకునిచే స్వచేష్టితము చెప్పఁబడవలెననియుఁ గవియొక్క యభిప్రాయమును సూచించు కొన్ని చిహ్నములచే నాగద్య మంకితము కావలయుననియు నాతఁడధికముగా

గద్యేన యుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఽఽఖ్యాయికా మతా
వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్
వక్త్రంచాపర వక్త్రంచ కాలే భావ్యర్థశంసి చ
కవేరభిప్రాయకృతైరంకనైః కైశ్చిదంకితా
కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాన్వితా

అను శ్లోకములలోఁ జేర్కొనినాఁడు. ఆ మహాలాక్షణికుఁడు కథా స్వరూపమును వివరించుచు నాయకుఁడభిజాతుఁడు గాన స్వీయోదంత మును జెప్పరాదనియు, నితరులచే నాతని చరిత్ర చెప్పఁబడవలెననియు సూచించి యందుఁ బ్రయోగింపఁ దగిన భాషావిశేషములను గూడ వివరించుచు నిట్లు రచించినాఁడు

న వక్త్రా పరవక్త్రాభ్యాం యుక్తానోచ్ఛ్వాసవత్యపి
సంస్కృతా సంస్కృతా చేష్టా కథాఽపభ్రంశభాక్తథా
అన్యైః స్వచరితం తస్యాం నాయకేన తు నోచ్యతే
స్వగుణావిష్కృతం కుర్యాదభిజాతః కథం జనః

భామహునిపై లక్షణములను సునిశితముగ విమర్శించినమహా నీయుఁడు దండ్యాచార్యుఁడు. అతడు గద్యకావ్యము ద్వివిధమని 'అపాదఃపదసంతానో గద్యమాఖ్యాయికా కథా ఇతితస్య ప్రభేదౌ ద్వౌ' యని విభజించి ఆఖ్యాయిక నాయకునిచేతను కథ నాయకునిచేఁ గాని యితరునిచేఁగాని చెప్పఁబడుననియు సూచించి యందు నియమోల్లం ఘనముగూడఁ గనుపట్టు చున్నదనియుఁగథ నితరుఁడు చెప్పినను నాయ కుఁడు చెప్పినను భేదము లేదనియు వక్త్రాపర వక్త్రవృత్త ప్రయోగము నను లంబోచ్ఛ్వాసవిభాగముననను నియమాతి చారము దోషము గానేరదనియు నిట్లు రచించినాఁడు[3].

3. కావ్యాదర్శము-పరిచ్ఛేదము 1-శ్లో॥లు 24-27.

నాయకేనైవ వాచ్యాన్యా నాయకేనేతరేణవా
స్వగుణా విష్క్రియా దోషో నాత్ర భూతార్థశంసినః
అపిత్వనియమో దృష్ట స్తత్రాప్యన్యైరుదీరణాత్
అన్యోవక్తా స్వయంవేతి కీ దృగ్వా భేదలక్షణమ్
వక్త్రం చాపర వక్త్రంచ సోచ్ఛ్వా సత్వం చ భేదకమ్
చిహ్నమాఖ్యాయికాయా శ్చేత్ప్రసంగేన కథాస్వపి
ఆర్యాది వత్ప్రవేశః కిం న వక్త్రాపరవక్త్రయోః
భేదశ్చ దృష్టో లంబాది రుచ్ఛ్వాసో వాస్తుకిం తతః

ఆఖ్యాయిక కథయనునవి యేకజాతీయములే యనియు ద్విసంజ్ఞికము లనియు నతఁడుఁ తత్కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా, యని నిర్ణయించినాఁడు. కన్యాహారణ సంగ్రామాదులు ఆఖ్యాయికా విశేష గుణములు కావనియు మహాకావ్య సామాన్య లక్షణములనియు నతఁడు

కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాదయః
సర్గబంధ సమా ఏవ నైతే వైశేషికా గుణాః

అని సూచించినాఁడు[4]. ఆఖ్యాయికా కథాలక్షణము లిట్లుచర్చింపఁబడినవి.

విశ్వనాథుఁడు గద్యకావ్యలక్షణములను సోదాహరణముగ వివరించినాఁడు. దండ్యాచార్యుడు ఆఖ్యాయిక కథయను రెండు గద్య భేదములనే పేర్కొని తక్కిన యాఖ్యానాదులు వానియందంతర్భూతములగునని చెప్పఁగా విశ్వనాథుఁడా వాక్యములనుదాహరించుచు లక్ష్యముగాఁ బంచతంత్రాదులని 'అపినిత్వనియమో దృష్టః తత్రాప్యన్యై రుదీరణా దితి దండ్యాచార్య వచనాత్ కేచిదాఖ్యాయికా నాయకే నైవ నిబద్ధవ్యా ఇత్యాహుః తదుక్తం దండినైవ అత్రైవాంతర్భ విష్యంతి శేషాశ్చాఖ్యాన జాతయః ఇతి ఏషాముదాహరణం పంచ తంత్రాది'[5]యని యుగ్గడించినాఁడు. దీనినిబట్టి పంచతంత్ర మాఖ్యాన జాతికిఁజెందునని చెప్పవచ్చును. ఆఖ్యాన మాఖ్యాయికా కథా భేదాంత

4. పరిచ్ఛేదము 1–శ్లో 29. 5. సాహిత్య దర్పణము - పరిచ్ఛేదము 6.

ఖ్యాతమగుననుటచేఁ బంచతంత్రమునకు వానిలక్షణములననువర్తింపఁ జేసి పరిశీలింపవలయును. ఆశ్వాసవిభాగముండుట, కథ కృతికర్తృముఖముగ వెలువడుట, వృత్త విశేషములునార్యలునచ్చటచ్చట నుండుట యను విషయములలోఁగథ ఆఖ్యాయిక అనురెండింటి లక్షణములును ప్రవర్తిల్లిన వనియే చెప్పవచ్చును. శ్లోకబాహుళ్యమును బట్టి పంచతంత్రమును జంపూకావ్యముగఁగూడఁ బరిగణించుటకవకాశము లేక పోలేదు. అగ్నిపురాణమునఁగథానికాలక్షణము

'భయానకం సుఖపరం గర్భేచ కరుణో రసః
అద్భుతోఽంతే సుక్లృప్తార్థో నోదాత్తా సా కథానికా'

అని వివరింపఁబడెను. పంచతంత్రమందలి ప్రాసంగిక కథలలో నీ లక్షణము వర్తింపదు. ఆకథల తత్త్వము భిన్నభిన్నముగా నుండును.

పాశ్చాత్య సాహిత్య విమర్శకులు పంచతంత్ర కథా సదృశములను ఫేబిల్సు (Fables) అందురు. లేటిన్ భాషలో Fabula యను పద మాంగ్లపదమునకు మూలము. దానికిఁ జెప్పఁబడిన యొక విషయమని (a thing said) యర్థము. అది సంగ్రహముగ వచనమునఁగాని పద్యమునఁగాని చెప్పఁబడుననియు నీత్యుపదేశాత్మకముగనో ప్రయోజనకరమైన విషయబోధకముగనో యుండుననియు ముఖ్యముగఁ బశువులు పాత్రలుగానుండుననియు మనుష్యపాత్రలు దేవతాపాత్రలు గూడ నుండుననియు నిట్లో కవిజ్ఞాన సర్వస్వమునఁ జేర్కొనఁబడెను.[6]

Fable in its original, widest sense, a fictitious story or statement of any description (from the latin fabula, a thing said) . . . . denotes a short narrative in prose or verse designed to convey a moral or useful lesson. The characters are most often animals but inmate objects, human beings or gods also appear.

అమెరికన్న విజ్ఞాన సర్వస్వమున ఈ ఫేబిల్ అనునది మొదటఁగాథా సామాన్యవాచిగా వ్యవహరింపఁబడుచుండెడిదనియుఁ గ్రమముగాఁ

6, Eneyclopardia of Britanica. Vol 9. P 22.

గథానికలకే యాధునిక వ్యవహారమునఁ బరిమితమైనదనియుఁ గల్పిత వ్యక్తులు పశువులు నచేతన వస్తువులు నందుఁ బాత్రధారణమొన రించు ననియు నిట్లు వివరింపఁబడెను.[7]

The Fable in literature, a term applied originally to every imaginative tale, but confined in modern use to short-stories, either in prose or in verse, which are meant to inculcate a moral lesson in pleasent garb. Imaginary persons, animals and inanimate objects are introduced as the actors and speakers.

ఈ పాశ్చాత్యవిమర్శకుల లక్షణములు పంచతంత్రికావ్యమునకు బాగుగా సమన్వయించును.

# 3. ఆంధ్ర పంచతంత్ర చంపువుల చరిత్ర-స్వరూపము

ఆంధ్రసాహిత్యమునఁ బదునైదవశతాబ్దికిఁ బూర్వమునుండియుఁ బంచతంత్రానువాదములు వెలువడుచున్నవి. వానిని చంపూవచన భేదములచే రెండువిధములుగా విభజింపవచ్చును. అందు గద్యపద్యాత్మకరచనలకుఁ జంపువులని పేరు. 'గద్యపద్యోభయం కావ్యం చంపూరిత్య భిధీయతే' అని యాలంకారికలక్షణము. అట్టి చంపూరూప పంచతంత్రాంధ్రీకరణములు మూఁడు మాత్రమే లభ్యములు.

అందు దూబగుంట నారాయణ కవి యనువాదము మొదటిది. భానుకవి బైచరాజు గావించిన యాంధ్రీకరణములనంతర రచనలు.

7. Encyclopardia of Americana, Internation Edition Vol 10 P 692.

సల్పకాలవ్యవధానముననున్న మువ్వురు మహాకవులు పంచతంత్రానువాదమునకుఁదలపడుట విస్మయావహము. అనువాదములు మూఁడింటను మువ్వురి ప్రత్యేకత పరిస్ఫుటముగ గోచరించుచుండును. ముఖ్యములగు వర్ణనలతో యథామూలముగా నీతిశ్లోకములననువదించుచుఁ గథను ప్రసన్నముగఁజెప్పుట దూబగుంట నారాయణకవి పద్ధతి. వర్ణనలకు స్వల్పప్రాధాన్యమొసంగి నీతిశ్లోకముల నెక్కువగా గ్రహింపక కథను సూటిగాఁజెప్పుట భానుకవి ప్రత్యేకత. కథను వర్ణనాత్మకముగాఁ దీర్చిదిద్ది యథోచితముగ నీతిశ్లోకములను గ్రహించి ప్రౌఢప్రబంధ శైలిలో నాంధ్రీకరించుట బైచరాజు వేంకటనాథుని యనువాదవిశిష్టత.

—: దూబగుంట నారాయణకవి యనువాదము :—

కవిచరిత్ర :

తెనుఁగుకవులు తమగ్రంథావతారికలయందును నాశ్వాసాంతముల యందును స్వీయోదంతములను బేర్కొనుచుందురు. తమ తల్లిదండ్రులనుగురువులను దమయభిరుచులను సూచించుచుందురు. భగవదంకితమైన కృతులలోఁగృతిపతివంశ వర్ణనకవకాశము లేదుగాన స్వీయ వంశవర్ణనము గావించుకొనుటయు నటనటఁగనుపట్టును. నారాయణ కవి తన యనువాదమునఁ బీఠికలోఁ దనచరిత్రను

హరిహరభక్తు నార్యనుతు నంధ్రకవిత్వ విశారదున్మహే
శ్వర వర మాననీయుఁ గులవర్ధను శాంతుఁ బ్రబంధవాచకా
భరణము నాగమాంబకును బ్రహ్మయమంత్రికినాత్మసంభవున్
సరసుని దూబగుంటపురశాసను నారయ నామధేయునిన్.

పద్యము—14

అను పద్యమున సంగ్రహముగాఁదెలుపుకొనినాఁడు. ఇందాతని తల్లి నాగమాంబ తండ్రి బ్రహ్మయమంత్రి యని పేర్కొనఁబడెను. ఆశ్వాసాంతగద్యములందును బ్రహ్మయామాత్య పుత్త్రయని గలదు. ఇందలి

మంత్రి, అమాత్యయనుపదములఁబట్టి నారాయణకవి నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడని స్పష్టమగుచున్నది. ఆశ్వాసాంతములందు నారాయణనామధేయప్రణీతంబైన యనియున్నది. పైపద్యమున నారయనామధేయునిన్ అనికలదు. కృతిపతి పంచతంత్ర రచనకాతని ప్రోత్సహించు సందర్భమున నారనార్య! అని సంబోధించినట్లు రచింపఁబడినది. వీనినిబట్టి నారాయణకవికి నారయ,నారనయనునవి నామాంతరములు కావచ్చును. అవి నారాయణ శబ్ద క్లుప్తరూపములనవచ్చును. 'నర స్యేదం నారం నారం వపురయత ఇతి నారాయణః' అనినారాయణ శబ్దవ్యుత్పత్తి. నారయను ప్రాతిపదికకు అయ, అనయను ప్రత్యయ సదృశములఁ జేర్చుటచే నారయనారనయను రూపములేర్పడినవి. నారయ నారనయనునవియే యాతని నామములయియుండుననియు వానినిసంస్కృతీకరించి కవి నారాయణయని వ్రాసికొని యుండుననియు నూహింపవచ్చును.

పై పద్యమునఁ గవి దూబగుంటపురశాసనుఁడని పేర్కొనఁబడెను. దీనినిబట్టి నారాయణకవి దూబగుంట గ్రామమునకుఁ గరణముగా నుండియుండునని యూహింపవచ్చును. పూర్వముగ్రామ శాసనాధికారము కరణములకుండెడిది. ఆచంట బమ్మెర బెజవాడ ఓరుగంటి తెనాలి మున్నగు నింటిపేర్లు గ్రామనామములఁబట్టి యేర్పడినట్లే దూబగుంట యను గ్రామనామము నారాయణకవికింటిపేరుగా సంక్రమించి యుండును. తనయింటిపేరునకాధారమైనదియుఁ దనశాసనమునకు స్థానమైనదియునగు దూబగుంట యనుగ్రామమెచ్చటనున్నదను విషయమున భిన్నాభిప్రాయములు గలవు. నెల్లూరుమండలముననొక దూబగుంటయను గ్రామముగలదు. ఉదయగిరికి సమీపమునఁ బామూరు చెంతనొక దూబగుంట గలదు. అట్లే యాత్మకూరునకు దగ్గరగూడనొక దూబగుంటగలదు. నెల్లూరునకు సమీపముననొక దూబగుంట గలదని వినికిడి. ఉదయగిరి తాలూకాలోని పామూరునకు సమీపముననున్న దూబగుంటలోఁ గవులున్నట్లు ప్రతీతియుండుటచే నదియే యీనారాణ

కవి నివాసము గావచ్చునని జనమంచి శేషాద్రిశర్మగారభిప్రాయపడిరి.[1] తన్నిర్ణయమున కింతకంటె ప్రబలాధారము లెట్టివియుఁ గానరావు.

హరిహర భక్తుఁనను పై పద్యమున, నారాయణకవి తాను హరిహరభక్తుఁడనని తెలుపుకొనినాఁడు. తిక్కన ప్రతిపాదించిన హరిహరనాథ తత్త్వము నితరకవులవలె నీతఁడుననుసరించియుండు ననవచ్చును. నెల్లూరినివాసియగుటయు దానికుపోద్బలకముగానున్నది. కాని హరిహరనాథరూపము నెచ్చటను నారాయణకవి స్తుతింపలేదు. కావున హరిహరభక్తుననుటలో నారాయణకవి హరిహరుల నిరువుర నారాధించువాఁడనుట సముంజసము. అట్లే యీపద్యమున నారాయణకవి తాను ప్రబంధవాచకాభరణమనియు నాంధ్రకవిత్వవిశారదుఁడనియుఁ జెప్పికొనినాఁడు. ప్రబంధములు చెప్పువారిలోనలంకారమువంటివాఁడు, నాంధ్రకవిత్వతత్త్వజ్ఞుఁడునని పై సమాసముల భావము.

## గురుప్రస్తుతి :

ఈ దూబగుంటనారాయణకవివర్యునకు నాగనార్యుఁడను గురువుండెననియు నాతఁడు కొండయమంత్రి యెఱ్ఱయకుఁ గూరిమినందనుఁడనియు త్రికాలములయందాతఁడు శివారాధన తత్పరుఁడనియు నీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

> కొండయమంత్రియెఱ్ఱయకుఁగూరిమినందనుఁడైన మద్గురున్
> ఖండశశాంకశేఖరుఁ ద్రికాలముఁ బూజయొనర్చు నాగనా
> ర్యుండను పేరుగల్గిన సరోజభవాన్వయ వార్ధికైరవా
> ప్తుండగు పుణ్యమూర్తి సులభుండగుటంగొనియాడి వేడుకన్

పీఠిక—పద్యము–8

## దేవతాపూర్వకవి స్తుతులు :

కావ్యాదిని దేవతలను సంస్కృతాంధ్రి పూర్వకవులను స్తుతించుట తెనుగుకావ్యములోని యొక ప్రత్యేకత. నారాయణకవి కృత్యావ

1. దూబగుంటవాని పంచతంత్రి పీఠిక-పుట 4.

తారికలో త్రిమూర్తులను, గణపతిని, లక్ష్మీసరస్వతులను నుతించి నాఁడు. జగన్మాతయైన పార్వతిని విడచుట విచార్యము. దేవతాగురు స్తవములయనంతరము సంస్కృతకవులలో బాణ భారవి మయూర శివభద్రి శ్రీహర్ష కాళిదాసులను దెనుగుకవులలోఁ గవిత్రయమును నారాయణకవి నుతించినాఁడు. తనకించుక పూర్వుఁడునాంధ్ర దేశమును బర్యటించి కవితా పాండిత్యములచే నుఖ్యాతలూగించిన కవిసార్వభౌముఁ డునైన శ్రీనాథుని బేర్కొనకపోవుట గమనింపఁదగినది. కవిత్రయమును మాత్రమే స్మరించుటచే నీతడు శక్తిమంతుఁడని శివశంకరస్వామిగారు భావించినారు.[2]

## స్వీయకవితా విధాన ప్రతిపాదనము :

పలువురు తెనుగుకవులు వాచ్యముగనో వ్యంగ్యముగనో తమ కవితా విధానమును గావ్యావతారికయందు సూచించినారు. నన్నయ గారి సారమతింగవీంద్రులు అనుపద్యము, తిక్కనగారి నిర్వచనోత్తర రామాయణావతారికలోని కొన్ని పద్యములు నుదాహరణీయములు.

దూబగుంటనారాయణకవి కృతిపతిముఖమునఁ దనరసవద్రచనా సౌభాగ్యమును వెల్లడించినాఁడు. హితులాతనిఘనతను జెప్పఁగా విని కృతిపతి యాతనిని బిలిపించి కవితాగోష్ఠియందుఁ బ్రియమెసఁగఁగఁ బలుకుచు నితాంతభక్తితో నంకురించు మందహాసముతో నొకకృతి నర్థించి నాఁడని యిట్లు చెప్పఁబడెను.

> సురచిరమైన నీకవిత సూరిసభాంతరయోగ్యతా మనో
> హరసరసార్థ గుంఫనల నందము గావున నారనార్య! సు
> స్థిరగతిఁ గీర్తి నన్నొనరఁజేసి సమస్త జగత్ప్రసిద్ధమై
> పరఁగుచు నుండు మాకొక ప్రబంధమొనర్పు ప్రియంబెలర్పఁగన్

పీఠిక–పద్యము–18

2. విజ్ఞాన సర్వస్వము-సంపుటము 3 పుట 9.

యందు నారాయణకవి కవిత్వము సరసములైన యర్థములఁ గుప్పించు బచే విద్వన్మనోహరముగా నుండునని సూచింపఁబడెను. నారాయణ కవికవిత సురుచిరముగా నుండుటచేఁ గృతిపతి జగత్ప్రసిద్ధినొందిన పంచతంత్రము నాంధ్రీకరింపుమని యిట్లు కోరినాఁడు :

పంచతంత్రమనఁగ నంచిత గీర్వాణ
భాషమున్న చెప్పఁబడిన యట్టి
కావ్యమాంధ్రభాషఁ గర్ణామృతంబుగాఁ
గూర్పవలయు నీదు నేర్పు మెఱయ

పీఠిక—పద్యము 19

కృతిపతి కర్ణామృతంబుగా నాంధ్రీకరింపుమని యర్థించినాఁడు. అనువాద ములన్నింట ప్రబంధవాచకా భరణముగ వాసిగాంచిన నారాయణకవి యనువాదము కర్ణామృతముగనే యున్నదనక తప్పదు.

## కుకవినిరసనము :

కావ్యాదినాశీర్వాదముగాని నమస్కృతిగాని వస్తునిర్దేశము గాని యుండవలెననియు ఖలనిందయు సత్పురుష గుణకీర్తనము గూడ నుండవలెననియు నాలంకారిక నియమమిట్లు గలదు.

ఆదౌ నమస్క్రియాऽశీర్వా వస్తునిర్దేశ ఏవవా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాం చ గుణవర్ణనమ్.

తెనుఁగుకవులు సద్గుణవర్ణనమునకు బదులు పూర్వకవి ప్రస్తుతి, ఖల నిందకు బదులు కుకవినింద గావించినారనవచ్చును. కవి శబ్దమునకు కావ్యరచయిత విద్వాంసుఁడను రెండర్థములును గలవుగావునఁ గుకవు లను దుష్పండితులు గను దుష్కవులుగను భావించి నిందించినారు.

నారయణకవి కువిమర్శగావించు వారినిట్లు హెచ్చరించినాఁడు.

చెప్పిన నాకవిత్వము రుచింపనితావులు చూచి చెప్పఁడీ
తప్పులు లేనిచో నవుఁగదా యని తీర్పఁడు మాటిమాటికిన్

జెప్పకుఁడొప్పుఁదప్పనుచుఁ జెప్పఁగ నేర్చిన వాని కొక్కచోఁ
దప్పులు లేక మానవని తద్జ్ఞులెఱుంగుఁడు మీకు మ్రొక్కెదన్.

పీఠిక—పద్యము 10.

విమర్శింపఁ బూనినచోఁదన కవిత్వము రుచింపని సన్నివేశములను బేర్కొనవలెనని యాతని సూచన. తప్పులు లేనిచో బాగుగానున్నవని యాయాసన్నివేశములను మాటమాటకు ప్రశంసింపవలెనని యాతని యభ్యర్థనము. ప్రతికవియుఁగోరు సహృదయామోదముద్ర నీతఁడు నపేక్షించినాఁడు. ఒప్పులను దప్పులుగాఁ జెప్పవలదని యాతని హెచ్చరిక. విదగ్ధుఁడైన కవిరచనమున నెక్కడో యక్కడఁ దప్పులు తప్ప వని యాతని యభిప్రాయము. పండితులీవిషయము నెఱుంగఁ గలరనుటలోఁ గుకవు లెఱుంగఁజాలరనుట వ్యంగ్యముగ బోధింపఁబడినది. ఈ కుకవి నింద యథార్థ బోధకముగా నున్నది. ఈ పద్యము కేతన విరచితమైన యాంధ్రిభాషాభూషణ మందలి యీ పద్యమును దలపించుచున్నది.

ఒప్పులు గల్గిన మెచ్చుఁడు
తప్పులు గల్గిన నెఱింగి తగ దిద్దుఁడు త
ప్పొప్పనకుఁ డొప్పు తప్పని
చెప్పకుఁడి కవులుపాస్తి చేసెద మిమ్మున్

పద్యము—8.

## కృతిపతి చరిత్ర :

రాజాంకితములైన కావ్యములందుఁ గృతికర్తవంశవర్ణనము గావించుట తెనుఁగుకవులకుఁ బరిపాటియైనది. కావ్యరచనాకాల నిర్ణయమునకు రాజవంశవర్ణన లెంతయో యుపకరింపఁగలవు.

ఈ పంచతంత్రము బసవక్షితిపాలునకంకితము. ఆతని తల్లి దండ్రులు, ఆతని దాతృత్వ సౌందర్య వివేకగాంభీర్య ప్రతాపములు నిట్లభివర్ణింపఁబడినవి

మనుమార్గుండగు తమ్మభూపతికి వేమాంజాంబకున్ బుత్త్రుఁడై
జనియించెన్ బసవేంద్రుఁడర్థిజన భాస్వత్కల్ప భూజాతమై
వనితామన్మథుఁడై వివేకనిధియై వారాశిగంభీరుఁడై
యనతారాతి మహాంధకారపటలీ హంసప్రతాపాఢ్యుఁడై

పీఠిక–పద్యము 36

పీఠికయందు నాశ్వాసాంతములందు సుమారు పాతికపద్యములలో బసవ భూపతి గుణగణములభివర్ణింపఁబడినవి. ఈతఁడు తన తండ్రిపాలించిన దేశమునే పాలించియుండవచ్చును. ఈతని రాజ్యపాలన కెట్టి యాధారములు దొరకినట్లు విమర్శకులు పేర్కొనలేదు గాని యీతని తండ్రి రాజ్యమొనరించినట్లు నిరూపించుటకుఁ దగిన శాసనాధారములు గలవని వివరించినవారు గలరు. ఈతని తండ్రియైన తమ్మరాజు కటకము రాజధానిగా నాంధ్రమును బాలించిన గజపతులకు సామంతుఁడనియు నాతని పేరు మీఁద రెండు శాసనములు దొరకుచున్నవనియు నాతమ్మ రాయఁడు క్రీ. శ 1460లో నుదయగిరిమీఁది మాన్యమునఁ గాశీ విశ్వేశ్వరునకు గోపాలకృష్ణునకు విడివిడిగాఁ జెటిరొక నగరు కట్టించి ప్రతిష్ఠ చేయించెననియు నాతని కాలము, నాతని పుత్త్రుడైన బసవరాజు కాలము నదియే కావచ్చును లేదా బసవరాజు కాలము క్రీ. శ 1485 ప్రాంతము కావచ్చుననియు శ్రీ ఆరుద్రగారభిప్రాయపడిరి[3].

ఈ బసవభూపాలుఁడు క్రీ. శ 1460 ప్రాంతమునయుండెననియు రాజ్యము చేసి రణరంగభైరవుఁడు రసికశిఖామణి మహావిద్వాంసుఁడు మనుచరిత్ర పఠన ప్రియుఁడు నింకననేక సుగుణములకు నెలవని కవులచేఁ బ్రస్తుతింపఁబడినాఁడని వివరించి నారాయణకవి కాలము క్రీ. శ 1480 యని శ్రీ లేకుమళ్ల అచ్యుతరావుగారు విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రలో దూబగుంట నారాయణకవిని గూర్చి వ్రాయుచు సూచించిరి.[4]

3. సమగ్రాంధ్ర సాహిత్యము - సంపుటము 4-పుటలు 126, 127.

4. అధ్యాయము 6-పుట 101-122.

శ్రీఆరుద్రగారు, శ్రీవేకుమళ్ళవారు గావించిన కాలనిర్ణయము లను సమీక్షించినచో దూబగుంటనారాయణకవి కాలముగూడఁ బదు నైదవ శతాబ్ద్యుత్తరార్ధమని నిర్ధరింపవచ్చును.

ఈపంచతంత్ర విమర్శసందర్భముననే శ్రీవేకుమళ్ళ అచ్యుత రావుగారు కృతిపతియైన బసవరాజు మనుచరిత్రప్రియుఁడని ప్రశంసింపఁ బడుటచే నీతఁడు కృష్ణదేవరాయల కాలమునఁగూడ నుండెనా యని నిస్సమాధానముగా ప్రశ్నించుకొనిరి. దూబగుంటనారాయణకవి పంచ తంత్రలబ్ధ నాశ్వాసాంత పద్యములలోఁ గృతిపతి నుద్దేశించి 'మందరాచ లేంద్ర ధీర మనుచరిత్రి సంతతానంద'[5] యని చెప్పినమాట సత్యమే. కాని కృతిపతిరాయలకాలముననున్నట్లు చెప్పుటకుఁదగినయాధార ములు మృగ్యములు. మనుచరిత్రప్రియుఁడనుటకు ధర్మశాస్త్రకర్త యైన మనువుయొక్క చరిత్రయందెక్కువ మక్కువగలవాఁడని యనఁగా ధర్మాచరణమున మనూక్త ప్రకారము నడచుకొని యానం దించు స్వభావము గలవాఁడని సమన్వయించుట సముచితము. అతని తండ్రియగు తమ్మభూపతిని గూర్చి నారాయణకవి 'మనుమార్గుండగు' నను విశేషణము ప్రయోగించినాఁడు. రాజరాజనరేంద్రుని నన్నయ భట్టుగూడ 'మనుమార్గుఁడగు విష్ణువర్ధనుండు' అని ప్రశంసించినాఁడు.

శ్రీఆరుద్రగారు దూబగుంటనారాయణకవినిగూర్చి వ్రాయుచు పంచతంత్ర కృతిపతియైన బసవరాజునకు సయోనా సవతి తమ్ముఁడిం కొక బసవరాజు గలఁడనియు నాతని కుమారుఁడైన సింగరాజునకు సంబంధించిన క్రీ. శ. 1518 నాఁటిశాసనమొకటిలభించుచున్నదనియు నందీవంశమువారలకు హొంసబిరుదరగండ, సహకారబాంధవ, మల్లనా వల్లభ, రణరంగభైరవ, గండధనంజయ, యనుబిరుదములున్నట్లు తెలి యుచున్నదనియు వీనిలోఁగొన్నిటిని దూబగుంటనారాయణకవి కృతి పతి నుద్దేశించి ప్రయోగించెననియు నాశాసనములలోఁజెప్పబడిన వంశ

5. పద్యము-109

క్రమమునే నారాయణకవియుఁ బేర్కొనెననియు, ఏనివలనఁగాలనిర్ణయము గావింపవచ్చుననియు సమగ్రాంధ్ర సాహిత్యములోఁ వివరించినారు.[6] నారాయణకవి పంచతంత్రానువాదపీఠికలో ప్రసవాంబక సమరూపున కొనబిరుదరగండనికి మహోర్వీశునకున్,[7] రణరంగభైరవునకున్ సహకారబాంధవునకున్[8] అని బసవరాజు బిరుదములు బేర్కొనినాఁడు.

ఈ బసవరాజింటి పేరేదియో పంచతంత్రమునఁ జెప్పఁబడలేదు. రఘురాముని సంతతిలోని వాఁడని బసవరాజభివర్ణింపఁబడినాఁడు. ఈతనికిఁ బూర్వులలో మాధవవర్మ యనునతఁడుండెనని గ్రంథపీఠికలో నిట్లు గలదు.

> మును బెజవాడ దుర్గఁ దనముగ్ధతనంబున మెచ్చఁ జేసి పెం
> పున రథదంతి వాజి భట భూరి బలంబులచేఁ గళింగభూ
> జనపతి దుంచి చేవఁదన సంతతికై మహిఁ బాడి నిల్పి కృ
> మ్మినఁ జిర కీర్తులంగనియె మాధవవర్మ తదన్వయంబునన్.

పద్యము—24

ఈమాధవవర్మనే ప్రస్తుతము కళింగదేశమందలి విజయనగర రాజులగు పూసపాటివారు తమ మూలపురుషుఁడని చెప్పుచున్నారని శ్రీ వేటుమళ్లవారు తదాధార భూతమైన యొకపెద్ద సీసమాలికను గూడ నుట్టంకించినారు. ఆసీసమాలికయందు మాధవవర్మ గొప్పదనము నాతని మూలముగాఁ బూసపాటివారనునింటి పేరేర్పడినవిధము నిట్లు చెప్పఁబడెను.

> అతని తనూజుఁడాతత బలోన్నతుండు మా
> ధవవర్మ నృపతి ముత్తాతఁబోలి

6. సంపుటము 6-పుట 127 7. పద్యము 41 8. పద్యము 44

జనకునాజ్ఞను సప్తశతి సాంగముగ రామ
దేశికుచేనుపదేశ మొంది
కనకదుర్గాకటాక్ష ప్రాప్తవిభవుండై
మళయసింగని బోరమ్రిందఁ జేసి
చౌబళహస్తమల్ల బలాధిపుని రక్త
ధారచేఁ బరదేవతను భజించె
వసు దిగింద్రియ శక వత్సరంబుల జయ
వాటికా దుర్గ వైభవము గాంచి
గగనవాణీవాక్య గౌరవంబునఁ బూస
పాటిభూమినిఁబురీవరము గట్టి
వాసిగాంచుటఁ బూసపాటివారను నింటి
పేరుగాంచిరి రాచపెద్దతికము
అమలరాజాదిగా ప్రముఖులు మావాఁరు
తద్గృహానామంబుఁ దాల్చి వెలి స.

ఈసీసమాలిక విజయనగర కళాశాలాపత్రికనుండి యుద్ధృత మైనట్లును శ్రీ శేకుమళ్ల వారు పేర్కొనియున్నారు. ఆరుద్రగారుగూడ నీమాధవ వర్మవంశీయుఁడును బంచతంత్రి కృతిపతియునైన బసవరాజుని బూసపాటి వంశీయునిగనే భావించినారు.

## కృతిపతి వంశావళి :

రఘురామునకు కుశమహారాజుదయించెను. అతనికి విజయసేనుఁడను కుమారుఁడు గల్గెను. అతనికి మాధవవర్మయను పుత్త్రుఁడు పుట్టెను. అతనికిఁ గొమ్మరాజు ప్రభవించెను. అతనికి అన్నలదేవ రాజను సుతుఁడుండెను. ఆయన్నలదేవరాజునకు సింగరాజను సూనుఁడు జన్మించెను. ఆ సింగరాజునకుఁ బెదవల్లభుఁడు పినవల్లభుఁడునను దనూజులుదయించిరి. ఆపినవల్లభుఁడు అన్నలదేవమ్మ యనునామెను బరిణయ మాడఁగా వారిరువురకును సింగక్షితిపతి, తమ్మభూపతి, తిరుమల నృపతి

యను పుత్త్రరత్నము సంభవించెను ఆతమ్మ భూపాలుఁడు వేమాంబను గృహిణిగాఁ జేసికొనెను. వారికుమారుకుఁ బంచతంత్ర కృతిపతియైన బసవరాజుద్భవించెను.

సంస్కృత పంచ తంత్రమందలి యైదు తంత్రములు నైదు పరిచ్ఛేదములుగా నాంధ్రీకరింపఁ బడినవి. మిత్త్రభేదమున 548, సుహృల్లాభమున 241, సంధివిగ్రహమున 360, లబ్ధనాశమున 110 అపరీక్షితకారిత్వమున 73, గద్యపద్యములు రచింపఁ బడినవి.

# 2. భానుకవి - పంచతంత్రి

భానుకవి దూబగుంట నారాయణ కవికించుక యర్వాచీనుఁడు. సంస్కృత పంచతంత్రమందలి కథల నతిస్పష్టముగను సంక్షేపముగను నితఁడనువదించినాఁడు. కొన్ని క్రొత్తకథలనుగూడఁ గలిపి రచించినాఁడు. గ్రంథమునకుఁ బంచతంత్రియని నామకరణమొనరించినాఁడు.

ఈ గ్రంథప్రతులు చెన్నపట్టణమందలి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందు రెండుగలవు. అందొకటి తాళపత్రప్రతి. రెండవది లిఖిత ప్రతి కాగితపుఁ బ్రతికిఁ దాళపత్రప్రతియే మూలము. ఆ గ్రంథాలయము వారు మద్రాసు ప్రభుత్వసాహాయ్యముతో దీనిని బ్రచురించి వెలుగు లోనికిఁ దెచ్చిరి. అడుగడుగునను గ్రంథమందుఁ గొన్ని పదములు, పద్య చరణములు శిథిలములైనవి. కొన్ని పూరింపఁబడినవి. పంచమాశ్వాసాదిని నపరీక్షితకారిత్వమునకుఁ జెందిన బ్రాహ్మణుఁడు— నకులమను కథలో గొంతభాగము లుప్తమైనది.

## దేవతాస్తుతి :

అవతారికలో వేంకటేశ్వరస్వామి, శంభుఁడు, గణాధిపుఁడు లక్ష్మి, పార్వతి, సరస్వతి వరుసగా నుతింపఁబడినారు. బ్రహ్మస్తవము మృగ్యము. లక్ష్మిపార్వతీసరస్వతులు, స్తుతింపఁబడుటచే వేంకటేశ్వర పరమేశ్వరులతోఁబాటు పరమేష్ఠియు నుతింపఁబడియుండుననియు నది లుప్తమైనదనియు నూహింపవచ్చును. ఐదవసంఖ్యగల పద్యము లేకుండు టయు లుప్తమనుటకు బలముచేకూర్చుచున్నది.

సంస్కృతకవులలో వ్యాసవాల్మీకికాళిదాసులు, మయూర బాణులు, తెనుఁగుకవులలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథుఁడు, భాస్కరుఁడు, రంగనాథుఁడు, నాచిరాజుసోమన యనువారు స్మరింపఁబడిరి. దూబగుంట నారాయణకవి విడువఁబడుట విశేషము. అష్టదిగ్గజములలో ముక్కుతిమ్మన, పెద్దన...

అల్లే యాంధ్రభోజుఁడని కీర్తిగాంచిన శ్రీకృష్ణదేవరాయల యాస్థాన ప్రవేశముగాని పోషణగాని యపేక్షింపక యాతని యుద్యోగులలో నొకఁడైన లక్ష్మమంత్రిని కవి యాశ్రయించుటయు విశేషమే.

## కవిచరిత్ర :

చిట్టనామాత్యుఁడు కృతిపతియైన లక్ష్మమంత్రితో భానుకవిని గూర్చి చెప్పు సందర్భమున,

> వరవాగ్వైఖరి లక్షణజ్ఞతను శ్రీవత్సాన్వయఖ్యాతి భూ
> వరమాన్యప్రకృతిన్ బురాతన సుకావ్యప్రౌఢిమన్ భారతీ
> వరమంత్రప్రతిభన్ మహేశపదసేవా నిష్ఠ నిన్ గోలగు
> ర్వరలో విశ్రుతలక్ష్మ మంత్రి! బుధసేవ్యమ్ముల్ భవద్భాగ్యముల్
>
> ఆశ్వా 1 పద్య 19.

అనుపద్యముగలదు. ఇందలి నాల్గవపాదమునకు 'తిప్పయ భాస్కరేంద్ర జనవాక్యమ్ముల్ భవద్భాగ్యముల్' అను పాఠాంతరమునుగలదు.

అదియే సరియైనదని గ్రహించుచో నందలి విశేషములన్నియుఁ గవికే చెందును. ఈ పద్యముతప్ప భానుకవి చరిత్ర చెప్పుపద్యమింకొకటి గానరాదు. అంతమాత్రముననదియే సరియైన పాఠమనఁజాలము. ఇఁక సరియైన పాఠమేదో యించుక పరిశీలింతము.

కృతిపతి వంశమూల పురుషుఁడైన కేశవుఁడు భారద్వాజ పవిత్ర గోత్రుఁడని "భారద్వాజ పవిత్రగోత్రమున శుంభల్లీలమైఁ గేశవుండారూఢింబ్రభవించె" నని చెప్పఁబడుటచేఁ బైపద్యమందలి శ్రీవత్సాన్వయ ఖ్యాతి యను విశేషణము కృతిపతికి సన్వయింపదు. కావునఁ బాఠాంతరమునే గ్రహించి కవికే సమన్వయింపవలెను. అట్లే పైపద్యమునఁ బరమేశ్వర పాదసేవానిష్ఠయందతఁడధికుఁడని కలదు. పంచమాశ్వాసాంతమునఁ గృతిపతి పద్మాధవధ్యానానందిత చిత్త! యని విష్ణుధ్యానముచే నానందింపఁబడిన మనస్సు గలవాఁడ! అని సంబోధింపఁబడెను. ఈ రెండు విశేషణములు విరుద్ధములుగా నుండుటచేఁ బాఠాంతరము గ్రహించి యందలి విశేషణములను భానుకవికే సంబంధించినవిగాఁ బేర్కొనుట సముచితము. పాఠాంతరమే కవ్యుద్దిష్టమని గ్రహించినచో భానుకవి శ్రీవత్సాన్వయ గోత్రజుఁడు, వాగ్విభవమునను రాజసమ్మానార్హత యందు ప్రాచీన సాహిత్య ప్రౌఢియందు భారతీవర మంత్రరాజ ప్రతిభయందు నీశ్వరార్చన యందు నాతని నెవ్వరుఁబోల రని చిట్టనామాత్యుఁడు ప్రశంసించినాఁడని చెప్పనగును. ఇందు భానుకవి భారతీవరమంత్రప్రతిభ ననుపముఁడనికలదు. ఆశ్వాసాంత గద్యములందు శ్రీభారతీవర ప్రసాద విద్యావిచిత్రయని భానుకవి తన్నుగూర్చి చెప్పికొనినాఁడు దీనినిబట్టి యతఁడు సరస్వత్యుపాసకుఁడనుట స్పష్టము. సరస్వతియనుగ్రహముచే విద్యలు పొందినాఁడని భావము. ఆశ్వాసాంతగద్యలఁబట్టి భానుకవి తిప్పనమంత్రి పుత్త్రుఁడని తెల్లమగుచున్నది. గ్రంథాంతమున శ్రీకృష్ణరాయ భూధవ భుజారక్షచేత రమ్యమైయున్న విద్యాపురమ్మునందుఁ దానీ పంచతంత్రిని వినుతికెక్క నాంధ్రీకరించి నట్లు[9] చెప్పుటచే భానుకవి శ్రీకృష్ణదేవరాయల సమకాలికుఁడని నిర్ణ

9 ఆశ్వాసము5 - పద్యము 51.

యింప వచ్చును. అట్లే కృతిపతికూడ రాయల సమకాలికుడుగా నభివర్ణితుడు గాన భానుకవి క్రీ. శ 1510 నుండి క్రీ.శ 1530 మధ్యకాలమున నీ పంచతంత్రిని రచించియుండునని శ్రీచాగంటి శేషయ్యగారు గావించిన నిర్ణయమత్యంత సమంజసముగా నున్నది.[10]

అవతారికలో గుకవినింద, తనకవితాద్యర్థ్య నివేదము లేకుండుట రొుక విశేషము.

## కృతిపతి చరిత్రము :

భానుకవి పంచతంత్రికృతిని సాటిపండితుడు నాట్యాచార్యుడు నైన లక్ష్మయామాత్యునకు నంకితమొసంగుట గణనీయము.

అవతారికయందు గృతిపతియైన లక్ష్మీనారాయణుని యమోఘ పరాక్రమము నఖండదాతృత్వము మున్నగు గుణములు పెక్కుస్థలముల నభివర్ణింపబడెను. శ్రీకృష్ణరాయ భూపాల కార్యభారధౌరేయుడనియు[11] వర్ణింపబడెను. అట్లే యేమంత్రి సితకీర్తి యను పద్యమున[12] కృతిపతి మంత్రిగా కీర్తింపబడి 'కృష్ణరాయదయా వివర్ధిత రమావిరాజి కరణము లక్ష్మీనారాయణుండు' అనియు బేర్కొనబడినాడు. చతుర్థాశ్వాసాంత పద్యములలో సతతప్రాభవ కృష్ణరాయ ధరణీ చక్రేశ కారుణ్యా వర్ధిత లక్ష్మీవిలసన్నిశాంత యనియు నుతింపబడినాడు. మంత్రిగా వర్ణింపబడుటచే గృతిపతి నియోగిశాఖకుజెందిన బ్రాహ్మణుడని తెలియుచున్నది. రాయల కార్యభార ధౌరేయుడనుటలో నాతని సామంతుడో ప్రతినిధియో కావచ్చును. రాజోద్యోగియనుట సముచితము. పెక్కుచోట్ల కరణికము లక్ష్మీనారాయణ యనియుండుటచే గ్రామాధికారి యని నిశ్చయింపవీలున్నది. ఇతరవిశేషణములచే నతడు రాయలచే బెక్కుఘన సత్కారములంది యుండుననియు జెప్ప

10 కవితరంగిణి - సంపుటము8 - పుట 250.

11 ఆశ్వాసము 1-పద్యము 13.

12 ఆశ్వాసము 1-పద్యము 34.

నగును. భానుకవి యీలక్ష్మీనారాయణుని సభను వేదశాస్త్రపురాణ విద్యాప్రవీణత నొప్పువిద్వజ్జనులొక్క వంక యనియభివర్ణించినాఁడు.[13] ఆంధ్రభోజుఁడైన రాయల యేలుబడిలో గ్రామాధికారులు గూడ సభలను నిర్వహించుట మిక్కిలి సమంజసముగానున్నది. అట్టి లక్ష్మీనారాయణుని సభలోఁ జిట్టన మంత్రి భానుకవిచే ప్రబంధము రచింపఁజేయుమని ప్రోత్సహింప లక్ష్మీనారాయణుడు బహువిధ సత్కారపురస్సరముగా నర్థించినాఁడు. భానుకవి పంచతంత్రి రచించినాఁడు. కాథామధ్యమునఁగూడ గృతిపతి సంబోధనలుండుట యొక విశేషము.

ముద్రిత పంచతంత్రి కృతిపీఠికలో లక్ష్మీనారాయణుఁడు రాయల యంతఃపురమున నాట్యసంగీతాచార్యుఁడని పేర్కొనఁబడినది. పంచతంత్రియందు నతఁడు నూతన భరతాచార్య అని సంబోధింపబడినాడు. అతడు సంగీత సూర్యోదయమను నొక సంగీత లక్షణగ్రంథమును రచించినాఁడు. అందతఁడు కృష్ణదేవరాయల కృపాక్షీరాబ్ధి చంద్రుఁడని యిట్లు చెప్పఁబడినది.

తస్య శ్రీకృష్ణరాయస్య కృపాక్షీరాబ్ధి చంద్రమాః
లక్ష్మీనారాయణో నామ వర్ధతే సారసాగరిణీః.

రాయలాతనికిఁ గావించిన ఘనసత్కారము లిట్లు వివరింపఁబడినవి.

శ్రీమత్కృష్ణనరేశ్వరస్య కృపయా స్వర్ణాంచితాం పాలకీం
ముక్తాగుచ్ఛ శతానుబద్ధ వలయం ముక్తాతపత్రద్వయం
శశ్వన్మత్తమతంగజాన్ మల హారీవాద్యం నిజాంతః పుర
స్థానే నాట్యరసాధి పత్యమసకృల్లక్ష్మీపతిః ప్రాప్తవాన్.

విష్ణువునకుఁ జక్రమువలెఁ దనకు నభినవభరతాచార్య బిదమున్నట్లు లక్ష్మీనారాయణుఁడిట్లు ప్రవచించినాఁడు.

సదాఽభినవశబ్దాది భరతాచార్య నామకం
బిరుదం ధారణీచక్రే ధత్తేచక్రమివాచ్యుతః.

13 ఆశ్వాసము 1-పద్యము 14.

సంగీతసూర్యోదయాధ్యాయాంత గద్యములలోఁ దనకుఁగల బిరుదములను లక్ష్మీనారాయణుఁడు 'ఇతి శ్రీమద్విప్రకులధుర్య భండారు విఠ్ఠలేశ్వరనందన సూక్ష్మలిఖితాచార్య రాయబయకార తోడరమల్ల అభినవ భరతాచార్య శ్రీలక్ష్మీనారాయణ విరచితే సంగీతసూర్యోదయే తాళాధ్యాయః ప్రథమః' అని వివరించినాఁడు. ఈ బిరుదములు పంచతంత్రియందును భానుకవిచే ప్రయోగింపఁబడినవి. ఈగద్యమందు లక్ష్మీనారాయణుఁడు భండారు విఠ్ఠలేశ్వరుని పుత్త్రుడని పేర్కొనఁబడినది. ఇందలి భండారు శబ్దము గృహనామము కావచ్చును. లేదాయది భండా శబ్దభవమగుటచే నాతఁడు భాండాగారాధ్యక్షుఁడై యుండు ననియు నూహింపవచ్చును.

కృతిపతి కృతికర్తను ప్రోత్సహించుట సహజము. కాని యిందుఁ గృతిపతి ప్రోత్సాహము కంటెఁ జిట్టనామాత్యుని ప్రోత్సాహమే యధికముగా వర్ణింపఁబడుట విశేషము.

## కృతిపతి వంశవర్ణనము :

భారద్వాజ పవిత్రగోత్రమునఁ గేశవుఁడుదయించెను. గౌరమ యాతని భార్య. వారికి విఠ్ఠలామాత్యుఁడు జన్మించెను. అతఁడు రుక్మాంబను వివాహమాడెను. ఆ పుణ్యదంపతులకుఁ గృతిపతియైన లక్ష్మీనారాయణుఁడు పుత్త్రుఁడు. ఈ లక్ష్మీనారాయణుని తండ్రియైన విఠ్ఠలామాత్యుఁడు గజపతిని మెప్పించి కనకఘంటలు గొనినట్లు "గజపతి మెప్పించి కనకఘంటలుగొని విద్యాప్రవీణత వినుతికెక్కె" నని చెప్పఁబడినది. పంచతంత్రిలోని కృతిపతి వంశవర్ణనము సంగీత సూర్యోదయము నందలి వర్ణనము సమానముగనే యున్నది.

## ఆశ్వాసాదికము :

గ్రంథమైదాశ్వాసములలో రచితము. ప్రథమాశ్వాసమున మిత్త్రభేదతంత్రము 352, ద్వితీయాశ్వాసమున సుహృల్లాభము 113,

తృతీయాశ్వాశమున సంధి విగ్రహమను తంత్రము 137, చతుర్థాశ్వాసమున లబ్ధనాశమను తంత్రము 82, పంచమాశ్వాసమున అపరీక్షిత కారిత్వమను తంత్రము 54, గద్యపద్యములలో దెనుఁగుఁజేయఁబడినది. పంచమాశ్వాసాదిని గ్రంథపాతము గలదు.

# 3. వేంకటనాథుని యనువాదము

భానుకవి యనంతరము పంచతంత్రము నాంధ్రీకరించినవాఁడు బైచరాజు వేంకటనాథుఁడు. పంచతంత్రాంధ్రానువాదములలో కెల్ల నీతని యనువాదము మిక్కిలి ప్రౌఢము ప్రబంధోచితమునైనది. పూర్వకవిస్మరణమున నారాయణ కవినైన స్మరింపకపోవుటచే ఆయనువాదము నీతఁడు చూచియుండఁడని పించును. కాని డా॥ చిలుకూరి నారాయణ రావు గారు బహుళ ప్రచారమునన్న దూబగుంట నారాయణ కవ్యనువాదమును వేంకటనాథుఁడు చూచియుండుననియు జూపోపమిచే నీసునొంది యంతకంటె రసవత్తరముగా నాంధ్రీకరింపఁదలంచి యుండుననియుఁబేర్కొనినారు[14]. వేంకటనాథుని పీఠికలోని ఒక్కఁడలంకారము నకు — అనుపద్యమున దీనికిది పూర్వచ్ఛాయయని నారాయణ కవి రచనము నధిక్షేపించినాఁడనియు వారు తలంచినారు. కాని యిది యసమంజసముగా నున్నదని డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు నిరాకరించినారు[15], ఆయాక్షేపణము సన్నిహితుఁడైన భానుకవికేల చెందరాదని వారు ప్రశ్నించుట సముచితముగా నున్నది.

వేంకటనాథుఁడు కవిరాజు రాజకవియగుట విశేషము. ఆతని యింటిపేరు బైచరాజు అని విమర్శకులంగీకరించిరి. ఆతని పూర్వీకులలో

4 భారతి-సంపుటము 18 పంచతంత్రము వేంకటనాథ నారాయణకవుల యనువాదములు. అనువ్యాసము పుట 629.

15 వ్యాసమంజిరి-పుట 161.

నాఱవ వాఁడైన భైచరాజు పేరుమీఁదుగా నింటిపేరేర్పడి యుండునని పెక్కండ్రభిప్రాయపడిరి. వేంకటనాథుఁడా భైచరాజు నిట్లభివర్ణించినాఁడు.

ధీరత రాజవంశ జలధిం బ్రభవించె మహావిరోధి సం
హార విహారి సాళ్వ బిరుదాంకుఁడు భైచనృపాలుఁడద్ధర
త్రీరమణీ మనోహరుని తీవ్రియశస్సతికిన్ హారాద్రినీ
హారవసుంధరా ధరములయ్యె సమగ్రవిహారశైలముల్

ఆశ్వా 1. పద్య 30

భైచరాజువర్ణనతో వంశవర్ణన మారంభింపఁబడుటచే నాతఁడే యింటి పేరునకాధారభూతుఁడని యూహింప వచ్చును. భైచరాజువారు నియోగిబ్రాహ్మణులలోఁ గూడఁగలరు. రాజు శబ్దము నియోగులకుఁ గూడవర్తించును. కాని వేంకటనాథుఁడు తన వంశము రాజవంశముగాఁ బై పద్యమునఁనేగాక యితర స్థలములందును సూచించుటచే నీకవి క్షత్రియుఁడనియే నిర్ణయింపనగును వేంకటనాథుఁడు తన్ను గూర్చి వేంకటధరావరప్రభుఁడ నని పేర్కొనినను అతఁడు రాజ్యపాలకుఁడని చెప్పుట కాధారములు మృగ్యములు. ఆతఁడు దుష్ప్ర రాజులనువారి యాశ్రియమును దీవ్రముగ నిందించినాఁడు. కృత్యంకితావసరమున కృతులు మూఢ భూమిపతుల కిచ్చుటను నిందించినాఁడు. తాను ప్రభువైనట్లు నఁజాలఁడు. అంతమాత్రమే గాక ప్రథమాశ్వాసమున సంజీవక దమనక సంభావణ సందర్భమున దుష్ప్రభుసంశ్రయమును సుదీర్ఘముగను నిశితముగను నిరసించినాఁడు. అమూలకములైన యందలిభావము లాతని యాత్మీయతా నిరూపకములు. దుష్ట నరపతియాశ్రియమునాతఁడు నిందించిన విధమున క్రిందిది పద్యమొక్కటి పరిశీలనార్హము.

నలకువఁజూచి యీఁడడగినం గసగుం గ్రశియించి యున్నచో
నలరుఁబ్రపూర్ణుఁడైన నెరయం బరికింపఁగలేఁడు నాకు నీ
కొలువిక చాలునన్నఁ గుసిగుంపులఁ బెట్టు వధింపఁజూచుఁగో
వల నరకంబుగా కొలుచువారికి దుష్ప్రభు సంశ్రియంబిసీ

ఆశ్వా 1–పద్య 429.

కుత్సితుఁడైన నృపాలుని స్వభావమును వేంకటనాథుఁడు

తనువుఁ బొదలనీఁడు తాపంబుఁ బుట్టించుఁ
బస్తుఁబెట్టు మూలఁ బొలవైచుఁ
గొలుచు సజ్జనులకుఁ గుత్సిత వసుమతీ
వల్లభుండు వేఁకి వంటివాఁడు.

ఆశ్వా 1-పద్య 430.

అని మనోహరముగా వెల్లడించినాఁడు. రాజుల స్వభావమును వారి యందుండు దుర్గుణములను

హత దాక్షిణ్యులనర్థకారులభిమానాధ్యాత్ములవ్యంజన
ప్రతిపక్షుల్లుజనప్రియుం వదులు సంపత్సన్నిపాతస్మృతి
క్షతికుల్సత్య పరాఙ్ముఖుల్ధన పిశాచగ్రస్తులా ద్యావన
చ్యుతులక్షాంతులనాంతరంగికులు రాజుల్గారె యూహింపఁగన్.

ఆశ్వా 1 - పద్య 435

అనుపద్యమున వరుసగా గుదిగుచ్చినాఁడు. ప్రభువు లెట్టివారికి ప్రశం. సింతురో వేంకటనాథుఁడిట్లు వివరించినాఁడు.

పలుకూఁతలఱచు వానిన్
గలుదాంౘెడు వానిఁజెవులు గఱచెడువానిన్
బొలఁతులఁదెచ్చెడు వానిన్
దొలఁగింపక సంతసింపుదురు రాజన్యుల్.

ఆశ్వా 1-పద్య 445.

అసందర్భ ప్రలాపకులను నటవిటగాయక కాంతాజనమును గాని తన వంటి వారిని ప్రభువులాదరింపరని యిట్లు సూచించినాఁడు.

అనుచిత భాషణముఖరా
ననులమొ విటగాయకులమొ నటులమొ గాథ
స్వన సంభర నమ్రవధూ
జనులమొ మమ్మేల రాజు సంభావించున్.

ఆశాఁ 1-పద్య 134

కథాభాగమున కెట్టి సంబంధము లేకపోయినను హిరణ్యకుని పూర్వ జీవితోదంత నివేదన సందర్భమున వేంకటనాథుడు రాజులెట్టివారి నాదరించి సమ్మానింతురో

పరిహాసకులకు నటులకు
దరుణులకును లంజదారి తమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం
బోరయింతురు రాజులీరుపో సరసులకున్

ఆశ్వా 2-పద్య 138.

అను పద్యమున వివరించినాడు.

గ్రంథస్థ విషయమును బరిశీలించినచో వేంకటనాథుడు రాజ సౌఖ్యము లనుభవించియుండడనుట స్పష్టము. బ్రతికి చెడి దేశములు తిరిగినాడేమో యని యూహించుటకు క్రింది పద్యము పరిశీలింపదగినది.

పరదేశంబెఱుగక తగు
గరగరికన్నీడువ ముడువగలిగి నడుమబే
దరికము వాటిలి తిరియ
న్దిరిగిన ననుబోటికమరునే యింతైనన్.

ఆశ్వా 2-పద్య 131.

దాతలపై వేంకటనాథునకుగల యభిప్రాయమిట్లు తెలుపబడినది.

దాతలు దాతలండ్రదది యతథ్యము లోకమునందు లేడుపో
దాత యతండు గల్గినను దాతృతదా సకలార్థు లందు నే
లా తుల తూగకుండు నచలస్థితి నింతయెఱింగి యేనహో
దాత ఋణానుబంధముగదా యని చిత్తము నందలంచెదన్.

ఆశ్వా 2-పద్య 140.

తనవంటి వారు ప్రభువుల యాచించుట నిష్ప్రయోజనమని యతడు

వెల్లివిరిసె బెంటి విద్యలు మగవిద్య
లడుగువట్టె గ్రిందువడిరి బుధులు

హీనజాతి పురుషు లెచ్చిరి యాచింపఁ
బోవు రెట్లు నేఁటి భూమిపతుల

ఆశ్వా 2–పద్య 132.

అని నిష్కర్షగా వాక్రుచ్చినాఁడు. ఇట్లు పరిశీలించినచో వేంకటనాథుఁడు రాజాస్థాన ప్రవేశము పొందలేదనియు రాజసత్కారము లందలేదనియు విశదమగుచున్నది.

వేంకటనాథుఁడు దుష్టనృపతులను సాదించినను సరసప్రభువులపై నతనికి గౌరవము లేకపోలేదని కథాగతిలో నతఁడు రచించిన

కోరిన గద్యపద్యములఁ గూరిచి యిచ్చెదనంటివేని ని
స్సారములంచు విత్తమిడఁజాలక కేరడమాడు లోభి యా
నేరుపు నేర్పుగాదు తను నిందలఁబెట్టు రసజ్ఞుఁడైనయు
ర్వీరమణుండు గల్గినఁ గవిత్వము సర్వఫలంబు లీదొకో

ఆశ్వా 2–పద్య 135.

యను పద్యమును బట్టి గ్రహింపవచ్చును.

## నివాసము :

వేంకటనాథుఁడు కృతిని హరిహరనాథునకంకితమిచ్చుటచే నెల్లూరు ప్రాంతమాతని నివాసమని యూహింపవీలున్నది. అట్లే కథా మధ్యమునను యాదృచ్ఛికముగ నతఁడు,

దమనకుఁడిట్లను పరవి
క్రమ విక్రమసింహపురనికటవటకాంతా
రమున నొకనాఁడు గాథ
క్రమమున నేనరిగి తిరుగఁగాఁగ ట్టెదురన్

ఆశ్వా 1–పద్య 186.

అని విక్రమసింహపుర ప్రసక్తిగావించుటయు వేంకటనాథుఁడు నెల్లూరుమండల నివాసియనుటను బలపఱుచుచున్నది.

**కాలము :**

పూర్వకవిస్తుతిలో వేంకటనాథుడు శ్రీనాథుని పేర్కొనుటచే నతఁడు శ్రీనాథునికిఁ బూర్వుఁడు గాఁడనుటస్పష్టము. బ్రౌనుదొరగారు తమ నిఘంటువునందతఁడు క్రీ. శ. 1500 సంవత్సర ప్రాంతమువాఁడని సూచించినారు.

శ్రీ చాగంటి శేషయ్యగారు బైచరాజు, తిమ్మరాజు తిరుపతి వేంకటేశ్వరస్వామికి గోవిందరాజులకును ధర్మమునొసంగి వేయించిన మూఁడు శాసనములఁబట్టి వేంకటనాథుని కాలమును నిర్ణయించినారు.[16] ఆ శాసనవివరములు:

1. మొదటి శాసనము:- శాలివాహన 1413 అగు విరోధికృత్తు సంవత్సర మిథునమాస బహుళపక్ష సప్తమీ సోమవారమునాఁటిది. (క్రీ. శ. 1491 సంవత్సరము జూన్ 27 వ తేదీ) ఈ శాసనములో బైచరాజు తిమ్మయదేవ మహారాజు అనియున్నది. భాష అరవము.

2. రెండవ శాసనము:- శాలివాహనశకము 1414 పరీధావి సంవత్సర వృశ్చిక మాస బహుళపక్ష విదియనాఁటిది. (క్రీ. శ. 1492 వ సంవత్సరము నవంబరు 6 వ తేదీన) ఇందులో అంతెం బరగండ ఉర గోల సురతాణుఁడును మహామండలేశ్వర ఉత్తమగండ ఉభయరగండ గండరగండ గండభేరుండ బిరుదాంకితుండునగు కొమ్మరాజు సిరుతిమ్మ రాజ కార్యనిర్వాహకుఁడు నగు బైచరాజు తిమ్మరాజు అనియున్నది. భాష అరవము.

3. మూఁడవ శాసనము:- కాలముదాహృతముకాలేదు, ఆంధ్రమున అంత్రెం పండరంగపురగోల సుతధారణ బైచరాజు తిమ్మరాజు శిలాశాసనము అనియున్నది.

వేంకటనాథుడు పంచతంత్రమునఁ దనవంశచరిత్రను వివరించుచు,

16 ఆంధ్రకవితరంగిణి - సంపుటము 9- పుటలు 120-121.

అలబై చ క్షితిపతికి
న్చలభిత్ప్రతిమాన భోగ పరతంత్రునకున్
గలిగెన్దిరుమల ధరణీ
తలనాథుఁడు నిర్భర ప్రతాపోజ్జ్వలుఁడై

ఆశ్వా 1-పద్య 31.

అనుపద్యమున వర్ణించిన బైచరాజు తిరుమలరాజును బైశాసనముల నుదాహృతుఁడైన తిమ్మరాజు నభిన్నులనియు వేంకటనాథుఁడా తిరుమల రాజునకు మనుమఁడగుటచే బదునాఱవ శతాబ్ద్యుత్తరార్థమున నుండు నని నిశ్చయింపవచ్చుననియు శ్రీచాగంటివారు నిర్ణయించిరి; డా॥ చిలుకూరి నారాయణరావు గారు కూడ వేంకటనాథుని మాతామహుని శాసనములఁబట్టి యతఁడు క్రీ. శ. 1550-60 సంవత్సరములనడుమ పంచతంత్రమును రచించియుండునని నిర్ణయించినారు.[17]

పై యాధారములఁబట్టి బైచరాజు వేంకటనాథుఁడు 16వ శతాబ్ది పూర్వార్థమున నుండెనని నిశ్చయింపవచ్చును.

## దేవతాస్తుతి :

శ్రీకృష్ణ ప్రార్థనముతో గ్రంథమారంభింపఁబడినది. తరువాత వరుసగాఁ బద్మ బ్రహ్మ వాణి పరమేశ్వరుఁడు దుర్గ విఘ్నేశ్వరుఁడు గరుత్మంతుఁడు నుతింపఁబడిరి. హరిహరనాథస్తుతి లేకుండుట విశేషము. గరుత్మంతునిస్తుతి యుండుటయు విశేషమే.

## పూర్వకవి స్మరణము :

సంస్కృతకవులలో బాణమయూర చోరులు స్మరింపఁబడిరి. వర్ణనావైవిధ్యమునఁ బదప్రయోగమున వేంకటనాథుఁడు బాణుని పోలును. ధారాశుద్ధిలోనతఁడు మయూరు నంతటివాఁడు. వాల్మీకి వ్యాసకాళిదాసులు స్మరింపఁ బడకుండుట విశేషము. తెనుఁగుకవులలోఁ దిక్కన యమరేశ్వరుఁడు సోమన శ్రీనాథుఁడు కీర్తింపఁబడినారు. నన్నయ విడువఁ బడుటయు విశేషము.

17. భారతి- సంపుటము 18 పుటలు-28, 29.

**గురుస్తుతి :**

వేంకటనాథుడు తన వంశాచార్యునిగాఁ దిరుమల శ్రియఃపతి నిట్లు శ్లాఘించినాడు.

వాచావీచీ ధీకృత
లోచన కర్ణాగ్రయాయి లోకసుధాంధో
సైచికిఁదలఁతు స్మద్వం
శాచార్యుం దిరుమల శ్రియఃపతి గురునిన్

ఆశ్వా 1-పద్య-12.

ఆశ్వాసాంతగద్యలందును ఇది వేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్య అని గురుస్మరణ గావింపఁబడెను.

**కుకవినింద :**

మనోజ్ఞ భావసంపదతో వేంకటనాథుఁడు బహువిపులముగాఁ గుకవినింద గావించినాఁడు.

రసస్ఫూర్తి తక్కువగానున్నదనియుఁ బూర్వకవుల రచనకిది ఛాయారూపమనియు నింకను బలు తెలుఁగుల కావ్యమునధి క్షేపించుఁ గుకవులనిట్లుతఁడు పాలంభించినాఁడు

రసవిస్ఫూర్తి గొఱంత దీనికిది పూర్వచ్ఛాయ యిచ్చోటఁద
ప్పస దిప్పట్టున నర్థసృష్టి పసలేదిచ్చోట నశ్లీల మ
ద్దెస నాదిక్కున దుస్సమాసమిది సందేహాస్పదం బీడనం
చు సుమాళంబునఁ బొండితుల్ నెరపు నీచున్ రోఁత వాక్రువ్వఁగన్

ఆశ్వా 1-పద్య-13.

ఉత్తములు తుమ్మెదలు పుష్పములందు స్థానమువలె మంచి తావులు వెదకుదురనియుఁగుకవులు నక్కలు గోతులవలెఁ గేవలము దోషములనే రోయుదురని యిట్లు నిందింపఁబడిరి.

మృదుగతి మంచితావులకు మెచ్చుసదావనిఁ బావనాళిదా
వదిగొని రోయు వంకలను వంచక సంచయ మట్టిదే గదా

చదురు ఘటిల్లఁజూచు సరసప్రసవంబులఁ జంచరీక పుం
గదుపులు నిచ్చలున్ న్వేదకుఁగా కుణపంబుల నక్కలేర్పడన్
ఆశ్వా 1-పద్య 17.

కుకవులు తమ గ్రంథ ప్రచార ప్రసిద్ధులకుఁబడు నవస్థలను వేంకటనాథుఁడిట్లు వివరించి యట్టివి కృతులుగావని నిరసించినాఁడు.

ఎడపక తారుదారె లిఖియించి పఠించి కృతుల్ ప్రతుల్ జగం
బడిగిన నిచ్చిహెచ్చి సకలావసథంబులఁదారయై దిశల్
గడచి నటించు కావ్యములు కావ్యములా హరణాఖు శాంతికై
విడువక కూలిఁబెట్టి చదివించు కృతుల్ గృతులే వసుంధరన్
ఆశ్వా 1-పద్య 19.

ద్వితీయాశ్వాసమునఁ గథా మధ్యమునందును గుకవుల స్వభావమును సహృదయతా రాహిత్యమును వేంకటనాథుఁడిట్లు పేర్కొనినాఁడు

పలుకుల శబ్ద సర్గ శతపత్ర భవంబులు జాతవర్ణముల్
బలుకడుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞలనర్థకముల్ విచారముల్
వలవనిఠీవి నవ్వఁ బెఱవారి నెఱుంగక తిట్టికూళలే
పొలుపునఁ దప్పులొప్పులనఁ బోదురొకో సుకవి ప్రబంధముల్
పద్య-136.

అట్టి యజ్ఞుల ప్రశంసలకు నిందలకుఁ దాను మోదఖేదములు పొందఁజాలనని ఆ సందర్భముననే వేంకటనాథుఁడిట్లు సూచించినాఁడు.

మెఱసి బహుప్రబంధతను మెచ్చుట మెచ్చుట యొచ్చమంటి పా
డఱి ముఱి నెన్ను టెన్నుట నిరక్షర కుక్షులధీర శిక్షితుల్
కఱటులు భూరుహాశ్మపశుకల్పులు మత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁబోవనాడినను గల్గవు నామది మోద ఖేదముల్
పద్య-137.

ఈకుకవి నిందా సందర్భమున విమర్శకులనేక విధములుగా నుందురనియు వారినందఱను దృప్తిపఱుచుట కష్టమనియు బహూపమాన పూర్వకముగా నిట్లు పేర్కొనఁబడినది.

ఒకఁడలంకారమునకు వేడుక వహించు
నొకఁడు వార్తా సమృద్ధికిఁ జెలంగు
నొక్కఁడు శబ్ద స్ఫూర్తులకు మాయురేయను
నొకఁడర్థ సృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకుమ స్తకముఁగదల్చు
నొకఁడుపమాన చర్చికకునలరు
నొకఁడు పదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు
నొకఁడు జాతిశ్లాఘకుబ్బుచుండు
గామిచందానఁదలవరి కరణి బధిరు
వలెదరిద్రుని గతివాది పగిదిఁ గనక
కారుచాడ్పునఁ బంగువైఖరిఁ గుజాతి
జాడ నిందఱి ముదలింపఁ జాలుటెట్లు

ఆశ్వా 1–పద్య 14.

కామిచందాన నొకఁడలంకారమునకు వేడుక వహించును. తలవరి వలె నొకఁడు వార్తా సమృద్ధికి నుత్సహించును. బధిరునివలె నొకఁడు శబ్ద స్ఫూర్తులకు మాయురేయనును. ఇట్లు గీతపద్యమందలి విషయములు పైపాదములందలి విషయములతోఁ గ్రమాన్వయము గల్గియుండును. 'భిన్నరుచిర్హిలోకః' అనువాక్యమునకుఁ జమత్కారవంతమైన వ్యాఖ్యాప్రాయము.

పెక్కు గుణములు గల రచనలో నొకతప్పున్న నది పరిగణనీయముగాదని బహుకళలచే ప్రకాశించు చంద్రునకు మచ్చ నిందగల్గింపదని వేంకటనాథుఁడిట్లు సూచించినాఁడు:

ఒప్పులుగల కృతిలో నొక
తప్పున్నను గడముగాదు దానికిఁ గళలం

జొప్పడు శశికిఁ గళంకము
కప్పేర్పడి యేమి నిందఁగావించెనొకో

ఆశ్వా 1-పద్య 15

కాళిదాసుని 'ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అను వాక్యమునకిది చక్కని యనుసరణము.

కుకవినిందా సందర్భమున వేంకటనాథుఁడు కవిత్వమెట్లుండవలెనో సుందరముగ స్తనౌపమ్యపురస్సరముగ నిట్లు వివరించినాఁడు

ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవఁ బోలి గూఢమును జాటుదనంబును గాక యుండఁజె
ప్పినయది పో కవిత్వమని పించు నగించిటుగాక యుండినన్.

ఆశ్వా 1-పద్య 18

క్రింది సంస్కృత చాటూక్తి యీపద్యమునకు మూలమనఁదగినది.

నోఘూర్జరీ స్తన ఇవాతితరం నిగూఢో
నద్రావిడీ స్తన ఇవాతితరాం ప్రకాశః
అర్థో గిరామపిహితః పిహితశ్చ కశ్చి
త్సౌభాగ్యమేతి మహారాష్ట్ర వధూకుచాభః.

బైచరాజు ప్రదర్శించిన స్తనౌపమ్యమును శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారు నిరసించినారు.[18] కాని శ్రీనాథాదులు స్తనసాదృశ్యమును గ్రహించినవారే భీమేశ్వరపురాణమున శ్రీనాథుఁడు 'కాలాంతఁ స్ఫురచ్చండికా పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్' అనియు జైమినీభారతమున పినవీరభద్రుఁడు 'పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జీబుగఁదోఁచుభాతిగా' అనియు రామాయణమున మొల్ల 'కొలఁగఁది గానవచ్చు వలిగుబ్బచనుంగవతీవి నొప్పఁగా' ననియు స్తనతౌల్యము గ్రహించుట సాహిత్యలోక ప్రసిద్ధము. కుకవితిరస్కృతి నింత

18 ఆంధ్రకవి చరిత్ర-భాగము I-పుట 94

దీర్ఘముగ నిర్వహించుటచే వేంకటనాథుఁడు సమకాలీనుల విమర్శలకు గుఱియై యుండునని యూహింపవచ్చును.

**అంకితము :**

రసవంతము పురాణ భారతోద్భూతము నైనను గావ్యము నరాంకితమైనచో సాధుజనపఠనయోగ్యముగాదని దృష్టాంతపూర్వకముగా వేంకటనాథుఁడిట్లు హెచ్చరించినాఁడు.

సన్నుత శబ్దలక్షణ రసస్ఫురితంబుఁ బురాణ భారతో
త్పన్నము నైన సాధుపతితంబయి యొప్పదు మర్త్యసేవ్యమై
యున్న ప్రబంధ మెప్పటికహో జగదేక పవిత్రభూమి దే
వాన్నము సారమేయ చరణాంకితమైన భుజిక్రియార్హమే.

ఆశ్వా 1-పద్య 26

తిక్కనమార్గానుసారియైన బైచరాజు గూడఁ బంచతంత్రమును హరిహరనాథాంకితము గావించినాఁడు. ఆతనికిని స్వప్నము వచ్చినది. అందొక మహాస్సు సాక్షాత్కరించెనఁట. దానినిట్లు వర్ణించినాఁడు.

హ్యాన్నిత్యయాచ రమయా వ్యమయా పరిభుత్వం
మాళీతుషార ఘృణినా జగతాం గురుత్వం
సందీపయన్న భసికోఽపి మహాన్ పుమాన్ మే
స్వప్నే శుభేఽసిత సితద్యుతి రావిరాసీత్

తిక్కనగారి కిమస్తిమాలామ్మను శ్లోకమునకిది యనుసరణప్రాయము. ఆ సాక్షాత్కరించిన శాంతి హరిహరనాథుడని యాతఁడా రూపము నిట్లభివర్ణించినాఁడు.

అంగధృతాబ్జు నిశ్చల తరాతను సర్వము సర్వమంగళా
లింగితు భీషణా శరకులీన జయోన్ముఖ పౌరుషక్రియా
సంగతు భీషణాంబక కృశాను నిరూపిత వైరిసద్మయో
గాంగ యుతాదృతిన్ హరిహరాకృతి మత్కృతిభర్తఁ జేసెదన్

ఆశ్వా 1-పద్య 22

ఈ పద్యముగూడఁదిక్కనగారి 'కరుణారసము వొంగి తొరఁగెడుచాడ్పున అనుపద్యమున కనుసరణముగనుందగినది.

హరిహరనాథ సాచివ్యము నొందుటకుఁ దిక్కనకునాచనసోము నికిఁదనకుఁదక్కనితరులకు శక్యముగాదని దృఢవిశ్వాసముతో వేంకట నాథుఁడిట్లు వాక్రొనినాఁడు.

ఏచనవు గలదు హరి హర
సాచివ్యము నొంద నన్యజనులకు మదినా
లోచింపఁదిక్కయజ్వకు
నాచన సోమునకు మఱియు నాకుందక్కన్

ఆశ్వా 1–పద్య 25

అధిక కుటుంబ పోషణకై మూఢరాజులకుఁ గృతియిచ్చి నరక మున కేగుటకంటె హరిహరాంకితము గావించి సుగతిఁబొందుట సము చితమని వేంకటనాథుఁడిట్లు పేర్కొనినాఁడు

అతికుటుంబ రక్షణాపేక్షఁ బ్రాల్మాలి
కృతులు మూఢభూమి పతులకిచ్చి
చచ్చి నిరయమునకుఁజనుకంటె హరి హరా
ర్పణముఁ జేసి సుగతిఁ బడయరాదె

ఆశ్వా 1–పద్య 27

ఈ పద్యము పోతన భాగవతావ తారిక యందలి 'ఇమ్మను జేశ్వ రాధములకిచ్చి' యను పద్యమును దలపించు చున్నది.

మూఢ ప్రభ్వంకితమును నిందించుటయే గాక మూఢరాజులు మహాప్రబంధము వినినఁ గల్గు ప్రమాదములఁ గూడఁ గథాగతిలో భంగ్యంతరముగ వేంకటనాథుఁడిట్లు వివరించినాడు.

ఏల ల్లందనతాన లేమయినలే వేయందు బోధించు నే
నూలంబెట్టఁగఁజాల మూఢనృపుఁడోహో సామహోసాహితీ

శూలంబులెన్నవులాడ సొమ్మసిలు నొచ్చుంజచ్చుఁదత్కల్మషం
బేలా యంజలిచేసి మ్రొక్కెదఁ పదార్థేచ్ఛాని శాచారికిన్.

ఆశ్వా 2-పద్య 133

## కవివంశ వర్ణనము :

భగవదంకితమైన కృతులలో సామాన్యముగాఁ గవివంశవర్ణన ముండును. కావున పంచతంత్రమున వేంకటనాథుని వంశవర్ణనము గావింపఁబడినది. అయ్యది బైచరాజుతో నారంభింపఁబడెను. అతనికిఁ దిరుమలరాజు పుట్టెను. తిప్పాంబిక యాతని భార్య. వారికి వీరభద్రుఁడు దయించెను. ఆతని భార్య లింగమక్క. వారికిఁ గుమారలింగరాజు, పర్వతరాజునను పుత్త్రులు గల్గిరి. అందుఁబర్వతరాజు అన్నమాంబికను బెండ్లియాడి వేంకటనాథుఁడు రంగ విభుఁడు శేషాద్రి యను పుత్త్రులను బొందెను. ఆ వేంకటనాథుఁడే పంచతంత్రికృతికర్త.

వేంకటనాథుఁడు తనఘనతను వంశవర్ణన సందర్భమున నిట్లు పేర్కొనినాఁడు.

అసహాయ సరసకవితా
రసికుఁడ వేంకటధరావర ప్రభుఁడ గుణ
ప్రసవ ప్రకాండ మదవ
ద్భసలాయిత విద్వదఖిల బంధువ్రజుఁడన్

ఆశ్వా 1-పద్య35

## ఆశ్వాసాదిక వివరణము :

పంచతంత్రి మందలి ఐదు తంత్రములై దాశ్వాసములుగా సనువదింపఁబడినవి. ప్రథమాశ్వాసమున 801 ద్వితీయాశ్వాసమున 241 తృతీయాశ్వాసమున 388 చతుర్థాశ్వాసమున 584 పంచమాశ్వాసమున 69 గద్యపద్యములు గలవు.

# 4. పంచతంత్ర చంపువుల ఆంధ్రీకరణ విధానము

ఆంధ్రీకరణ మనగా దెనుగు సేత. తెనుగుననువదించుట యని యర్థము. ఆలంకారికులు ఆంధ్రీకరణ మెట్లుండవలెనో యెందును జెప్ప లేదు. చెప్పునవసరము గూడ వారికి గలుగలేదు. కాని యానందవర్ధనాచార్యులవారు ఇతర కవులరచనా సాదృశ్యమును సంవాదమనియు, నది మూడు విధముల నుండుననియు ధ్వన్యాలోకమున నిట్లు పేర్కొనినారు.

సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్
ఆలేఖ్యాకారవత్తుల్య దేహివచ్చ శరీరిణాం
తత్రపూర్వ మనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరమ్
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః.

ఉద్యోతము 3–కారికలు 116–117.

ఇందలి తుల్యదేహివత్సంవాదము అనువాదమున ననువర్తింపదగినది. ఆంధ్రీకరణము మూలముతో సమానముగ స్వతంత్ర రచనగా భాసించునట్లుగ నుండుట వాంఛనీయమని చెప్పవచ్చును. పెక్కుకవులు రామాయణ భారతాదుల నుండి కథాభాగము గ్రహించి పలుమార్పులు గావించి కావ్యనాటకములను రచించుటకు గారణము తమరచనము స్వతంత్రమైనదిగా భాసింప జేయుటయే. ధ్వనికారుఁడుగూడ ధ్వన్యాలోకమున

ఇతివృత్త వశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యోప్యంతరాభీష్ట రసోచితకథోన్నయః.

ఉద్యోతము 3–కారిక–67

అని యితివృత్తమును మార్చిరచింపవచ్చు ననినాడు. ఇతరులును

యత్స్యాదనుచితం వస్తునాయకస్య రసస్య వా
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథావా ప్రకల్పయేత్.

అని యామోదించినారు.

ఆంధ్ర వాఙ్మయము నన్నపార్యుని భారతాంధ్రీకరణముతో ఆవిర్భ వించినది. అది యథామూలాను వాదముగాదు. ప్రసన్నకథా కలితార్థ యుక్తి, యక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తినిధిత్వమునను మూడు గుణములను భారతానువాదమున బాటించుచు నన్నయ తన రచనము స్వతంత్రమైనదిగా భాసింప జేసినాడు. శ్రీనాథుడు నైషధాంధ్రీకరణ సందర్భమున కావ్యానువాదమెట్లుండవలయునో 'అశేషమనీషి హృద యంగమంబుగా శబ్దంబననుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావంబుపలక్షించియు...' అని వివరించి యనుసరించినాడు.

సంస్కృత పంచతంత్రము చిన్న చిన్న కథలతో గూర్పబడినది. కథనాధారముగా నీతిబోధ గావించుట విష్ణుశర్మ లక్ష్యము. ఆంధ్ర చంప్వను వాదకులు కథకు ప్రాధాన్యమొసంగినారు. కథాగమనమున కలంకార ప్రాయములగునట్లుగ నీతులు గ్రహించినారు. కావున నాంధ్ర పంచతంత్ర చంపుల యాంధ్రీకరణ విధానమును 1) కథానువాదము 2) నీత్యనువాదమునను నంశము లాధారముగా బరిశీలింపవలయును.

## 1. కథానువాదము

సంస్కృత పంచతంత్రమున డెబ్బదియొక్క కథలు గలవు అందు మిత్రభేదమందలి కథలు: 1 వానరము కీలోత్పాటనము 2 నక్క-భేరి, 3 దంతిలగోరంభులు- 4 దూతీజంబుకాషాఢ భూతులు 5 విష్ణురూప ధూర్తకౌలికుడు 6 కాకి- కనకసూత్రము 7 బకము-కర్కటకము 8 భాసురకమనుసింహము- శశకము, 9 మందవిసర్పిణియను పేను- అగ్నిముఖమను నల్లి 10 చండరవమను నక్క నీలిరస భాండము 11 మదోత్కటమనుసింహము-ద్వీపి-వాయసగోమాయువులు, 12 టిట్టిభ దంపతులు, 13 కంబుగ్రీవమను కచ్ఛపము-సంకట వికటములను రెండు హంసలు 14 అనాగత విధాత - ప్రత్యుత్పన్నమతి- యద్భ విష్యుడునను మూడు చేపలు 15 చటకదంపతులు- కుంజరము 16 వజ్రదంష్ట్రమను సింహము- చతురకక్రవ్యములను సృగాలవృక

ములు 17 వానరయూథము- సూచీముఖము 18 చటకదంపతులు-వానరము 19 ధర్మబుద్ధి-పాపబుద్ధి యనుకోమట్లు 20 బకములు-కృష్ణసర్పము 21 జీర్ణధనుఁడను వణిజుఁడు-లోహతుల 22 రాజు-సేవకవానరము 23 చోరబ్రాహ్మణుఁడు.

మిత్రలాభమందలి కథలు: 1 తామ్రచూడుఁడు-బృహత్ స్ఫిక్ అను సన్న్యాసులు 2 బ్రాహ్మణి-తిలచూర్ణము 3 పుళిందుఁడు, నక్క, అతితృష్ణచే జచ్చుట 4 సాగరదత్తుఁడను వణిక్పుత్రుఁడు, 5 కౌలికుఁడు 6 తీక్ష్ణవిషాణమను వృషభముయొక్క యండములు-నక్క.

కాకోలూకీయమందలి కథలు: 1 చతుర్దంతమను గజయూథపతి శశకము 2 శశకపింజలులు 3 మిత్రశర్మయను బ్రాహ్మణుఁడు-మేకపిల్ల 4 మహాకాయమను కృష్ణసర్పము-పిపీలకములు 5 హరిదత్తుఁడను బ్రాహ్మణుఁడు పాము-మణి 6 చిత్రరథుఁడను రాజు-పద్మసరోవరము 7 కపోతలుబ్ధకులు 8 కామాతురుఁడను వృద్ధవణిక్కు-చోరుఁడు 9 ద్రోణుఁడను బ్రాహ్మణుఁడు-చోరబ్రహ్మరాక్షసులు 10 వల్మీకోదరసర్పము 11 వీరధరుఁడను రథకారుఁడు 12 ముని-మూషికాంగన 13 సింధుకమను పక్షి-సువర్ణపురీషము 14 ఖరనఖరమను సింహము-జంబుకము 15 మండూకపతి-మందవిషుఁడను సర్పము 16 యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణుఁడు-ఘృతాంధత్వము.

లబ్ధప్రణాశమందలి కథలు: 1 గంగదత్తుఁడను భేకపతి-ప్రియదర్శనుఁడను సర్పము 2 కరాళకేసరమను సింహము-ధూసరకమను నక్క-లంబకర్ణుఁడను గార్దభము 3 యుధిష్ఠిరుఁడను కుంభకారుఁడు-లలాటప్రహారము 4 సింహము-సృగాలపోతములు 5 బ్రాహ్మణుఁడు-కుటాభార్య 6 నందుఁడను రాజు-వరరుచియను సచివుఁడు 7 శుద్ధభటుఁడను రజకుఁడు-పులితోలు కప్పఁబడిన గార్దభము 8 హాలిక దంపతులు 9 ఉజ్జ్వలుఁడను రథకారుఁడు-ఉష్ట్రవ్యాపారము 10 మహాచతురకమను సృగాలము-గజకళేబరము 11 చిత్రాంగమను నక్క.

అపరీక్షిత కారిత్వమందలి కథలు: 1 కోమటి-క్షపణకుడు 2 దేవశర్మయను బ్రాహ్మణుడు-నకులము 3 నలుగురు బ్రాహ్మణులు-సిద్ధివర్తిచతుష్టయము 4 బ్రాహ్మణపుత్ర చతుష్టయము-సింహప్రాణ ప్రతిష్ఠ 5 నలుగురు బ్రాహ్మణులు-మూర్ఖతా ప్రదర్శనము 6 శతబుద్ధి సహస్రబుద్ధులను చేపలు-ఏకబుద్ధియను కప్ప 7 ఉద్ధతమను నక్క-గాడిద 8 మంధరకుడను కౌలికుడు-శిరోయుగళ బాహుచతుష్టయము 9 స్వభావకృపణుడను బ్రాహ్మణుడు-సక్తుపూర్ణకలశము 10 చంద్రుడను భూపతి-వానరయూథము 11 భద్రసేనుడనురాజు- రాక్షసుడు 12 మధుసేనుడనురాజు-త్రిస్తని 13 చండకర్ముడనురాక్షసుడు-బ్రాహ్మణుడు 14 భారండపక్షి రెండుగ్రీవములు 15 బ్రహ్మదత్తుడను బ్రాహ్మణుడు- కర్కటకము.

ఆంధ్రచంపూకర్తలు పైకథలలో నలువదికథల నాంధ్రీకరింపక విడచినారు. ఇంచుమించుగ మువ్వురును విడచుట విశేషము. ఆ కథలు లేని పంచతంత్ర ప్రతి వారికి లభించినదేమో నిశ్చయింపజాలము. ఆ కథలను బరిశీలించినచో వానిని విడచుటకు ప్రధాన హేతువులుగా నాఱింటినూహింపవచ్చును. అవి : 1 తత్త్వపునరుక్తి 2 చమత్కార రాహిత్యము 3 బ్రాహ్మణాపకర్షకత్వము 4 ప్రభ్వౌన్నత్య భంజకత్వము 5 అశ్లీలార్థప్రదాయకత్వము 6 అర్థదురవగాహత్వము.

## 1 తత్త్వపునరుక్తి :

సంస్కృత పంచతంత్రమందలి కొన్నికథలొకే తత్త్వమును బోధించు చున్నవి. కావ్యత్వప్రధానముగ నాంధ్రీకరించిన చంపూకర్తలు పునరుక్తి గల కథలను విడిచియుందురని యూహింపవచ్చును. అట్టివి పదునొకండు గలవు. మిత్రభేదమందలి చటకదంపతులు-కుంజరము అనుకథయు టిట్టిభదంపతులు- సముద్రము ననుకథయు నొకే తత్త్వమును బోధించు చున్నవి. కావున టిట్టిభదంపతుల కథ విడువబడినది. వజ్రదంష్ట్రమును సింహము-చతురక క్రవ్యములను స్యగాల మృగ

ములు అనుకథ కొంచెము ముందున్న మదోత్కటమను సింహము-ద్వీపివాయసగోమాయువులను కథను బోలియున్నదగుటచే విడువబడినది. అట్లే చటకదంపతులు-వానరము అనుకథ దానికి ముందున్న వానర యూథము-సూచీముఖమను కథకు ప్రతిబింబముగా నుండుటచే విడిచిపెట్టబడినది. కాకోలూకీయ మందలి మందవిషుఁడను సర్పము-జలపాద్యుఁడను మండూక పతి యనుకథయును లబ్ధప్రణాశమందలి గంగదత్తుఁడను భేకపతి-ప్రియదర్శనుఁడను సర్పము అనుకథయు నొకే విధముగా నున్నవి. కావున లబ్ధప్రణాశమందలి కథ విడువబడినది. అట్లే లబ్ధప్రణాశమందలి సింహసృగాల పోతముఁను కథ కాకోలూకీయ మందలి ముని-మూషికాంగన అనుకథను బోలియున్నది. కావున నది విడువబడినది. జాతిలక్షణము తొలగదనుట రెండింట సమానము. మిత్రభేద మందలి యనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుఁడునను మూఁడుచేపలకథయు నపరీక్షిత కారిత్వమందలి శతబుద్ధి సహస్రబుద్ధులను చేపలు—ఏకబుద్ధియను కప్ప అనుకథయు నొకే తత్త్వముగలవి. కావున నపరీక్షిత కారిత్వమందలి కథవిడువబడినది. అపరీక్షిత కారిత్వమందు ఉద్ధతమను గాడిద-నక్క యనుకథగలదు. అందు నక్కరాగల యపాయము హెచ్చరించినను గార్దభమజ్ఞానముతో వ్యవహరించినది. లబ్ధప్రణాశమందలి కరాళకేసరమను సింహము- ధూసరకమను నక్క-లంబకర్ణమను గార్దభము అనుకథలో గూడ గార్దభము సింహము వలన ప్రమాదము నొంది దైవవశమున బయటపడినను నజ్ఞానముచే మరల సింహమును సమీపించి మృత్యుముఖమున ప్రవేశించినది. గార్దభము యొక్క యజ్ఞానమే రెండింటను ప్రతిపాదింప బడెను గావున నపరీక్షిత కారిత్వమందలికథ విడువబడినది. అట్లే యీ పరిచ్ఛేద మందలి చంద్రుఁడనుభూపతి-వానర యూథమనుకథ గూడ జంప్వనువాదకులచే విడువబడినది. అందు నపకారమునందిన వానరయూథము పగబూని చంద్రుఁడను రాజును సపరివారముగ వినాశమొందించుట గలదు. సముద్రునిపై టిట్టిభదంపతులు పగబూని సాధించుకొనిన మిత్రభేదమందలి

కథకు నీకథకు బోలిక యధికముగనుండుటచే నాంధ్రకర్త లీకథను విడిచి యుందురు. అట్లే యపరీక్షిత కారిత్వమందలి మంథరకుడను కౌలి కుడు–శిరోద్వయబాహు చతుష్టయ సంపాదనము అనుకథలో నతడు భార్యగావించిన యుపదేశమునననుసరించి వినాశమొందినాడు. లబ్ధ ప్రణాశ తంత్రారంభమందలి మకరపతి భార్యగావించిన దురుపదేశ మునననుసరించి మిత్రద్రోహమునకు దలపడి వినాశమొందినాడు. కావున కౌలికునికథ విడువబడినది. అపరీక్షిత కారిత్వమందలి బ్రహ్మదత్తుడను బ్రాహ్మణుడు–కర్కటకము అనుకథ యాతంత్రమందలి దేవశర్మయను విప్రుడు–నకులము అనుకథకు సన్నిహితముగనున్నది. కర్కటకము సర్పమునుజంపి బ్రాహ్మణుని రక్షించినది. దేవశర్మయను బ్రాహ్మణుని కథలో నకులము సర్పమునుజంపి బ్రాహ్మణకుమారుని రక్షించినది. కావున చంపూకర్తలు బ్రహ్మదత్తుడను బ్రాహ్మణునికథను విడిచి యుందురు. చంపూకర్తలు తెనిగింపక విడిచిన కథలను బరిశీలించిన నాకేతత్త్వమును ప్రతిపాదించునవి గావున గొన్నిటిని విడిచియుందు రని నిశ్చయింపవచ్చును.

## చమత్కార రాహిత్యము :

కథకు జమత్కారము ప్రాణమువంటిది. అదిలేనియెడల గథ రక్తిగట్టదు. సంస్కృతపంచతంత్రమున జమత్కారము లేదనిపించు కథలు గొన్నిగలవు. చంప్వనువాదకులచే విడువబడినకథలలో నట్టివి కొన్నిగలవు. కాకోలూకీయతంత్రమందలి అతిదర్పమను కృష్ణసర్పము–పిపీలికమనుకథ, చిత్రరథుడనురాజు, పద్మసరోవరమనుకథ, వల్మీకోదర సర్పమను కథ, ఖరనఖరమనుసింహము జంబుకమను కథ యీ విభాగ మునకు జెందును. అట్లే లబ్ధప్రణాశమందలి యుధిష్ఠిరుడను కుంభ కారుని కథగూడ జమత్కారములేనిదగుటచే విడువబడినది. ముందు వెనుకలు పరీక్షింపక రాజాతనిని మహాపురుషుడగు రాజపుత్త్రునిగా భావించినట్లు రచింపబడుటయు ననుచితమను తలంపుతో నాంధ్రకర్తలు

విడిచియుందురు. ఆ తంత్రిమందలి యుజ్జ్వలుఁడను రథకారుడు ఉష్ట్ర వ్యాపారము అనుకథగూడ పేలవముగా నుండుటచే విడువబడియుండును. అట్లే యాతంత్రి మందలి మహాచతురకమను సృగాలము-గజకళేబరమను కథలో మృతగజశరీరమును జీల్చించుటకు నక్క-ప్రదర్శించిన తెలివి ప్రధానముగా బోషింపబడినది. పూర్వకథలయందును నక్క-తెలివి నిరూహింపబడుటచే నీకథ విడువబడియుండును. అట్లే యాతంత్ర మందలి చిత్రాంగమను సారమేయము అనుకథలో నెట్టి చమత్కృతి లేదుగావున నది విడువబడి యుండును. అపరీక్షితకారిత్వమందలి భారండ పక్షి-రెండు గ్రీవములను కథ నీతిబోధకమేయైన నసహజముగా నుండుటచే నాంధ్రికర్తలు విడిచిపెట్టియుందురు. ఇట్లు చమత్కార రాహిత్యమును బురస్కరించుకొని చంపూకర్తలు కొన్నికథలను విడిచి నారని యూహింప వచ్చును.

## బ్రాహ్మణాపకర్షకత్వము :

ఆంధ్రీకరణములను నిశితముగ బరిశీలింపగా ముగ్వురును బ్రాహ్మణాధిక్యమును ప్రదర్శించినారని విశదమగును. కాకోలూకీయ తంత్రి మందలి ద్రోణుఁడను బ్రాహ్మణుఁడు-చోరబ్రహ్మరాక్షసుఁడు అను కథలో మూలమున లేక పోయినను బ్రాహ్మణాధిక్యమును బైచరాజు వేంకటనాథుఁడు

'దీవింప వలవదవనీ
దేవతలామోద వనధిఁదేలిన శాపం
బీవల వదలఘు సంతా
పావిల చేతస్కులమ్మహామహులయినన్

ఆశ్వా 3-పద్య 240.

బ్రాహ్మణ ద్వేషంబులేక బ్రతుకుండని పీడ్కొలిపిన......'

అని వెల్లడించినాడు. కాబట్టి బ్రాహ్మణులకపకర్ష గల్గించు భాగములు గలవి యగుటచే గొన్ని కథలాంధ్రికర్తలచే విడువబడి

యుండునని యూహింపవచ్చును. అట్టికథలలో మిత్త్రిభేదమందలి చౌరబ్రాహ్మణుడను కథ మున్నెన్నదగినది. అందు బ్రాహ్మణుడు తనశరీరము నర్పించి తక్కిన నలువురు ధనిక విప్రుల రక్షించినను నీతడు చోరుడుగా నిరూపింపబడుటచే బ్రాహ్మణభక్తిగల యాంధ్రకర్తలు విడిచి యుందురు. అతడు మహాపండితుడై పూర్వజన్మకర్మఫలముగా జోరుడుగా బుట్టినట్లు చెప్పబడినను జంపూకర్తలు విడచినారు. కాకోలూకీయమందలి హరిదత్తుడను బ్రాహ్మణుడు–పాము మణి, యజ్ఞదత్తుడను బ్రాహ్మణుడు–ఘృతాంధత్వము అనుకథలుగూడ విడువబడినవి. హరదత్తుడను బ్రాహ్మణుని కథలో బ్రాహ్మణకుమారుని లుబ్ధత్వము, ధూర్తత్వము యౌవనోన్మత్తత యభివర్ణింపబడినవి. యజ్ఞదత్తుడను బ్రాహ్మణునికథలో బ్రాహ్మణుని భార్య పుంశ్చలిగా నిరూపింపబడినది. లబ్ధప్రణాశ తంత్రమున బ్రాహ్మణుడు–కులటాభార్య అనుకథలో భర్తయొక్క యాయుష్యార్ధమును బొంది యాతని భార్య యాతనికి ద్రోహము దలపెట్టి పంగునితో రమించుట వర్ణింపబడుటచే ననువాదకులాకథను విడిచియుందురు. అపరీక్షిత కారిత్వమున బ్రాహ్మణ చతుష్టయముతో గూడిన కథలు మూడును విడువబడినవి. అందు బ్రాహ్మణపుత్ర చతుష్టయము–సిద్ధివర్తి చతుష్టయము అనుకథ చాలపెద్దది. అయిన నసంపూర్ణము. ఆ చక్రభమణ వృత్తాంతము వివరింపబడలేదు. వీనితోబాటు వారి పేరాశయునందు నిరూపితము. కావున నాకథ విడువబడినది. అట్లే నలువురు బ్రాహ్మణ పుత్త్రులు–సింహప్రాణ ప్రతిష్ఠ అనుకథలో బ్రాహ్మణకుమారులలో వారి పాండిత్యమును మింగివేయు నంతటి యజ్ఞానము నిరూపితము. అట్లే తరువాతి కథలో బ్రాహ్మణ కుమారుల మూర్ఖత్వము ప్రదర్శింపబడుటచే నదియు విడువబడినది. పంచమతంత్రమందలి చండకర్ముడను రాక్షసుడు–బ్రాహ్మణుడు అను కథలో బ్రహ్మరాక్షసుడు బ్రాహ్మణుని స్కంధమారోహించుట గలదు. కావున ననువాదకులా కథను బరిత్యజించియుందురు. ఇట్లు బ్రాహ్మణాపకర్షకములగుటచే గొన్నికథలు చంపూకర్తలచే విడువబడియుండునని యూహింప వీలున్నది.

## ప్రభ్వౌన్నత్య భంజకములు :

భారతీయులు ప్రభుభక్తి పరాయణులు. పంచతంత్రకథలలో గొన్నింటి యందు ప్రభువుల గొప్పదనమునకు గళంకము గల్గించు నట్టివి గలవు. బహుశః ఆ కారణము చేనట్టి కథలను చంపూకర్తలు విడిచి యుందురని యూహింపవచ్చును. మిత్రభేదమందలి దంతిలగోరంభుల కథ, విష్ణురూపధూర్త కౌలికునికథ యనువాదముల విడువబడినవి. దంతిల గోరంభుల కథలో ప్రభుభార్యను దంతిలుఁడు పరిష్వంగ మొనరించెనని సేవకుడైన గోరంభుఁడు పలుకును. అది యథార్థము గాకపోయినను ప్రభుభార్యాశీలాపకర్షకము. అట్లే గోరంభుఁడు ప్రభువునుద్దేశించి యసందర్భముగను జుగుప్సావహముగను 'అహో అవివేకోఽస్మద్భూపతేః యత్పురీషోత్సర్గమాచరం శ్చిర్భటీ భక్షణం కరోతి' అని చెప్పును. కావున నాకథ విడువబడినది. కౌలికరథకారుని కథలో గౌలికుఁడు తాను విష్ణుస్వరూపుడనని మోసపుచ్చి రాజపుత్రిని రమించుట రాజకులమునకే గాక విష్ణుదేవునకుగూడ నపఖ్యాతి గల్గించును గావున నాంధ్రకర్తలాకథను విడిచియుందురు. అట్లే రాజు–సేవకవానర మను కథలో రాజునజ్ఞానము వానరమువలన నిరూపింపబడినది. కావున నాకథ విడువబడినది. అట్లే నక్క—నీలీభాండరసమను కథలో నక్క నైల్యమునొందుట యొకగుణముగా సింహవ్యాఘ్రాదుల బెదరించి మృగాధిపత్యము పొందినట్లు వర్ణింపబడినది. క్షుద్రజంబుకము సింహవ్యాఘ్రాదులపై ప్రభుత్వము నెఱపుటకిష్టపడని కారణముగ ననువాదకులాకథను విడిచియుందురు. మిత్రలాభమందలి సాగరపుత్త్రుఁడను వణిజుని పుత్త్రుని కథయందతఁడు ప్రభుపుత్త్రిని బరిణయమాడినట్లు గలదు. కథచిత్రముగ సాగినను మిడుతంభొట్లు జోస్యమును బోలియున్నది. వణిక్పుత్త్రుని నృపాలసుతా వివాహమున కిష్టపడని వారై యాంధ్రకర్తలాకథను విడిచియుందురు. అదియున్గాక 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' అను తత్త్వబోధవలన లోకమున గర్మాచరణాసక్తియు దొలగిపోవును గావున నాకథ విడువబడియుండును. లబ్ధప్రణాశమందలి

నందుఁడనురాజు-వరరుచియను మంత్రి యనుకథలో రాజు ఖలీనము దాల్చిభార్యను బృష్టమునందిడికొని హాయహేషలతో మోయుట రచింపబడెను. రాజప్రతిష్ఠా భంజకముగా నుండుటచే నాకథ విడువబడి యుండును. అట్లే అపరీక్షితకారిత్వ తంత్రమందలి భద్రసేనుఁడను రాజుపుత్రిక-రాక్షసుడనుకథలో రాజకన్యను రాక్షసుడుపభోగించినట్లు గలదుగావున చంపూకర్తలాకథను విడిచియుందురు. ఇట్లు రాజగౌరవ మునకు నష్టముగల్గించు సన్నివేశములుండుటచేఁ గొన్ని కథలను చంపూంధ్రకర్తలు విడిచియుందురని యూహించుటకు వీలున్నది.

## అశ్లీలార్థ ప్రదాయకత్వము :

కావ్యమందలి సన్నివేశములుదాత్తముగను నుత్తమసంస్కార సంభరితముగ నుండవలెను. సాహిత్యము సంఘప్రతిబింబసదృశమే యైనను సంఘమునందుండు నసభ్యతాశ్లీలతలు సాహిత్యమున బరి హార్తవ్యములు. లోకప్రవృత్తికంటె సాహిత్యలోకప్రవృత్తి విలక్షణ మైనది.

పంచతంత్రమందలి కొన్నికథలలో నశ్లీలతాబంధురములైన ఘట్టములుగలవు. బహుశః ఆ కారణముచే జంపూనువాదకులాకథలను విడిచియుందురని యూహ. మిత్త్రభేదమందలి తీక్ష్ణవిషాణమను వృషభము నక్క యనుకథలో అండప్రసక్తి గలదు. కాకోలూకీయమున సింధుక మనుపక్షి – సువర్ణపురీషమను కథలో బురీషవృత్తాంతము జుగుప్సా వహము. లబ్ధప్రణాశమందు హాలికదంపతులకథలో గులటావృత్తాంతము గలదు. అందు నాహాలికాంగన చోరునిచే నగ్నగా విడువబడినది. అపరీ క్షితకారిత్వమను కథలోని మధుసేనుడనురాజు-త్రిస్తనియనుకథలో రాజకన్య త్రిస్తనియనిగలదు. అశ్లీలార్థస్ఫురణము లేశమాత్రముగనైన లేకుండునట్లు రచించుట కవుల ముఖ్యధర్మమని భావించినవారగుటచే జంపూంధ్రకర్తలు పైకథలను విడిచియుందురు.

## దురవగాహనత్వము :

కథలను వీలయినంత ప్రసన్నముగ రచించుట యనువాదకుల సంకల్పము. క్లేశకరములైన సన్నివేశములను గథలను అనువాదకులు వీలయినంతవఱకు బరిహరించినారు. మిత్రలాభతంత్రమున గాలికుని కథలో కర్త కర్మ యనునవి పాత్రలు. అట్టి పాత్రలతో గథరచించిన, బాలురైన పాఠకులకేగాక ప్రౌఢులకు గూడ నర్థగ్రహణమున క్లేశము గలుగకతప్పదు. ప్రబోధచంద్రోదయమువంటి వేదాంతగ్రంథములో నట్టిపాత్రలు రాణింపగలవు. సామాన్యకథలలో నట్టిపాత్రల బ్రవేశ పెట్టుట తగదనుతలంపుతో బహుశః అనువాదకు లీకథను విడిచిపెట్టి యుందురు.

అనువాదకులు సంస్కృత పంచతంత్రమందలి కథలను యథో చితముగ సంస్కరించి యనువదించుచు గొన్ని కథలను విడచుటయే గాక కొన్ని కథల నదనముగ రచించుట బరిశీలనార్హము.

## అధికముగ రచించిన కథలు :

చంపూనువాదకులలో దూబగుంట నారాయణకవి మాత్రము క్రొత్తగ గథలను గల్పించి రచింపలేదుగాని భానుకవియు బైచరాజు గూడ యథాశక్తిగ గథలగల్పించి యనువాదమున జేర్చినారు.

భానుకవి మిత్రభేద తంత్రమున కాకి–హంస, భిక్షువు–కిరాతుడు, రాజకీరము–గణిక యను మూడుకథల నధికముగ రచించినాడు. బైచ రాజు శశము రాతిపలక యను కథను రచించినాడు. మిత్రలాభ తంత్ర మున జితాంగుని పూర్వజీవితోదంతమును ముగ్గురు చంపూను వాద కులు రచించినారు. అది యమూలకము. దూబగుంట నారాయణకవి రచింపగా దదనుసారముగ దక్కినవారు రచించినారని యూహింప వచ్చును. ఆ తంత్రమున భానుకవి ఎలుక–గజమిథునమను కథ నధిక ముగ రచించినాఁడు. లబ్ధప్రణాశ మందలి గాడిద–పులితోలు అనుకథను మార్చి యనువాదకులు కాకోలూకీయ తంత్రమున రచించినారు. లబ్ధ

ప్రాణాశతంత్రమున భానుకవి విటుఁడు-వేశ్యమాత, బ్రాహ్మణుఁడు-రాజునను రెండుకథల నధికముగ రచించినాఁడు. అందు వైచరాజు గూడ బ్రాహ్మణుఁడు రాజపుత్త్రిని పీడుట, హాలిక కాంత భర్తృరాజబాధ నొందుట, నక్క-తాఁబేలు నను మూఁడు కథల నధికముగ రచించినాడు. అసంప్రేక్షితకారిత్వ తంత్రమున భానుకవి సితాసితులను శిష్యులు-గురువు; గురువు-శిష్యుఁడు నను రెండుకథల నధికముగ రచించినాడు. ఇట్లు భానుకవియు వేంకటనాథుఁడు నధికముగ రచించిన కథలకు మూలము హితోపదేశమునను మృగ్యమే. స్వయముగా వారాకథల గల్పించి యుందురనుట సమంజసము.

అధికముగ గల్పింపబడిన కథలలో వైచరాజు రచించిన చతుర్థాశ్వాసమందలి బ్రాహ్మణుఁడు రాజపుత్త్రిని పీడిన కథ యత్యుత్తమముగానున్నది. వైచరాజు తన శక్తిసామర్థ్యములను సమగ్రముగ ప్రదర్శించి యాకథను సర్వాంగ సుందరముగ రచించుట ప్రశంసార్హము. ఆకథ యొక్కటియు ఏకాశ్వాసప్రబంధముగ బరిగణింప దగ్గది. అందు పాత్రపోషణ వర్ణనలు శైలియున్నగునవి ప్రబంధోచితముగ బోషింపబడినవి. ఆకథ వేంకటనాథుని స్వతంత్ర ప్రబంధరచనా సామర్థ్య నిరూపకము.

తక్కినకథలలో జెప్పుకోదగిన ప్రత్యేకత గోచరింపదు. మీఁదు మిక్కిలి పంచతంత్ర కథలకు ప్రతిబింబతుల్యములన దగినవి పెక్కు గలవు. భానుకవి రచించిన సితాసితులు-గురువు అనుకథలో జమత్కారము లేక పోవుటయే గాక యశ్లీలార్థకమైన మంత్రము చెప్పబడినది. దీర్ఘములైన గుకార దకారముల సంపుటీకరణముతో మంత్రము గూర్పబడుట విచార్యము. అట్లే గురువు-శిష్యుఁడునను కథలో శిష్యుఁడు గురువుతో

'అనఘ ! గుదముఁగుదుఁగ జనమిగిలున్న యీ
జలము నీకుఁబోయఁజనదు నాకు'

అని పలుకుట యసభ్యముగ నున్నది.

చంపూరూపమున బంచతంత్రము నాంధ్రీకరించిన ముగ్గురును గథాస్వీకరణమున గొన్నిటిని విడిచి కొన్నిటిని గల్పించి రచించుటలో స్వాతంత్ర్యము నవలంబించినట్లే మూలమందలి కథల ననువదించు నపుడును వారు స్వతంత్రతను ప్రదర్శించినారు. సామాన్యముగ నాంధ్రీ కర్తలు పాటించు యథామూలకత, మూల ప్రపంచనము, మూలకుంచనము, మూలత్యాగము, అన్యథాకల్పనము, అమూలకత యనువానిని వీరు ననుసరించినారు. మిత్రభేదాది తంత్రముల ననువదించునపుడు దూబగుంట భానుకవి భైచరాజు అనుసరించిన విధానమెట్టిదో కొన్ని ముఖ్యఘట్టములాధారముగా బరిశీలింతము.

## మిత్రభేద తంత్రము :

1. పంచతంత్రి కథ మహిలారోప్యనగరమును అమరశక్తియను ప్రభువు పరిపాలించుచున్నాడని యారంభమగును. చంపూకర్తలన్యథాకరించి పాటలిపుత్రమను నగరమును సుదర్శనుఁడను ప్రభు వేలుచున్నాడని కథనారంభించిరి. వారు హితోపదేశము ననుసరించిరి.

మూలమున అమరశక్తి మంత్రులతో భాషించుట, యందు సుమతియను మంత్రి విష్ణుశర్మను గూర్చి చెప్పుట గలదు. అనువాదకులు విష్ణుశర్మయే ప్రభువుతో నాతని పుత్త్రులను నీతిమంతుల గావింతునని చెప్పినట్లు రచించినారు. ప్రభువు మంత్రులతో సంప్రతించుట వారు విష్ణుశర్మను బేర్కొనుట యనువాదముల విడువబడినది. కథ కెట్టి ప్రయోజనము లేకపోవుటయే మూలత్యాగమునకు గారణము.

2. వర్ధమానుని కథలో సంజీవకము కాలు విఱుగుట, యతడు కావలివారిని నియోగించుట మున్నగు కథ యథామూలముగ నాంధ్రీకరింపబడినది. దూబగుంట నారాయణకవి "ఒక్కహారిగూడగ ముట్టెన నేమువాఱ సంజీవకుఁబట్టి చంపెనది చెప్పఁగ, సిగ్గగుచున్న దెంతయున్"

అని సేవకులు చెప్పినట్లు రచించుట యన్యథా కల్పనము. మూలమునకు మెఱుగు పెట్టినట్లున్నది.

3. 'వానరము కీలోత్పాటనము' అనుకథలో బైచరాజు పెంపుదలను నమూలకతను ప్రదర్శించినాడు. బాలన ర్తకిని బాముగఱచుట, దాక్షాయణీదేవిని ప్రార్థింప విషవిముక్తియగుట తత్ఫలితముగా నామె తల్లిదండ్రులాలయనిర్మాణమునకు బూనుకొనుట యమూలకము, ఆలయనిర్మాణకారణోద్ఘాటనము చమత్కారావహముగానున్నది. దూబగుంట యథామూలముగా నాంధ్రీకరింప భానుకవి కుదించి రచించినాడు.

4. కరటకదమనకుల సంభాషణము మూలమున విపులముగ గలదు. అనువాదములందు మూలత్యాగము, కుంచనము గాననగును.

5. ఆషాఢభూతి కథలో నాతడు పరివ్రాజకుని సమీపించి శిష్యత్వమున కుపక్రమించు సందర్భమున మూలమున నాతడు సంసారము, యౌవనము, జీవితము, భోగము నమువాని స్వభావమును వివరించుట సంసారోత్తరణ మార్గముపదేశింపుమని కోరుట దానికా సన్యాసి యాశ్చర్యపడి శివమంత్రిప్రాశస్త్య ముగ్గడించుట విపులముగ గలదు. అనువాదకులు కథను సంగ్రహముగ జెప్పు దృష్టితో నీవిషయము లన్నింటిని విడిచినారు.

మూలమున పరివ్రాజకుడు పురీషోత్సర్గమునకు వెడలుచు ధనము గల కంథనాషాఢభూతికి బట్టుకొమ్మని యిచ్చినట్లు 'భో ఆషాఢభూతే యావదహం పురీషోత్సర్గం కృత్వా సమాగచ్ఛామి తావదేషా కన్థా యోగేశ్వరస్య సావధానతయా రక్షణీయా' అని గలదు. నారాయణ కవియు, భానుకవియు బరివ్రాజకుడాచమనార్థమై వెడలుచు కంథ నొసంగినట్లు రచించినారు. అతఁడనుష్ఠానార్థియై వెడలుచు బొంతనాషాఢభూతి కొసగినట్లు బైచరాజు రచించినాడు. మల విసర్జన వృత్తాంత మశ్లీలార్థకమని తలంచి యనువాదకులు మూలమును మార్చి యుందురు. ఇచ్చట భానుకవి యౌచిత్యమును బాటించినను సితా

పితులు—గురువు, గురువు-దుష్టశిష్యులు నను కథల యందనౌచిత్యము నకు బొల్పడుట విచార్యము.

ఆషాఢభూతి ధనమునకై పరివ్రాజకుని జంపదలంచినట్లు సంకల్పించెనని మూలమున 'అహో న కథంచి దేష మే విశ్వాస మాగచ్ఛతి తత్కిం దివాఽపి శస్త్రేణ మారయామి? కిం వా విషం ప్రయచ్ఛామి? కిం వా పశుధర్మేణ వ్యాపాదయామి?' అని రచింపబడెను. అనువాదకులు మువ్వురును ఆషాఢభూతి యొక్క ఈ దారుణ సంకల్పమును విడిచినారు. ఔచిత్య పోషణమే కారణము కావచ్చును. కాని యీ సన్నివేశ మాషాఢభూతి స్వరూపస్వభావ నిరూపకము.

ఐశ్వర్య సర్వస్వమును గోల్పోయి వికల మనస్కుడైన సన్యాసి తిరిగి తిరిగి త్రోవలో గలిసిన తంతువాయు నాతిథ్యమర్థించినట్లును అతిథి ధర్మములఁ గూడ బోధించినట్లును మూలమున గలదు. అనువాదములలో నీ విషయము లన్నియు విడువబడినవి. సభార్యుడై మద్యపాన నిమిత్తముగ గ్రామాంతర మేగుచున్న తంతువాయుని బరివ్రాజకు డాతిథ్య మర్థించుట యనుచితమను దృష్టితో ననువాదకులు మూల త్యాగము గావించి యుందురు. తక్కిన కథయందు గూడ ననువాదకులు మార్పులు గావించినారు. కాని తంతువాయుని భార్యా కులటా స్వభావ నిరూపణము మూలానుసారముగనే సాగినది.

6. కంబుగ్రీవమను కచ్ఛపము—సంకట వికటములను కథలో హంసలనావృష్టిచే దామున్న సరోవరము శుష్కనీరము కాగా దామా సరోవరము వీడి వెడల సంకల్పించి నట్లు కూర్మముతో బల్కినట్లు మూలమున గలదు. దూబగుంట నారాయణ కవి హంసలు తమ బడలిక పోవుటకు, దృప్తిగా భుజించుటకు, మానస సరోవరమున కేగదలంచినట్లు

మానస సరోవరాంతర
మానిత జలపాన కేళి మగ్నులమైనం

గాని మన బడలికలు మఱి
మానంగా నేరవిచటి మడుగుల నీళ్లన్.

నఱికి మెలతామర తూండ్లు నమలలేవు
చాలఁ దీయని తెలినీరు గ్రోలలేదు
జాతి పక్షులతోఁ గూడ జరగలేదు.
పోదుమాయన్న ... పద్య-442, 443.

అని కచ్ఛపముతో జెప్పినట్లు రచించినాడు. ఇది యన్యథా కల్పనము. హంసలకు మానస సరోవర నివాసోల్లాస మత్యంత సహజము. కావున నారాయణకవి గావించిన మార్పు సముచితము. అనావృష్టి కారణముగ వెడలనున్నట్లు రచించుటలో హంసలకు గచ్ఛపముతో గల గాఢానుబంధము వ్యక్తముగా గలదు. అది నారాయణ కవి రచనమున లుప్తమైనదన వచ్చును. భానుకవి, వైచరాజు యథామూలముగ ననువదించినారు.

## మిత్ర ప్రాప్తి తంత్రము :

1. మూలమున గథకు రంగస్థలముగ నారంభమున న్యగ్రోధ పాదపవర్ణనము గలదు. అనువాదకులు మువ్వురు దానిని మార్చి శాల్మలి వృక్షమని పేర్కొనినారు. అన్యథా కల్పనమునకు ప్రయోజనము మృగ్యము. న్యగ్రోధవృక్షమే బహుపక్షి నివాస యోగ్యము.

2. బ్రాహ్మణి-తిలచూర్ణ మను కథలో దిలలమధ్య నొక కుర్కురము మూత్ర విసర్జన మొనరించినట్లు 'తిలానాం మధ్యే కశ్చిత్సారమేయో మూత్రోత్సర్జం చకార' అనిగలదు. తిల లంటు పడుట కదియే కారణము. అనువాదకులు మువ్వురు నన్యథా కల్పన మొనరించినారు. దూబగుంట నారాయణ కవి

'ఏ మఱియున్న నయ్యెడకు నేపునఁ గుక్కుటమేఁగుదెంచియు
ద్దామత నువ్వులచ్చటఁ బదంబునఁ జల్లిన ...

అని కోడి కాలితో జల్లినట్లు మార్చినాడు. వైచరాజు నారాయణకవి ననుసరించి 'ఒక కాలజ్ఞాని హాలికాలయాగ్రి స్థానంబున నుండి చేట జడియన్ వ్రాలెన్' అని రచించినాడు. మూత్ర విసర్జన వృత్తాంతము మార్చుట సముచితము. భానుకవి యీ కథ విడచినాడు.

3. చిత్రాంగుని పూర్వజీవిత వృత్తాంతము పంచతంత్ర హితోప దేశములలో గానరాదు. దూబగుంట నారాయణకవి చిత్రి ముగా రచించినాడు. తక్కిన యిరువురు నాతని ననుసరించినారు. అమూలకమైన యితివృత్తి విస్తరణము మనోజ్ఞముగా నున్నది.

## కాకోలూకీయ తంత్రము :

1. రాజ్యాభిషేకము నందనున్న యులూకమును వాయసము నిందించిన విధము మూలమున మనోహరముగ నున్నది. అందులూకము యొక్క హైన్యము, రూప వికారము 'అహోనయుక్తమేతత్,' యన్మయూర హంస కోకిల చక్రవాక శుక కారణ్డవ హారీత సారసాదిషు పక్షిప్రధానేషు విద్యమానేషు దివాన్ధస్యాస్య కరాల వక్త్రస్యాభిషేకః క్రియతే తన్నైతన్మమ మతమ్. యతః

వక్రనాసం సుజిహ్మాక్షుం క్రూరమప్రియదర్శనమ్
అక్రుద్ధస్యేదృశం వక్త్రం భవేత్ క్రుద్ధస్య కీదృశమ్
స్వభావ రౌద్రమత్యుగ్రం క్రూరమప్రియవాదినమ్
ఉలూకనృపతింకృత్వా కా నః సిద్ధిర్భవిష్యతి.'

శ్లోక 76-77.

అని నిందింపబడెను. దూబగుంట నారాయణ కవి

క్రూరము ఘోరదృష్టియు విరూపము నీచము నైజకోపదు
ర్వారమునైన దివాంధమన వర్తిలు ఘూకముఁ బక్షిరాజుఁగా
మీరలు సేయనేమిటికి మీఁదట దీని నెపంబునన్ ముదం
బారఁగ రాజ్య రక్ష మనకబ్బదు సుండెడనైన వేళలన్.

సంధి విగ్రహ-పద్య 74.

అని మూలమందలి సారమును మనోహరముగా చిత్రించినాడు. భాను కవి అతి సంగ్రహముగ ఘూకనిందను

ఇతనినభిషేక మొనరింప నెట్లువచ్చు
దర్పసం యుతుఁడ ప్రియ దర్శనుండు
పక్షులను నెల్ల భక్షించి బలిసికొనుచు
నల్పుఁజేపట్టఁ గార్యమ్ములగునె దలఁప

ఆశ్వా 3–పద్య 36.

అనిగావించినాడు. బైచరాజు వేంకటనాథుడు మాత్రము ప్రౌఢముగ మిక్కిలి ప్రబంధోచితముగ నులూకస్వరూప స్వభావములను నిందాస్పదముగ నిట్లు రచించినాడు.

కర్ణ హృత్స్ఫుటసూచి కాయమానోత్తాన
వికట ఘోషము విన్న నెగటుగాదె
కాల కాకోదరోగ్ర స్ఫుటాస్ఫుట ముఖం
బాలోకనము సేయ నఘముగాదె
భ్రమదుల్ముక భ్రాంతి భాగవీక్షణ దృష్టి
సరణిఁద్రిమ్మరు చుండ జాలిగాదె
కర్కశవ్యాయామ గరుదమంగళమరు
త్ప్రతతిసోఁకినఁ బీడవట్టు కొనదె

దారుణాకార మప్రియ దర్శనంబు
ప్రకృతి రౌద్రంబు క్షుద్రంబపక్షమంబు
ఘూక మేయూరు పికశారికా కలాప
కీరికాముఖ భరణ మేయూరు చెప్పుఁడ.

దారుణ దృష్టి వికారా
కారమతి క్రూరమహాముఁగానదు కరుణా

మారం బెట్లయ్యెడు ర
హారంభం బెఱుగఁజెప్పుఁడా వినవలతున్

ఆశ్వా 3-పద్య 63-64

బైచరాజు రచనము మూలమునకు వన్నెపెట్టు నట్లున్నది.

2 రథకారుని కథలో ననువాదకులు ప్రధానమైన రెండు మార్పులు గావించినారు. మూలమున రథకారుని భార్యయు నుప పతియు నాలింగన సౌఖ్యమును మాత్రమే పొందినట్లు గలదు. చంపూ కర్తలు ముగ్గురును వారి రతిసౌఖ్యాను భవమును విపులముగా వర్ణించి నారు. అందును భానుకవి, బైచరాజు వారిమన్మథ మల్ల యుద్ధ విశేష ముల గూడ వర్ణించినారు. అది దక్షిణాంధ్ర యుగసాహిత్యమునకు బూర్వరంగ ప్రాయముగా నున్నది. ఇది యనుచితమైన యన్యథా కల్పనము. అట్లే యామె విటునాహ్వానించుటకు గారణము రానున్న యపమృత్యు ప్రమాదమునుండి భర్తను బరిరక్షించుటయని 'యద్యద్యదినే పరపురుషేణ సహైకస్మి న్నిచ్ఛయనే సమారుహ్యాలింగనం కరోషి తత్త్వవ భర్తృసక్తోఽపమృత్యుస్తస్య సంచరతి భర్తాఽపి పునర్వర్ష శతం జీవతి' యని మూలము. అది యామెకు దేవి యొసంగిన వరము. మూడు చంపువుల యందు నామె పరపురుషునితో రమించుటకు గారణము విటబలాత్కారమని యామె తెలిపినట్లు నిరూ పింపబడెను. విటునివలన నామె భయపడిన విధమును దూబగుంట నారాయణకవి.

ఆ రథకారుఁడల్లన విజాంగనఁదెల్పినఁ గన్నువిచ్చియా
సారసనేత్ర యిట్లనియెఁ జయ్యన నీవు తొలంగు మంతకా
కారుఁడు వీఁడు మేల్కనిన గ్రక్కన నిన్ను నన్నుఁజంపుము
న్నారసి పీడెపట్టిన భయంబునఁ బోవక చిక్కియుండితిన్.

సంధి-విగ్రహ పద్య 242

యని రచించినాఁడు. బైచరాజు విటబలాత్కార వృత్తాంతమును

ఒండననేల నాయగనియొద్ద రమించుట యింద్రభోగమై
యుండునయో యనుంగు విభుఁడూరకిఁబోవు టెఱింగియొంటి ని
ట్లుండఁగ వచ్చి పట్టికొని యోరి దురాత్మక సిగ్గుగొంటి వీ
వెండయుఁ బోలె వేఁడి ఘటియింపదె నాకిటువంటి కూరిమిన్

ఆశ్వా 3-పద్య 282.

అని వివరించినాడు. ఆతని రచనమున రథకారుడీ హేతువును విశ్వ
సించినట్లు

ఏనుబ్రివాసి నోటెఱిఁగి యింతటనంతట నాకుమాటవ
ర్లేని దెఱింగి కన్గొని చలింపక పీఁడిలుపొచ్చి యుద్ధతుం
డై నిలు పోవలేక కదియంబడెఁ గూఁతలురోఁతలంచుల
జ్ఞానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్

పద్య 287.

అని పేర్కొనబడెను. నమ్ముటయేగాక రథకారుడును విటునకు భయ
పడినట్లు బైచరాజు

చిక్కితిపీని చేత రోదసేయుట సిగ్గులచేటు పొందులం
జొక్కక వేగనిల్వెడలఁ జూడఁడు ముచ్చటఁ దీర్చుకున్న వీఁ
డుక్కున నేమి సేయునో భయోదయమయ్యెడునంచునోడి యీ
చక్కర ముద్దుగుమ్మ సరసప్రియభాషల నింపొనర్చెడున్

పద్య 288

అని తెలిపినాడు. విటబలాత్కారమును గారణముగ రచించుటకంటె
దేవీవచనానుసారము శాపవృత్తాంతమును గల్పించుటయే ఔచితీ
శోభితము. అనువాదకులు నారతి ప్రియముగానున్నదా నీపతిరతి నీకు
సుఖప్రదమాయని ఆమెను విటుడు ప్రశ్నించినట్లు రచించుట
యమూలకము, ఆమె పాతివ్రత్య నిరూపణమున కవకాశమొసరించు
టకై వారట్లు రచించినారు.

ప్రాత మగ డెట్లు రోతగొల్పునో రథకారుని భార్య సూచించిన విధమును పైచరాజు

తలపేను, పంటి సందిది
పులు కాలను ముల్లు వస్త్రమున యాక కటి
స్థలి తీట పాదరక్షన్
శిలపోలెం బాతిమగఁడు చేకెవ్వరికిన్

పద్య 260.

అని రచించుట యమూలకము. రథకారుని భార్యాస్వరూప నిరూపకము.

## లబ్ధప్రణాశ తంత్రము :

1 సంస్కృత పంచతంత్రమున లబ్ధప్రణాశతంత్ర రంగభూమి కగా జంబూవృక్షము స్వీకరింపబడెను. అనువాదకులు మేడిచెట్టుగా మార్చినారు. ఫలరసాస్వాదనమున జంబూవృక్షమే ప్రసిద్ధి నొందినది. అన్యథా కల్పన మనుచితముగానున్నది.

2 మకరపతి సముద్రమునువీడి తత్సుకోమల వాలుకా సనాథ తీరభూమిని ప్రవేశింపగా గపినాథుడతనినతిథిగా నర్చించినట్లు మూలమున గలదు. ఆంధ్రీకరణములందు గథమారినది. ఫలభక్షణ సందర్భమున నొకటి జారి నీటిలోబడి మధురముగ ధ్వనింపగా దద్ధ్వనికి ముచ్చటపడి కపినాథుడు పెక్కుఫలములు రాల్చెననియు వానిని భక్షించుచు మకరపతి క్రమముగా జెలికాడైనాడనియు గలదు. ఒక్కపండు నీటిలోబడి బుడబుడ ధ్వనిసేయగా నైచ్ఛికముగా ననేక ఫలములను జారవేయుట కపి చపల స్వభావ సూచకము. నారాయకవి కపిచాపల్యము నిట్లు మధురముగ రచించినాడు.

ఆ చప్పుడు తన చెవులకు
నేచిన కౌతుకముఁ బెనుప నెడ నెడ ఫలముల్

వైచుచును సహజచాపల
మైచను మర్కటము చప్పుడాలించు తఱిన్.

లబ్ధనాశ- పద్య 13

3 వానరేంద్రుడు మకరపతివలని ప్రమాదమునుండి బైటపడి తిరిగి తన నివాసమైన యౌదుంబరవృక్షము నధిష్ఠించి పుత్త్ర మిత్త్ర కళత్రభృత్యామాత్యులంగనుంగొని సంభవించినమరణ సన్నివేశ వృత్తాంత మెఱింగించినట్లు భానుకవి యొక్కడే రచించినాడు. ఇది యమూలకము. ఆ కపిపతిపుత్త్రుడగు సుశర్మ మకరపతిపై పగగొన నుద్బోధించుటయు నమూలకమే. పితాపుత్త్రుల సుదీర్ఘ సంభాషణమున విటుడు- వేశ్యమాత; బ్రాహ్మణుడు- రాజు అను రెండు కథలు గూడ ప్రసక్తములైనవి. ఈ యమూలకమైన భానుకవి కల్పనము కథ కెట్టి ప్రయోజనమును జేకూర్చుటలేదు. అట్లే మకరపతి మఱల విశ్వాసము గల్గించుటకై తానాడినదంతయు హాస్యకల్పనమనియు దప్పక స్వీయగృహమునకు రావలయుననియు మర్కటపతి నర్థించినట్లు మూలమున గలదు. ప్రాణహత్యాయత్నమునుండి దైవవశమున విముక్తుడైన మర్కటనాథుని మఱల మోసపుచ్చుట నిష్ప్రయోజన కరము మిక్కిలి యనుచితము నగునను తలంపుతో జంపూకర్తలు విడిచి యుందురు. మూలత్యాగ మత్యంత సమంజసముగా నున్నది.

## అసంప్రేక్షిత కారిత్వతంత్రము :

1. సంస్కృత పంచతంత్రమున మణిభద్రుడను శ్రేష్ఠి-క్షపణకుడను కథతో నసంప్రేక్షిత కారిత్వతంత్రమారంభింపబడెను. చంపువులలో బ్రాహ్మణుడు-నకులమను కథతో నీ తంత్రము ప్రారంభింపబడెను. హితోపదేశమున నీ పరిచ్ఛేదము లేదు గావున దూబగుంట నారాయణకవి యీ మార్పునకు గారకుడని చెప్పవచ్చును. ఈ కథగూడ నసంప్రేక్షిత కారిత్వ ఫలమునే బోధించును గాన మార్పు సముచితముగా నున్నది.

2. బ్రాహ్మణుడు-నకులము అను కథలో సంస్కృత పంచతంత్రమున బ్రాహ్మణునకు కుమారుడు పుట్టిన దినముననే నకులముగూడ జన్మించినదనియు దానిని స్తన్యదానాభ్యంగనాదులచే బ్రాహ్మణి పోషించెననియు గలదు. స్తన్యాదానాది వృత్తాంత మనుచితమని యను వాదకులు విడిచినారు.

సంస్కృత పంచతంత్రమున బ్రాహ్మణి నకులము నుండి బాలుని రక్షింపుమని భర్త కప్పగించి జలకుంభము దాల్చి తటాగమమున కేగిన దనియు ననంతరమా బ్రాహ్మణుడును భిక్షాటనకై యిలువిడిచెననియు గలదు. బ్రాహ్మణుడు బాలుని రక్షణకై నకులము నుంచి యింటిని విడిచి వెడలునట్లు అనువాదకులు రచించుట యన్యథా కల్పనము. దానికి వారు భిన్న హేతువులను జూపినారు. మాబగుంట నారాయణకవి యా బ్రాహ్మణి పుణ్యదినము వచ్చుటచే బాలుని భర్త కప్పజెప్పి స్నానార్థము నదికేగెననియు బుణ్యదినమగుటచే దన్నగర ప్రభు మందిరమునకు బలువురు బ్రాహ్మణులు ప్రభుసంభావనలకై వెడలుచుండ నా బ్రాహ్మణుడు పెంపుడు నకులమును బాలకుని రక్షగా నుంచి యిలువెడలె నని రచించినాడు. ఈభాగము భానుకవి రచనమున శిథిలమైనది. వైచరాజు చతుర్దివసప్రాయుడైన యర్భకుని బొత్తుల నునిచి భర్త కప్పగించి యా బ్రాహ్మణి పుట్టినింటి కేగగా నతడు నకులమును బాలుని రక్షకై నిలిపి గృహ బాహ్యభూమికి వెడలెనని రచించినాడు.

మూలమున బుత్రసమానముగ బెంచిన నకులము నుండి బాలుని రక్షింపుమని బ్రాహ్మణి కోరంగా బ్రాహ్మణుడు పుత్రుని వీడి భిక్షార్థమేగుట మిక్కిలి యనుచితము. పుణ్యదినమగుట ప్రభువునుండి భూరి సంభావనము బొందవచ్చు నను నాశతో బ్రాహ్మణు డింటిని విడిచెనని రచించుట సమర్థనీయముగను ఔచిత్య పరిపోషకముగ నున్నది. నాల్గు రోజుల పసికందును వీడి బ్రాహ్మణి పుట్టినింటి కేగినట్లు వైచరాజు రచించుటలో నౌచిత్యము మృగ్యము. కన్నవారిల్లెంత సమీపమున నున్న నంతటి పసికందు వీడి పచ్చిబాలెంతరాలు పుట్టింటికేగుట మిక్కిలి యనుచితము.

## 2. నీత్యను వాదము

కథాను వాద సందర్భమున జంపూకర్త లెట్టి స్వాతంత్ర్యమవ లంబించినారో నీత్యనువాద విషయమున నట్టి స్వేచ్ఛ నవలంబించినారు. విష్ణుశర్మ పంచతంత్రమును మనోహరమైన నీతిశాస్త్రముగా రచించి నాడు. అందు గథ యానుషంగికము. అందు గొంతి కావ్యత్వము ప్రద ర్శింపబడినను నీతి బోధ ప్రాధాన్యము వహించును. చంపూకర్తలు కావ్యముగ ననువదించుటచే గథను జమత్కారజనకముగ మహాకావ్యో చితముగా రచించుటకే ప్రాధాన్య మొసంగినారు గాన నందు బెక్కు నీతులు విడువబడినవి.

పంచతంత్రమున ననేక ములు ఒకే శ్లోకతంత్రమునగాని భిన్న తంత్రములగాని పునరుక్తములైనవి. అనువాదకులు బహు సమర్థతతో సమ్యగ్పరిశీలన మొనర్చి వానిని బరిహరించినారు. కావ్యపద్ధతి కట్టి సంస్కరణ మావశ్యకము.

మిత్త్రభేద తంత్రమున వర్ధమానుని కథలోని స్వల్పస్య కృతే యను 19 వ శ్లోకము లబ్ధప్రణాశ మందు గంగదత్తుడను మండూకపతి కథలో గలదు (శ్లో 29). సంజీవకుడు గర్జించుసందర్భ మందలి అరక్షితం తిష్ఠతి దైవరక్షితమ్మను 20 వ శ్లోక మా తంత్రమందలి మత్స్యత్రయ కథలో బునరుక్తము (శ్లో 352). దమనకుడు పింగళకునితో భాషించు నప్పటి రాజా తుష్టో హియను 91 వ శ్లోకమా తంత్రమందలి టిట్టిభ దంపతుల కథలో గలదు (శ్లో 383). కరటకదమనకుల సంభాషణ మందలి త్యాజ్యం న ధైర్యం విధురేఽపియను 216వ శ్లోక మా తంత్ర మందలి కంబుగ్రీవమను కచ్ఛపము వికటసంకటులను హంసలు అను కథలో గూడగలదు (శ్లో 345). భాసురకమను సింహమను కథలోని జాత మాత్రం నయః శత్రుమ్మను 256వ శ్లోకము కాకోలూకీయ కథారంభ మున గలదు (శ్లో 3). మందవి సర్పణియను యూకము-అగ్నిముఖమను మత్కుణమను కథలోని ఏహ్యాగచ్ఛయను 276వ శ్లోకము మిత్త్రప్రాప్తి యందు దామ్రిమాడుని కథలో నావృత్తమైనది (శ్లో 67). దమన

కునితో సంజీవకుడు మాట్లాడు సందర్భమందలి యయోరేవ సమం విత్తమ్మను 304వ శ్లోకము మిత్ర ప్రాప్తి యందు హిరణ్యకుని సంభాషణమునను (శ్లో 30), గాకోలూకీయమున ముని- మూషికాంగనయను కథయందు (శ్లో 208) బునరుక్తమైనది. ఒకే శ్లోకము మూడు తంత్రము లందును జెప్పబడుట విశేషము. దమనకుడు సంజీవకునకు గర్తవ్యోపదేశ మొనరించు సందర్భమందలి ఆపదర్థే ధనం రక్షేత్తను 387వ శ్లోకము కాకోలూకీయమున జతుర్దంతమను గజపతి-శశకమను కథలో గూడ గలదు (శ్లో 84). కరటక దమనక సంభాషణమందలి ఉద్యోగినం పురుష సింహమ్మను 392వ శ్లోకము మిత్రప్రాప్తి యందు సోమలికుడను కౌలికుని కథలోగూడ జెప్పబడినది. (శ్లో 37)

మిత్ర సంప్రాప్తి తంత్రిమందలి చిత్రగ్రీవుడు పాశబద్ధుడగు సందర్భమందలి కృతాంతపాశ బద్ధానామను 5వ శ్లోక మాతంత్రిమందలి హిరణ్యక లఘుపతనక సంభాషణమున గలదు (శ్లో 182). హిరణ్యకుడు లఘుపతనకునితో బల్కిన కోఽతి భారస్సమర్థానామను 58వ శ్లోక మాతంత్రిమందలి మంథరక సంభాషణమునను గలదు (శ్లో 127). హిరణ్యక లఘుపతనకుల యన్యోన్య స్నేహపూర్వక జీవిత నిర్వహణ నిరూపణ సందర్భమందలి దదాతి ప్రతి గృహ్ణాతియను 51 వ శ్లోకము లబ్ధ ప్రణాశారంభమున గలదు (శ్లో 13).

కాకోలూకీయ తంత్రాంత మందలి యత్రైవ రాజ్యే, రామస్య వ్రజనమ్మను శ్లోకములు (శ్లో 251, 52) అపరీక్షిత కారిత్వమందలి మంథరకుడను కౌలికుని కథలో బునరుక్తములైనవి (శ్లో66, 67).

లబ్ధ ప్రణాశ తంత్రమందలి గంగదత్తుడను మండూకపతి కథలోని యచ్ఛక్యం గ్రసితుమ్మను 23వ శ్లోకమా తంత్రిముననే మహాచతురకమను నక్క—మృతగజమను కథలో గూడ గలదు. (శ్లో 75)

అపరీక్షిత కారిత్వ మందలి నాపితుని కథలోని జీర్యంతి జీర్యతః కేశాః అను 16వ శ్లోకమా తంత్ర మందలి చంద్రుడు—భూపతి యను కథలో గలదు (శ్లో 79)

ఒక కవి రచించిన ఒకటి రెండు శ్లోకములా గ్రంథముననో యాతని యితర గ్రంథముననో పునరుక్తములగుట సమంజసముగా నుండును. నీతిబోధ ప్రధానగ్రంథమగుటచే నిన్ని శ్లోకములు పంచతంత్రమున పునరుక్తములైనను ఔచిత్యానౌచిత్యముల చర్చకవకాశము వ్యర్థము. చంపూకర్తలు పంచతంత్రమును గావ్యముగా ననువదించుట కుపక్రమించుటచే నిట్టి నీతి శ్లోకములను బెక్కింటిని బూర్తిగా విడుచుట ప్రశస్యము. చంపూకర్తల కథాసంస్కరణ సందర్భమున విడువబడిన శ్లోకములు పరశ్శతముగా నున్నవి. భిన్నసన్నివేశములలో భిన్న విషయములను బోధించు నాశ్లోకములన్నియు వెనిగింపబడినచో గథాగమనము కుంటువడి చమత్కారము హరించి పోయెడిది. ఇక నేయే తంత్రమందలి యేయే సందర్భము లందలి నీతి శ్లోకములు కావ్యత్వ సంపాదనమునకై యనువాదము లందు విడువబడినవో సమీక్షింతము.

## మిత్రభేదము :

1. వర్ధమానుని కథలో నారంభమున సర్థార్జనోపాయములు, అర్థాగమోపాయ భూత సప్తవిధ వాణిజ్య విశేషములు బహు శ్లోకములలో (2–18) వివరింపబడినవి. చంపూకర్తలు విడచినారు.

2. ఆసాఢభూతి కథలో దేవశర్మయను సన్యాసి తంతువాయుని సమీపించి యతిథి ధర్మ వైశిష్ట్యమును మూడు శ్లోకములలో (181–183) వివరించినట్లు గలదు. సోమపానమత్తునకు బోధించుట యనుచితమను దృష్టితో ననువాదకులు విడిచినారు.

3. దూతి తంతువాయుని భార్యకు కులటాధర్మమును మూడు శ్లోకములలో (190–192) బోధించినట్లు గలదు. కులటాధర్మ ప్రశంసను ముఫ్వురు చంపూకర్తలు విడిచినారు.

4. భాసురక శశక సంభాషణమున 1. విగ్రహాఫలత్రయము, దుర్గాశ్రయమున గలుగు ప్రయోజనములు 2. శత్రువునుపేక్షింపరాని

విధము 3 శత్రుసామర్థ్యము తెలియక యెదిరింపరాదను విషయము పెక్కు శ్లోకములలో (251-261) వివరింపబడినవి. ఇవియు విడువబడినవి.

5. దమనక సంజీవకుల సంభాషణమున సేవానర్థములు విపులముగా సేవయాధన మిచ్ఛద్భిః అను శ్లోకముతో నారంభింపబడి యెనిమిది శ్లోకములలో (287-294) పేర్కొనబడినవి. అనువాదమునవి విడువబడినవి.

6. సింహము-కాక జంబుక ద్వీపివ్యాఘ్రములను కథలో స్వామ్యర్థమై ప్రాణములు వీడువారికి గల్గుస్థితినాలుగు శ్లోకములలో (316, 318, 321, 323) వివరింప బడినది. ఆ శ్లోకములనువాదమున విడువబడినవి.

7. టిట్టిభ దంపతులు-సముద్రుడు ననుకథలో టిట్టిభము టిట్టిభితో నుత్సాహ శక్తి వలన స్వల్పులును ఘనులు కాగలరని నాలుగు శ్లోకములలో (355-358) దెలిపినట్లు గలదు. ఇవియు నాంధ్రీకరణముల విడువబడినవి.

8. దమనకుడు సంజీవకునితో నాత్మ రక్షణావశ్యకము నైదు శ్లోకములలో (386-390) వివరించినాడు. ఇందలిభావము లింతకు ముందు జెప్పబడినవే యను నుద్దేశముతో ననువాదకులు విడిచి యుందురు.

## మిత్రసంప్రాప్తి :

1. చిత్రగ్రీవుని యుదంతమున జిహ్వాలౌల్య స్థితిగతులు, దైవ ప్రాతికూల్యఫలము మూడు శ్లోకములలో (3-5) వివరింపబడినవి. ఇవి విడువబడినవి.

2. సపరివారుడైన చిత్రగ్రీవుడు హిరణ్యకుని జేరిన సందర్భమున సుహృద్విశిష్టత మనోహరముగ మూడు శ్లోకములలో (17-19) వివరింపబడినది. అవి విడువబడినవి.

3. లఘుపతన హిరణ్యకుల తొలి సంభాషణమున వైరము యొక్క స్వరూప స్వభావములు విపులముగ బెక్కు గద్యపద్యములలో వివరింపబడెను. లోకజ్ఞతా సంపాదనమున రాజపుత్త్రులకది యత్యంతావశ్యకమే గాని కథాకథనమునకిది బహుశః అనావశ్యకమను తలంపుతో ననువాదకులు విడిచియుందురు.

4. లఘుపతన హిరణ్యకుల యనుబంధ సూచన సందర్భమున బ్రీతి లక్షణము, దానమాహాత్మ్యము నైదుశ్లోకములలో (51–55) జెప్పబడెను. ఇవియు విడువబడెను.

5. తామ్రచూడుని కథలో నతిథి నాదరింపని వారి స్థితిగతులు, తత్ఫలము మూడు శ్లోకములలో (67–69)వర్ణింపబడినవి. ఇవియు విడువ బడినవి.

6. బ్రాహ్మణి-తిలచూర్ణమను కథలో దానమాహాత్మ్యము తొమ్మిది శ్లోకములలో (73–81) వివరింపబడినది. ఇవియు విడువబడినవి.

7. గత విభవుడైన హిరణ్యకుడు తనస్థితిని కాకకూర్మములకు నివేదించు సందర్భమున బహువిధ నీతి బోధక శ్లోకములు పెక్కు పేర్కొనబడినవి (89–111). అందు దరిద్రుని జీవిత దౌర్భాగ్యము సునిరూపితము. ఇవియన్నియు బరిత్యజింపబడినవి.

8. లఘుపతనకాదులు సుఖగోష్ఠుల గాలము గడుపుచున్నట్లు తెలుపు సందర్భమున సుభాషిత ప్రశస్త్యము అనర్ఘములైన మూడు శ్లోకములలో (4–6) నుగ్గడింపబడెను. ఈ శ్లోకములు విడువబడినవి.

**కాకోలూకీయము :**

1. మేఘవర్ణునకు మంత్రులు గావించిన యుపదేశమున రాజ నీతికి సంబంధించిన నీతి శ్లోకములనేకములు (7–69) గలవు. అను వాదము లందవి యెల్ల సూత్ర ప్రాయముగా రచింపబడినవి. ఇంచు

మించుగ ననువాదకులా సందర్భమున స్వాతంత్రిలను ప్రదర్శించినారని చెప్పవచ్చును.

2. శశక పింజలముల కథలో నివాసస్వామ్య నిర్ణయ వృత్తాంతము మూడు శ్లోకములలో (91-93) వివరింపబడెను. ఇదియు విడువబడెను.

**లబ్ధ ప్రణాశము :**

1. వానరపతి మకరాధిపునతిథిగా నమృత తుల్యములగు జంబూ ఫలములచే నర్చించిన సందర్భమున సంస్కృత పంచతంత్రమున నతిథి సేవా ఫలము నాలుగు శ్లోకములలో (2-5) వివరింపబడెను. చంపువులలో మకరపతి యతిథిగా భావింపబడక పోవుటచే నీ శ్లోకములు విడువబడినవి.

2. మకరము తన హృదయమును గ్రహించుటకై గొనిపోవుచున్నదని తెలిసికొనిన వానరముపడిన మానసికాందోళనము మూలమునకు మెఱుగులు దిద్దుచున్నది. అనువాదయితలా ఘట్టమున లోకోత్తరమైన నీత్యుపదేశ మొనరించినారు. అది యంతయు వానర పాత్రికుత్కర్ష ప్రదము. నారాయణ కవి వీతరాగుని వైశిష్ట్యమును

రాగసంయుక్తుఁ డరణ్య వాసంబున
  బహు కాలమున్నను ఫలము లేదు
నెఱయఁ బంచేంద్రియ నిగ్రహంబున నిట్లు
  గదలకున్నను వాని కదియ ఫలము
వీతరాగుండును వినయశీలుండును
  వివిధ ధర్మాధర్మ విదుఁడు నగుచు
సత్యదయా దాన శౌచంబు లెవ్వఁడు
  గలిగి వర్తించు నిష్కపటవృత్తి
వాని నిలయంబు ఘన తపోవనము గాని
దండకాషాయ వస్త్రక మండులువులు

ముండితయును భిక్షాటనముంజదువును
నాటకమ్ములివి ప్రయోజనములు గావు. పద్య–69

అని వివరించినాడు. భానుకవి కర్మమార్గోపదేశమును

అని నక్రమునకుఁ గర్మము
లనుభవ హేతువులు బ్రిహ్మకైనను హృదయం
బునఁ జింతా రహితుండై
ఘనమగు మతిఁ గెల్చి మెలఁగఁగావలయు నిలన్
ఆశ్వా 4–పద్య 38

అని గావించినాడు. బైచరాజు వేంకటనాథుఁడు కామాంధుని యవస్థను

భీమాటవిలో నున్నం
గామంధుని బొదువుఁ బాతకంబులు రాజ
గ్రామమున నున్న దూరిత
కాముని గల్మషము లంటఁగా శంకించున్.

చిరకాల మరిగె నురిగెం
దరుణిమ యికనేడ గామ తంత్రంబనుచున్
బరలోక చింత సేయని
పురుసాధముఁజేటుపాటు పొందరె యనుచున్
ఆశ్వా–4 పద్య 79, 80

అనుపద్యముల నుగ్గడించినాడు. ముప్వురును సార్వత్రిక సార్వకాలిక సత్యోద్ఘాటన మొనరించిన తీరు ప్రశంసార్హము. ఈయమూలక కల్పనము సందర్భోచితముగా నున్నది.

## అసంప్రేక్షిత కారిత్వము :

1. సెట్టి – క్షపణకుఁడను కథలో వైశ్యుడు క్షీణవిభవుఁడై దరిద్రతా స్వరూప స్వభావములను, శక్తి సామర్థ్యములను సుదీర్ఘముగా దొమ్మిది శ్లోకములలో (2–10) జింతించినట్లు మూలమున గలదు. ఆ నీతి శ్లోకముల ననువాదకులు విడిచినారు. దూబగుంట నారాయణ కవి

మాత్రము ఆ సెట్టి దైన్యజీవనమునుఁ దలమాసినపుడును దెలమించుక లేక, యను (35వ) పద్యమున సుందరముగ జిత్రించినాడు. నీతి శ్లోకము లను విడిచి యతడట్లు రచించుట కావ్యోచితము.

2. నాపితుని కథలో దృష్టాంతప్రభావము రెండు శ్లోకములలో (15–16) ను, బ్రాహ్మణుడు-నకులమను కథలో బుత్ర సుఖ వైశిష్ట్యము మూడు శ్లోకములలో (19–21) నభివర్ణింపబడగా గావ్యత్వ పరిపోష ణార్థకై యనువాదకులు విడిచినారు.

ఇట్లు చంపూకర్తలు మువ్వురును బంచతంత్రము నొక మధుర కావ్యముగా సంతరించు సంకల్పముతో సంస్కృత గ్రంథమందలి పెక్కు నీతి శ్లోకములను దమ యాంధ్రీకరణమున విడిచి పుచ్చినారు. అనువదిం చిన శ్లోకములలో గొన్నింటిని మువ్వురు ననువదించినారు. కొన్నింటిని గొందరే తెనిగించినారు. మువ్వురు నాంధ్రీకరించిన కొన్ని శ్లోకములను మాత్రమే గ్రహించి స్థాలీపులాక న్యాయమున వారి శ్లోకానువాద విధానమును బరిశీలింతము.

1. సుహృదా ముపకార కారణా
ద్ద్విషతామప్య పకార కారణాత్
నృప సంశ్రయ ఇష్యతే బుధైః
జఠరం కో న బిభర్తి కేవలమ్.

మిత్రభేద–శ్లో 22.

మిత్రుల కుపకారంబును
శత్రుల కపకారమును నిజంబుగఁజేయన్
క్షత్రియులఁ గొలుచుట యుదర
మాత్రము కొఱకైన సేవ మహిఁగొఱయగునే.

దూబ–మి భే–పద్య 95.

పరుల మదంబుఁ ద్రెంచఁదన బాంధవ కోటులను మన్చి దిక్కులన్
గురుతరకీర్తి నెంచఁదన కోరికలెల్ల ఫలించ రాజసే

ఖరులను సజ్జనాళి కలకాలము గొల్చుటకాక పొట్టకై
తిరముగఁ గొల్వనేల కులదీపక! విత్తియ లక్ష్మధీమణీ
భాను–ఆశ్వా 1–పద్య 77.

తనవారిఁ బ్రోచుటకు నం
టని వారి వధించి వైచుటకుఁగా నృపులం
బనివడి కొలుచుట లేకె
వ్వని కెద్దడి పుట్టె నన్నవస్త్రంబులకున్
బైచ–ఆశ్వా 1–పద్య 132.

అనువాదములు మూడును యథామూలముగా సాగినవి. దూబగుంట నారాయణ కవి క్షత్రియుల ననినాడు. పాలకుల ననుట సముచితము. భానుకవి వృత్తమును స్వీకరించి మూలమును వివరించినాడు. 'తన కోరికలెల్ల ఫలించ' అని క్రొత్తగా గలిపినాడు. సజ్జనాళి, కలకాలమను పదములు నమూలకములే. బైచరాజు శత్రులననుటకు నంటనివారిననినాడు. అర్థమున రెండును సమానమే.

2. ఉదీరితోఽర్థః పశునాపి గృహ్యతే
హయాశ్చ నాగాశ్చ వహంతి చోదితాః
అనుక్త మప్యూహతి పండితో జనః
పరేంగితజ్ఞాన ఫలా హి బుద్ధయః
మి. భే– శ్లో 44.

పలికిన సన్నెఱింగి పశుపంక్తులు సెప్పినయట్ల చేయు శి
క్షల హాయకుంజరంబులు వశంబున మోచుక పోవునట్లు మ
ర్త్యులు తమ బుద్ధి లేకెదిరి యుక్తిఁ జరించిన వారలేటికిన్
వెలయఁ బరేంగితం బెఱుఁగ నేర్చుటగాక వివేకమిమ్మహిన్.
దూబ–మి–భే పద్య 112

పలికినంత నెఱుఁగుఁ బశువులు తలపోయ
సంజ్ఞ నెఱుఁగు దంతి సైంధవములు

నొరుల యింగితమ్ము లూహ నెఱుంగుట
తెలివి లక్ష్మమంత్రి! ధీసమేత!

భాను-ఆశ్వా1-పద్య80.

మతినే నిచ్చినఁగాని లేదు చనదాత్మ శ్లాఘనామానసం
బితరాకార విచేష్టితార్థముల నూహించునర్థరిత్రింబశు
ప్రతతుల్ నేర్చు నుదీరితార్థముల దిక్ర్రఖ్యాత మేధానమ
న్వితుఁడై వర్తిలు పండితుండకట వానింబోలఁడే చెప్పుమా.

బైచ-ఆశ్వా1-పద్య 147.

నారాయణ కవి యనువాదమున వైశద్యము గలదు. భానుకవి శ్లోక సారము నాటవెలఁది మూడు పాదములలోనే రచించుట ప్రశంసనీయము. బైచరాజు పద్యమున స్వాతంత్రత ప్రదర్శింపబడినది. మూల మందలి హాయనాగముల విషయములు విడువబడినవి.

3. ఉత్తరాదుత్తరం వాక్యం వదతాం సంప్రజాయతే
సువృష్టి గుణ సంపన్నా ద్బీజాద్బీ జమివాపరమ్.

మి-భే-శ్లో 64.

ఉత్తరమునఁ బొడమెడుఁ బ్ర
త్యుత్తరముత్తరము లేక యుత్తరమగునే
హత్తిన సువృష్టి వలనన్
వితులకుం బొడము నట్టి వితులుపోలెన్

దూ నా- మిభే-పద్య 119.

ఒరులాడిన వాక్యమ్ముల
సరవిం బ్రతివాక్యములు రసస్థితి వొడమున్
ధరణిని బీజమ్ములు దా
మురు వృష్టిని బొడము కరణి నుచితమ్మగుచున్

భాను-ఆశ్వా 1-పద్య 87

విత్తున విత్తుంబలెఁ బ్ర
త్యుత్తరముత్తరము వలన నుదయించు భవ

చ్చిత్తము నీతికళా సం
పత్తికిఁ బుట్టినిల్లుగాదె పరికింపంగాన్

వైచ—ఆశ్వా1—పద్య 158.

నారాయణకవి రచనమున 'ఉత్తరములేక యుత్తరమగునే' అను భాగము మూలమునకు విపులీకరణము. భానుకవి పద్యమున భావాను వాదము గలదు. ఉత్తరమను పదమును దూబగుంట నారాయణకవియు వైచరాజు వేంకటనాథుఁడు ననువాదమున దెచ్చినారు. భానుకవి వాక్య ప్రీతి వాక్యములని యనువదించి రసస్థితి యనుపదము నన్యథాకల్పించి నాడు. ఇది మనోహరముగా నున్నది. వైచరాజు మొదటి రెండు పాదములలోనే యనువదించుట యాతని రచనా సామర్థ్యమును నిరూ పించు చున్నది.

4. స్థానేష్వేవ నియోక్తవ్యా భృత్యాశ్చాభరణాని చ
నహి చూడామణిః పాదే ప్రభవామీతి బధ్యతే

మి భే— శ్లో 78.

నరపతి భృత్యులఁ దొడవుల
నొరసితగిన నెలవులందు నునుపక యున్నన్
జరణంబునఁ జూడామణి
శిరమున నందియయుఁ బెట్టు చెలువము గాదే

దూ నా— మి భే. పద్య—132.

తొడవులక్రియ భృత్యుల నిలి
పెడు చోటుల నిలుపవలయుఁ బృథివీశుఁడు పెం
పడర నటుగాక త్కక్కినఁ
దడ బడుఁ గార్యములు తద్విధంబునఁదలఁపన్

భాను—ఆశ్వా1—పద్య 96.

అతిశయస్థాన యోగ్యు నీచాసనమున
నునుచు విశ్వంభరా వల్లభునకు నింద

మస్తకోచిత కోటీర మండనములఁ
గాళ్ళఁద్రొడిగిన యమ్మర్త్యుఁ గఱటియనరె

బై వేం. ఆశ్వా 1-పద్య 171.

నారాయణకవి యథామూలముగ ననువదించినాఁడు భానుకవి భృత్యుల కుపమానముగ నాభరణములు గ్రహించినాఁడు ఈకల్పనము గూడ మనోహరముగ నున్నది. వేంకటనాథుఁడు భానుకవి పద్ధతినే యనుసరించి మఱింత మెఱుఁగులు దిద్దినాఁడు.

5. కనక భూషణ సంగ్రహణోచితో
యది మణి స్త్రపుణి ప్రతిబధ్యతే
న స విరౌతి న చాపి న శోభతే
భవతి యోజయితు ర్వచనీయతా

మి భే- శ్లో 81.

కుందనముఁగూర్ప నర్హమైయుందపడిన
పృథుల రత్నంబు వెండిలోఁ బెట్టెనేని
రత్నమున కేమి కొఱయగు రాజు బంటుఁ
దగినపనిఁ బెట్టకుండినఁ దగవు గాక

దూ నా-మి భే- పద్య 133.

కనకభూషణ సముచిత క్రమవశాక్తి
కమ్ములోహానఁగట్టిన కరణి నధిక
(విధుల) పతిహిత మతులందు వెలయుభటులఁ
గూర్చు సిరికన్య పురుషులఁ గూర్పఁ జనదు.

భాను-ఆశ్వా 1-పద్య 97.

అధమ వృత్తి కధికు నమరించుపతి దిట్టుఁ
గుడుచుఁగాదె యారకూట కటక
కలిత మణికి నిందగాద పొనర్చిన
కుత్సితుండు నిందఁగుడుచుఁగాని

బై వేం- ఆశ్వా 1-పద్య 172.

మూలమున త్రపుణి యనిగలదు. సీసమునందని యర్థము. నారాయణ కవి వెండియనియు, భానుకవి యినుమనియు, బైచరాజు త్తడియనియు మార్చి రచించినారు. బంగారము కాని పక్షమున నేలోహముగా దానిని మార్చి రచించిననుచితముగానే యుండును.

6. కౌశేయం క్రిమిజం సువర్ణముపలాద్దూర్వాపి గోరోమతః
పంకాత్తామరసం శశాంక ఉదధే రిందీవరం గోమయాత్
కాష్టాదగ్ని రహేః ఫణాదపి మణిర్గోపిత్తతో రోచనా
ప్రాకాశ్యం స్వగుణోదయే న గుణినో గచ్ఛంతి కా జన్మనా
మి. భే-శ్లో 103.

సూకరరూపంబు భీకరంబుగఁ దాల్చి
పుండరీకాక్షుండు పొగడువడఁడె
మృగరూపమునఁబుట్టి జగతి ప్రసిద్ధుఁడై
ముని సురేంద్రుని చేత మ్రొక్కువడఁడె
ఛాగస్వరూపంబు షణ్ముఖుండు ధరించి
సురసమూహమునఁ బ్రస్తుతిగనండె
ఇంద్రాగ్ను లిరువురు నెసఁగంగఁ బక్షులై
బృథుల సత్కీర్తులఁ బెంపుగనరె
యల్పజంతువులని వారి యాదరింప
కుండెనే తొల్లి సురముని మండలంబు
గాన నీవును ననుఁజుల్కగాఁ దలఁపక
చిత్తమునఁ జేర్చి నామాట చిత్తగింపు
దూ నా- మి భే- పద్య 137.

హరియును బోత్రిగాత్రధరుఁడై శరజన్ముఁడు ఛాగరూపియై సరసిజ బాంధవుండు హయసం హనుఁడయ్యును (మున్) మహేశ్వరాం బురుహ భవాది దేవ పరిపూజ్యులుగారె మృగేంద్ర! శౌర్య భా సుర! ననుసక్క మాత్రముగఁ జూడకుమీ మది నీకుఁ బూజ్యుఁడన్.
భాను-ఆశ్వా 1-పద్య 102

హరి సూకర రూపంబున
హరిణాది మృగాకృతుల మహర్షుల జంపై
హరిసుతుఁడు పూజ్యులై యుం
డరె వారల గౌరవంబు గరిమ వడియెనే

బై. వేం—ఆశ్వా 1—పద్య 176.

అనువాదకులు ముప్వురును మార్చి రచించినారు. నిర్జీవములగు కౌశేయము, సువర్ణము, దూర్వాలు మున్నగునవి మూలమునందుండగా విష్ణువు, షడాననుఁడు మున్నగు దేవతలను గ్రహించి యనువాదకులు రచించినారు. సందర్భమున కుత్కర్ష గల్గుచున్నది. అనువాదకుల కింకొక శ్లోకము లభించినదో లేక నారాయణకవి యథోచితముగ మార్చిరచింప దక్కినయిరువురు నాతని ననుసరించిరో నిశ్చయింప శక్యముగాకున్నది.

7. ఏకంభూమిపతిః కరోతిసచివం రాజ్యేప్రమాణాం యదా
తం మోహాచ్ఛ్రియతే మదః సచ మదాద్దాస్యేన నిర్విద్యతే
నిర్విణ్ణస్య పదం కరోతి హృదయే తస్య స్వతంత్రస్పృహా
స్వాతంత్ర్యస్పృహయా తతః సనృపతేః ప్రాణేష్వభిద్రుహ్యతి
మి భే—శ్లో—263.

మనుజవరుఁడు నిజామాత్యుగా నొక్కని
నిల్పఁదద్భారంబు నిర్వహించి
తనరుసత్రిక్చందన వనితాది సుఖముల
మోహమంతంతకు మురియఁబడఁగ
మోహంబుచే గర్వమునఁ గన్నుగానక
గర్వాతిశయమునఁ గాని పనులఁ
జేసి నిజేశ్వరుచే నొత్తు నను బుద్ధి
నతని నుల్లంఘింప మతిఁదలంచుఁ

దలఁచి దృఢతరముగ నేలి దళముఁగూర్చుఁ
గూర్చి రాజ్యంబు తనకు గైకొనఁగడంగుఁ
గడఁగి నృపపక్షమగువారి కడుపుకిడక
కుశలబుద్ధిని బతిఁగాల వశునిఁజేయు

దూ. నా-మి. భే-పద్య-282.

రాజ్యరక్షకునిగా రాజు మంత్రిని నిల్పు
మంత్రి యాదక్షత మదమునొందు
నామదమ్మునఁగార్య మాలస్యముగఁ జేయు
నటమీఁద స్వాతంత్ర్య మాత్మఁగోరు
స్వాతంత్ర్యమున నిజేశ్వరున కొండుదలంచు
నంతట మతి వేఱయగుచునుండు
నందుకుఁబతి కర్మమప్పుడు మఱచిన
వెనుకనంతటఁబోదు విగ్రహించు
గాన విషమైన భోజ్యమ్ము గ్రక్కవలయుఁ
దవిలి నొప్పించు దంతమ్ము దివియవలయు
మంత్రియును దుర్జనుండైన మాన్పవలయు
రాజనీతికి విత్తయ ప్రభుని లక్ష్మ!

భాను-ఆశ్వా-1 పద్య 182.

తనఘనరాజ్యమంతయుఁ బ్రధానునిపైనిడియున్న మత్తుఁగాఁ
బెనచి నరేశ్వరుండు నడిపించినవాఁడతి రూఢమూర్ఖుఁడై
కనుకని వల్లభున్నరకుగాఁగొనఁడా సచివావనీశులం
దనయము నెవ్వఁడాఢ్యతముఁడై మనువానినచేరు లక్ష్మియున్

బై. వేం-ఆశ్వా 1-పద్య 374.

దూబగుంట నారాయణకవి మూలానుసారమనువదించినాఁడు. 'తనరు స్వచ్ఛందన వనితాది సుఖముల' ననుభాగమమూలకము. అతడు 'స్వాతంత్ర్య స్పృహయా తతః సనృపతేః ప్రాణేష్వభిద్రుహ్యతి' అను భాగమునకు వివరణప్రాయముగా గీతపద్యము రచించినాడు. భానుకవి

మూలమును స్పష్టపఱచినాడు. కర్తృవ్యతాబోధయు గావించినాడు. పైచరాజు శ్లోకసారమును నిరూపించినాడు. అమూలకత్వమే యందధికము.

8. హోమార్ధైర్విధివ త్ప్రధాన విధినా సద్విప్ర బృందార్చనైః
యజ్ఞైర్భూరి సుదక్షిణైః సువిహితైః సంప్రాప్యతే యత్ఫలమ్
సత్తీర్థాశ్రమ వాసహోమ నియమైశ్చాంద్రాయణాద్యైః కృతైః
పుంభిస్తత్ఫల మాహవే వినిహతైః సంప్రాప్యతే తత్ క్షణాత్
మి. భే– శ్లో 325.

క్రతునివహంబుఁజేసినను గైకొని దానములెన్నియేనియున్
జతురతఁజేసినన్ బ్రచురసాగర తీర్థములాడినన్ రణ
క్షితి నిమిషంబునిల్పి దృఢచిత్తమునంబతిపీర మర్దన
వ్రతమునఁ బ్రాణముల్ విడుచువాని ఫలంబునఁబోలఁజేమియున్
దూ. నా—మి. భే—పద్య 422.

సమరముఖంబునంబడిన స్వర్గముగెల్చిన లక్ష్మిగల్గు కా
యములనయంబు బుద్బుదములట్ల మదిందలపోసి చూడదు
ర్గమ మగుశక్తిఁబోరెద మదంబ మదీయ హృదంతరంబునం
దమర మృగేంద్రుతోఁడ ననునప్పుడు సూడుఁడు మీరలందఱున్
భాను—ఆశ్వా 1—పద్య 249.

సవనములాచరించి కను శక్రనికేతము భూరిదాన ధ
ర్మ విధులొనర్చి కాంచు సురమందిర ముగ్రతపస్సమాధులం
దవులు మరుత్పథం బతులితత్వర శూరుఁడుగాంచుఁ బ్రాణముల్
తవతవలేక నిల్చి జగడంబున నేడ్తెఱ నూడ్చి పుచ్చినన్
పై. వేం—ఆశ్వా—1 పద్య 538

మూలమందలి హోమార్థైః సద్విప్రబృందార్చనైః చాంద్రాయణాద్యైః

అనుపదములు నారాయణకవి యనువాదమున విడువబడినవి. బైచ రాజు మూలమును సందర్భోచితముగా మలచుకొని రచించినాడు. మనోహరముగానున్నది. భానుకవి మూలముతో నెట్టి సంబంధము లేకుండునటుగా స్వతంత్రముగా నుండునటు రచించినాడు.

9. యస్మాచ్చ యేన చ యదా చ యథా చ యచ్చ
యావచ్చ యత్ర చ శుభా శుభమాత్మ కర్మ
తస్మాచ్చ తేన చ తదా చ తథాత తచ్చ
తావచ్చ తత్ర చ కృతాంతవశాదుపైతి. మి. సం. శ్లో 20

ఎచ్చటనేనిమిత్తమున నేపని యెవ్వనివంక నెప్పుడో
నచ్చటనానిమిత్తమున నాపని యాతని వంకనప్పుడో
నచ్చుగ మర్త్యకోటికి శుభా శుభ నిర్మిత కర్మజాలముల్
దెచ్చె విధాత కాలముగతిం గడియించుఁదలంక నేటికిన్

దూ. నా–సు. లా–పద్య 17.

తన పూర్వజన్మ కర్మము
లనుదినము శుభా శుభమ్మునందించు జగ
జ్జనులాది జీవులకు దై
వనియోగము వలనఁగడవ వచ్చునె తలఁపన్

భాను–ఆశ్వా 2–పద్య 15.

ఏ వాసరమున నెద్దెస
నేవయసున నెట్టికర్మ నేమఱఁడెవ్వాఁ
డావాసరమున నద్దెస
నావయసున నట్టికర్మ నతఁడు భుజించున్

బైచ–ఆశ్వా 2–పద్య 23.

యత్తచ్ఛబ్ద ప్రయోగమును దూబగుంట, బైచరాజు మూలాను సారముగ దెచ్చినారు. భానుకవి మూలమందలి భావమును మాత్రము గ్రహించి ప్రసన్నగంభీరముగ రచించినాడు. శబ్దప్రయోగమున కతడు

మొగ్గనసూపక సారభూతమైన యర్థము నతఁడతి సులభముగ నావిష్కరించినాడు.

10. రవి నిశాకరయోః గ్రహపీడనం
గజభుజంగ విహంగమ బంధనమ్
మతిమతాంచ నిరీక్ష్య దరిద్రతాం
విధిరహో బలవానితి మే మతిః

మి. సం-శ్లో 22.

గ్రహపీడ చంద్రసూర్యుల
కహిగజ విహగములకుగ్రమగు బంధనముల్
బహుమతికి దరిద్రత్వము
విహితంబుగఁ జేసినట్టి విధి నేమందున్

దూ. నా-సు. లా-పద్య 20.

సుజనులకు లేమి గ్రహపీడ సోమ సూర్యు
లకు భుజంగేంద్ర మాతంగ శకున సంచ
యమున నరయంగ బంధన మాచరించు
నలఘుతరమైన విధిశక్తిఁ దెలియ వశమె

భాను-ఆశ్వా-పద్య 16.

ఉరువిహగవ్రజంబునకు నోదముదంతికి ముందు చిల్వకుం
బరుష తమోగ్రహాగ్రహణ బాధసుధాంశున కంశుమాలికిం
బరమదరిద్రతాప్తి మతిమంతులకుంగలుగంగఁజేసెనె
వ్వరుసవతిందు నందు బలవంతుఁడు పోవిధినాకుఁజూడఁగన్

బై. వేం-ఆశ్వా 2-పద్య 30.

నారాయణకవి పద్యము యథామూలకమై ముచ్చట గొల్పుచున్నది. ఉగ్రమగునను విశేషణమమూలకమై మూలమునకు సొగసు చేకూర్చుచున్నది. భానుకవిపద్యమున అరయంగ నను నమూలకమైన పదము వెలితిదన మొసంగుచున్నది, మతిమతామ్మనిమూలముననుండ భానుకవి

సుజనులకని మాఱ్చుట సముచితముగా నున్నది. విధిః బలవాన్ అని మూలమునందుండ విధినేమందున్ అను నారాయణకవి యనువాదము తెలుఁగునుడికారముతో నున్నది. భానుకవి అలఘుతర మైన విధిశక్తి తెలియవశమె యనుటయు సహజసుందరముగ నున్నది. విహంగము భుజగాదులస్థితిని విశేషణములతో ప్రబంధోచితముగ పై చరణ వర్ణించినతీరు శ్లాఘ్యము. పద్యము స్వతంత్రరచనముగ భాసించు చున్నది. ఎవ్వరు నవతు అని పృచ్ఛించుట యమూలకము. ఇందునందు బలవంతుఁడు పో విధియను నిర్ణయము మూలమునకు వన్నె పెట్టుచున్నది.

11. వ్యోమైకాంత విహారిణోఽపి విహగాః సంప్రాప్నువంత్యాపదం
బధ్యంతే నిపుణైరగాధ సలిలాన్మీనాః సముద్రాదపి
దుర్నీతం కిమిహాస్తి కిం చ సుకృతం కః స్థానలాభేగుణః
కాలః సర్వజనాన్ప్రసారిత కరోగృహ్ణాతి దూరాదపి

మి. సం-శ్లో 23.

అరుదుగఁజేరరాని గహనాభ్రములన్ గుమ్మరునా ఖగాండజో
త్కరములు జిక్కుఁబెవ్వలలఁగానవు దుర్జయ సచ్చరిత్రవి
స్ఫురణముఁదెల్పఁ స్థానబలమున్ మఱినెయ్యది యాగదాక్రియా
పరుఁడగుచున్ గ్రహించు విధిప్రాణుల దవ్వులఁగేలుసాచుచున్

దూ. నా-ను. ౧౦-పద్య 21.

తారామార్గమునం జరించు ఖగసంతానమ్ము వారాశిలో
నారూఢస్థితినున్న మీనతతి పై వాధీనతన్ భూజనో
గ్రారంభంబునఁగాదె చిక్కుపడుఁ గాలాతిక్రమకీర్తి నె
వ్వారల్ నేర్తురుపాయ ధైర్యబలగర్వఖ్యాతిఁబొందినన్

భాను-ఆశ్వా 21-పద్య 17.

గగనమునం జరించు పతగంబులగాధసముద్ర వారిలోఁ
దగవిహరించు మీలు వలతండములంబడి చచ్చు నవిఁథన్

దెగిచన స్థానశక్తి గలదే వలదేర్పడఁ జింతదీనికై
తెగునెడ నెంతదవ్వయినఁ దెచ్చుగదా విధి దేహధారులన్
బై. వేం—ఆశ్వా 21-పద్య 30.

అనువాదపద్యములు మూడు నొకదానితో నొకటి పందెము వేసికొని నట్లుసాగినవి. విహగమీనములు ప్రత్యేకముగ సవిశేషణముగ చేర్కొన బడినవి. భానుకవి, బైచరాజు యథామూలముగ ననువదించినారు. నారాయణకవి మాత్రమా రెండింటిని గలిపి ఖగాండజోత్కరములనియు వానికి నరుదుగ జేరరాని గహనాబ్ధుల గుర్మ్మరు నను విశేషణమును రచించినాడు. ప్రసాదితకరో గృహ్ణాతి దూరాదపి అను మూలమును యథాతథముగ 'గ్రహించు విధి పాణుల దవ్వులఁగేలు సాచుచున్' అని నారాయణకవి యొక్కడే రచించినాడు, తక్కినవారు భావాను వాద మొనర్చినారు.

12. వైరిణా నహి సందధ్యాత్ సుశ్లిష్టేనాపి సంధినా
సుతప్తమపి పానీయం శమయత్యేవ పావకమ్
మి. సం—శ్లో 32.

బుద్ధిమంతుఁడైన పురుషుండు తన శత్రు
హితుఁడటంచుఁ జేర నిచ్చి చెడును
దప్త జలముచేతఁ దడిపిన యగ్నిదా
హీనమగుచు శమితమైన కరణి
దూ. నా- సు. లా—పద్య 45

రసము (ల) గ్ని వలనఁ గ్రాఁగి తదుష్ణంబు
దాల్చియైనఁ గలసి దాని నణఁచు
నల్పుఁడధికునొద్ద ననఘు భావముదాల్చి
యైనఁగూడి చెఱుచు నా క్షణంబ
భాను- ఆశ్వా 2—పద్య 28.

తనగుణముఁ బూనియున్నాఁ
డని పగతుని నమ్మఁబోల దనిశము మదిలో

ననలశిఖా తప్తోదక
మనలునిప్పైఁ జింది చల్ల నార్చునా లేదో
వై వేం— ఆశ్వా 2-పద్య 55.

అనువాదములు మూడింటను వై శద్యము ప్రస్ఫుటము.

13 మృద్ఘట ఇవ సుఖభేద్యో
దుస్సంధానశ్చ దుర్జనో భవతి
సుజనస్తు కనకఘట ఇవ
దుర్భేదః సుకర సంధిశ్చ మిసం—శ్లో 38

మంటికడవఁబోలె మహిదుర్జనస్నేహ
మధిక శీఘ్రముననె హత్తు విరియుఁ
గనక కలశభాతి గల సజ్జనస్నేహ
మెదవుఁ బగులఁబడక పదల మగును.
దూ. నా—సు. లా—పద్య 57.

అవమతి భావము మృత్కల
శవిధం జూపట్టుసుజను భావం బయినన్
ప్రవిమల హేమఘటముక్రియ
వివరింపుము వారివలన విశ్వయలక్ష్మా
భాను—ఆశ్వా 2-పద్య 32.

ఖలుఁడు సుఖభేద్యుఁడతి మృ
త్కలశగతిన్సజ్జనుండు గాఢాగ్ని శిఖా
కులతప్త కనకఘటముం
బలె దుర్భేద్యుండు చక్కఁబడఁడు మృదూక్తిన్
వై. వేం—ఆశ్వా 2-పద్య 64

దూబగుంబ నారాయణకవి చిన్నయాటవెలఁది పద్యమున మూలమును యథాతథముగా నాంధ్రీకరించినాడు. భానుకవి శ్లోకభావమును దెనిగించి నాడు. సుఖభేద్యః దుస్సంధానః సుకరసంధిః అను విశేషణములను విడిచి

నెట్టినాడు. భేదత్వమును మాత్రమే సైచరాజు గ్రహించి సంధాన
త్వమును విడిచినాడు.

14. ఉద్యతేష్వపి శస్త్రేషు బంధువర్గవధేష్వపి
పరుషాణ్యపి జల్పంతో వధ్యా దూతా న భూభుజా

కాకో—శ్లో 88.

పెఱికిన యాయుధంబుగొని భీతిలగాఁ బొడువంగఁ జూచినన్
వెఱువక సాహసస్వామిహిత నిశ్చితకార్యము పల్కుచొప్పున
న్తెఱఁగున వాఁడు రాజునకుఁ డెల్లమి పుత్రసమానుఁడట్లకా
నెఱుఁగుము నన్నుఁ జంపుమనకు నిష్ఠురమూఢభవన్మానంబునన్

మూనా—సం. వి—పద్య 105

తలపోయ నిష్ఠురోక్తులు
పలికినఁ దిట్టినను భూమి పాలురకును వ
ధ్యులు గారు దూతలెందును
జలభిన్నిభ భోగ సూత్న భరతాచార్యా!

భాను—ఆశ్వా 3 పద్య 49.

పేఁటకులుపైఁ బడునపుడున్
తలు సత్యంబు పల్కుదురు తద్వ్యాపా
రితమునకుఁ గలఁగరు ధా
త్రీతలవల్లభులు నగరు తెగ రెప్పటికిన్

సై. వేం—ఆశ్వా 3 పద్య 90.

నారాయణకవి వృత్తమును స్వీకరించుటచే భీతిలగా, వెఱువక యను విశేషణముల నధికముగా ప్రయోగించినాడు. అస్లే దూతలెట్లు పలుక వలెనో యతడు నిరూపించినాడు. దూత రాజునకు బుత్రసమాను డనుటయు నాతని కల్పనము. భానుకవి కందపద్యమున దొలి మూడు పాదములలోనే మూలభావమును సుకుమారముగ దెనిగించినాడు. దూతలు వధ్యులుగారని మూలమున నుండుగా సైచరాజు వేంకట

నాథుఁడు దానిని వివరించుచు ధాత్రీవల్లభులు కలగరు, నగరు, తెగరు
నని వివరణమొనరించినాడు.

15. పోతో దుస్తర వారిరాశితరణే దీపోఽంధకారాగమే
నిర్వాతే వ్యజనం మదాంధకరిణాం దర్పోపశాంత్యై సృణిః
ఇత్థం తద్భువి నాస్తి యస్య విధినా నోపాయచింతా కృతా
మన్యే దుర్జన చిత్తవృత్తిహరణే ధాతాఽపి భగ్నోద్యమః
హితోపదేశము-సు. శ్లో 176.

శరనిధి దాఁట నావయును సంతమసంబడగింప దీపమున్
వరకరి శిక్షకంకుశము వాయువు గూర్పఁగఁదాళ వృంతమున్
వెరవునఁజేసె బ్రహ్మ పదివేల విధంబుల మూర్ఖ చిత్త వి
స్ఫురణ మడంపలేక తలపోయుచు నిప్పుడు నున్నవాఁడహో!
సూ. నా-మి. భే పద్య 368

బహుళాంధకారమ్ము వాపదీపము జీవ
నంబుల దాఁటంగనావ భద్రి
దంతావళముల మదం బణంపఁగ నంకు
శము పన్నగముల రోషంబు చెఱుప
గారుడ మంత్రింబు ఘనతరాఘంబుల
హరియింప ధర్మువు నతిదరిద్రి
బాధఁదీర్పంగ సంపద శోకముల నోటు
వఱుప నానాకళా ప్రౌఢిమయును
బ్రేమమున నబ్జభవుఁడు కల్పించెఁగాని
చేయనోపంగ లేఁడయ్యెఁ జెనటి హృదయ
దంభ మొక్కింత మాన్పంగ ధాత్రిలోన
లాలితోదర! విశ్వయ లక్ష్మధీర!

భాను-ఆశ్వా 1-పద్య 211.

తిమిర నివారణ క్రియకు దీపము వారిధి నిస్తరింపఁ బో
తము చలిఁబాప వహ్ని రవితాప భరంబడఁగింప నాతప

త్రిము కలుషమ్ములం జెఱుప ధర్మము వాల్పడియుండుగాని య
క్కమలజుఁడున్ సుబోధ్యుఁడుగాఁడు దురాత్ముని జక్కఁ జేయఁగన్

బై చ-ఆశ్వా 1-పద్య 458.

హితోపదేశ శ్లోకమునకు బై పద్యమనువాదములు. నారాయణ కవి యథా మూలముగ ననువదించినాడు. మూలమందు ఛత్రము, దీపము, వ్యజనము, అంకుశమునను నాల్గు విషయములు మాత్రమే చెప్పబడినవి. ఘనకవి పెక్కువిషయముల నధికముగా వివరించినాడు. గారుడ మంత్రము, ధర్మవు సంపద కళాప్రౌఢిమ యనువిషయము లాతని స్వీయములు. బైచరాజు వేంకటనాథుఁడు గూడ వహ్ని, ఆతపత్రము, ధర్మము ననుమూఁడు విషయముల నధికముగ జేర్చినాడు. సందర్భశుద్ధి నొసంగుచున్నవి. హితోపదేశ శ్లోకముల గూడ యథోచితముగ జంపూకర్త లనువదించుట గణనీయము.

ఇట్లు పంచతంత్రమందలి కథను బంచతంత్రి హితోపదేశములందలి పెక్కు నీతి శ్లోకములను జంపూకర్తలు ముప్వురును గావ్య పద్ధతిని హృద్యముగ ననువదించినారు.

# 5. పంచతంత్ర చంపువుల కావ్యత్వ సమీక్ష

సంస్కృత పంచతంత్రము నీత్యుపదేశ ప్రధానముగా రచింపబడినది. తదనుకూలముగా గథ గ్రహింపబడినది. కథా కథనమున విష్ణుశర్మ కావ్యత్వము నక్కడక్కడ బోషించినను నీతిబోధ గావించుటయే యాతని లక్ష్యము. చంపూనువాదకులు కావ్యముగా నాంధ్రీకరించుటచే గావ్యత్వమునకే యగ్రస్థానమొసంగబడినది. సముచితముగనే నీతిబోధ నిర్వహింపబడినది. కావున జంపూరచనలను సమీక్షింప

నపుడాకవులు పాత్రచిత్రణ రసపోషణాదికమున ప్రదర్శించిన కౌశల మును సమాలోచింప వలయును.

## —: పాత్రచిత్రణము :—

రసము ప్రధానపదార్థము. అది యాధారము నపేక్షించును. దానికి పాత్రయను వ్యవహారము లోకసిద్ధము. కావ్యమున శృంగారాది రసము లుండును. వానికాలంబనములైనవి పాత్రలు. కథారచనమున పాత్రలను దీర్చి దిద్దుటలో మహాకవి తన యసమానప్రజ్ఞా వైభవమును ప్రదర్శించును. ఏ పాత్ర లేకపోయినచో గథాగమనము కుంటువడునో యేపాత్ర సహృదయ హృదయరంగమున జిరకాలము స్థిరనివాస మేర్పఱుచుకొని నిలుచునో యేపాత్ర దైనందిన వ్యవహారమున గూడ లోకులచే సందర్భోచితముగా సంస్మరింపబడుచుండునో యాపాత్ర సజీవమైన దనవచ్చును. సజీవపాత్ర నిర్మాణము మహాకవి ప్రతిభా నిరూపణకు నికషోపల ప్రాయము. బహువిధములైన పాత్రలతో రామాయణ భారతములను సంతరించిన వాల్మీకి, వ్యాసుల పాత్ర నిర్మాణచాతుర్యము జగద్విదితము. "తన కావించిన సృష్టి తక్కొరుల చేతంగాదునా" నను ప్రశంసనొందిన తిక్కన పాత్రపోషణ ప్రావీణ్యము గూడ సాహిత్యలోక ప్రసిద్ధమే.

పంచతంత్ర కథ ప్రాక్పశ్చిమ దేశములలో నల్పకాలముననే యనల్పముగా ప్రచార ప్రసిద్ధులు పొందుటకు ముఖ్యకారణము విష్ణు శర్మ పశుపక్షులచే గథను నిర్వహించుట. ఆ పశుపక్షులు కుక్షింభర మైన జీవితము గడపునవి గావు. మానవుని నయశాస్త్రసంపన్నుని గావింప సమర్థకములు. విష్ణుశర్మ వానిమన స్తత్త్వమాధారముగా రాగద్వేషాదికములను బోషించుచు లోకమున కనన్యసదృశమగు నీత్యుపదేశ మొనర్చి యజరామరమైన కీర్తిగాంచినాడు.

ఆంధ్ర పంచతంత్ర చంపూనువాదములలో ప్రతికథయు స్వయం సంపూర్ణమైన కథాఖండముగా సంతరింపబడినది. విష్ణుశర్మ ప్రతిపాదిత

పాత్రలనే చంపూకర్తలు స్వీకరించినను మూలమునకు వన్నె గలుగు నట్లు వారు పాత్రచిత్రణ మొనరించినారు. పశుపక్షుల ప్రవృత్తులు, చిత్తవృత్తులు మూలమునందలివే యైనను జంపూకర్తల మూలక భావ వైవిధ్య ప్రదర్శనము గావించి తమ శక్తి సామర్థ్యములను నిరూపించు కొనిన పద్ధతి పరమశ్లాఘ్య రమణీయము. పశుపక్షులందు మానవులకు గలుగు నట్టి సుఖదుఃఖ రాగద్వేషాద్యవస్థలు గల్పించి పాత్రచిత్రణ మున జంపూకర్తలు చూపిన స్వాతంత్ర్యము పరిగణనీయము. మూల మున ననుచితములని వారికి దోచిన విషయములను సవరించుటయు నత్యంత సముచితముగా నున్నది. అట్లే మానవపాత్ర చిత్రణమునను వారి ప్రత్యేకత ప్రస్ఫుట మగుచున్నది.

మూలగ్రంథమందలి పాత్రల స్వరూప స్వభావములను యథా తథముగా ననువదించు నపుడం దెట్టి చమత్కార పోషణ మున్నను అది యెల్ల మూల గ్రంథ రచయితకే చెందును. అందలి అమూలక భావ ప్రదర్శనము మాత్రము అనువాదకుని ప్రత్యేకతగా బరిగణింపబడును. కావున నాంధ్రపంచతంత్ర చంపూకృతి కర్తలు అమూలకమగు శిల్ప నైపుణ్యముతో బాత్రచిత్రణము నే యే సన్నివేశములలో నే యే రీతుల గావించినారో సోపపత్తికముగ బరిశీలింతము.

ప్రాచీనకాలము నుండి మానవులకువలె బశుపక్షులకును రాజ్యాధి పత్యములు లోక ప్రసిద్ధములు. అట్టి యధిపతుల పాత్రలను మహారాజో చితముగ జిత్రించి కథలో మహానాయకోచితముగ ప్రవేశపెట్టుట చంపూకర్తల పాత్రచిత్రణలో గణనీయమైన విశేషము. సమస్త మృగములకు సింహమధిపతి. దానికి మృగశాస నాధికారమాజన్మ సిద్ధము. విష్ణుశర్మ మిత్రభేద తంత్రమున బింగళకుడను సింహమును 'పింగళకో నామ సింహః సర్వమృగ పరివృతః' అని పరిచయ మొనరించి నాడు. పంచతంత్ర మందలి ప్రథమ తంత్రమున కధిపతియైన పింగళక పాత్రను విష్ణుశర్మ యొక సామాన్య పాత్రగా బరిచయ మొనర్పగా

ననువాదకులు మృగాధిపతియైన పింగళకు నొక సామ్రాజ్యాధినేతగ జిత్రించుచు గథలో మహానాయకునిగ ప్రవేశపెట్టుట కావ్యోచితము.

దూబగుంట నారాయణకవి పింగళకుడు స్వభుజ బలపరాక్రమను లచే మృగములను శాసించుచు రాజ్యము ననుభవించు చున్నాడనియు, నభిషేక క్రియాదులు లేకున్నను స్వార్జితముగ రాజ్యమును బాలించు చున్నాడనియు

ఆ వనంబున బింగళ కాఖ్యుఁడయిన
సింహమధిక జంతువుల శాసింప నధికుఁ
డగుచు నిజభుజ విక్రమణాఢ్యమహిమ
ననుభవించుచు రాజ్యంబు నట్లుకాఁగ

అభిషేకాది క్రియలను
విభవము లేకయును ఘోర విపినంబులలో
శుభగోన్నత విక్రమమునఁ
బ్రభులై సింహము మృగాధి పతియై వెలసెన్.

మి. భే–పద్య 79, 80.

అనివర్ణించినాడు. భానుకవిగూడ మదపుటేనుగుల కుంభస్థలమును జీల్చి యా మాంసమును భక్షించి క్రొవ్వి గర్వరేఖలతో మృగకులమును బింగళకుడు పరిపాలించుచున్నాడని

వారణరాజ కుంభమును వ్రక్కలుజేసి తదీయరక్తముల్
సారెకుఁగ్రోలి క్రోలి సరసంబగు మాంసము మెక్కి తుందిలా
కారబలంబునన్ మృగనికాయము దిక్కుల మీఱి గర్వవి
ద్యారుచిఁబొల్చుఁ బింగళకుఁడ న్మృగవల్లభుఁడ వ్వనంబునన్.

ఆశ్వా 1–పద్య 68.

అని రచించినాడు. సంజీవకుని సమీపించినపుడును దమనకుఁడు తన ప్రభువగు పింగళకుని శౌర్య గాంభీర్యసంపదను

మదదంతావళ (కుంభసంభృతిలస) న్మాంసాన్నముల్ నిచ్చఁబెం
పుదలిర్పన్ దిని మేనువొంగ సతతంబున్ శౌర్యగాంభీర్య సం
పదఁబెంపొందిన సింహవల్లభునకున్ బంటన్ వృషాధీశ! కూ
ర్చెద మన్నాథుని నీదు స్నేహమునకున్ సిద్ధంబు వేడందగున్.

ఆశ్వా-1పద్య 114

అని వివరించినట్లు భానుకవి రచించినాడు. వైచరాజు వేంకటనాథుడు గూడ నేనుగుల మదమణచి వంచక ధూర్తకృత్యముల నశింపజేసి శతృవులైన ఖడ్గమృగముల నదుపులోనికి దెచ్చుకొని పింగళకుడు రాజ్యాధి పత్యము నిర్వహించుచున్న విధమును

కరటుల మేల్మదంబణఁచి కర్కశ వంచక ధూర్త కృత్యము
ల్నెఱచి పరోగ్రఖడ్గ పటలిన్నడవాఁడికిఁబాపి క్రొవ్వు నం
గుఱువులు వారు కంటకులఁ గొండగపుల్నరఁ దోలి పౌరుషం
బఱిముఱిఁ గ్రాలఁబింగళకుఁడన్మృగరాజు చరించు నచ్చటన్

ఆశ్వా 1—పద్య 101.

అని వివరించినాడు. ఇందు బింగళకునిలో సామ్రాజ్యాధిపతి ధర్మములు మనోహరముగా నిరూపింపబడినవి. పింగళకుని సామ్రాజ్యప్రాప్తికాతని బలపరాక్రమములే హేతువులనియు రాజ్యాధిపత్య మాతనికి స్వయం సమార్జితమనియు వైచరాజిట్లు తెలిపినాడు.

హరికి మృగరాజ్యమెవ్వరు
కరుణించిరి తనకుఁ దానకాదా వరకుం
జర భంజనునకుఁ జలనిధి
కురువిక్రమ వైభవునకు నొక రీవలెనే

ఆశ్వా 1—పద్య 102.

ఇట్లు చంపూకర్తలు మువ్వురును బింగళక పాత్రనుదాత్తముగా జిత్రించి యొక మహానాయక పాత్రవలె ప్రవేశపెట్టుట కావ్యత్వ పరిపోషణమును నిరూపించు చున్నది.

మిత్రభేద తంత్రమున సంజీవకుడు పింగళకునితో బాటు సమాన ప్రతిపత్తిని బొందినవాడు. ప్రతినాయక సదృశుడు. అతని ప్రవేశ మును గూడ భానుకవి కావ్యోచితముగ

కనియెన్ భూధర సన్నిభాంగు నతి తీక్ష్ణ...... ...
ఎజవాల సంచలన భావాతూల నిర్ధారితా
ప్రధనికాయున్ మృగయూధ కర్ణకుహరోగ్ర ధ్వాను నద్యుత్కకు
ద్ఘన భూషాంచిత గర్వనిర్వహాణ విద్యాంకున్ గకుద్మత్ప్రభున్.
ఆశ్వా-1పద్య 111.

అని నిర్వహించినాడు. అందు సంజీవకుడు పర్వతోపముడు, తనవాల విక్షేపమున బుట్టిన వాయువు ఆకాశమును జీల్చివేయుననియు దనగర్జ సకల మృగశ్రీవః కుహారభయంకర మగుననియు వర్ణింపఁబడెను. ఇది యమూలకము

మూలమున దమనకుడు పింగళకునితో సంజీవకుని గూర్చి 'మహేశ్వరస్య వాహన భూతో వృషభః' అని పల్కినట్లు గలదు. భాను కవి సంజీవకుని రూపవైభవమును ప్రబంధోచితముగ నిట్లు వర్ణించినాడు.

సమవర్తి వక్త్రదంష్ట్రా భీషణములగు
దీర్ఘ విషాణముల్ తేజరిల్ల
ధరణిఁజరించు గోత్రగ్రావమోయన
నరుదైన సింహ సంహనన మొప్పఁ
బాయని మేచకాభ్రము భాతి నెంతయు
రమణీయమగు మూపురమ్ము దనరఁ
బ్రళయావసర ( రుద్ర ) పటహనినాదమ్ము
లంకురించిన మాడ్కి అంకెలలమరఁ
ప్రకట గాంభీర్య ధైర్య దర్ప ప్రతాప
గుణములఁదనర్చు నొక వృషగణవరేణ్యుఁ
గంటి నాతఁడు నన్నును గారవించె
( నధిపు మన్ననగల ) బంటనగుటఁజేసి ఆశ్వా 1-పద్య 119

ఇందు సంజీవకుని భయముగొల్పు కొమ్ములు, నడుము, మూపురము జంకెలు వర్ణింపబడినవి. మృగాధిపతి నెదిరించుటకు గావలసిన శక్తి సామర్థ్యములు సంజీవకపాత్రలో భానుకవి మనోహరముగా నిక్షేపించి నాడు. వైచరాజుగూడ గాలు విరిగిన సంజీవకము వజ్రాయుధపు దెబ్బ తినిన శైలశృంగము వలె నున్నదని పేర్కొని దానిరూప సౌభాగ్యము నిట్లు వర్ణించినాడు.

చేవఁజిగుర్చు శృంగములు శృంగములం బ్రకటింప భూరి శో
భావహమైనె పాదములు పాదము లన్దలఁపింప జంగమ
గ్రావముభంగి భానుభవ కచ్చమున న్విహరించు వాని సం
జీవకుఁగాంచి మొక్కి-నిలిచెన్మృగ ధూర్తకుమారుఁడయ్యెడన్
ఆశ్వా 1-పద్య 195

ఇందు గొమ్ములు, పాదములు నొకదానికొకటి మించి మనోహరముగా నున్నవనియు సంజీవకుడు నడచు చున్న కొండవలె గదలాడుచున్నా డనియు వైచరాజు గావించిన కల్పనము రమణీయము. పింగళకునికి దమనకుఁడు సంజీవకుని బరిచయమొనర్చునప్పుడు అతడు ప్రళయకాల ఘన గర్జితుడు, కులపర్వత సముడు, ఆకాశమును రాయుకొమ్ములు గలవాడని పల్కి-నట్లు వైచరా జిట్లు రచించినాడు.

ఘన ఘనఁగానకుఁ దేవర
పనుపునఁ జని యచటఁగంటిఁ బ్రళయాంత రట
ద్ఘననినదు గోత్రగిరి నిభ
తను నభ్రంకష విషాణ ధరుఁగ బైదురన్.

ఆశ్వా 1-పద్య 202

అమూలకమైన సంజీవక రూపకల్పనము తెలుగుకవుల పాత్రచిత్రణ ప్రత్యేకతా నిరూపకము.

మూలమున సంజీవకుడుఁ గర్జించు చుండెనని 'గర్జన్ ఆస్తే' అని మాత్రమే యుండగా దెనుగుకవులా గర్జను మధురముగ వర్ణించుట

షశేషము. దూబగుంట నారాయణ కవి యీ వృషభేంద్రు గర్జనమును 'భూసంత్రాసకరాంత్యకాల జలదప్రోద్భూత గర్జోపమ వ్యాసంగంబున ఱంకెవైచె' నని రచించినాడు. భానుకవియు 'ప్రళయకాల బలాహక గర్జాసన్నిభంబగు సంజీవకు భయానక ధ్వానంబ'ని పేర్కొనినాడు. వైచరాజు వేంకటనాథుడును 'అననుభూత పూర్వంబై యకాలప్రళయ జలధర గర్జితంబునుంబోని యఖండ సంజీవక గర్జనంబు పరిసర ధరాధర దరి ధ్వానములం బ్రతిధ్వానంబులం బుట్టించిన' అని వర్ణించినాడు. సర్వ మృగరాజ్య చక్రమున కధిపతియగు పింగళకునకు వెఱపు పుట్టించిన సంజీవకుని ఱంకె నత్యంత సముచితముగ దెనుగుకవులభివర్ణించినారు. పింగళకుని నెదిరింపగల సంజీవకుడు గావించిన గర్జనము నట్లు వర్ణించుట తెనుగుకవుల యౌచితీసుందరమైన పాత్రచిత్రణ చాతుర్యము నుగ్గడించుచున్నది.

మిత్రలాభమున నాయకుడనదగు లఘుపతనకునిగూర్చి మూలమున 'తత్ర చ లఘుపతనకో నామ వాయసః ప్రతివసతిస్మ' యని చెప్పబడెను. ఒక కథలోని సామాన్య పాత్రవలె లఘుపతనకుం డందు. బేర్కొనబడినాడు. వైచరాజు ప్రౌఢముగ నా పాత్రప్రవేశమును

వసుధ నెవ్వని సదన్వయకర్త జేజేల
 యేనికిఁ గులముద్ధరించు కొడుకు
పితృకార్యములు సమర్పింతు రెవ్వానికి
 నాదిత్యరుద్ర వస్వగ్రభుక్తిఁ
బొదలు నెవ్వని గృహంబున మనోహర భార
 తీ భారవహాముఖ ద్విజకులంబు
పథిక సంతతి కేరుపఱుచు నెవ్వని కంఠ
 మిశ్రతారావంబు మేలుగీల్లు

ప్రజ్ఞ పెంపున నెవ్వాని బలమునకును
బ్రహ్మకొడుకైన లెక్కఁజెప్పంగఁజాలఁ

డతఁడు నగరోపకంఠ చైత్రాగ్రవర్తి
పక్షిమాత్రుండె వాయస పరివృఢుండు.

ఆశ్వా2-పద్య 6

అని నిర్వహించినాడు. ఇందు లఘుపతనకుడొక వాయసమాత్రుడుగా గాక యొక మహానాయకుడుగా నభివర్ణింపబడినాడు. అతని యన్వయ కర్తృత్వప్రాశస్త్యము, పితృకార్యాధిక్యము, గృహవైభవము, భవిష్యచ్ఛుభాశుభ సూచనము మనోజ్ఞముగ వివరింపబడినవి.

సంస్కృత పంచతంత్రమున 'చిత్రాంగోనామ హరిణోలుబ్ధ త్రాసితః తస్మిన్నేవ సరసి ప్రవిష్టః' అని గలదు. ఇందు చిత్రాంగు డను మృగస్వరూపము వివరింపబడలేదు. వైచరాజు

చకిత స్వాంతముతో మహామహిరజశ్ఛన్న ప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజ నిర్వేదైక నిశ్వాస వీ
చికతో బమ్మెరపోకతో నటకుఁ గశ్చిల్లుబ్ధక క్షోభ మొం
డొక కాంతార మృగంబు భిన్నఖురటంకోదగ్రి మేతెంచినన్.

ఆశ్వా 2-పద్య 176

అని కిరాతునిచే దఱుమబడుచు భీతమనస్కుమగుచు గమనవేగముచే నిట్టూర్పులు పుచ్చుచున్న చిత్రాంగుని స్వరూపమును హృదయంగమముగ వర్ణించినాడు. మిత్రలాభ ఘట్టమున ప్రముఖపాత్రవహించు చిత్రాంగు నతడు పరిచయ మొనర్చిన విధ మనన్యసామాన్యము.

విష్ణుశర్మ కాకోలూకీయ తంత్రమున నాయకుడగు మేఘ వర్ణుఁ డను వాయస ప్రభువు నుద్దేశించి "అనేక కాకపరివారః విహిత దుర్గ వచనః' అని పరిచయమొనర్చినాడు. నారాయణకవి మేఘవర్ణుని వైభవమును

ఆ మహనీయ భూరుహము నందనిశంబుననేక బాంధవ
స్తోమము దన్నుఁగౌతుకముతోఁ గొలువంగను మేఘవర్ణుఁడన్

నామము దాల్చి ప్రాభవమునం బెనుపొంది వసించు వాయస
స్వామి విపక్షపక్షికుల సంహారణ ప్రవణాంతరంగుడై.

సం. వి—పద్య—7

అని ప్రబంధోచితముగ వర్ణించినాడు. విపక్షపక్షికుల సంహారణ ప్రవణాంతరంగుడైయనుట యాతని యాధిక్యమును ఆధిపత్యమును దెలుపు చున్నది.

లబ్ధ ప్రణాశ తంత్రమున 'సింహము—అకర్ణహృదయ గార్దభము' అను కథలో మృగపతియగు సింహము గార్దభమును జీల్చునప్పటి రూపము మూలమున వర్ణింపబడలేదు. ఆ మృగేంద్ర రౌద్రాకృతిని దూబగుంట నారాయణ కవి మనోహరముగ

శితినఖంబులు మెఱయంగ జేగురించు
ఘనతారానన మతిభయంకరముగాగ
నుఱక నుంకించునట్లున్న యుగ్రహరికి

పద్య—92.

అని వర్ణించినాడు. సింహము యొక్క వాడిగోర్లు, జేగురించి భయంకరముగానున్న ముఖము నిందుజక్కగా వర్ణింపబడినవి. ఈపాత్ర రూపవర్ణనమమూలకము. ఉగ్రహరికి ననుటలో నుగ్రనరసింహావతార స్ఫూర్తి గల్గుచున్నది.

2. పంచతంత్రమున గథలలో రేఖామాత్రముగనున్న పాత్రల యాకృతి విశేషములకు మనోహర భావసంపదను మేళవించి ప్రబంధోచితముగ వర్ణించుట తెనుగుకవుల ప్రత్యేకత. ఏదియో చమత్కారమును గోచరింపజేసి పాత్రలను సాక్షాత్కరింపజేయుట చంపూకర్తల రచనావిశిష్టత.

టిట్టిభ దంపతులు—సముద్రుడు అనుకథలో సముద్రుడు తనకు గావించిన యపరాధమును విన్నవించుకొనుటకు టిట్టిభము సుపర్ణుని

జేరినట్లు మూలమునగలదు. అందు తార్క్ష్య నిరూపసౌభాగ్యము వర్ణింప బడలేదు. సముద్రుని శిక్షింపదగినవాడు, తమ ఖగకులమునకు అధిపతియైనవాడు, అనంతర కథాభాగమునకు నాయకుడనదగినవాడు నగు ఆసుపర్ణుని బైచరాజు వేంకటనాథుడిట్లు వర్ణించినాడు.

తన తల్లికెగ్గొనర్చిన పాపరామాత
కడుపునఁ గడిఁదిచిచ్చిడిన వాని
గజకచ్ఛపాహృతి గ్రాసచర్వణ తృప్తి
వెలుగొందు జాఠరానలము వాని
... ... ... ఆశ్వా-1 పద్య 628.

ఇందు దనసవతితల్లికి బుత్రవియోగ బాధగల్గించుట గజకచ్ఛపనిషాద భక్షణము శతధారా పరాభవమునను వైనతేయుని మహత్తర జీవిత విశేషము లుగ్గడింప బడినవి. అట్లే యీకథలో విష్ణువు వైనతేయుని సకాశమున కేగెనని మాత్రమే గలదు. ఆ పరమాత్మ రూప వైభవము వర్ణింపబడలేదు. దూబగుంట నారాయణ కవిమాత్రము జగన్మోహన కర సుందర విష్ణురూపమును

నీలాంబుదచ్ఛాయ నెఱసిన మేనితో
రమణీయ పీతాంబరంబుతోడ
శంఖచక్రాధి కోజ్జ్వల హస్తములతోడ
ధవళాబ్జతులిత నేత్రములతోడ
... ... ... మి. భే—పద్య 477.

అని వర్ణించినాడు. నీలమేఘసమ శరీరచ్ఛాయ, కట్టిన పీతాంబరము, శంఖచక్రాద్య లంకృత హస్తములుఁ,నవమాలికాశోభిత వక్షః స్థలము మున్నగు విషయములు మనోహరముగ నిందభివర్ణింపబడినవి. నారాయణకవి విష్ణురూపమును సాక్షాత్కరింప జేసినాడు.

సుహృల్లాభ తంత్రా రంభమున జిత్రగ్రీవాది కపోత పోతముల బంధింప వలపన్నిన కిరాతునిగూర్చి 'జాలహస్తోఽతికృష్ణతనుః స్ఫుటిత

చరణ ఊర్ధ్వకేశో యమకింకరో నరః' అని గలదు. ఆ బోయని రూపమును వైచరాజు

వెడ వెడఁ జంకఁ జక్కమున వేలెడు చల్దియు సందిలోహాపుం
గడియము కూరదృష్టిగల కన్నులు నల్లనిమేను మూఁపునం
బడిశము జుంజుఱుందల తపారము జేగురుబొట్టు మేఖలం
గొడవలి గల్గివచ్చె నొక క్రూర కిరాతుఁడ మంధర త్వరన్.

అశ్వా2-పద్య8

అని కన్నుల కింపుగొలుప వర్ణించినాడు. చంకయందు చల్దియన్నము గల చిక్కము, సందిట నినుపకడియము మున్నగువానితో గిరాతుని రూపము కావ్యోతముగ నభివర్ణింపబడినది.

మిత్రభేద తంత్రమున మూడుచేపల కథలో జేపలబట్ట వచ్చిన జాలరుల రూపమును వైచరాజు

కాఱు మొసళ్ల వాకట్లు మఁదులు చర
ణాంగు ళంబులఁ దాఁ కుటుంగరములు
కడలేని నడగట్టి పడిన పిక్కలు చుట్టి
చెక్కిన మొలఁ ద్రాళ్ళు చిక్కములును
... ... ... ఆశ్వా1-పద్య 614

అని వర్ణించుట యమూాలకము. కాకోలూకీయమున వృద్ధవణిక్కు-చోరుడు ననుకథలో గూడ జోరుని రూపమును

భవనదీపాహిత భ్రమర పేటిక వాలు
కాభస్త్రితల ముళ్ళు గద్దగోళ్ళు
ములు దోరణము బట్ట మొలఁ ద్రాటి కుఱువాఁడి
కైదువు దెసకట్టు కావు బొట్టు
... ... ... ఆశ్వా-3 పద్య 199

అని వైచరాజు గావించిన వర్ణన మమూలకము. మూలమున 'చోరః ప్రవిష్టః' అని మాత్రమే గలదు. కథాగమనమున ప్రధానపాత్ర వహిం

చిన చోరుని యాకార వైభవమును వర్ణించుటలో కావ్యత్వము పోషింప బడినది.

సుహృల్లాభ తంత్రారంభమున 'సక్క—పృక్షిందుడు సతిసంచ యేచ్చ చేజచ్చుట' అనుకథలో 'మహా నంజనపర్వత శిఖరాకారః'అని వరాహ వర్ణనము గలదు. వైచరాజు వరాహరూప విశేషములను

కర్మిమ్మి చతుష్కురిం జమురు కాలువలై ప్రవహింప రోమపుం
గుమ్మెలఁ బార్శ్వ భాజములు గూకలు వత్తులుగా ముఖంబునం
దుమ్ములు రేఁగ మైమఱచి దున్నుచు ముస్తెలఁ దెల్చి కుంజముల్
గొమ్ములఁ జిమ్ముదాని నొక ఘోరవరాహముఁ గాంచియాత్మలోన్

ఆశ్వా 2–పద్య 105.

అని వర్ణించినాడు. లేశమాత్రముగ నున్న వర్ణనమును సర్వాంగ సౌష్ఠవముగ దీర్చుట వైచరాజు పాత్రపోషణ ప్రత్యేకత.

3. పంచతంత్రాంధ్రీకరణములలో స్త్రీ పాత్రలకు విశిష్టస్థాన మొసంగబడినది. మూలమున గులటలుగా జిత్రింపబడిన యా పాత్రల రూపరేఖా విలాసములను జంపూకర్తలు అమూలకములగు కల్పనలతో నతిమనోహరముగ నభివర్ణించినారు. పాత్రపరిచయము వలననే భావి కథలో నాపాత్ర ప్రవర్తనము గ్రహింప వీలుగానుండు నట్లు పాత్ర చిత్రిణ మొనరించిన చంపూకర్తల ప్రతిభ ప్రశస్యము.

మిత్రభేద తంత్రమున జంపూకర్తలు రచించిన గోపకాంత జారద్వయమను కథకు మూలము హితోపదేశము. అందు గోపకాంత నుద్దేశించి 'కస్యచిత్ గోప వధూః బంధకీ' అని మాత్రమే గలదు. దూబగుంట నారాయణకవి యామె సౌందర్యమును

కరికుంభ యుగమతి కాఠిన్యమగుఁ గాని
యీకాంత చనుదోయికింత వెలితి
దళితారవిందంబు తెలివిమేలగుఁ గాని
యీయింతి మోముతోనీడు గాదు

... ... ... మి. భే–పద్య 455.

అను పద్యమున వర్ణించినాఁడు. ఆమె స్తనద్వయము, ముఖము, తను కాంతి, పదద్వయము నెంతమనోహరముగా నున్నవో వక్రోక్తి మార్గమున వర్ణింపబడినవి. వేంకటనాథుఁడు మొదట నామె యాకార విశేషములను

వన్నెలఁ బెట్టుఁ గట్టుఁ జలువల్చెలువల్వెద చల్లు చన్నులన్
గన్నులకల్కి పూయుసిరిగందము మందమరుత్కిశోరముల్
జున్నులు రేఁప మెచ్చుముడుచున్గడుఁ జొక్కపుఁ గ్రొవ్విరుల్సరుల్
పన్నశిరోఘవీథిఁ గనుపట్టునయారె యొయార మేర్పడన్

ఆశ్వా 1-పద్య 587.

అని రమ్యముగ వర్ణించినాఁడు. విటరాజు లెందఱు యత్నించినను సంతానము గలుగకుండుటచే నామె సౌందర్య సంపద, యొడలి బింకము తఱుగకున్నవని

పాయని మంద నుండి యడపాదడపా చనుదెంచు బోయనిన్
బోయినఁ జీర జిక్కదఁట పుణ్యము లేదని మానసంబునం
ద్రోయక హోపరస్థలముఁ ద్రొక్కియుఁ జూచినయోని నాలుగేన్
గాయలు గాయ వచ్చెలువ గర్భము నందెటువంటి పాపమో.

కనిపెంచని గొడ్రాలది
గనునొడలు న్దొడలు నడలుకటి నెన్నడుమున్
జనుదోయి మెఱుఁగు జిగిబిగి
యనుయంబుం ద్రచ్చివేసినట్లొప్పెసఁగున్.

పద్య 588, 589.

అనుపద్యములలో బైచరాజు వర్ణించినాఁడు. ఆమె ౘౌడుపట్టుకొని చల్ల తఱుచునప్పటి సౌందర్యమును గూడ నతఁడు

వేలిన నిద్రిమేలుకని వేఁకొక బానకు నేర్పుతోఁడఁబై
మీఁవడఁబుచ్చి కవ్వమిడి మట్టచనుంగవ రాయిడింప మేఁ

దీవ నటింప నెన్నడును దీలుపడం గటిగుల్కం గాచముల్
జోవలం బాడం జల్లం దరుచున్నాడిం దర్శిణి రజ్జుపాణియై
పద్య 590.

అని వర్ణించినాడు. అందామె చలద్రూప సౌందర్యము సుందరముగా నిరూపితము. ఆమె చల్లకుండను శిరస్సున ధరించి కోకిలకంఠముతో నాహ్వానించుచు జల్లనమ్మట విటులకు గనులపండువుగా నుండుసని

వెడవెడ వేడి వెన్నారయు వేసలి మస్తకసీమం దక్రపుం
గడవయొకింత పయ్యెదకుం గాకరదోంచునురోజమూర్యపుం
బిడుత పికాంగ నోక్తి వలపించు నెలుంగమరంగ వీట న
ప్పడంతుక చల్లవిల్చుంగనుపండువు జారులకాచరింపుచున్
పద్య 591.

అని వర్ణింపబడినది. భావికథలో విటద్వయముతో వ్యభిచరించు నామె ప్రవృత్తి కనుకూలముగ ఆమె రూపము నట్లు వైచరాజు వర్ణించుట ప్రశంసార్హము. ఈపాత్ర పోషణమంతయు సమూలకమే. కథలో నెట్టి ప్రాధాన్యము లేని యూమె భర్తరూపమును గూడ వైచరాజు

అట్టలెత్తిన ప్రాంతమెట్టులు కడుగుటం
బటి చాతికలతోడి వరువ కాళ్ళు
నడిప్రాంత ముతుక గోణము మించు దులకించు
ములుగత్తి యలిమిడి మూలికలను
... ... ... పద్య 598

అని వర్ణించుటయు సమూలకమే. మిత్రభేదతంత్రమున 'ఆషాఢ భూతి–జంబుకము–దూతి' అను కథలో బుంశ్చలియగు సాలిలేమ సౌందర్య స్వభావములను భానుకవి

పసిండి సలాక చెంగలుపబంతి రతీశ్వరు దంతి యెప్పుడున్
రసికుల పక్కదాంపు వలరాయని తూపు మనోజకేళికిన్

గోసరగలట్టి రూపు కడుగూటమి యందులయోపు నుజ్జ్వలో
ల్లసముల కుప్ప కప్పురపులప్పల మించిన సాలెలేమయున్

ఆశ్వా 1-పద్య 144.

అని కమనీయముగ వర్ణించినాడు. ఈవర్ణనమంతయు నమూలకమే. ఆమె విటున కై యేగునప్పటి చొప్పుకూడ భానుకవిచే' ఉచితశృంగార వేషమ్మున సంభ్రమంబు దళుకొత్త జలధరమధ్య నిర్గత సౌదామినీలతిక చందమ్మున దనమందిరమ్ము వెలువడి వ్యామ| గావ్యాపయోధర భార మ్ములవలన మధ్యంబసియాడ నీలిచేలంబు ముసుంగిడి గోడనీడల నడచుచు శంబరవిరోధి యాఱవబాణంబనంగ ననంగశరమ్ముల నవ యవమ్ము లెఱుంగక విటాన్వేషమ్మున మందగమనమ్మున నావారాంగన గృహాంత కుటీరమ్ముచేరి' (145) అనువచనమున వర్ణింపబడెను. ఆమె మేఘ మధ్యమున నున్న మెఱుపు దీగెవలె నున్నదనుట, మన్మథునాఱవ బాణముగా భాసించుచున్నదనుట యనుపమము లైన కల్పనలు. ఇట్లు మూలమున లేని గుణగణమును బొందించి సాలిలేమ సౌందర్యమును వ్యభిచార స్వభావమును తత్సన్నాహమును భానుకవి మనోహరముగ బోషించినాడు. ఆసాలిలేమ దూతి యొక్క స్వరూపస్వభావముల గూడ భానుకవి

ఓగు పిసాళి గుల్లబడి యోటు బికారి విటాళి పాలికిన్
రోగముకుండ గోకరి కురూపి మృషాలయ యింద్రజాల దక్ష
వ్యాగమశీల మాటల ప్రియంబు నయంబ (నయంబు) మీఱఁగా
వేగమ వచ్చి మంగలి నివేశన బద్ధ వధూటికిట్లనున్.

పద్య 141.

అని వర్ణించినాడు. ఈపాత్ర స్వరూప నిరూపణ మమూలకము. కథలో నామె ప్రవర్తన మెట్లుండునో పైరూపవర్ణనము పరిచయ మొనరించు చున్నది.

కాకోలూకీయమున రథకారుని భార్య నుద్దేశించి విష్ణుశర్మ 'తస్య భార్యా కామదమనీ సా చ పుంశ్చలీ జనాపవాదయుక్తా చ' అని పేర్కొనినాడు. పంచతంత్ర స్త్రీపాత్రలలో రథకారుని భార్యపాత్ర ప్రముఖమైనది. కథలో గీలకపాత్రను వహించిన ఆమె రూపసంపదాదులను వర్ణించుట యత్యంతి సముచితము. కావున నారాయణకవి

నగుమోముఁ గలికి కన్నులు
బిగిచన్నులు నసదునడుము బింబాధరమున్
జిగిదొలఁకు పదతలంబులుఁ
దగిమొప్పున్ బద్మముఖికిఁ దరుణులలోనన్

సంధివిగ్ర-పద్య 217.

అని యామె సౌందర్యమును వర్ణించినాడు. అది యామె భావివర్తన వ్యంజకముగనున్నది. ఆమె విటుని జేరునప్పుడు పుష్పశరాసను సామ్రాజ్య లక్ష్మియను నట్లున్నదని యిట్లు వర్ణించినాడు.

ఆ సమయంబునఁ బుష్ప శ
రాసను సామ్రాజ్య లక్ష్మి యన శృంగారో
ద్భాసితయై నిజపర్యం
కాసనమునఁ గాంత జారునల్లన చేరెన్

సంధి విగ్ర- పద్య 229

ఈ పుష్పశరాసను సామ్రాజ్య లక్ష్మియను కల్పనము నేగాక పద్యమును గూడ భానుకవి గ్రహించుట (ఆశ్వా 3-పద్య 98) గమనార్హము తన ప్రత్యేకతను నిలుపుకొనుటకు భానుకవి యాసందర్భమున నామె విలాస విభ్రమములను

చన్నులమీఁది కొంగు దిగజారి వళిత్రయనాభి లేర్పడన్
గన్నులఁజూడ్కి (దొంతి) తొలికారు మెఱుంగుల నీనుచుండఁగన్
గొన్నన వింటిజోదు మదకుంజరమో యన డాసియున్న య
య్యన్నుఁ గడంకఁ జూచె సురతాభిరతిన్ రతిరూప శోభితన్

ఆశ్వా 3- పద్య 99

అని వర్ణించినాడు. మదకుంజరౌపమ్యమున నామెయంగసౌష్ఠవ మంత యనభివ్యక్తము. రతిరూపౌపమ్యమున నామె సౌందర్యము నిరూపితము. వైచరాజు గూడ నామె స్వరూప స్వభావములను

కేరళదేశంబున రథ
కార ప్రమదామతల్లి గల దవ్వీకచాం
భోరుహముఖి యువజారో
దార వృషంబులకు వల్లెత్రాడై మెరయున్

ఆశ్వా 3- పద్య 246

అని సంగ్రహముగ బరిచయ మొనర్చి యామె శక్తి సామర్థ్యములను

జారుల కొంగుపుత్తడి యసభ్యుల చేరువపంట మన్మథ
ప్రేరితకోటికేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారుల పట్టుగొమ్మ యుపవల్లభ సంపద పాంథబృంద మం
దారము పల్లవాంగణ నిధానము దాని విలాస మారయన్

ఆశ్వా 3-పద్య 247

అని వర్ణించినాడు. జారులకు గొంగుబంగారమైన యామె విటకాండ్ర నెట్లువ్రేళ్ళు లూరించుచుండునో

క్రొవ్విన చన్నుదోయి కులుకున్నను బయ్యెదఁ దెల్పఁ జూచిన
న్రువ్వనఁ బర్వుచూపులదరుల్వొదరం బటు పాంథమర్మముల్
ద్రవ్వ మెఱుంగుమేని చెలువం బెడఁ జేయక జూడఁ గోడెకాం
డ్రువ్రేళులూఱనూర మెఱయున్ రథకారవధూటి నీటునన్

అని వైచరాజు మనోహరముగ వర్ణించినాడు. ఆమె యేటి కేగునప్పటి సౌందర్య సంపద

మెఱుఁగులఁగ్రుమ్మరించు కనుమించులు త్రొక్కనిచోట్లు ద్రొక్కఁగ్రి
క్కిఱిసిన గుబ్బచన్నులెడయాక విరోధుల జోక నొండొక
ళ్లొఱయ నితంబబింబమున నొక్కొకయించుక జాఱఁ గట్టుఁ గ
ట్టొఱపు ఘటింపనేగు నలయుగ్మలి దూరపు టేటి నీటికిన్

పద్య 249

అని వివరింపబడెను. ఆమె రూప వైభవమునకు విటులు పొందు నవస్థలు మనోజ్ఞముగ నిట్లు వర్ణింపబడినవి

ఆవృత్తస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిగ్రాహమో
హావేశక్షుభితుండుగాని నరుఁడిష్టాహార సంచార ని
ద్రావైముఖ్యము లేనివాడు గృహకాంతా కాంతసంతాన చి
న్తావైరాగ్యవశుండుగాని జనుఁడెన్నన్లేఁడు లేఁడొక్కఁడున్

పద్య 250

ఇందు విటులామెకువశులై పొందు మానసిక సంక్షోభ, యాహార సంచార నిద్రావైముఖ్యము, వైరాగ్యము హృద్యముగా నిరూపింప బడినవి. శ్రీహర్ష నైషధీయచరితమందలి, 'నకానిశిస్వప్నగతం దదర్శ తమ్మ' ను శ్లోకమున (సర్గ 1 శ్లో 30)కీ పద్యము జ్ఞాపకముగా నున్నది. పరపురుషాసక్తిగల యామె శృంగారవికారములను బైచరాజు వేంకటనాథుఁడు

పలుమెఱుంగులు మోవిపై నటింపఁగఁగేరి
నవ్వు నొక్కొక్కసారి ఆవ్వనవ్వు
జారకర్ణగ్లానిచేర నారజముగాఁ
బలుకు నొక్కొక్కసారి పచ్చిపలుకు

... ... ... పద్య 251

అను సీస పద్యమున రమ్యముగ వర్ణించినాడు. ఆమె నవ్వులలో జూపులలో నడకలలో జారిణీలక్షణములుప్పొంగు చున్నట్లు వర్ణింపబడినవి. అట్లే పరపురుషులనామె యేయేరీతుల వలపించి, మోసగించి యాశలు రేకెత్తించునో

ఏతెంతునని యెు పొక్కిడి పోయి మత్తాళి
చూడ నాకట తొంగి చూడవయితి
చేసేఁత నపుడ యుచ్చిక బుచ్చికపు మాట
లాడనాతో మాటలాడ వయితి

పద్య 252

అను పద్యమున ప్రపంచ వంచకులయిన జారులావాడవదినె యెదుర్రైన బల్కుడురని వర్ణించుటలో సువ్యక్తము. ఆమె స్వభావమంతయు వాడ వదినె యనుటలో ప్రస్ఫుటమగు చున్నది. ఆమె సౌందర్య నిధానమగు స్తనద్వయము బైచరాజుచే నిట్లు వర్ణింపబడినది.

పరుషటంక కుఠార సంభరణ కరణ
జనిత తాపరసక్లాంత శాంతి కాంత
హస్తములఁదేర్చు నొక్కొక్క యవసరమున
శైత్య భైషజ్యమున దాని చన్నుదోయి

పద్య– 253

ఆమె రూపసౌందర్య సర్వస్వమును సూత్ర ప్రాయముగా బైచరాజు

కైసేసి బిడ్డ పాపల
తో సందడిలేమి నొడలు దొడలుం బిఱుఁదిం
తేసి కుచంబులు మెఱయం
గాసుందరి పోతబొమ్మగతిఁ జూపట్టున్

పద్య– 254

అని సూచించినాడు. ఆమె చెలువము 'తెరువు పెసరువలె నానాపథిక భోగ పాత్రమైనదని' యు వర్ణించి బైచరాజామె శీలమును వ్యంగముగ సూచించినాడు. పంచతంత్రమందలి కులటేతివృత్తముగల కథలన్నిటి యందు నతివిశిష్టస్థాన మలంకరించిన రథకారుని భార్యాస్వరూప స్వభావములను అమూలకమైన భావసంపదతో జంపూకర్తలు ముప్వురు నిరూపించుటలో వారి పాత్రచిత్రణ సామర్థ్యము విశదమగు చున్నది.

కాకోలూకీయమున కామాతురుఁడగు వృద్ధవైశ్యుడు–చోరుడు ననుకథలో వృద్ధవైశ్యునాతని పడుచుభార్య యేవగించుకొనినట్లు గలదు గాని యామె సౌందర్యమెట్టిదో యందు సూచింపబడలేదు. దూబగుంటనారాయణకవి

... ... ... వానికిఁ జంద్రరేఖనా
నెన్నిక కెక్కి యొప్పుఁ గమలేక్షణ రూపవిలాస విభ్రమో
త్పన్న వయో విభాసి కులభామలయొప్పుఁ దృణీకరింపుచున్
సంధివిగ్రహ-పద్య 181

అనియామె మనోహరాకృతిని వర్ణించుట యమూలకము.

మిత్రభేదమందలి వానరము-కీలోత్పాటనము అను కథలో బైచరాజు నర్తకి వృత్తాంతమును గల్పించి యామె సౌందర్యమును

'వితత విలాస సంభ్రమణ విస్ఫురిత విశ్రుతనా మిటారియా
యతనుకటారి కర్కశకుచాంగజిత ప్రకటారి నృత్తనం
దిత శకటారి వారసుదతీమణి యొర్తు నటించు నున్నతిన్'
అశ్వా1-పద్య109.

అని యభివర్ణించినాడు. అతనుకటారి యని మన్మథుని యస్త్రముగఁ జెప్పుటలో నామె సౌందర్యము సువ్యక్తము. భుగంజ శ్రేష్ఠులనామె యెట్లా నందింపజేయునో మనోహరముగ బైచరాజిట్లు వర్ణించినాడు.

రాగరుచి గలుగు దెస నల
భోగిని మయిమఱపుఁ దిగిచి పోడిమి తెమ్మెర తృ
ష్ణాగతి దరలింపఁగ సం
భోగం బొసఁగుం భుజంగ పుంగవ తతికిన్
పద్య 110.

పంచతంత్రమున గాకోలూకీయమున ముని-మూషికాంగన యను కథలో నయ్యంగనా సౌందర్యమును విష్ణుశర్మ లేశ మాత్రముగ నైన వర్ణింపలేదు. దూబగుంట నారాయణకవి కన్యాసౌందర్యమును ముని సహస్రాక్షునితో

కలికి చూపుల కాంతిఁ గలువ తోరణములు
పచరించినట్లున్న బాలఁజూడు

మెఱుఁగుఁజెక్కుళ్లను మించు టద్దంబులఁ
జూపెడు నీకు నీ సుదతిఁ జూచు

సంధివిగ్రహ—పద్య 262.

అని వివరించినట్లు రచించినాడు. కవిసమయ సిద్ధములగు నుపమలను గ్రహించి కన్యారూపసౌందర్యమును నారాయణకవి వర్ణించుట కేవల మమూలకము. మూషిక స్త్రీగా మారి ప్రాప్తయౌవన యగునప్పటి సౌందర్య సంపదను వైచరాజిట్లు వర్ణించినాడు.

కులుకు గూడె మేను మెఱుఁగెక్కె పాలిండ్లు
బయలు మెఱసెఁ బిఱుఁదు బలిసె నడలు
ముఱిప మెఱిఁగె సిగ్గు మోమున నివురొత్తెఁ
దోయజాస్య కలరుఁ బ్రాయమైన.

ఆశ్వా3—పద్య 301

ఆమె నూనూఁగు ప్రాయము నొందుటను 'కలితరుచి మించు నించున ఫలముంబలె' నున్నదని తరువాతి పద్యములో వైచరాజు వర్ణించుట పరమ రమణీయముగ నున్నది.

వైచరాజు గావించిన స్త్రీపాత్ర పరిచయము లన్నింటను 'గురువు రాజకన్యను నిరాకరించిన కథ' లోని రాజకన్యాపాత్ర పరిచయము శిఖరాయమానము. లబ్ధప్రణాశ తంత్రాంధ్రీకరణ సందర్భమున నమూలకముగ గల్పింపబడిన యాకథయందలి రాజకన్యా సౌందర్య వైభవ వర్ణనము అతి విపులముగను ప్రౌఢప్రబంధోచితముగను నిర్వహింపబడినది. ఆరంభమున వైచరాజు రాజకన్యా రూపసౌభాగ్యము నిట్లు పరిచయ మొనర్చినాడు.

సితరోచిర్ముఖి కప్పు కొప్పు సుమనస్స్వాహంబధిష్ఠించి కృ
ష్ణత నొందంగని యోర్వలేక వదనాబ్జాతంబు గాంచె న్విధూ
న్నతిఁ జన్నుంగవ యచ్యుతాప్తిఁ బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితి రోమావళివల్లి చక్రిత భజించె న్నితంబ ప్రియాసక్రియన్

ఆశ్వా4—పద్య93.

ఆ చంద్రిముఖియొక్క వ్యాపించిన కైశికబంధము సుమనస్సుల స్నేహము నధిష్ఠించి కృష్ణత్వము నొందగా ముఖపద్మము విధూన్న తిని, స్తనయుగము అచ్యుతత్వమును, నడుము హరిత్వమును, లతవంటి రోమావళి చక్రిత్వమును నిర్వహియానతో బొందెనని భావము. ఇందలి చమత్కృతి యర్థద్వయ ప్రతిపాదనమున గలదు. కొప్పు సుమనః స్నేహము నధిష్ఠించి కృష్ణత్వము నొందెననగా బువ్వుల చమురును బొంది నల్లదనము గల్గియుండెననియు దేవతల యనురాగము నొంది విష్ణుత్వమును బొందెననియు రెండర్థములు. అట్లే విధూన్నతి యనగా జంద్రుని యౌన్నత్యము, విష్ణుని యున్నత స్థితి యనియు, అచ్యుతత్వ మనగా జారని స్థితి, విష్ణుత్వమనియు రెండర్థములు. ఇట్లే తక్కిన వాని యందు నర్థద్వయము. కొప్పు కృష్ణత్వము నొంద వదనాదికము గూడ విష్ణుత్వమును బొందెనను నర్థద్వయముతో గూడిన యపూర్వ కల్పనము సుమనోమనోహరము. ఇట్లే బైచరాజు పయోధర శబ్దమందును శ్లేషను ప్రదర్శించి జన్మాంతర కర్మానుభవ మెందున్నను దప్పదని రాజపుత్త్రి నడుము నిట్లు వర్ణించినాడు.

తనకుఁ బయోధర భృతిఁ వేఁ
గని మిన్నెలనాఁగ మధ్యమయ్యె నమైనన్
జనదు పయోధర భారము
జననాంతర కర్మమేలచను నెందున్నన్

పద్య-97.

తాత్త్విక విషయ సమన్వయముతో రాజకన్యా మధ్యస్తన సౌందర్య మును బైచరాజిట్లు చమత్కరించినాడు.

పరమాణువు పరమ మహ
త్పరి పూర్తి న్గోచరించుఁ బరమ మహాత్మున్
బరమాణువై కనంబడుఁ
దరుణీమధ్యస్తనేక్ష తత్త్వజ్ఞులకున్

పద్య-98.

ఆ రాజకన్య నేత్రములు, స్తనములు, నెఱవేణి యామెశరీరమున నెట్లమర్చినట్లున్నవో బైచరాజు వర్ణించి యా కన్యాసౌందర్య మనుపమమని యిట్లు పేర్కొనినాడు.

కన్నులకు మొగము చాలదు
చన్నులకు నురఃస్థలమ్ము చాలదు వెన్నుం
బెన్నెఱవేణికిఁ జాలదు
కన్నియ చెలువంబుఁ బొగడఁగా నాతరమే

పద్య 99.

ఈ రాజపుత్త్రి కథ యమూలకమగుటచే నీ స్త్రీపాత్రచిత్రణ నైపుణ్యమంతయు బైచరాజు వేంకటనాథుని స్వోపజ్ఞకమే యనదగును.

అపరీక్షితకారిత్వమందలి 'వణిక్పుత్త్రుఁడు-క్షపణకత్రయ' మను కథలో వర్షీయసి రూపమును బైచరాజిట్లు వర్ణించినాడు.

అరసాన్న గ్రహణాస్థిశేషనతదేహన్ సౌఖ్యకృత్తైల సం
స్కారణాభావ జటీకృతాలకన నీషద్దైన్యతామ్య న్ముఖం
బసుమపాత్రిక్పరిధాన సంవృత నితంబ న్నిర్గతాలంబ నా
జరఠం గన్గొనియొండు నాకనగర స్వామల్ ప్రసాదించినన్

ఆశ్వా 5-పద్య 45.

ఇందామె యస్థిపంజరము, తైలసంస్కారవిహీనమైన కేశవేశము, ముఖదైన్యము సహజసుందరముగ నభివర్ణింపబడినవి. ఇదియు నమూలకమే. ఈ విధముగ విష్ణుశర్మ సంస్కృత పంచతంత్రమున స్త్రీపాత్రల రూప విలాసాదులను గొన్నికథలలో వర్ణింపక విడిచి కొన్నింట లేశమాత్రముగా వర్ణింపగా నాంధ్ర చంపూకర్తలు వానినంగప్రత్యంగ వర్ణనములతో ప్రబంధోచితముగ నిర్వహించుట కథలకు బుష్టిగలిగినది. అది యనువాదకుల పాత్రచిత్రణకళా నిర్వహణ సామర్థ్య నిరూపణకు పతాకవంటిది.

4. పశుపక్షులకు మానవులకు నాహార నిద్రా భయమైథునాదులు సమానములేయైనను స్వభావములు భిన్నములుగా నుండును. ఒక్కొక్కరి

స్వభావమొక్కొక్క విధముగ నుండును. పశుపక్షులయు, మనుష్యు లయు స్వభావములు విభిన్నములుగ, విచిత్రములుగ నుండుట అత్యంత సహజము. రచయిత పాత్ర చిత్రణమున వాత్రల నైసర్గిక స్వభావమును జమత్కార జనకముగ జిత్రింప వలయును. పంచతంత్రి చంప్వనువాద కులు పాత్రల స్వభావములను మిక్కిలి మనోజ్ఞముగ జిత్రించినారు.

చపలత్వము వానరముల స్వభావము. స్థిరత్వమనిన నాజాతికి గిట్టదు. మిత్రభేదమందలి 'వానరము- కీలోత్పాటన'మ ను కథలో గోతుల గుంపులు చెట్లపై కెగ ప్రాకుచు నేయేవిధములుగ ప్రవర్తించి నవో దూబగుంట నారాయణకవి

గుడి యెక్కి తరులపై గుప్పించు నవియును
　దరువులపై నుండి దాటు నవియు
నురుతరశాఖల నూగాడు నవియును
　బ్రాకారములు ప్రాకి పాఱునవియు
గోపురంబుల మీదఁ గూర్చుండు నవియును
　గోళ్లఁబ్రిక్కలు వీపు గోకునవియు
నిక్కుచు బొమలెత్తి వెక్కిరించెడునవి
　యొండొంటితోఁ బోరి యోడునవియు
నిట్లు వానర యూథంబు లిట్టు నట్టు
సహజమగు చాపలంబున సంభ్రమింప
వానిలోపల నొక వృద్ధ వానరంబు
దూరముగఁబాఱి తావిధి పేరణమున

మి. భే—పద్య 91.

అని మనోహరముగ వర్ణించినాడు. ఈవర్ణన మంతయు నమూలకము. సహజమగు చాపలంబున సంభ్రమింపనని వర్ణించుటలో కపియూథ స్వభావోద్ఘాటనమున గవికి గల యాసక్తి సువ్యక్తము.

కుక్క అతివిశ్వాసముతో సేవించు స్వభావముగలది. పిడికెడు మెతుకకది పొందునవస్థలను దూబగుంట నారాయణకవి కరటక దమనక సంభాషణ సందర్భమున నిట్లు వర్ణించినాడు.

వాలంబు నులిచియు నేలఁగాళ్లఁ డఁచియు
ధాత్రిపైఁ బొరలియుఁ దాల్మి విడిచి
వదనంబుఁ దెఱచియు నుదరంబుఁ జూపియు
బెక్కు పాట్లను బడ్డ కుక్క కొక్క
కడియొఁ డన్నము కాని కడుపార నిడఁబోరు—
మి ఖే- పద్య 99.

ఇందలి శునక స్వభావ చిత్రణ మమూలకము.

వైనతేయుఁడుద్ధతుడు. దేవేంద్రుని ప్రతిఘటించి కులశాయుధ మును తృణీకరించిన మహాబలుడాతడు. 'టిట్టిభ దంపతులు—సముద్రుడను' కథలో సుపర్ణుడు సముద్రునిపై నలిగి 'అహం స్థలాంతరమ్ముద్యేవ నయామి' యనినట్లు పంచతంత్రిమున గలదు. అందు గరుత్మంతుని యాద్ధత్యము పరిస్ఫుటముగా వర్ణింప బడ లేదు. సముద్రశోషణ మొన రింతునని పలికిన తార్క్ష్యుని యాద్ధత్యమును వైచరాజిట్లభి వర్ణించినాడు.

ధీరగరుత్సమీరణహతి న్సలిలంబులఁ జల్లి దృష్టదు
ష్టోరగ కోటిజీవితములూడ్చి తిమింగల తద్గిలాది వా
శ్చారములం ఘనజ్జఠరజ జ్వాలనార్చుల ప్రేల్చి వార్ధిని
స్సారముఁ జేసి గ్రమ్మఱ నొసంగుదుఁ ద్వద్వనితాండపిండముల్
ఆశ్వా 1—పద్య 633.

ఇందలి పదబంధము గూడ గరుడుని శక్తి సామర్థ్యముఁను, నౌద్ధత్య మును నిరూపింప సమర్థకము. వజ్రాయుధము వంటి నాభయంకర బల మును సముద్రుడు తెలియడా? నాసేవకుడవని నిన్ను గుర్తింపడా? ఎంతటి తల క్రొవ్వుగలవాఁడో యని యాతడు టిట్టిభునితో

కులిశాయుధ భీషణమై
వెలసిన నాలావుఁ గనఁడొ వినఁడో నన్నుం
గొలిచినవాఁడని నిన్నుం
దెలియఁడొ సాగరుఁడు చూచితే తలక్రొవ్వెన్
పద్య 624.

అని పలుకుటలో గూడ నుద్ధత స్వభావము పోషింపబడినది. ఈ యమూలక పాత్ర స్వభావ పోషణము వైచరాజు పాత్రచిత్రణ నైపుణ్య నిరూపకము.

అపరీక్షిత కారిత్వమందలి 'దేవశర్మ-యాజ్ఞసేని' యను కథలో దూబగుంట నారాయణకవి సంభావనల్కై తహతహలాడు బ్రాహ్మణుని స్వభావ మెట్లుండునో చక్కగ నిరూపించినాడు. పసిబాలునింట విడిచి ప్రభుమందిరమునకు సంభావనకై వెడల నశక్తుడై, సీట్కై వెడలిన భార్య రాకకు నిరీక్షించుచు, బరిపరి విధముల దలపోయుచున్న బ్రాహ్మణుని స్వభావమును నారాయణకవి

ఎన్నడు వచ్చుఁ బుణ్యతిథి యెన్నఁడు దానముచేయు భూవరుం
డెన్నఁడ కించనత్వమును నేఁబెడబాఁసి సమస్త వస్తు సం
పన్ననికేతనుండనగు భాగ్యము గల్గునొ యంచుఁగోర్కిమై
నున్నయెడన్ ధనాగమము గొందుటకుండటి తప్పెనెట్లొకో

అక్కట యెల్లఁదీఱవు నృపాగణికిం బోడసూప కున్ననా
కిక్కడ వెన్నపాపనికి నెవ్వరు కాఁపిక వేళఁదప్పెఁబో
నక్కడ నేప్రయోజనములబ్బు మనంబున మానవుండు దా
నొక్కటి చింతసేయ విధి యొక్కఁడు వేఱతలంచు నక్కటా

అసం. కారి-పద్య 24, 25.

అని యభివర్ణించినాడు. పుణ్యతిథికై యాతడు పరితపించుట యదను తప్పిన నైశ్వర్యవంతుడగుటకు నవకాశములేదని బాధపడుట యత్యంత సహజముగా నున్నది. వెన్నవంటి లేత శిశువును విడిచిపెట్టుట కిష్టపడక చివఱకుఁ దానొకటి తలఁచిన దైవ మింకొకటి చేయునని దైన్యము నొందుట స్వభావ సుందరము. భార్యాగమనమునకై మార్గము దిక్కులు ఉత్కంఠతతో నాతడు చూచిన విధము

అనుచుఁగదలిపోవు నట పోయిక్రమ్మఱ
మగిడివచ్చు బాలు మొగము చూచు

సుదతివచ్చు తెరువు చూచు దిక్కులు చూచు
నిక్కి చూచు గోడ లెక్కి చూచు

పద్య– 26

అని రమ్యముగా వర్ణింపబడినది. ఈ బ్రాహ్మణ స్వభావ వర్ణన మంతయు నమూలకమే.

బైచరాజు కపటశీలుని స్వభావ మెట్లుండునో ప్రథమాశ్వాసమున 'బకము-కర్కటకము' అను కథలో బకపాత్రి చిత్రణమున నిరూపించి నాడు. పరనీరస్థానగమనాపేక్షతో దరిచేరిన మత్స్యములతో కృత్రిమ వాత్సల్య ప్రదర్శనపూర్వకముగ బకము

తిరిగి తిరిగి నేటికలసితి భరమాన
వసమె మూఁడుకాళ్ల ముసలి గానె
కండవడియె వయసా గర్వమో సంచార
శక్తి ముదుక కెట్లు సంభవించు

ఆశ్వా1–పద్య 316

అని భాషించినట్లు బైచరాజు రచించుట యమూలకము. మూడు కాళ్ల ముసలిననుచు కృత్రిమ వార్థకమును అశక్తతను వ్యక్తపఱుచుచు భాషించుచున్న ఒకపాత్ర వంచక శీల నిరూపణ సమర్థకము.

సంతానమునకై స్త్రీ స్వభావమెట్లుండునో బైచరాజు పంచ మాశ్వాసమున దేవశర్మకథలో మనోహరముగా నిరూపించినాడు. దేవ శర్మ భార్య సంతానప్రాప్తికై ఱాతికి అప్పకు నెట్లు మ్రొక్కినదో సంతానవతుల జూచి యెట్లు ముచ్చటపడినదో

'సంతులేకల శరజ్జలజలోచన ఱాయి
గన్న ఱాతికిఁగుండు గన్న గుంటి
కెఱుగుచు మఱుగుచు నెవ్వరే వ్రతములఁ
జెప్పిరా వ్రతములఁ జేసికొనుచు
సుతులఁగని పెంచు గరితలఁజూచి యేచి
యిచ్చముచ్చట నొందుచు నిట్టులుండ'

పద్య– 5.

అని వైచరాజు గావించిన వివరణమంతయు నమూలకమే.

వైచరాజు వేంకటనాథుడు వేటకాండ్ర మృగయా స్వభావ మెట్లుండునో ద్వితీయాశ్వాసమున జిత్రాంగదుని పూర్వ వృత్తాంతకథన సందర్భమున నిరూపించినాడు. ప్రభువును ప్రోత్సహించునప్పుడు బోయలు సింహశరభాదుల వేటాడుటలో జూపిన యుత్సాహమును వైచరాజు

కొన వెండ్రుకలఁబట్టి కూపెట్టి సింగంబుఁ
 బట్టి తేకున్న నీబంటఁ గాను
నెల వారసిల సొమ్మసిల వైచి శరభంబుఁ
 బరిమార్పకున్న నీ బంటఁగాను

పద్య- 194

అను సీసపద్యమున మధురముగ నభివర్ణించినాడు. ఈ మృగయార్థుల స్వభావ చిత్రణ మమూలకము.

కాముకుల స్వభావమును పంచతంత్రి చంపూకర్తలు నిరూపించిన విధమత్యంత ప్రశంసనీయము. సంధివిగ్రహపరిచ్ఛేదమున రథకారుని కథలో నుపపతి రథకారుని భార్యకై యెట్లువ్విళులూరుచున్నాడో దూబగుంట నారాయణ కవి యిట్లు చిత్రించినాడు.

ఎప్పుడు పిల్చుఁబద్మముఖి యెప్పుడు దాని ప్రియుండు వోవు న
న్నెప్పుడు గారవించుఁగమలేక్షణ యంచు నహర్నిశంబు నే
నెప్పుడుఁగోరుచుండుదు మహిందలపోయఁగ నేను ధన్యుఁడన్
జెప్పఁగనేల నన్నిపుడు శీఘ్రిమ రమ్మని పిల్వఁబంచుటన్.

పద్య- 231

ఆ కాంత యెన్నడు వచ్చునో యని యెదురుచూచుట, పతి యెన్నడుపోవునోయని భావించుట, యామె యెన్నడు సుఖమునొసంగునోయని తలపోయుచుండుట పర సతీ సమాగమకాంక్షియైన కాముకుని స్వభావమని కవి మృదుమధురముగ సూచించినాడు. భానుకవిగూడ రథకారుని

భార్య స్నానమొనరింపనేగగా జారుడామెకై మదనోద్రిక్తుడై వేగు చున్న స్థితిని

ఎప్పుడేనియు దిజ్మదేభేంద్ర కుంభ
సన్నిభములైన పాలిండ్లు జారకాంత
నాయురఃస్థలిఁ జేర్చు మన్నన దలిర్ప
నపుడు మదనాగ్ని యణఁగు నటంచు నుండ.

ఆశ్వా 3- పద్య 97

అని వర్ణించినాడు. మదనాగ్ని చల్లార్చుటకామె ఘనపరిరంభణము తిప్ప నుపాయాంతరము లేదని జారుడు తలంచుటలో గాముక స్వభావము సువ్యక్తము. ఇదియమూలకము.

వైచరాజు చతుర్థాశ్వాసమున 'బ్రాహ్మణుడు–రాజపుత్రిని నిరాకరించుట' యనుకథలో గురువగు నా మహాబ్రాహ్మణుని పాత్ర నాధారముగ గాముకమనఃప్రవృత్తిని మనోజ్ఞముగ లోకమున కెఱిగించి నాడు. గురువైయైనను ఆబ్రాహ్మణాధముడు రాజపుత్రిని రతిభిక్ష వేడుట విచార్యము. ఆ రాజపుత్త్రి గురువగు నతనికి

గురుఁడనఁగఁ దండ్రియఘసం
హారణగుణా శిష్యురాల నైనప్పుడె కూఁ
తుర మేరదప్పి కామా
తుర బుద్ధిం గోర్కి సేయుదురె నా చోటన్

పద్య- 205

అని తాను గూతురగునని చెప్పి పరభామా సంగమము వలన గలుగు దోష పుంజమునుగ్గడించి తన్ను గోరుటచే బ్రాహ్మ్యహాని, తపోహాని, ప్రాణహాని కలుగక తప్పదని హెచ్చరించినది. అయిన నా పాపబుద్ధి బ్రహ్మాయుజంద్రుడు నింద్రుడు గావించిన చీకటితప్పుల నుదాహరించి తన సంకల్పమును సమర్థించుకొని తన యభీష్టము నెరవేర్పుమని యర్థించి నాడు. కాముకులు వావివరుసల నాలోచింపని స్వభావముగలవారని

బైచరాజీవృత్తాంతమున వ్యంగముగ బోధించిన తీరు రమణీయముగా నున్నది.

చంపూకర్తల స్వభావచిత్రణమున గుళటాస్వభావ నిరూపణ మత్యంత మనోహరముగానున్నది. కులటల యసత్యాలాపములు నిరంకుశవివాదములు, పరపురుషసుఖతత్పరత బైచరాజుని యనువాదములో మధురముగ బోషింపబడినవి. మూలమునకుత్కర్ష గలిగింపబడినది. కౌలికుఁడుపపతికై యేగుచున్న భార్యను బంధింపగా నామె తానెచ్చటకు వెడలలేదనియు, మద్యపానవశమున నప్రస్తుతము పల్కుచుంటి వనియు భర్తకు సమాధానమిచ్చినట్లు మూలమున 'అహం త్వత్సకాశాదాగతా న కుత్రచిదపి నిర్గతా తత్కథం మద్యపానవశాదప్రస్తుతం వదసి' యనియున్నది. బైచరాజుకృతిలో ఆమె

కూరకు నారకు బయటకు
రారా దనుమేర గలదో రానో పోనో
యారా చూడవె నేఁడే
లా రోషమువచ్చెఁ గ్రొత్తలా యిత్తెఱఁగుల్

ఆశ్వా 1—పద్య 250

అని యెదురు తిరిగి వాదించినట్లు రచింపబడినది. మాటలచే ప్రయోజనము లేదని యెంచి రోషముగల మగవాఁడవైనచో దప్పుగానున్నప్పుడు పట్టుకొనుమని

పలుకులకేమీ రోసము
గలిగిన మగవాఁడ వయినఁగాచి కడంకం
దలతలఁ బట్టికొనంగా
వలదంటినొ చంపితోఁ బ్రోవ వలదంటి నొకో

పద్య 251.

అని సవాలుచేసినది. అంతయు గుళటాస్వభావ నిరూపకము.

బైచరాజు చతుర్థాశ్వాసమున 'కాపుకాంతభర్త రాజబాధ నొందుట' యను కథలో గుళటయైన కాంపుకాంత భర్తతో గోరి కలహించి దెబ్బతిని దండతాడిత భుజంగివలె నింగి ముట్టిన యలుకతో

ఆడికలం బడితినో అం
కాడితినో యిల్లు ముంగిలననో తటితో
గూడననో నీళ్ల ననవో
కూడునె యిల్లాలి నన్నుఁగొట్టం దిట్టన్

పద్య 472.

అని భర్తనధిక్షేపించినది. అకారణకలహముతో భర్తను గులట యెదిరించు విధము నిందు బైచరాజు మనోహరముగ నిరూపించినాడు.

రథకారుని కథలోగూడ బైచరాజు కులటాస్వభావమును మనోహరముగ బోషించినాడు. ప్రభుకార్యమునకై గ్రామాంతర మేగవలసి వచ్చినదని రథకారుడు పలుకగా నతనిభార్య మాఱుమగని పొందు లోని యింపు సొంపులను

చివురు వాతెర అచ్చుచేయుఁబో వేఱూరి
యొసపరిగాని పల్లొత్తు కెంపు
తమి గుబ్బ చంటి పాలేము డిగ్గుఁ బోవింత
గుమ్మచిమ్మట వ్రేలిగోరి తాఁకు
మోముదామర తావి ముదమందఁ బోక్రొత్త
బోజుఁగు కస్తురి చుక్క బొట్టుతేఁటి
చిన్నారి మేనవాసించుఁబో పొఱుగింటి
కలికి చుట్టము బొమ్ము కమ్మపూఁత
తన చొకాటపుఁ జెక్కుటద్దములఁ బ్రతిఫ
లించుఁబో మాఱుమగని కొ్రొమ్మించు రూపు
ప్రాఁతపోరాట మొందూరఁ బఱఁచెననుచుఁ
బొంగె లావణ్యసీమ వడ్లంగి లేమ

ఆశ్వా 3-పద్య 259.

అని మధురముగ భావించినది. పరపురుషాధరపానసఖక్షతాలింగన సుఖపారవశ్యమును బహుధా ప్రశంసించినది. పాతమగఁడు తల లోని పేను, పంటి సందున నుండు మాలిన్యము, కాలియందలి ముల్లు

వస్త్రము నందున్న పేను, కటిప్రదేశము నంటలి దురద, చెప్పులోని జూయి యని

తల పేను పంటి నందిడి
పులు కాలను ముల్లు వస్త్రమున యూక కటి
స్థలి తీటఁ పాదరక్షన్
శిలవోలెం బ్రాఁతమగఁడు చేసెవ్వరికిన్

ఆశ్వా 3–పద్య 260.

అని యేవగించుకొనినది. మీఁదుమిక్కిలి భర్తనువీడి స్వేచ్ఛగా మఱి యొక మగవానితో సుఖించుటను ఆమె దుర్భర వ్యాధి నశింపగా శరీరము ప్రకాశించు విధముగా నుండునని

నెరసుతోడఁ బోతె నేత్రంబు దుర్భర
వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లుగతి వీనిఁబాసి యి
చ్ఛానురూప వృత్తి నగుదు నేను

పద్య 261.

అని భావించినది. మూలమున భర్తపరదేశిగామియగుటకామె గూర్చి 'సాఽపి తద్వచనం శ్రుత్వా హర్ష చిత్తోత్సుక్యాత్' అని మాత్రమే గలదు. బైచరాజు రచనలో ఆమె గావించిన పరపురుష సంగమ సుఖ వైశిష్ట్య ప్రశంస, నిజభర్తృ వైముఖ్య ప్రదర్శనము నమూలకములు. భర్త పరీక్షర్థము వేచియున్నట్లు పోల్చుకొనిన పిమ్మట ఆమె భర్తృ సంభోగ సౌఖ్యమును ప్రశంసించుచు భర్తకు, జారునకు గల యంతర మును సముద్రము, చిన్న నీడిపడియ పోలికతో

ఇది యేటిమాట యేలా
వదిరెదు నిను నీ వెఱుంగవా నారమణుం
డుదధి చిఱుపడియ వీవ
ల్లది నేనన్నకున్న దెలియదా నీ మదికిన్.

పద్య 279.

అని తెలిపినది. భర్తృ సౌఖ్య మింద్ర భోగమనియు, నాతడింట లేకుండుట చూచి నీవు ప్రవేశించి సిగ్గుగొంటివనియు నామె యుపపతిని 'ఒండన నేల నామగని యొద్ద రమించుట యింద్రభోగమై'...(ప 282) అని నిందించినది. మహాపతివ్రత వలె రథకారుని భార్య గావించిన ఈ భర్తృ ప్రశంస కులటాస్వభావమును హృదయంగమముగా నిరూపించుచున్నది.

వృద్ధ భర్త నసహ్యించుకొను పడుచుభార్యాస్వభావమెట్లుం డునో వైచరాజు తృతీయాశ్వాసమున వృద్ధవణిజుఁడు-చోరుఁడునను కథలో మనోజ్ఞముగా విశదపఱిచినాడు. వృద్ధుడైన సార్థవాహుని భర్తగా బొందుట కాతని పడుచుభార్యయెట్లు ప్రవర్తించెడిదో వైచ రాజు

పాఱవేయుచెకాని భక్ష్యంబులిచ్చిన
వాతెర నంటదవ్వాలు గంటి
చించివైచుచె కాని చీరలిచ్చినఁగటీ
రమునఁగై సేయదా అంపెలాఁడి

పద్య 183.

అను పద్యమున వివరించినాడు. ఆమె చేష్టలకా ముదుసలి యెట్లు బాధపడెనో

మొరడు వంగిన సెట్టి ముదుకకు జవరాలి
మోముగానని వాని ముకురమయ్యె
వగ్గు భర్తకు నాఁతివాతెర చండాల
వాటి వండిన పిండి వంటలయ్యె

పద్య 185

అను సీసపద్యమున నెంతయో దయనీయముగా వైచరాజు చిత్రించి నాడు. ఈ యమూలక వర్ణన మామె స్వభావమును జెప్పక చెప్పు చున్నది.

5. ఒక్కొక్క సన్నివేశమున పాత్ర మనః స్థితి యొక్కొక్క విధముగ మారుచుండును. తానెదుర్కొను సంఘటనమును బట్టి మనః స్థితి గతులు భిన్నములుగా మార్పునొందుట మనుష్యులలోనే గాక పశుపక్షు

లందును గానవగును. అట్టి మనః స్థితిని మనోజ్ఞముగ బోషించుట పాత్రి చిత్రణ నైపుణ్యములో ప్రాధాన్యము వహించును. పెక్కు కథలలో బంచతంత్ర చంపూకర్తలు సన్నివేశానుకూలముగ బాత్రల స్థితి గతులపోషణలో నెంతయో సామర్థ్యమును వెల్లడించినారు.

మిత్రభేదమందలి ఆషాఢభూతి కథలో ఐశ్వర్యమును గోల్పోయిన వ్యక్తిపొందు మానసికవ్యథ యెట్లుండునో పరివ్రాజకుని పాత్రిలో బోషింపబడినది. మూలమున ధనము గలకంథ నాషాఢభూతి యపహరింప ఆ పరివ్రాజకుడు పొందిన మనోవికలత 'హాహా ముషితోఽస్మి ఇతి జల్పన్ పృథివీతలే మూర్ఛయా నిపపాత. తతః క్షణాచ్చేతనాం లబ్ధ్వా భూయోఽపి సముత్థాయ పూత్కర్తుమారబ్ధవాన్. భో ఆషాఢభూతే, క్వమాం వంచయిత్వా గతోఽసి తద్దేహి మే ప్రతివచనమ్. ఏవం బహువిలప్య తస్య పదపద్ధతి మన్వేషయన్ శనైః శనైః ప్రస్థితమ్.' అని వర్ణింపబడినది. బైచరాజు పరివ్రాజకుడు బొంతకై 'నిప్పుద్రొక్కిన కోతి వడువున మడమలూదక' మఠంబునకు వచ్చినాడని (ఆశ్వా 1-వచ 236) పేర్కొనుట యమూలకము. ఆయా పద్యమాపాత్ర మనః స్థితిని మనోజ్ఞముగ నిరూపించుచున్నది. నోరెండగా నెక్కువ బాధతో సన్యాసి శిష్యుడైన ఆషాఢభూతిని బిలుచుచున్నరీతిని బైచరాజు

తానకమున నిజశిష్యుం
గానక యాషాఢభూతిగా రారా తే
రానాసొమ్మని చీరు
స్దీనత నోరెండ యతి యతివ్యథతోడన్

ఆశ్వా 1-పద్య 237

అని వివరించినాడు. ఇంకను పరివ్రాజకుని యారాటము సహజసుందరముగ బైచరాజుచే

వెలవెల్లనై మఠాలయము వెల్వడుఁదాపనివక్త కంథకై
కెలఁకులఁజూచు భూమిసురగేహములారయు నేఁడు భిక్షకై

తెలతెలవేగి శిష్యుఁడరుదేఁడు గదా కనుఁగొన్నఁ జెప్పరే
కలుష విదూరులార పనిగల్దను నుస్సను సూర్చు హోయనున్
పద్య 236.

అని యభివర్ణింపబడినది. వెలవెలబోవుట మఠమును వీడి బైటకు వచ్చుట దిక్కులు చూచుట, బ్రాహ్మణగృహములు పరికించుట ఇతరుల నాషాఢ భూతిని జూచినచో జెప్పుడని యర్థించుట పరివ్రాజకుని సంక్షుభిత మానసిక వ్యథను విశదపఱుచుచున్నది. అక్లే యు స్సురనుట నిట్టూర్పులు పుచ్చుట హోయనుట గూడ యతి మనస్థితి నిరూపకము. ఆషాఢభూతి నన్వేషించుటలో నతడు పొందిన శ్రమ

అడిగినవారిం గ్రమ్మఱ
నడుగంజనుఁ జనినకడకు నతఁడార్తుండై
గుడిగుండమనక పల్లియ
పడుసర నాకరయుఁ జెఱిచి పఱచిన శిష్యున్.

పద్య 240.

అని పేర్కొనబడినది. ఆ తాపసి స్నానమొనర్చుటకు గాని ఓంకార ముచ్చరించుటకుగాని తిరుగుటకుగాని యవశుడై తాపభారముచే రేయింబవళ్ళు విలపించినాడని

స్నానమొనర్ప దీమసముచాలక నోంకృతి నోరఁ బేర్కొనం
గానక భిక్షుకుండు దిరుగం జరణంబులు రాక ద్రివ్యకం
థా ననుఁబాసితే యనుచుఁదాపభరంబున మేన్చలింప లో
లోనడలూన రేయుఁబగలు న్విలపించు నతండు దీనతన్

పద్య 242.

అని బైచరాజిట్లు వర్ణించినాడు. ఆర్జింపబడిన ధనమపహరింప బడినపుడు వ్యక్తులు పొందు మానసిక సంతాపమెట్లుండునో బైచరాజు ఈ ఘట్ట మున నత్యంత మనోహరముగ జిత్రించినాడు. ఈ కథలోనే బైచరాజు నిర్దోషి నేరారోపణము పొంది శిక్షింపబడునప్పుడెట్లు బాధనొందునో

నాపితుని పాత్రియందు నిరూపించినాడు. ఏపాపము నెఱుగని నాపితుడు సకలదోషములకు నెల్లవైన యాతని భార్యమాటలచే దోషారోపణము నొంది శిక్షింపబడినపుడు పొందిన మానసిక సంక్షోభమును

ఇటునటు నన నోరాడక
తటతట నెద యదర నోరఁదడిలే కొడలా
రట పడఁగ నుండెనపుడ
చ్చట మంగలి తొంగలించు సంత్రాసమునన్

పద్య 274.

అని వర్ణించినాడు. మాటరాకుండుట, గుండెదడ నొందుట, నోట దడి యారుట, శరీరమారాటపడుట యకారణముగ శిక్షనొందిన నాపితుని మనః స్థితిని స్పష్టపఱుచు చున్నవి. మూలమున నతడేమియు ననలేక తూష్ణీభావము నొందినట్లు' నాపితోఽపి ప్రహారపీడితతను ర్వక్తుం నశశాక. అథ తం తూష్ణీభూతం దృష్ట్వా' అనిగలదు.

మిత్త్రభేదమందలి వానరము-కీలోత్పాటన మనుకథలో నట్టు వకత్తె పొందిన విషబాధను దొలగించుటకై వైద్యులు యత్నించి విఫలులై యెట్లు బాధనొందిరో బైచరాజు

కాటుపట్టున గత్తివాటులు వైచి ని
ర్విషమూఁది మనకున్న విసివె నొకఁడు
ఘటపూర్ణ మంత్రి పుష్కరధార లెత్తించి
గుణముగానక రోసి గునిసె నొకఁడు

ఆశ్వా 1-పద్య 120.

అను సీస పద్యమున మధురముగ జిత్రించినాడు. విఫలమనోరథులైన విషవైద్యుల మనఃస్థితి యిందు మనోజ్ఞముగ బోషింపబడినది.

కపిహృదయము దొరకినగాని భార్యరుజ శాంతింపదను వార్త విన్నప్పుడు క్రకచము పొందిన యవస్థను లబ్ధప్రణాశమున దూబగుంట నారాయణకవి

అతని వధించు టెంతయు మహాదురితంబు సమస్తధర్మసం
తతికి నిధానమీ సతి వృధా మృతిబొందినఁ బాపమీ యెడన్
మతిఁదలపోయ నిద్దఱును మాన్యులె యైనను భార్యరక్షదా
సతిశయ ధర్మమంచుఁదగ నార్యులు చెప్పఁగ వింటు నెట్లనన్.

పద్య 32.

అని వర్ణించినాడు. పరమ మిత్త్రుని వధించుట మహాపాపము. సమస్త ధర్మకార్య నిర్వహణమునకు భార్య యత్యంతావశ్యకమగుటచే నామెను రక్షించుట ముఖ్యవిధి. ఇట్లు భిన్నపరిస్థితులమధ్య నలిగిన మొసలి మన స్తత్త్వమును నారాయణకవి చిత్రించిన విధ మత్యంత ప్రశంసార్హము ఇది యమూలకము. ఇట్లే తనహృదయమున్నకై మకరపతి తన్ను వధింప నున్నట్లు పిడుగు వంటి వార్తవినిన మర్కటేంద్రుని మానసికాందోళన మును దూబగుంట

సగము చచ్చిన మేనితోఁ జకితుఁడగుచుఁ
గంపమొందుచు వృద్ధ మర్కటము మూర్ఛ
మునిఁగి కన్నులు గానక మునిగిఁ కొంత
వడికిఁదెప్పఱి యాత్మదైవంబుఁ దూఱి

పద్య 65.

అని వర్ణించినాడు. వేంకటనాథుఁడా కపి మనోవేదనను

నగచరుఁడదివిని వెఱఁ బం
డ్లిగిలిచి వడవడ వడంక యెదపడి చెడితిన్
దెగితిఁ గడచనితిఁ బొలిసితి
బొగరున నిట్లయితి మోసపోయితి ననియెన్

ఆశ్వా 4—పద్య 76.

అని రచించినాడు. ఆత్మమరణవార్తా శ్రవణమున చపల స్వభావము గల కపి పొందిన హృదయ పరితాపము, తదనుగుణముగ ననుభవించిన యాందోళనము దూబగుంట బైచరాజుల రచనలలో మనోజ్ఞముగ జిత్రింపబడినవి. బైచరాజు పద్యాగమనము గూడ కపిహృదయ స్థితి

నిరూపణసమర్థకముగా నున్నది. ఇది యమూలకమగుట తెనుగుకవుల పాత్రి చిత్రిణ నైపుణ్యమును విశదపఱుచు చున్నది.

6. ఒక్కొక్క సన్నివేశము నందు వ్యక్తుల మనఃస్థితిలో ఊహాతీత మైన మార్పుగల్గు చుండును. ఆ మానసిక పరిణామమును జిత్రించు టయు బాత్రచిత్రణమున ప్రాధాన్యము వహించును. బైచరాజు వేంకటనాథుఁడు' వృద్ధవణిజుఁడు–చోరుఁడు' అనుకథలో బాత్రిలమనః పరివర్తనములను మనోహరముగా జిత్రించినాడు. దోచుకొనుటకై వృద్ధ వైశ్యునింట ప్రవేశించిన చోరుడు అతని స్థితిగతుల నెఱిగి జాలినొంది యైశ్వరము నపహరించు తలంపును వీడుటయే గాకయతడు స్వీకరింపు మని ప్రార్థించినను నిరాకరించినాడు. మీదు మిక్కిలి యాముదుసలి సెట్టి భార్యను సోదరిగా భావించి యాధన సర్వస్వము నరణముగా నిచ్చుచుంటినని యతడు

నీ నిలయంబునఁగల సొ
మ్మేనొల్లం బడుచు కరణమిచ్చితి నిదినీ
తో నలగిన వేసారిన
చో నను మదిఁ దలఁపు మలయుచుం బఱతెంతున్.

ఆశ్వా3–పద్య208.

అని పలికినాడు. చోరునిలోగల మార్పు మనోజ్ఞముగా నిరూపింపబడి నది. ఇతః పూర్వము వృద్ధభర్త నసహ్యించు కొనిన యాతని భార్య చోరునుపదేశాను సారముః నావృద్ధ భర్తకు సమస్త సౌఖ్యముల నొసంగి నది. భార్యా సౌందర్యాస్వాదనమును శశవిషాణ ప్రాప్తిగా దల పోసిన యావృద్ధవణిజుడు ఆకస్మిక దాంపత్య లాభమును బొంది యామె లావణ్యము నెట్లు కొల్లగొట్టినాడో బైచరాజిట్లభివర్ణించినాడు.

రాజ్యాస్వ్యముఖ కౌమరస వాసనల గుర్రిక్క
నాను ముక్కున బంటియైన దనుక

ధరపయోధర సుధాధర రసంబునఁ జొక్కఁ

బంచ బాణపిపాస పాయు దనుక

... ... ... ఆశ్వా3-పద్య 211.

పరివర్తనము నొందిన పిదప ఆ వృద్ధ వైశ్యుని భార్యా పాతివ్రత్యమును సకలలోక శిరోధార్యముగ నిట్లు బైచరాజు వర్ణించినాడు.

ఉదయవేళకు మున్నె నిదురమేల్కాంచి వచ్చి

ప్రాణవల్లభు పదాబ్జముల వ్రాలు

వ్రాలి నిర్మలతర జ్వలన తప్త సువర్ణ

కలశోదకంబుల జలకమార్చు.

... ... ... పద్య 212.

ఈ పద్యమందలి ముక్తపదగ్రస్తము సార్థకము. ఈ కథయందు బైచరాజు గావించిన పాత్రల మనః పరిణామ చిత్రణము ఆతని పాత్రచిత్రణ సామర్థ్య నిరూపకము.

7. మూలమందు గథాకథనమున పాత్రలకు సంబంధించిన కొన్ని కథాంశము లతిస్వల్పముగ చేర్కొనబడగ వానిని వివరణ ప్రాయముగ రచించుట చంప్వనువాదకుల పాత్రచిత్రణ వైశిష్ట్యమును దెలుపుచున్నది. నన్నయాదుల పద్ధతినే వీరుననుసరించుట గణనీయము.

మిత్రభేదమందలి ఆషాఢభూతి—జంబుకము—దూతియను కథలో భార్యపై కోపము నొందిన నాపితునుద్దేశించి 'కోపావిష్టః' అనిమాత్రమే కలదు. ఆతని కోపమును దూబగుంట 'తొత్తుల తొత్త వేచడమ దూల పిసాచి యటంచు నాత్మలో నెత్తిన తీవ్రకోపమున' (మి. భే-పద్య 205) అని అచ్చతెనుగు పదములతో దిట్టుచు మనస్సునందు దీవ్రమైన కోపము నొందినాడనుట మూలమునకు వివరణాత్మకము.

కాకోలూకీయ మందలి గజయూథపతి—శశమను కథలో గజముల గమనము 'ఇతస్తతో భ్రమద్భిః' అని పేర్కొనబడెను. కథా ప్రవృత్తిలో గజగమనము ప్రాధాన్యము వహించుటచే నారాయణకవి దితిజకులౌపమ్య ప్రదర్శన పూర్వకముగ గజసంచారౌద్ధత్యమును

పాదఘట్టననేల భార మగ్గలమైన
 క్రుగ్గి దిగ్గజములు క్రుగ్గిపడఁగ
నురువడిఁబాఱుచో నెరసిన తరులెల్లఁ
 దిట్టలై మహీజాఁపకట్టు వడఁగ
ఘీంకార రవము సంకీర్ణమై పర్వఁగ
 దండకొండలు ప్రతిధ్వనులనీనఁ
గర్ణజానిలమున గగన భాగమునకుఁ
 దేలి మేఘంబులు దూలి పోవ

దేవసైన్యంబులకు నోడి దితిజకులము
నిలువఁ జోటెచ్చటను లేక జలధి చొరఁగఁ
బాఱు తెంచిన చందమై భద్రకరులు
త్వరిత గమనంబునను సరోవరము చేరె

సంధివి గ–పద్య 86.

అని యభివర్ణించినాడు. గాఢసకుల సామ్యము ఆమూలకము. భద్రకరుల సంచారౌద్ధత్యము మూలమునకు వ్యాఖ్యాప్రాయము.

కాకోలూకీయమున వృద్ధవణిక్కు–చోరుఁడునను కథలో వృద్ధ వణిజుని నాతనిభార్య చోరభయముచే జేరినవిధము 'సాఽపి తం చౌరం దృష్ట్వా భయవ్యాకులితా వృద్ధమపి తం పతిం గాఢం సమాలిలింగ' అని రచింపబడినది. సమాలిలింగ యను మూలమునకు వివరణ రూపముగ దూబగుంట

కరికుంభములకంటెఁ గడుసైన చనుదోయి
 యుగ్మలి బిగియార నొత్తియొత్తి
బిసకాండముల కంటెఁ బసమించు కరముల
 నతివ యంతంతకు నలమి యలమి
పల్లవంబులకంటె బాగైన కెంగేల
 లలితాంగి యల్లన తెలిసి తెలిసి

పికనాదమున కంఠమెం బెంపారు నెలుఁగున
బింబోష్ఠి పలుమాఱు పిలిచి పిలిచి

సంధివిగ్రి-పద్య 186.

అని యభివర్ణించినాడు. వైచరాజు గూడ విధిప్రేరణమున నామె ముదుసలి భర్త నాలింగన మొనరించిన విధమును

కచభరము విరియ హార
ప్రచయంబల్లాడఁ బఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ
కుచలికుచాగ్రములు నాటుకొనఁ బ్రాణేశున్

ఆశ్వా 3-పద్య 201.

అని వర్ణించినాడు. ఇట్లు మూలమును వివరించి రచించుట చంపూకర్తల పాత్రచిత్రిణలో నొక ప్రత్యేకత.

8. పాత్రోత్కర్షకముగ మూలకర్త యభిప్రాయమునకు మెఱుగులు దిద్దుట చంపూంధ్రికర్తల పాత్రిచిత్రిణలో గననగు విశిష్టత. చిన్న విషయమునందైనను గావ్యత్వమును బోషించుట వీరి రచనా సంకల్పము.

ఆషాఢభూతి కథలో దేవశర్మయను పరివ్రాజకుడు ధనముగల తన బొంతను రేయింబవళ్లు విడువలేదని 'నక్తం దివం కక్షాంతరాత్తాం మాత్రాంన ముంచతి' అని మూలమున గలదు. బొంతపై దేవశర్మకు గల వ్యామోహమును వర్ణించుట భావికథ కత్యంతావశ్యకము. కావున వైచరాజు

కలదా సన్యాసికి బహు
కలధౌత సువర్ణ పూర్ణ కంథ సదా య
బ్బలుగు యతి మరపు మోసము
గలనేనియు లేక దానిఁగని రక్షించున్

స్నాన మొనరించునప్పుడు జపము సేయు
నపుడు కరపాత్రమున భిక్షమడుగునపుడు
పండునపుడును బొంతపై నుండు మనసు
బీదగఱిచిన బూరె యబ్భిక్షుకునకు

ఆశ్వా 1-పద్య 217, 218.

అని దేవశర్మకు బొంతపైగల వ్యామోహమును వర్ణించినాడు. మఱచి పోవుట, మోసపోవుట స్వప్నమందైనను బొందక బొంతనాతడు రక్షించు చుండుననియు, అతనిమనస్సు స్నానమాచరించునపుడు, జప మొనరించు నపుడు, భిక్షించునపుడు, పండుకొనునప్పుడును బొంతపై సంలగ్నమై యుండునని రచించుటలో మూలమునకు సొగసు చేకూరినది.

ఆషాఢభూతి పాత్రచిత్రణమునను బైచరాజు మూలమునకు మెఱుగులు దిద్దినాడు. భిక్షకేగిన గృహమందలి పూరిపుడక తనవస్త్రము నకు దగిలి వచ్చినదని పరమకపట స్వభావుడైన ఆషాఢభూతి పొందిన పరితాపవర్ణనము అమూలకము. నారాయణ కృష్ణ అని । మొక్కుచు గురుని సమీపించెననుటలో నాతని స్వభావము స్పష్టపడుచున్నది. అతడు గురుని సమీపించినప్పటి స్థితిని బైచరాజు

వెలవెలని మోముతో మఱి
యెలుఁగొందఁగ గురునిఁజూచి యెవ్వరికెందుం
గలుగని కలుషము నాకిదె
గలిగెనయో యెట్టిపాపకర్ముఁడ నొక్కో

ఆశ్వా1-పద్య 221

అని వర్ణించినాడు. వెలవెలబోవుచున్న ముఖము, అయ్యో యెట్టి పాప కర్ముడ నొక్కో-యని పడుచున్నబాధ పరద్రవ్యముపై నతని కెంతటి వైముఖ్యము గలదో నిరూపించుచున్నవి. కనుంగవయందు జలజల అశ్రువులు ప్రవహింప నాగడ్డిపుడకను భిక్షకై వెడలినవారి యింట విడిచివత్తునని యతడు గురుని ప్రార్థించుటలో విశ్వాస పాత్రత గల్పింప

బడినది. నేయిపూసినకత్తి, గోముఖ వ్యాఘ్రము, అను నుపమానము లచే ఆషాఢభూతి స్వభావమునంతటిని బైచరాజు వ్యక్తపఱచినాడు. అమూలకమైన పూరిపుడక వృత్తాంత కల్పనచే ఆషాఢభూతి స్వభావమును మెఱుఁగులు దిద్దుచు బైచరాజు చిత్రించుటలో జూపిన శిల్ప నైపుణ్యమనల్పము.

మిత్రభేద తంత్రమున మదోత్కటమను సింహము– కాకద్వీపి జంబుకోష్ట్రములు నను కథలో గాకాదులు మృగపతి కాహారము దెచ్చుటకై వనమున దిరిగి యొక్క జంతువును గూడ బొందలేదని 'అథ తే చత్వారోఽపి భ్రమితుమారబ్ధా, యావన్నకించిత్ సత్త్వం పశ్యంతి,.....' అని మూలమున గలదు. దూబగుంట నారాయణకవి కాక వ్యాఘ్రాదులు కాననము వెదకుటను

పొదలు సొచ్చి చూచి పుట్టలు వీక్షించి
చెట్టుగుట్ట మొదలు చేరి కాంచి
గిరులు నదులుఁ దొనలు బరికించి పరికించి
కాన నొక మృగంబుఁ గానలేక

మి. భే. పద్య-386.

అని యభివర్ణించినాడు. గుట్ట పుట్ట వెదకిరని చెప్పుటయే గాక పరికించి పరికించి యని పునరుక్తితో జెప్పుటచే వారుపడిన శ్రమ, వారికిగల ప్రభుభక్తి వ్యక్తమగుచున్నది. మూలమునకు నారాయణకవి చక్కగ మెఱుగులు దిద్దినాడు. అట్లే బైచరాజు రచనలో ఉష్ట్రవధచే బుభుక్షు దీర్చుకొనుమని బహూపపత్తులతో వాయసము సింహమున కుపదేశించుట అమూలకము. జంబుకమునకు బదులు వాయసముండుట విశేషము. అందు బులి పాము దయారహితముగ దమ సంతానమునే యాహారముగా స్వీకరించునని

నిలుపోపరాని యాఁకటఁ
బులి పిల్లల భుజగమండముల భక్షించున్

గలుషమునకు రోయునె నీ
తులు దలపోయునె బుభుక్షితుఁడు చిత్తమునన్

ఆశ్వా 1- పద్య 501.

అని పలికి యాకరటకము విశ్వామిత్రుఁడు కుక్కమాంసమును దినుట. ఒకరాజు తన శరీరమును దానే తినుట యను వృత్తాంతములను గూడ

కుక్షిదరికొన్న పట్టున
వీక్షించునె దేహిరుచులు వేళలు మునిహా
ర్యక్షము విశ్వామిత్రుఁడు
భక్షింపఁడె సారమేయ పలలముఁదొలుతన్
కలశజుఁడు చూడ నొకరాజు కానలోన
దండియాఁకటఁ దనమేను దానె తినఁడె
వటుపుతల్చి బుభ్యాధనులు గీర్వాణమునులు
చేటిపీనుఁగుఁగఱచి భక్షింపరొటు.

ఆశ్వా 1-పద్య 503,504.

అని వివరించినట్లు రచింపబడినది. ఒక కాపుకొడుకు భార్యాపుత్రాదులను వధించి తినిన వృత్తాంతమును, సస్యములను బోషించి ప్రజలు కోసికొని యనుభవించు వృత్తాంతమును గూడ గాకమీ సందర్భమున నుదాహరించినది. 'మొఱయిడు శ్వా(శ్రీ)తావనసమో న హి ధర్మవటంచు వేదముల్' అని వేదోక్తిని గూడ బేర్కొని పరివారమును గూడ నుష్ట్రమాంసప్రదానముతో ననుగ్రహింపు మని కరటకుఁడర్థించినట్లు బైచరాజు రచించినాఁడు. ఈ యుపపత్తులన్నియు నమూలకములు. సందర్భమున కెంతయో పుష్టినొసంగునట్టివి. ఇక్కడ వాయసమునకు బదులు జంబుకమే యీ సంభాషణము గావించినట్లు మూలమునసుండుట యెంతయేని సముచితమనక తప్పదు.

మిత్రభేద తంత్రమున ప్రధానకథయందు పింగళకునితో దమనకుఁడు దన్ను నక్కమాత్రముగా జూడవలదనియు జన్మముకంటె స్వగుణ సంపత్తియే ప్రకాశింపదగినదని

కౌశేయం క్రిమిజం సువర్ణముపలా ద్దూర్వాఽపి గోరోమతః
పంకాత్తామరసం శశాంక ఉదధేరిందీవరం గోమయాత్
కాష్ఠాదగ్నిరహేః ఫణాదపి మణి ర్గోపిత్తతో రోచనా
ప్రాకాశ్యం స్వగుణోదయేన గుణినో గచ్ఛంతి కా జన్మనా

శ్లో॥ 103

అని పల్కినట్లు గలదు. ఇందు బట్టుబట్ట, బంగారము, దూర్వలు పద్మము, మున్నగునవి హీనములగు పదార్థముల నుండి పుట్టినవని వివరింపబడెను. చైతన్యరహితపదార్థములే యిందుదాహృతములు. దూబగుంట నారాయణకవి పుండరీకాక్షుఁడు, మహర్షి, షడాననుఁడు, ఇంద్రాగులు క్షుద్రజన్మ గలవారే యనియు వారు లోకారాధ్యులే యనియు

సూకరరూపంబు భీకరంబుగఁ దాల్చి
  పుండరీకాక్షుండు పొగడువడఁడె
మృగరూపమునఁ బుట్టి జగతి ప్రసిద్ధుఁడై
  మునిసురేంద్రువి చేత మ్రొక్కుగొనఁడె
ఛాగస్వరూపంబు షణ్ముఖుండు ధరించి
  సురసమూహమునఁ బ్రస్తుతి గనండె
యింద్రాగ్నులిరువురు నెసఁగంగఁ బక్షులై
  బృథుల సత్కీర్తులఁ బెంపుగనరె

యల్పజంతువులని వారి నాదరింప
కుండెనే తొల్లి సురముని మండలంబు
గాన నీవును నన్ను జుల్కఁగాఁదలఁ పక
చిత్తమునఁ జేర్చి నామాట చిత్తగింపు

పద్య-137

అని రచించినాడు. భానుకవియు నారాయణకవి భావములనే గ్రహించి

హరియును బోత్రిగాత్రిధరుఁడై శరజన్ముఁడు ఛాగరూపియై
సరసిజబాంధవుండు హయసంహనుఁడయ్యె (నుమున్) మహేశ్వరాం

బురుహ భవాదిదేవ పరిపూజ్యులుగారె మృగేంద్ర! శౌర్య భా
సుర! నను నక్కమాత్రముగఁ జూడకుమీ మది నీకుఁబూజ్యుఁడన్

ఆశ్వా 1–పద్య 102.

అని రచించినాఁడు. భైరవరాజు వేంకటనాథుఁడు

హరి సూకర రూపంబున
హరిజాది మృగాకృతుల మహాత్ముల జంపై
హరిసుతుఁడు పూజ్యులై యుం
డరె వారల గౌరవంబు గరిమ వడియెనే

ఆశ్వా 1–పద్య 176.

అని రచించినాఁడు. మూలమున ప్రాణరహిత పదార్థములభివర్ణింప బడగా నాంధ్రీకర్తలు మువ్వురు వైకుంఠ షాణ్మాతురాది దేవతలనుగ్రహించి వర్ణించుట మూలమున కుత్కర్ష చేకూరినది.

అట్లే సంజీవకుఁడు తన్ను జంపనున్నాడనుటకు నిదర్శన మేమియని పింగళకుఁడు దమనకు నడుగగా నాతడు తనయొద్ద ప్రతిన సలిపినాడనియు నారక్తనయనముఖుఁడు, స్ఫురితాధరుడునై యాతడు దిక్కులవలోకించుచు ననుచితస్థానస్థితుడై దర్శింపగలడనియు 'యదద్య మయాగ్రే తేన నిశ్చయః కృతో యత్ప్రభాతే పింగలకం వధిష్యామి తదత్రైవ ప్రత్యయః ప్రభాతేఽవసర వేలాయా మారక్తనయన ముఖః స్ఫురితాధరో దిశోఽవలోకయ న్ననుచిత స్థానో పవిష్టస్త్వాం క్రూర దృష్ట్యా విలోకయిష్యతి' యని సమాధానమొసంగినట్లు మూలమున గలదు. సంజీవకుని యుద్ధోద్యమమును భయంకరాకృతిని నారాయణకవి

కొమ్ములఁ గ్రుచ్చియెత్తియును ఘోరఖురాగ్ర నిపాతనంబులన్
జిమ్మియు దంతఘాతములఁ జించియు వాల విశాలచాలనో

గ్రమ్మఁల నెమ్మఁ లెల్లఁ గడికండలుగాఁ జదియంగ మోఁదియున్
సమ్మదమారఁజ ంచు మృగసత్తమ యేమఁ జీయుండి తేనియున్

ఆశ్వా 1-పద్య 334

అని కన్నులకు గట్టినట్లు రచించినాడు.

పింగళకుఁడు తన్ను వధింపగలడని యెట్లెఱుంగనగునని సంజీవకుఁడు దమనకుని ప్రశ్నింపనతడు 'ఏష తే ప్రత్యయః యది రక్తనేత్రః త్రిశిఖాం భ్రూకుటిం దధానః సృక్విణీ పరిలేలిహ త్వాం దృష్ట్వా భవతి తద్దుష్టబుద్ధిః అన్యథా స్వప్రసాదశ్చేతి' అని పలుకును. పింగళకుని వైమనస్య స్థితిని సూరబగుంట నారాయణకవి

మునుగాళ్లు రెండు తోఁకయు
ఘనములుగా మీఁదికెత్తి కడు వివృతముగా
నొనరించిన వదనముఁగని
మనమునఁదల పోయు కలహమతిగా నతనిన్

ఆశ్వా 1-పద్య 481.

అని మనోజ్ఞముగా జిత్రించినాడు. భానుకవి

లాంగూలం బల్లార్చి క
నుంగవ ద్రిప్పుచును నోరనురువులు గ్రమ్మన్
ప్రమోఁగుచు నుండిన నెఱుఁగుము
సింగము జగడమ్మునకును జేరెనటంచున్

ఆశ్వా 1-పద్య 271.

అని రచించినాడు బైచరాజు పింగళకుని భయంకర యుద్ధరూపమును

కలనికిఁ బింగళకుండెటు
వలె నుండఁగఁ బోదునవిన నాఁడురు దంష్ట్రల్

వెలువడిన వదనముం జెడ
తల వాలము నుండ వానతజేఁ బొమ్మనియెన్

ఆశ్వా 1-పద్య 654.

అని కమనీయముగ నభివర్ణించినాఁడు. సంజీవకు నెదుర్కొనుటకై సింహమేస్థితిలో నుండునో వర్ణించుటలో ననువాదకులు మువ్వురు మూలమునకు మెఱుఁగులు దిద్దిన విధమభివంద్యము.

ప్రభాతసమయమున సంజీవకునిజంపి సమస్తమృగములకు దృప్తిగా నాహారము నొసంగుదునని పింగళకుఁడు తనతో జెప్పినాడని దమనకుడు సంజీవకునకు 'యః ప్రభాతే సంజీవకం హత్వా సమస్త మృగపరివారం చిరాత్ తృప్తిం నేష్యామి' అని తెలిపినట్లు మూలమున గలదు. దూబగుంట నారాయణకవి పింగళక నిశ్చయమును

కొలువునకీవురాఁదడవ ఘోరకరాళ విశాల దంష్ట్రిలన్
మెలఁగఁగ నిన్నుఁబట్టి బలిమిన్ గళరక్తము మున్నుగ్రోలిక
ట్టలుక నిజాశ్రిత ప్రతతికంతటికిన్ భవదీయ మాంస మ
గ్గలముగఁ బంచి పెట్టుటకుఁగా నియమించె మృగేంద్రుఁడు గ్రతన్

ఆశ్వా1—పద్య 347

అని యత్యంత సహజముగ నుండునట్లు రచించినాడు. పింగళకునిభయంకరమైన కోరలు, సంజీవనికుపై బడిరక్తమును బీల్చుట, ఆశ్రిత జంతువులకు మాంసమును బంచిపెట్టుట మున్నగు ఘోరకృత్యము లన్నియు బింగళకుని దుర్వారమైన యాగ్రహమును స్ఫురింప జేయుచున్నవి.

అట్లే సంజీవకుఁడు పింగళకు నెదుర్కొనిన విధము మూలమున 'అథ సంజీవకః ఖరనఖర వికర్తితపృష్ఠః శృంగాభ్యాం తదుదరముల్లిఖ్య కథమపి తస్మాదపేతః శృంగాభ్యాం హంతుమిచ్ఛన్ యుద్ధా యావస్థితః' అని చెప్పగా బైచరాజు సంజీవక యుద్ధ విజృంభణమును

జేవురు సోబకన్గొనలఁ జిప్పిల నూప్పుల వెంట నుజ్జ్వల
త్పావక కీలలోలిఁగనుపట్టఁగఁ గొమ్ములు వంచి కానన
గ్రావములం బ్రతిధ్వనులు గ్రాల ఖణిల్లన అంకవైచి సం
జీవకుఁడా గ్రహింపడర సింహముపైఁ బడియెన్మహోద్ధతిన్

ఆశ్వా-పద్య 658.

అని వర్ణించుట మూలమునకు వన్నెచేకూరినది. ఈ సందర్భమున మూలమున పింగళక సంజీవకుల యుద్ధవిశేషములను భానుకవి 'భీమ హిడింబులట్లు పోరందొడంగిన' అని (ఆశ్వా 1-వ 276) రచించుట యమూలకము. బైచరాజు

సంజీవక పింగళకుల
ఖంజ పరాక్రమము లడరఁగాఁ గయ్యముసే
యంజొచ్చిరపుడు మహిభృ
త్కుంజర ఫణి ఘోణి కూర్మ కులపతులదరన్

ఆశ్వా 1–పద్య 659

అని వర్ణించుటయు నమూలకమే. సందర్భోత్కర్షకముగా నున్నది.

కాకోలూకీయమందలి వృద్ధ వణిజుఁడు—చోరుఁడు అను కథలో చోరునివలన వృద్ధవణిక్కునకు భార్యా పరిరంభణ సుఖమబ్బుటచే నతడు కృతజ్ఞతతో దనయైశ్వర్యమును గ్రహింపుమని పలికినట్లు

యా మమోద్విజతే నిత్యం సా మామద్యావ గూహతే
ప్రియకారక భద్రంతేయన్మమాస్తి హరస్వ తత్.

శ్లో 187.

అని మూలమున గలదు. నారాయణకవి యనువాదమున

ఈ రమణీలలామ నను నెప్పుడు వృద్ధునటంచు దగ్గఱం
జేరదు నేఁడు నిన్నుగని చెందిన భీతని గౌఁగిలించుటన్.

హారి విశేష సౌఖ్యములనంది కృతార్థుఁడనైతి నావుఁడున్
నారుచిరార్థ సంపద గొనందగు నిచ్చెదఁ బుచ్చుకోనగా

సంధివిగ్రహ-పద్య 190.

అని వృద్ధ వణిజుఁడు పల్కినట్లు గలదు. ఇందామె యూతని నస హ్యించుకొను రీతి, చోరుని వలన నాతఁడు సుఖించిన విధము చక్కఁగ నిరూపింపబడెను. ప్రతిపదము నర్థస్ఫోరకముగ మూలమునకు మెఱుఁగులు వెట్టుచు నారాయణకవి రచించిన పద్యము శ్లాఘనీయము.

బైచరాజు గోపకాంత-జారద్వయమునను హితోపదేశము నందలి కథను మిత్రభేద తంత్రమున సమయోచితముగ ననువదించినాఁడు. ఆకథ యందు గోపకాంత వచ్చుచున్న భర్తను జూచి దండనాయకునితోఁ 'దండనాయక త్వంలగుడం గృహీత్వా కోపం దర్శయన్ సత్వరం యాహి' అని చెప్పినట్లు మూలమున గలదు. తెనుగున నామె యుపదేశమును బైచరాజు

కసరెత్తి ముక్కుడుస్సిన
పసరమువలె రేఁగి పరుషభాషల నన్నున్
విసువక పగఁజాటుచుఁ బో
మ్మసమున నన దండపాలుఁ డట్లొనరించెన్

ఆశ్వా 1-పద్య 600.

అని రచించినాడు. ముక్కుడుస్సిన పసరమువలె నను నుపమానము మూలకము అట్లే మూలమున దండనాథుని కొడుకు గోపకాంత యింట ప్రవేశించిన విధముఁ 'అయం కేనాఽపి కారణేన పుత్రిస్యోపరి క్రుద్ధః సచ పలాయమానోఽత్రాగత్య ప్రవిష్టః' అని చెప్పబడెను. పుత్రుని దఱుము చున్న దండనాథుని క్రౌర్యమును, బుత్రుని దైన్యమును బైచరాజు

వెడ వెడ నార్చుచుఁ బెఱికిన
పిడియము వలకేలఁ గ్రాల బిఱబిఱ వెంటం

బడి యాహో యెడు ముద్దుం
గొడుకుం దెగఁ జూచె నెందుకోనే నెఱుఁగన్

తఱుముడువడి మేన్వడకం
బఱిపడి యగు తాల్మిఁజావు పలువెత్తి యహో
వెఱపున నిలుసొచ్చినఁగడు
నఱిముఱిఁ జేపట్టి కలఁచినట్లయ్యెఁ బఱి

ఆశ్వా 1–పద్య 604, 605.

అని మనోహరముగ నభివర్ణించినాడు. దండనాథుని క్రౌర్యము, పుత్త్రుని వెఱపుతో గూడిన చావుపరుగులు కన్నులకు సాక్షాత్కరించినట్లు బైచరాజు రచించినాడు. కుసూలము నుండి బైటకు వచ్చిన దండపాలుని సుతుడు 'నిరవధిక రాహుముఖ గహ్వర నిర్గత శీతభానుఁడని' బైచరాజు వర్ణించుటయు నమూలకము. బాలుని స్థితినా యౌపమ్యము చక్కగ నావిష్కరించు చున్నది. ఇట్లు పలుతావులలో అనువాదకులు మూలమునకు మెఱుగులు దిద్ది తమ పాత్రచిత్రణ సామర్థ్యమును నిరూపించు కొనిరి.

9. సమాజములో వ్యక్తుల మధ్య బహు విధములైన సేవ్య సేవక, స్నేహ, భార్యా భర్త్రాది సంబంధము లుండును. మహాకవులా యనుబంధములను హృద్యముగ బోషించుదురు. వాని వలన పాఠక లోకమునకు లోకజ్ఞత గలుగును. అవి వ్యవహార వేత్తృతా సంపాదకములు. సంస్కృత పంచతంత్రము నందా యనుబంధములు బహు సన్నివేశములలో బోషింపబడినవి. చంప్వాంధ్రీకర్తలు పెక్కు కథలలో నమూలకములైన భావములతో నా యనుబంధములను మనోహరముగా రూపొందించినారు. అది వారి పాత్రచిత్రణ కౌశల నిరూపకము.

మిత్త్రభేదమున బింగళకునకు దమనక సంజీవకాదులకు మధ్య సేవ్యసేవకభావము చంపూకర్తలచే మధురముగ బోషింపబడినది.

దూబ గుంటనారాయణ కవ్యనువాదమున బింగళకుఁడే కార్యమునకై వచ్చితివని దమనకుని ప్రశ్నింప నతడు 'భవత్పాదంబులకు నా వలనం బ్రయోజనంబు కలుగుటంజేసి పని వింటి' నని సమాధాన మొసగినట్లు రచింపబడెను. సంజీవకుని వృత్తాంత మెఱింగి వచ్చినపుడును దమనకుడు

మున్ను నీవిన్న శబ్దమిమ్మగ నెఱింగి
తెలిసి వచ్చితి నీపాదములు భజింప

పద్య 156

అని పలికినాడు. 'అది కావించిన యతండు. దేవర మన్నింప నర్హుండని' వచించినాడు. సేవకుడుగా నతఁడు ప్రభు గుణగణమును

అడరి మహాబలుండధిక సత్త్వంబున
  నురుతరు వ్రజముల నురులఁగొట్టి
నీచంబు మృదువునై నెరయనానతమైన
  కసవుఁబెల్లగి లంగ విసరనొల్లఁ
డబ్బంగి నధికుండు నల్పులదెసఁబోక
  ఘనతరా రాతుల గండడంచు
నట్లు నీవును మహాహంకార మృగములఁ
  దగిలి సాధింపంగఁ దగుదుగాన

సాధుజంతు మాత్రింబుల బాధపఱిచి
యుదర పోషణ మొనరించు చున్నవారలు
సాటిసేయంగ దగునె యీ జగతి నీకు
శౌర్యగుణధామ మృగకుల సార్వభౌమ.

పద్య–158.

అని కీర్తించినాడు. పింగళకుడిందొక సార్వభౌముడుగా స్తుతింపబడినాడు. సేవకుడు ప్రభువిషయమై యెట్లు వినయమును జూపవలయునో ప్రభు గుణ సంపత్తి నెట్లు ప్రశంసింప వలయునో దూబగుంట నారాయణకవి

నిరూపించిన విధము మనోజ్ఞము. బైచరాజు గూడ భాసురకమను సింహము—శశకమను కథలో మృగములన్నియు గలిసి తమకార్య సాఫల్యమునకై మృగపతిని

గిరిదరీ ముఖబహు ద్విరదశోణిత సిక్త
 గండ శైలము కనత్కనక పీఠి
పరితో విసారి శంబర లులాయ వ్యాఘ్ర
 హరిణ ఘోషములు తూర్యారవములు
మస్తకోపరి పతన్మహీధరాధిత్యకా
 ఝరవారి యభిషేక సలిలధార
సవిధ పాదపలతా స్థాయి నీడజకులాం
 చిత తతుల్యాభ సురాశీరవములు

గాఁగ మృగరాజ విఖ్యాతిఁ గనిన నీకు
నౌర గాంభీర్య మౌర సాహస విలాస
మౌర గౌరవ మౌర సత్వాతిశయము
చారుతర మూర్తి పంచాస్య చక్రవర్తి.

హరిసాగా నీరూపము
శిరమున ధరియించి కాదె శిక్షించె మరు
త్పరి పంథిఁ గనక కశిపుం
గరి వైరీ నిన్నుఁ బొగడఁగా మావశమే.

ఆశ్వా 1–పద్య 340, 341

అని శ్లాఘించినట్లు రచించినాడు. మృగపతి యనుభవించుచున్న చక్రవర్తి లాంఛనములు మనోహరముగ ప్రస్తుతింప బడినవి. నృసింహావతార ప్రసక్తియు సందర్భ సముచితముగ జేర్చఁబడినది. కవులీ సందర్భమున నొక మహాసార్వభౌముని వందిమాగధ సేవకాగణము స్తుతించిన పద్ధతి ననుసరించుట ప్రశస్యము. ఈ సింహస్తవముల మూలక ములు.

ప్రభువు తన శరీరము నిచ్చియైన ప్రజలను రక్షింపవలయును. కన్న బిడ్డలవలె ప్రజలను బాలించుట యుత్తమ ప్రభులక్షణము. కావు ననే కాళిదాసమహాకవి రఘువంశమున దిలీప చరిత్రలో 'క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః' అనియు శాకుంతలమున దుష్యంతుని గూర్చి 'ప్రజాః ప్రజా స్వా ఇవ తంత్రి యిత్వా' అనియు రచించినాడు. ప్రజలు పొందు బాధలకు ప్రభువు మిక్కిలి తరితపించి తన్నివారణమునకు యత్నింప వలయును. నారాయణ కవి సంధి విగ్రహ పరిచ్ఛేదమున 'గజయూధము-శశము' అను కథలో గజబృంద గమన సందర్భమున హతశేషులైన యమాత్యుల జూచి తత్పతియగు శిలీముఖుఁడు 'కన్నీరొలుక వారలంగనుంగొని'

వఱపు జనింపనేల యనివారణ వారణ పంక్తులింతగాఁ
బఱవగనేల యిట్లు గల బాంధవు లందఱు గాలిధూళిగా
నుఱక విధాత యేమిటికి నుండ'గఁ జేసెను నాదుజీవనం
బెఱుఁగఁగ నేరనైతి మతిహీనుల కెక్కడి వేశుభంబులున్

పద్య 89

అని చింతాక్రాంతుండైనట్లు రచించినాడు. ప్రభువులు సేవకులయెడ జూపనగు ననురాగము అమూలకమగు శిలీముఖుని పరితాపమున వ్యక్తమగుచున్నది. ఇట్లు పంచతంత్రానువాదములలో సేవ్యసేవ కానుబంధము మనోజ్ఞముగ బోషింపబడినది.

విష్ణుశర్మ రచించిన మిత్రసంప్రాప్తితంత్రము పరమమిత్రుల ప్రగాఢ స్నేహానుబంధ నిరూపణమునకొక చక్కని లక్ష్యకోశము. అందలి పశుపక్షుల మైత్రిని బంచతంత్రచంపూకర్తలు బహ్వామూలక భావములతో మరింత సుందరముగ బరిపోషించినారు. పాత్రచిత్రణ మున దమప్రత్యేకతను నిలుపుకొనినారు.

వలతోగూడ నేకముఖముగా నెగురుచున్న తన పక్షిపరివార ముతో జిత్రగ్రీవుఁడు తనమిత్రుడైన హిరణ్యకుని గూర్చిఁ మమసుహృ

ద్ధిరణ్యకో నామ మూషకః సర్వేషాం పాశచ్ఛేదం కరిష్యతి' అని పలికి నట్లు మూలమున గలదు. దూబగుంట నారాయణకవి దీనిని

నా చెలికాఁడు హిరణ్యకుఁ
డీచేరువ నుండు నెపుడు నిట్టఁదామనపైఁ
దోఁచిన దుర్దశమాన్పన్
జూచునతఁడు నన్నుఁదెలియఁ జూచిన మాత్రిన్

పద్య 13

అని యనువదించినాడు. 'నన్నుఁదెలియఁ జూచినమాత్రన్' అనునది యమూలకము. అది చిత్రగ్రీవ హిరణ్యకస్నేహానుబంధ నిరూపకము. అట్లే మూలమున హిరణ్యకుఁడు పాశబద్ధుఁడైన చిత్రగ్రీవుని జూచి 'భోః కిమేతత్' అని ప్రశ్నించినట్లుండ దూబగుంట యనువాదమున. హిరణ్యకుఁడు 'చెలికాని నత్యాదరంబునఁ గౌఁగిలించుకొని దుఃఖితుండై'

మిగుల వివేకివి నీకుం
దగ నెగ్గులు చేసెనే విధాతృండు

పద్య 15

అని పలికినట్లు గలదు. ఈ మిత్రసంభావన మమూలకము. ముందుగా బరివార బంధచ్ఛేదముగావించి పిదప నాపాశచ్ఛేద మొనరింపుమని చిత్రగ్రీవుఁడు పలుకగా హిరణ్యకుఁడతనిని

నీ నిర్మల గుణసంపద
నీ నడవడి నీక యొప్పు వినుఁగొనియాడం
గానాకు శక్యమగునే
భూనుతగుణ నిన్నుఁబోల్పఁ బురుషుఁడు గలఁడే
వాని భూలోకమంతయు నేలఁజాలు
నధికపుణ్యుండవని'

పదం 26–27

కొనియాడినట్లు నారాయణకవి రచించినాడు. సమస్తపాశచ్ఛేద మొన రించి విందుపెట్టి పంపినట్లును దూబగుంట రచనలో గలదు. ఇందలి చిత్రగ్రీవ ప్రశంస పాత్రౌన్నత్యపోషకము. గాఢ స్నేహానుబంధ నిరూపకము. విందు పెట్టిపంపుట యమలాకము.

హైచరాజు హిరణ్యకుని గూర్చి చిత్రగ్రీవుఁడు తనపరివారమునకు

సకలపక్షిసమానసుఁడు శాంతిసమగ్రుఁడజాత శత్రుఁడం
తక నిభపత్త్యుఁడిష్టజనతా ఘనతాప విఘాతి సర్వమూ
షకముల సార్వభౌముఁడు రసజ్ఞుఁడు ప్రాణము ప్రాణమాహిర
ణ్యకుఁడిటనుండు నాయన దయామతి నివ్వలవంతఁబాడుదున్

ఆశ్వా 2 పద్య-19

అని పరిచయమొనరించినట్లు రచించినాడు. ఇది యమూలకము. చిత్ర గ్రీవహిరణ్యకానుపమస్నేహ బంధసూచకము.

హిరణ్యకుని పూర్వవృత్తాంతమును విని మిత్రుఁడగు మందర కుఁడాతని నోదార్చి యాదరించిన విధమును దూబగుంట

పెక్కులు పలుకం బనిలే
దెక్కడికిం బోవవలవదేనును నీవున్
దక్కక కూడుకయుండుద
మిక్కడ నతిసౌఖ్యవృత్తి నింపెసలారన్

పద్య 162

అనిరచించినాడు. ఇదియమూలకము. అట్లే మందరకుని సాంత్వనమునకు సంతసించి హిరణ్యకుఁడతనికి

మిత్రమందర నీ సుచరిత్ర మహిమ
మఖిల జనులకు గొనియాడనాస్పదంబు
గానవాకును సంతోషకరముగాదె
నిన్నుఁగనుగొన్న నాభాగ్య మెన్న నేల

పద్యం 164

అని కృతజ్ఞతాపూర్వకముగా బదులిచ్చుటయు నమూలకమే. అమూలక భావప్రదర్శనముచే మందరక హిరణ్యకుల మధురస్నేహానుబంధమును దూబగుంటనారాయణకవి పోషించినవిధము ప్రశంసనీయము.

భానుకవి మందరకునకు లఘుపతనక చిత్రాంగ హిరణ్యకులకుగల స్నేహానుబంధమును మనోజ్ఞముగ జిత్రించినాడు. బంధితుడైన చిత్రాంగునిస్థితిగతులు తెలిసికొనగోరి వచ్చిన మందరకుడుగూడ విధివశమున బద్ధుడుకాగా ఆమందరకునకై లఘుపతనక చిత్రాంగ హిరణ్యకులు "శోకవ్యాకులితచిత్తులై పురపురంబొక్కుచు నలుదిక్కులు సూచుచు మనము ముప్పురము నతనియండ వసియించి బ్రతికితిమింక నితండు విడివడు నుపాయంబెయ్యది యొకో!" అని చింతిల్లినట్లు భానుకవి రచించినాడు. కృతాంత నిభుడైన లుబ్ధకుడు మందరకుని బంధించుటకు వారెంత తీవ్రమైనబాధనొందిరో పురపురంబొక్కుచు, నాలుగుదిక్కులు చూచుచు ననుటలో బాగుగవ్యక్తమైనది. ఇదియమూలకము. అందు హిరణ్యకుఁడు మందరకునిగూర్చి

చెలికాఁడు రక్షకుఁడు ని
ర్మలచిత్తుఁడు కూర్మవిభుఁడు మనలనుబాసెన్
దలపోయఁడత్యఁడు లుబ్ధకు
వలనం బెడవాయు నేర్పవఱలు మతమునన్
నిలువెల్ల ధర్మరూపము
తలపెల్లను దలఁపఁబరహితం బమృతమ్ముల్
పలుకులు సువిచారత ని
ర్మలచిత్తుండితని బాయరాదని మఱియున్

ఆశ్వా 2 పద్య 101-102

అని కావించిన ప్రశంస మందరకుని సౌశీల్యమును నిరూపించుచున్నది. మందరకుని శరీరము ధర్మరూపమనియు, నాతని తలంపులన్నియు పరహితంకరములనియు వాక్కులు పీయూషములనియు నాతడు నిష్కల్మషహృదయుడనియు వివరింపబడెను. ఎవ్వని వైశిష్ట్యమైన నాతని రూపము

నందును, దలంపులందును, మాటలయందును నాధారపడియుండును. ముత్యములవంటి యామూడుగుణములందు మందరకుడెట్టివాడో భాను కవి యమూలకకల్పనచే నిరూపించినాడు.

దూబగుంట నారాయణకవి మందరకుని స్నేహశీలమును చిత్రాంగపాత్రప్రవేశ సందర్భమున నిరూపించినాడు. మందరకలఘు పతనకాదులున్న ప్రదేశమునకు భయభ్రాంతుడై చిత్రాంగుడు రాగా మందరకుడపరిచితుడు నాగంతకుడునగు నాతనియెడ నాదరాభి మానములు ప్రదర్శించుచు

ఎచ్చటనుండి వచ్చితిదియేమి మృగోత్తమ నీమదిన్ భయం
బచ్చుపడంగ నున్నయది యవ్వల నెంతటి కార్యమయ్యె నీ
వచ్చుట పెద్దలెల్ల నిటవచ్చుట గావున నన్నపానముల్
పుచ్చుక మానివాసమునఁ బొంది వనంబు నలంకరింపవే

సు. లా పద్య 173

అని స్వాగతము పల్కినాడు. నీవు వచ్చుట పెద్దలెల్లరు నిచ్చటకు వచ్చుట యనుటలో మందరకుని సౌహార్దము సువ్యక్తము. అంతియగాక

మా కంటె నీకుఁ జుట్టము
లీకాననమందుఁ గలుగరిది నీయిలుగాఁ
గైకొని నిలువుము నీవు

పద్య 176

అని యభయ మొసంగినాడు. ఇదియు నమూలకమే. మందరకుని మిత్రప్రేమను దూబగుంట యుత్తమముగా బోషించినాడు.

నారాయణకవి పాశబద్ధుడైన చిత్రాంగుని జూచి లఘుపతనకుడు పరితపించిన విధమును గూడ మధురముగ రచించినాడు. కంట దడి పెట్టి దుఃఖించుచున్న లఘుపతనకుని యవస్థ నతడు

కని లఘుపతనుఁడు డగ్గఱి
మును కొని కన్నీరు దొరఁగ మోహభ్రాంతిన్

దనమేను దుఃఖ వహ్నిన్
గనలంగ నిట్లనియెం బరమ కారుణ్యమునన్

సు.లా. పద్య 178

అని రచించినాడు. చిత్రాంగునితో నాతడు నీవెవ్వరి నేవిషయము యాచింపవు ఎవ్వనికిని జేటు దలంపవు భగవంతుడు నిర్దయుడై నీకెట్టి కష్టము గల్గించినాడో కదా! జలతృణ భక్షణములతో నుగ్రవనమున జీవించు నీకెట్టి కష్టమును విధాత కల్పించెనో కదా యని

ఒక్కని వేడఁబోవు మఱియొక్కని చేటున కియ్యకోవు వే
రొక్కని సొమ్ముకాసపడ నొల్లవు మాలవిధాత నిర్దయుం
డక్కట నీరునుం దృణము నాని మహోగ్రవ నాంతరంబునన్
గ్రమక్కెడు నీకు నిట్టి యవమానము మానము దప్పఁ జేసెనే

పద్య 179

అని విలపించినట్లును రచించినాడు. ఇందు జిత్రాంగుని సౌశీల్యము, లఘుపతనక చిత్రాంగుల యనుపమ స్నేహసంపద మనోహరముగ బోషింప బడెను. భైచరాజు వేంకటనాథుడు గూడ బద్ధుడైన చిత్రాంగుని జూచిన లఘుపతనకుని మానసిక వికలత్వమును దదుచిత చేష్టలను

......వాయసనాథుఁ డచ్చోట్టఁ
గనిసుక్కి యెటువంటి కష్ట మొదవె

నేమిసేయుదు ననుచు నహీన వేగ
కలన ఱెక్కల పటపటాత్కార మెసఁగ
నరిగ బాష్ప నిరుద్ధాక్షుఁడగుచు సఖునిఁ
గదిసి యిట్లనుఁ గంఠగాద్గద్య మడర

ఆశ్వా 2 పద్య 180

అని వర్ణించినాడు. సంస్కృత పంచతంత్రమున 'శోకవ్యాకులిత మనాః' అని మాత్రమే కలదు. దానికి వివరణ ప్రాయముగ భైచరాజు ఱెక్కల పటపటాత్కారము, బాష్పాను రుద్ధాక్షుత, కంఠగాద్గద్యము

మానసిక వైకల్యము ననువానిని ప్రయోగించినాడు. నారాయణకవి రచనమందలి కన్నీరు దొరగుట, మోహాభ్రాంతి నొందుట, శరీరము దుఃఖవహ్ని యందు గనలుట, విఘాతృ నిర్దయత్వ నిందాదికము నమూలకములే. ఈ ఘట్టమున నాంధ్రీకర్తలు అమూలకములైన భావములతో పశుపక్షుల మధ్యనున్న స్నేహాధిక్యమును మధురముగ బోషించినారు.

హిరణ్యకుడు సపరివారుడైన చిత్రగ్రీవుని బంధ మోక్షము నొనర్పగా లఘుపతనకు డాశ్చర్య పడి యాతని గుణ సంపదను

పరధరాధిప భేద కరము నీకరమునీ
వివరంబు బహుమార్గ విశ్రుతంబు
రాజశేఖర కుమారక మనోహరము నీ
చర్య నీ సన్మానసం బుదాత్త
మవిరళ సుగతి హేతువు నీ వినీతత్వ
మలరు నీ గుణము ధర్మానుకూల
మతివృద్ధి మహిమఁ జెన్నారు నీ యాకార
మిష్ట కార్యముల నీ యోగి వెరుగు

నీ కరుణ లక్ష్మి వాటిల్లు నీ రసజ్ఞ
సత్యభారతి నిలుచు నీసన్నిధాన
మభిమతార్థంబు లొసఁగు నిన్నభినుతింప
శక్యమే నాకు మూషకస్వామి కళత్రి
ప్రతి లేని కరుణ నీడజ
పతి మృతికిం బాపి సుగతిఁ బడసితి నీ సం
గతి గాదే యీ యాప
ల్లత లంటిన మమ్ము బోటులకుఁ గృత కృత్యా

ఆశ్వా 2 పద్య 44, 45.

అని స్తుతించినట్లు బైచరాజు వేంకటనాథుఁడు రచించినాడు. ఇందు హిరణ్యకుని పరహితాచరణైక సద్బుద్ధి యద్భుతముగ గీర్తింప

బడినది. ఈ ప్రసంశయమూలకము. హిరణ్యాక్షుని గుణ బాహుళ్యముతో బాటు స్నేహ యోగ్యతయు సునిరూపితము.

బైచరాజు పింగళక సంజీవక సఖ్య మెంత యవిభాజ్యముగ నున్నదో

తనువు ప్రాణంబు విరియును దావి భానుఁ
డాతపముఁ బోలెనల మృగాధ్యక్షుఁ డతఁడు
పాలు నీరును గూడిన పగిది నుండి
రతిశయ స్నేహమునను నయ్యడవి లోన.

ఆశ్వా 1-పద్య 208

అని యభివర్ణించినాడు. వారి యనుబంధమునకు శరీరము ప్రాణము, పుష్పము పరిమళము, సూర్యుడు ఎండ, పాలు నీరు అనునుపమలు ప్రయోగింప బడినవి. అన్నియు నమూలకములే. ఇట్ల ద్వితీయములగు నుపమానముల ప్రయోగించుటయే గాక 'అన్యోన్య ప్రసన్న స్నేహ ప్రవర్ధమానులయి యొరుల కవకాశంబీక యేకగ్రీవంబయి యుండ' వారి యనుబంధము ప్రవర్తిల్లి నట్లును బైచరాజు రచించినాడు. దమనకుఁడు మాత్సర్యము నొందుటకు, మిత్రభేదము గావించుటకు ప్రధాన హేతువైన పింగళక సంజీవక గాఢ సఖ్యము బైచరాజుచే మనోజ్ఞముగ బోషింప బడినది.

దూబగుంట నారాయణ కవి మిత్రభేదమున కంబుగ్రీవ-వికట సంకటులను కథలో వికట సంకటులను హంసలు సజల సరోవ రాంతరమున కేగ నిశ్చయింప నాకమఠవరుఁడు మిత్ర వియోగమునకు

కూడితి మిన్నాళ్ళుఁ దోడఁ బుట్టువులట్ల
యెడరు పుట్టిన చోట విడుతురయ్యొ
పక్షహీనుండని భావింతురేని న
పక్షుండ నతి దుర్విపక్ష వృత్తిఁ
బక్షాధికులు మీరు పక్షపాతము గల్గి
పక్షి మార్గమున సంరక్షతోడఁ

గొని పోవకుండినఁ గొలనింకు నంతలో
నెవ్వరిచే నైన నీల్ల వలయు

పద్య–444.

అని కుండెనని వర్ణించినాడు. కంబుగ్రీవుడు తోబుట్టువు లట్లు పెరిగితి మనుట యందును దన్ను గూడఁ దీసికొని పొండని యర్థించుట యందును వారి స్నేహానుబంధము సూచితము.

కాకోలూకీయమున శశ కపింజలుల కథలో కపింజలుఁడు రాకుండుటకు వాయసము 'అహో కిమద్య కపింజలో నాయాతః కింకేనాపి పాశేన బద్ధః ఉతాహోస్విత్ కేనాపి వ్యాపాదితః సర్వథాయది కుశలీభవతి తన్మాం వినా న తిష్ఠతి' అని విలపించినట్లు మూలమున గలదు. దుస్సహమైన మిత్త్ర్ర వియోగమునకు వాయస మెట్లు చింతించినదో బైచరాజు

డేగకుఁ జిక్కెనో యురువడిం ధృతి గాడ్పడి దవ్వు పోయెనో
లాగము దక్కి మచ్చు వలలంబడెనో వెరవేది పాది నెం
దేగెనొ పుట్టలెక్కి కరమే మఱి పాముల చేతఁ జచ్చెనో
యేగతి యంచునో తెలియదింతయు రాఁడు వయస్యుఁ డక్కటా

అని బాష్పవారి ధార
ల్గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్
గనుఁగొనుచు విహ్వలుఁడనై
చననేరక యుంటి నన్నిశాసమయమునన్

ఆశ్వా 3 పద్య–102, 103.

అని వర్ణించినాడు. బాష్పధారలు వ్యాపింపగా నలుదిక్కులు పరికించుచు వయస్యుడగు కపింజలునకై వాయసమావేదనము నొందిన విధము వారి సౌహార్దమును నిరూపించుచున్నది.

దూబగుంట నారాయణకవి లబ్ధప్రణాశతంత్రమున కపిమకరముల స్నేహాబంధమును మనోజ్ఞముగా జిత్రించినాడు. కోతిహృదయ

మునపేక్షించి మొసలి తన పరమమిత్రుఁడైన కపీంద్రుని ప్రశంసింపగా నాముదిమర్కటము పొల్చుకొననేరక

డాసి యుపకారమేనేమి చేసినాఁడ
బూనినీతోడఁ జేసిన పొందువలన
రాజ్యవిరహిత దుఃఖభారంబుఁ ద్రోచి
తాల్మినున్నాఁడనదియు యుక్తంబుగాదె

పద్య 39.

అని యెంతయో వినయముతో బల్కి మిత్ర ప్రాశస్త్యమును

శోకశాత్రవభయముల చొప్పుమాన్పు
ప్రీతి విశ్వాసగుణ హేతు భూతమైన
మిత్రమను నక్షరద్వయ మిశ్రమైన
రత్నమేవేల్పు సృజియింప బ్రబలెనొక్క

పద్య—40.

అని యుగ్గడించినాడు. ఈ సంభాషణ మంతయు నమూలకము. అట్లే క్రకచము యొక్క భార్య రోగపీడితయగు చున్నదని తెలిసికొని ఆ మర్కటేంద్రుడు పడిన యవస్థను గూడ నారాయణకవి

జలములఁగాని వెల్పలికిఁ జాలనటంచు విచారమేటికిన్
బలికిన మందు దెత్తుననుఁ బంపు మటన్నటికేను బోయిభూ
వలయము నెల్లఁ గ్రుమ్మరి దివాకరుఁడయ్యె పరాంబురాశిలో
పల దిగి పోకమున్న వడిఁ బాటి రయంబున వత్తుఁబోయెదన్
పొమ్మనవు పోయి మందులు
దెమ్మనవు చికిత్స చాలఁ దెలిసిన వైద్యున్
రమ్మనవు భార్య నిజమగు
సొమ్మనవు దలంకనేమి చోద్యము చెపుమా

పద్య 54, 55.

అని రచించినాడు. ఆ వనచరేంద్రుడు 'పరదుఃఖేన దుఃఖితః' అను స్వభావము గలవాడు. మకరము కృతకప్రేమను ప్రదర్శింపగా నగ

చరుడు సహజప్రేమ ప్రదర్శించుచు మిత్రుని భార్యకు గలిగిన విపత్తున కెంతయో దురపిల్లినాడు. సూర్యాస్తసమయమునకు ముందుగనే మందు దెత్తునని శపథము చేసినాడు. అమూలకమైన కపీంద్రుని యీరాట మంతయు నాతని యకలంక సౌహార్దమును దెలుపుచున్నది. నారాయణ కవి పాత్రి చిత్రణనైపుణ్యమును నిరూపించుచున్నది.

చంపూకర్తలు లబ్ధప్రణాశ తంత్రాంధ్రీకరణమున మకరదంప తుల కథలో భార్యాభర్తృ సంబంధమును రుచిరముగ బోషించినారు. కపిస్నేహముచే మకరపతి పెక్కుదినము లింటికి వెడలకుండుట కాతని భార్య

ఇంతకు మున్నునాడు హృదయేశ్వరుఁడెయ్యెడ కేనఁ నేఁగినన్
సంతసమొప్ప వచ్చు నిమిషంబున నిన్నిదినంబులయ్యెఁదాఁ
జెంతలఁ జేరఁడేమిటికిఁ జిక్కెనొ కాక పరాంగనారతి
భ్రాంతి నిజాలయంబునకు రాకచటం బ్రియమంది నిల్చెనో
పద్య-15.

అని పరితపించినట్లు నారాయణకవి రచించెను. ఇది యమూలకము• ఎచ్చటకేగినను భర్త తడయక నిముషమున వచ్చునని యీమెతలంచు టలో వారి యన్యోన్య దాంపత్యానురాగము వ్యక్తమగుచున్నది. స్త్రీహృదయ మర్మజ్ఞుడగుటచే నారాయణకవి పరాంగనారతి భ్రాంతితో నింటికి రాకుండెనని యీమె తలంచినట్లు వ్రాయగలిగినాడు. మకరపతి నిజభార్య రుగ్ణతకు బరితపించి చెలికత్తెతో

సంజీవని మొదలుగ నే
నంజక కొనివత్తు నెట్టి యౌషధమైనన్
రంజకపు మాట గాదిది
కంజాత దళాయతాక్షి గ్రక్కునఁజెపుమా
పద్య-26

అని పల్కుటయు నారాయణకవి కల్పనమే. సంజీవనినైన దెత్తుననుటలో మకరపతికి భార్యపైగల ప్రేమానురాగములు స్పష్టపడుచున్నవి.

బైచరాజు వేంకటనాథుడు గూడ మకరదంపతుల యన్యోన్యదాంపత్య వైభవమును రమ్యముగా జిత్రించినాడు. ప్రియోజనమున్నచో దన ప్రాణములనైన నౌషధముగా నొసంగుటకు మకరము సిద్ధపడినట్లు

నావిని క్రకచుండను మ
జ్జీవము లౌషధములయినఁ జేడియకీలో
సేవింపఁజేసి నిర్గదఁ
గావించెదఁ జెపుము దాఁచగా నేమిటికిన్

ఆశ్వా 4—పద్య 40.

అని బైచరాజు రచించినాడు. రోగగ్రస్తయైన భార్యను జూచి మకరేంద్రుడు పొందిన యవస్థను భానుకవి

... ...

ఒడలెఱుంగని రీతి నున్నకుటుంబినిఁ
బొడగాంచి పరవశంబునఁ బ్రిగాఢ
సంశ్లేష మొనరించి సర్వాంగ కమ్ములు
పుణికి మనోజాగ్నిఁ బొరల నపుడు
దుఃఖవారిధి వీచులఁదొట్రువడుచుఁ
గన్నుదోవలను గడునశ్రుకణములురుల
నధికమగు చింత మనమంత నలిమికొనఁగ
గ్రాహముఖ్యుండు గద్గద కంఠుఁడగుచు

ఆశ్వా 4—పద్య 15

అని వర్ణించినాడు. దుఃఖ సముద్రపుటలలలో దొట్రువడుట, కనుకొనల నుండి యశ్రుకణములు ప్రవహించుట, మనస్సునందు జింత యలము కొనుట. కంఠము గాద్గద్యము నొందుట గ్రాహపతి దైన్యావస్థా నిరూపకములు. అతడు భార్యను జూచినతోడనే పరవశించి సంశ్లేషముల నొనరించుట యంగముల నిమురుట యాతని గాఢానురాగ సూచకములు. అమూలకములైన భావసంపదతో జంపూకర్తలు ముప్వురు నుదాత్తముగ భార్యా భర్తృత్వసంపదను బోషించినారు. భార్యా ప్రాశస్త్యమును భానుకవి యీఘట్టమున

ఊహింప మిత్ర సందోహమ్మునకు నారఁ
బండిన సస్యమ్ము బాంధవులకుఁ
గనుపండు వొనరించుఁ గల్పమహీజంబు
వంశహేమమునకు వన్నె  పద్య-25,

అను పద్యముఘన నుద్ఘోషించినాడు. అట్లే భైచరాజు గూడ

భార్యలేక యొనర్చు పండువు దండువు
కులకాంత పెట్టని కూడు గీడు
పత్నితోఁ బలుకని పలుకులు చిలుకులు
గృహిణిలేని కబంధకేళి జాలి  పద్య73.

అను పద్యమున వివరించినాడు. ఈ పద్యములమూలకములు. దంపతుల మధ్యనుండు ననురాగమహిమ నభివర్ణించుటతోబాటు కవులు భార్యాప్రాశస్త్యమును గూడ నుగ్గడించుట శ్లాఘనీయము.

ఆంధ్రీకర్తలు పితాపుత్రానుబంధమును గూడ బెక్కు సందర్భములలో మనోహరముగ బోషించినారు. మిత్రభేదమున వణిక్పుత్రుడు—లోహతుల యనుకథలో లోహతులను గోల్పోయిన వణిజుడు తన్ను మోసగించిన మిత్రుని తానును మోసముతో గెలువవలెనని యెంచి యాతని పుత్రునితో నదికేగి పుత్రుని భద్రముగ నొకచోటదాచి తానొక్కడే నది నుండిరాగా బాలునికై యాతని తండ్రి 'భో అభ్యాగత కథ్యతాంకుత్రమే శిశుర్య స్త్వయా సహ నదీం గతః' అని ప్రశ్నించినట్లు మూలమున గలదు. నారాయణకవి యనువాదమున నాబాలుని తండ్రి 'పాయని దుఃఖభారమున, పురవరంబు నింటింట నరసి యరసి' పుత్రునడిగినట్లు గలదు. అతడు నదినుండి వచ్చిన వణిజుని

పాపని నదికిం దోడుక
వేపోయితి వాఁడు రాఁడు వెండియు నతి దా
వాపోవఁ దొడఁగెఁ జెప్పవు
పాపంబని తలఁచి దుఃఖపడవింతైనన్

మి. భే పద్య 555.

అని ప్రశ్నించినట్లును అందు గలదు. నారాయణకవి గావించిన వణిజుని పుత్రవియోగ సంతాపవర్ణన మమూలకము. అట్లే వైచరాజు గూడ ఆసెట్టి తనపుత్రుని గ్రద్దయెట్లు పట్టుకొని పోగలదని మిత్రునితో

చేప జెల్లగాదు చిట్టెల్కయును గాదు
పిట్టగాదు కోడి పిల్లగాదు
కొట్టి జుట్టుఁ బట్టుకొని పోవ పసిబిడ్డ
లేడ నీల్ల గద్ద లేడఁ జెప్పుమ

ఆశ్వా 1-పద్య-782.

అని విలపించినట్లు రచించినాడు.

భానుకవి యసంప్రేక్షిత కారిత్వమున బుత్రనిర్విశేషముగ బెంచిన నకులమునజ్ఞతా ఫలముగ జంపి బ్రాహ్మణుడు పరిపరి విధముల విలపించిన విధమును

చిఱుగజ్జెమోతలం చెవులు పండువుగాఁగఁ
దేకువ వెనుక నే తెంచు విధము
చప్పుడాలించి మీసలు దీటుచును జెంతఁ
గూర్చుండి నిక్కి కన్గొను తెఱంగు

ఆశ్వా-5పద్య4.

అని యభివర్ణించినాడు. చిఱుగజ్జెల మోతలతో జెంత జేరుట, చప్పుడు వినబడి నంతనే నిక్కి పరిశీలించుట మున్నగు నకుల చేష్టలను దలంచుకొనుచు ఆ బ్రాహ్మణుడు పరితపించుటలో నాతని యాబాల్యము పెంచిన ప్రేమలోని మాధుర్యమును నిరూపించుచున్నది. ఈ కల్పన మమూలకము.

వైచరాజు వేంకటనాథుఁడు మిత్రభేద మందలి 'కాకము-కనక సూత్రము' అను కథలో సంతానమును గోల్పోవుచున్న వాయసా ధ్యక్షుని పుత్ర మమకారమును

నూఁగారు వొడలం మేనుల తోడ నెరకునై
కిఱుకూఁతలిడ నాలకింప లేదు

అల్లంతఁ గాంచి యుల్లార్చు పక్షములతో
శిరము లంకింప నీక్షింప లేదు

ఆశ్వా 1–పద్య 287

అను పద్యమున నభివర్ణించినాడు. శ్వేత శరీరముతో మధురములైన చిన్న చిన్న యఱుపులతో ఱెక్కలల్లార్చుచు సమీపించుటలు మున్నగు వానిని స్మరించుటలో వాయసాధ్యక్షుని గాఢ పుత్రి మమ కారము వ్యక్తమగు చున్నది. పక్షులలోని పుత్రి మమకారమును గూడ నమూలక భావములతో భైచరాజు వర్ణించుట గణనీయము.

భైచరాజు చతుర్థాశ్వాసమున 'బ్రాహ్మణుఁడు రాజపుత్త్రిని నిరాకరించుట' అను కథలో బితా పుత్త్రికానుబంధము మధురముగ బోషింపబడినది. దైవికముగ దండ్రి యెడబాటు పొంది మఱల దండ్రిని జూచుట తటస్థింపగా రాజపుత్రి దుఃఖించిన విధము

ముందఱ నేగి యుబ్బువన మోహిని వాహిని పోలె నుబ్బువం
తందల కట్టు కన్దొగల దట్టముగాఁ బ్రవహించు నశ్రువా
రిందులి తేతర స్తన శరీరములం దిగుపారఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెరతో మొగ మెత్త కేడ్చినన్

పద్య–333.

అని వర్ణింప బడినది. పొంగిన దుఃఖముతో ప్రవహించిన అశ్రుధారలతో దండ్రికి నమస్కరించి మొగమును గూడ భైకెత్తకయే యామె విల పించుటలో నామెకు దండ్రిపై గల యాదర మెట్టిదో తెలియుచున్నది. ఆమె యవస్థను జూచుచున్న క్షీయామెతండ్రిలో గలిగిన పరిణామము

కడుపులోఁ జేపెట్టి కలఁచి నట్లగుటయు
భక్తిఁ గూరిమి పట్టిఁ బట్టి యె.
శిరముర౦బునఁ జేర్చి చెఱువు వ్రిస్సిన రీతి
నోడి కట్టట్టి పెల్లురులు నశ్రు
ధారల నతితాంత దశఁ గన్నతను వల్లి
దడుపుచు గద్గదధ్వాన లీల

పద్య–333.

అను సీస పద్యమున వివరింప బడినది. కడుపులో జేయిపెట్టి కలచినట్లగుట, గండి తెగిన చెఱువు నందలి జల ప్రవాహము వలెఁ గన్నుల వెంబడి నశ్రువులు గారుట, కంఠమున గాద్గద్య మొదవుట మున్నగునవి రాజేంద్రునకు గూరిమి పట్టిపై గల వాత్సల్యమును నిరూపించు చున్నవి. ఆమె నత్తవారింటి కంపునపుడా మనుజేశ్వరుడు గావించిన హితబోధ విపులముగ నైదు పద్యముల ( 278–282 ) లో నభివర్ణింప బడినది. అందునాతని పుత్త్రికా వాత్సల్యము వెల్లివిరియు చున్నది. అందామె యత్తమామలతో దోడి కోడండ్రతో జుట్టు పక్కములతో నేయే విధములుగా ప్రవర్తింపవలయునో పుత్రులతో నైన నెట్లు ప్రవర్తింపరాదో ఇట్లుపదేశింప బడినది.

అత్తమామల చిత్తములగ వర్తిలవమ్మ
ధవుని దైవంబుగాఁ దలఁపవమ్మ
తోడి కోడండ్ర పొత్తును బాయనీకమ్మ
మఱఁదులఁ గని మని తిరుగవమ్మ
యనుఁగుఁ జుట్టముల పట్టున వెట్ట గాకమ్మ
పఱుపుళ్ళపై రక్తి వదలకమ్మ
కాఁగాని చెలుల డగ్గఱి చరింపకుమమ్మ
యుత్తమ స్త్రీల పొందుడుగకమ్మ
తోడుతో నైన నందను తోడనైన
నొంటి పాటున భాషించు టుడుగవమ్మ
పనులఁ గొనకమ్మ భూసురాంగనల చేత
వేళ్లఁ జూపించు కొనక జీవింపవమ్మ

పద్య–381

ఈ హితబోధ సకల స్త్రీ జన శిరోధార్యము. కణ్వ మహర్షి శకుంతలకు గావించిన యుపదేశాత్మకమైన 'శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియ సఖీ వృత్తిం సపత్నీ జనే' యను శాకుంతల శ్లోకమునకు ఇది వ్యాఖ్యాన ప్రాయము గానున్నది. కన్న పుత్రికను విడువలేక పడు నా రాజోత్త ముని దుఃఖమును గూడ గైచరాజు

తల్లీ నిన్నెడబాసి యెుండొక ముహూర్తంబైన నైరింప నా
యుల్లంబోర్చునె పుత్రుకీక నిను నయ్యో దైవ మిట్లి చ్చెనే
వెల్లింబోయి నవంతఁ గుందవలసెన్నెయ్యంబుఁ బ్రార్థించి వి
ద్యుల్లేఖా నిభ దేహ నిన్నిలుపఁ బుత్తున్ శీఘ్ర కాలంబునన్

పద్య—383.

అని వర్ణించినాడు. అమూలకమైన ఈ కథలో బైచరాజీ ఘట్టమున బితాపుత్రికానుబంధ మెట్లుండునో సహజసుందరముగ నభి వర్ణించి నాడు.

అత్త కోడండ్రను బాధించుట లోకప్రసిద్ధమైన విషయము. అత్తకోడండ్ర యనుబంధ మెట్లుండునో బైచరాజు 'హాలిక కాంత భర్తృ రాజ బాధనొందుట' యనుకథలో రుచిరముగ నిరూపించినాడు. ప్రభు సమ్మానితుడై యింటికివచ్చిన హాలికునితో నతనితల్లి తరళీకృత లోచనాంతయై కోడలి దుశ్చేష్టితములను

తిట్టినఁదిట్టు బెట్టుఁజఱుదిండికిఁ గొల్చినఁ గొల్చు సాగ ది
చ్చిట్టకమన్న మాతులకుఁ జేతులు సాఁచు నొకప్పుడేని యి
ల్వట్టదు సంతకూటములఁ బాయదు చేయదు చెప్పినట్టు నీ
ఱట్టడి జంత యిల్సెఱిచెరా తనయా యనయాను షంగతిన్

ఆశ్వా 4—పద్య 430

అని వివరించినది. కోడలియెదిరించుటలను, జెముపోకలను నమ్మికగల్గు నట్లు, చెవికింపుగా జెప్పుటయేగాక నీవునామెయు నెచ్చటకైన వెడలు డని కుమారునితో నామె

నీవఁట యదియఁట వలసిన
త్రోవం జనుఁడింక మమ్మునదూరఁగఁబనిలే
దీవఱదను కారోఁతల
దేవళ్లం బడితి పసిపితిం గోడలిచేన్

పద్య 432

అని నిష్కర్షగా బలికినది, తల్లిపలుకులు అసత్యములని తెలిసియు జేయునది లేక యతడు విరక్తుడై గృహమును వీడినాడు. అత్తస్వభావ చిత్రిణమున బైచరాజు చూపిన నేర్పు ప్రశంసార్హము.

లోకమున గొందరు ఉపకారమొనరింతురు. ఉపకారము పొందినవారెట్లు కృతజ్ఞతను జూపవలయునో భానుకవి 'ఎలుక–గజ మిథునమ'ను కథలో నిరూపించిన విధమత్యంత శ్లాఘనీయము. గజ మిథునమునకు మహోపకృతి యొనర్చిన మూషికముతో నాగజపతి

గుంతవెడలివచ్చి కుంజరయుగళమ్ము
మూషికమున కెలమి మ్రొక్కి మ్రొక్కి
నీవుగలుగఁబట్టి నేఁ బ్రతికితినీకుఁ
బిడ్డపేరుపెట్టి పెంపుగందు

ఆశ్వా 2–పద్య 54

అని పల్కినట్లు భానుకవి రచించినాడు. దంతీంద్రుడు మూషకమునకు మ్రొక్కుట, నీవలన బ్రతికితిని సంతానమునకు నీ పేరు పెట్టుదునని పల్కుట యాతని కృతజ్ఞతా పరత్వమును నిరూపించుచున్నది. ఇది యమూలకము. ఇట్లు వివిధములైన యనుబంధములను బోషించి చంపూ కర్తలు తమ యనల్ప పాత్రిచిత్రిణ కౌశలమును వెల్లడించినారు.

10. చంప్వనువాదకులు పాత్రచిత్రణమున ఔచిత్యమునకు ప్రాధాన్యమొసంగుట పరిశీలనార్హము. మూలమునందలి యనుచితములుగా నున్నసన్నివేశముల నాంధ్రికర్త లౌచిత్యము ననుసరించి మార్చి కథాగతికుత్కర్ష కల్గునట్లును బాత్రిలకుదాత్తత చేకూరునట్లు రచించుట వారి పాత్రచిత్రణము నందలి యొక విశిష్టత.

సంస్కృత పంచతంత్రిమున ఆషాఢభూతి ధనముగల కంథకై గురువైన పరివ్రాజకుని సంహరింపదలంచినట్లు 'అహో న కథంచి దేష మే విశ్వాసమాగచ్ఛతి తత్కిం దివాఽపి శస్త్రేణ మారయామి కిం వా విషం ప్రయచ్ఛామి కిం వా పశుధర్మేణ వ్యాపాదయామి' అనిగలదు.

ఆంధ్రీకరణములు మూడింట విడివిడువబడినది. ఆషాఢభూతి యొక్క కాపట్యముతో బాటు దౌర్జన్యమును గూడ నిది చక్కగా నిరూపించు చున్నదనవచ్చును గాని గురువుని జంపదలచెనని రచించుట యనుచిత మని భావించి చంపూకర్తలు దీనిని విడిచియుందురు.

మిత్రభేదమున 'మదోత్కటమను సింహము, కాకోష్ట్ర వ్యాఘ్ర జంబుకములు' అనుకథలో సింహము గజయుద్ధమున ద్విప దంతప్రహార ముచే బాధనొందుచున్నదనియు దస్మాలమున గదలుటకు శక్యము గాకుండెననియు 'తథాఽన్యేద్యుః మదోత్కటస్య మహాగజే నారణ్య సంచారిణా సహ యుద్ధమభవత్. తత స్తస్య దంతముసల ప్రహారైః వ్యథా సంజాతా. వ్యథితః కథమపి ప్రాణైః నవియుక్తః. అథ శరీరా సామర్థ్యాత్ న కుత్రచిత్ పదమపి చలితుం శక్నోతి' అని రచింపబడెను. దూబగుంట నారాయణకవి గజసమరోదంతమును విడిచినాడు. సింహ మునకు రోగము ప్రాప్తించినదనియు దత్ఫలముగ శరీరము కృశించు చున్నదనియు

కల్యము నందు భక్ష్యమును గానక మేను కృశించె రోగదౌ
ర్బల్యము నాకుఁగల్గుటను భద్రగజేంద్ర శిరః పలాద బా
హుళ్యము లేమి నుద్ధతికి నోపక చిక్కితిఁగాన దేహవై
కల్యము మానుకై వడి సుఖంబగు పథ్యముఁ దెచ్చి పెట్టుఁడీ
పద్య—380.

అని వివరించినాడు. సింహము గజదంతప్రహారముచే శక్తిహీనమై యాహార సంపాదనమున కసమర్థమైనదనుట పాత్రికపకర్షదాయకము. కావున నారాయణకవి రోగదౌర్బల్యము నాపాదించుట యౌచితీశోభి తము. భానుకవియు మృగేంద్రుడు క్షుధార్తుడైనట్లు మార్చిరచించి యౌచిత్యము పోషించినాడు. బైచరాజు మాత్రము యథామూలముగ రచించినాడు.

మిత్రభేదమున టిట్టిభ దంపతుల కథలో విష్ణువు గరుత్మంతుని రమ్మని దూతను బంపగా గరుత్మంతుడు వెడలుటకు నిరాకరించినట్లు

'భోదూత కిం మయా కుభృత్యేన భగవాన్ కరిష్యతి తద్గత్వోతం వద యదన్యో భృత్యో వాహనాయాస్మత్ స్థానే క్రియతామ్' అని మూలమున గలదు. సర్వేశ్వరుడైన విష్ణువాహ్వానింప వాహనముగా నున్న గరుత్మంతుఁడు నిరాకరించుట మిక్కిలి యనుచితము గావున జంపూకర్తలీ వృత్తాంతమును విడిచి యౌచిత్యమును బోషించిరి.

మిత్రసంప్రాప్తి తంత్రమున హిరణ్యకుడు చిత్రగ్రీవుని బరీక్షించితినని చెప్పినట్లు 'భోవేద్మ్యహం రాజధర్మం పరంమయా తవ పరీక్షా కృతా' అని మూలమున గలదు. సుహృద్వర్యునితో బరీక్షించితిననుట మిక్కిలి యనుచితముగా నుండునను తలంపుతో జంపూకర్తలీ విషయమును విడిచినారు.

మిత్ర సంప్రాప్తియందే 'బ్రాహ్మణి-తిల చూర్ణమను' కథలో బ్రాహ్మణుడు తనభార్యను బిలిచి యొక బ్రాహ్మణునకానాడు భోజనమొసంగవలయునని కోరగ దానికామె కోపగించుకొని దారిద్ర్యోపహతుఁడవగు నీకు భోజనప్రాప్తియెట్లు గల్గును అట్లు వచించుటకు సిగ్గుగా లేదా యనిపల్కి యాతడామెను రుచిరాహారాలంకరణములచే నెట్లు తృప్తిపఱుచుటలేదో 'తచ్ఛ్రుత్వా బ్రాహ్మణీ పరుషతరవచనైః తం భర్త్స్యమనా ప్రాహ కుత స్తేదారిద్ర్యోపహతస్య భోజనప్రాప్తిః. తత్ కిం నలజ్జస ఏవం బ్రువాణః. అపిచ న మయా తవ హస్తలగ్నయా క్వచిదపి లబ్ధం సుఖం న మిష్టాన్నస్యాస్వాదనం న చ హస్త పాదకంఠాది భూషణమ్' అని నిందించినట్లు మూలమున గలదు. ఆమె తీక్ష్ణవాక్కులకతడు భయపడి మఱల తద్దానప్రశస్త్యము నుగ్గడించినట్లు 'తచ్ఛ్రుత్వా భయత్రస్తోఽపి విప్రో మందం మందం ప్రాహ' అని మూలమున గలదు. ఈ భార్యాసంభాషణమున నామె వాక్పారుష్యము, పత్యధిక్షేపణము స్పష్టము. నారాయణకవి యౌచిత్యము ననుసరించి యామె పాత్రకుత్కర్ష గల్గునట్లు సంభాషణమును మార్చి రచించినాడు. అతని యనువాదమున బ్రాహ్మణుడు భార్యతో

వనజాతాయతనేత్రి రేపటి యమావాస్యన్ మహీదేవభో
జన కార్యంబున కేమి గూర్చితివి వాత్సల్యంబునం జెప్పుమా
పద్య–79.

యని ప్రశ్నించినాడు. వాత్సల్యంబుతో జెప్పుమా యనుటలో భార్యా భర్తల మధ్యగల గాఢానురాగ విశేషము సువ్యక్తము. దానికామె

తననేర్పుకొలఁది పురుషుం
డనువున ద్రవ్యములు గూర్చియవి దెచ్చినచో
వనితలు పాకక్రియలకు
నొనరింతురు నీవు దేకయున్నవె చెప్పుమా
పద్య-81.

అని లోకసహజముగ సమాధాన మొసంగినది. భర్త తనకెట్టి సుఖమును గల్గింపలేదని బ్రాహ్మణి భర్తను దీవ్రముగ నిందించినట్లు మూలమున నుండ దెనుగు సేతలో నామె భర్తతో ననురాగముతో గౌరవ ప్రతి పత్తులతో 'కార్యేషు మంత్రీ' యను వాక్యానుసారము సంభాషించి నట్లు గలదు. భర్తృ నిందగావించుట యనుచితమని నారాయణకవి మార్చి రచించి బ్రాహ్మణి పాత్రి కౌన్నత్యమును గలిగించినాడు.

కాకోలూకీయతంత్రమున 'చతుర్దంతమును గజయూథపతి శశకము' ననుకథయందు దూతగానేగిన శశకము గజయూథపతిని 'భోభో దుష్టగజ' అని సంబోధించి సంభాషణ మారంభించినట్లు మూలమున గలదు. దూతగా వెడలిన శశకము దుష్టగజ అని సంబోధించుట మిక్కిలి యనుచితము. నారాయణకవి రచనమున ఓగజేంద్ర! నీకు సేమమే యని యాత్మీయతతో బలుకరించి సంభాషించి నట్లు గలదు. భానుకవియు ఓగజేంద్ర! నీకు భద్రంబగుగాక' యని యాశశకము సంబోధించి సంభాషణ కుపక్రమించినట్లు రచించినాడు. దూతకుండవలసిన వాక్నైపుణ్యము నాంధ్రకర్తలు పోషించినారు.

ఇట్లు పాత్రచిత్రణమున జంపూనువాదకులు గణనీయమైన ర్యమును వెల్లడించినారు.

## —: రస రసాభాస పోషణము :-

కావ్య ప్రాశస్త్యమును నిర్ణయించుటలో రస పోషణము ప్రముఖపాత్ర వహించును. ఏ కావ్యమునైనను ఎవ్వరును గథ కొఱకు బహువారములు పఠింపరు. ఒకే కావ్యమును పెక్కు పర్యాయములు చదువుటకు అందలి రస పోషణము ప్రధాన కారణమగును. కావ్యమున గథకంటె రసము ప్రాధాన్యము వహించును. సుప్రసిద్ధాలంకారికుడైన కుంతకుఁడు వక్రోక్తి జీవితమున

నిరంతర రసోద్గార గర్భ సందర్భ నిర్భరాః
గిరః కవీనాం జీవంతి న కథా మాత్రమాశ్రితాః

ఉన్మేషము—4.

అని కవుల వాక్కులు రసనిష్యంద సన్నివేశములు గలిగి జీవించు ననియు నవి కథామాత్రము నాశ్రయింప వనియు నుడివినాడు. కళా ప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారు గూడ రామాయణ కల్ప వృక్షమున అవతారికలో

కవి ప్రతిభలోననుండును గావ్యగత శ
తాంశముల యందుఁ దొంబది యైనపాళ్ళు
ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయు
రెట్లు గొప్పది నవకథా దృతిని మించి

అని పేర్కొనినారు.

ఆలంకారిక శిరోమణి యైన ఆనంద వర్ధనా చార్యులవారు 'కావ్య స్యాత్మా ధ్వనిః' అని ధ్వన్యాలోకము నారంభించి ధ్వని కావ్యాత్మ యని స్థాపించినారు. ధ్వని ప్రభేదము లన్నింటిలో ఆలంకారికులచే రస ధ్వనికే అత్యంత ప్రాధాన్యము నొసంగబడినది. అదియే కావ్యాత్మ యని జగన్నాథ పండితుడు రస గంగాధరమున ప్రథమాననమున

'ద్వివిధో ధ్వనిః. అభిధామూలో లక్షణా మూలశ్చ. తత్రా ద్యస్త్రివిధః రసవస్త్వలంకార భేదాత్. రసధ్వని రిత్య లక్ష్య

> క్రమోప లక్షణాత్ రసభావ తదాభాస భావశాంతి భావోదయ భావసంధి భావశబలత్వానాం గ్రహణమ్. ద్వితీయశ్చ ద్వివిధః అర్థాన్తర సంక్రమిత వాచ్యోఽత్యన్త తిరస్కృత వాచ్యశ్చ. ఏవం పంచాత్మకే ధ్వనౌ పరమ రమణీయతయా రసధ్వనేస్త దాత్మా రసస్తావ దభిధీయతే.'

అని నిర్ణయించినాడు. ధ్వని కావ్యాత్మ. అది అభిధామూలము, లక్షణా మూలము అని ద్వివిధము. అభిధామూలమైన ధ్వని రసవస్త్వలంకార భేదములచే మూడు విధములు. రసధ్వనికి అసంలక్ష్య క్రమ వ్యంగ్యమనియు వ్యవహారము గలదు. ఉపలక్షణముచే రసభావ తదాభాసాదులు రసధ్వనికి గ్రాహకములు. లక్షణా మూలమైన ధ్వని అర్థాంతర సంక్రమిత వాచ్యము, అత్యంత తిరస్కృతవాచ్యమునని రెండు విధములు. ఇట్లు ప్రధానముగ బంచవిధాత్మక మైన ధ్వనియందు రసధ్వని పరమ రమణీయమైనది. రసము దానికాత్మ వంటిది—అని రసగంగాధర కర్త యభిప్రాయము.

విష్ణుశర్మ రాజపుత్రులకు నీతిబోధ గావించుటకై పశు పక్షులను బాత్రలుగా గ్రహించి పెక్కు గథలు కల్పించి పంచతంత్రమును రచించినాడు. ఆ గ్రంథ మేకనాయకాశ్రయము కానట్లే యేక రసాశ్రయమును గాదు. అందలి భావములు స్థాయిత్వమును బొంది రసములుగా బరిణమించుటకు సమర్థములని చెప్ప వీలుపడదు. శకుంతలా దుష్యంతులు పరస్పరానురాగ బద్ధులై విధివశమున వియోగము నొంది మఱల గలిసికొని సంభోగసుఖ పరంపర ననుభవించిరని చెప్పినంతలో నా వాక్యమున శృంగార రసము పోషింప బడిన దనజాలము. విభావానుభావాదులు రేఖా మాత్రముగా సూచించినంతలో రసస్థితి గలుగదు. కావున బంచతంత్రమున రసనిరూపణము బహుకష్టసాధ్యము. అట్లే పంచతంత్ర గత పాత్రలు ప్రధానముగ బశు పక్షులు. పశు పక్షుల రతి శోకాదులు రసములగునా రసాభాసములగునా యనువిషయము వివాద గ్రస్తము. అలంకారికులలో భిన్నాభిప్రాయములు గలవు.

విభావాను భావవ్యభిచారుల సంయోగము వలన రసము నిష్పన్న మగునని భరతాచార్యుఁడు నాట్య శాస్త్రమున 'విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అని రస నిర్వచనము గావించెను. విభావాదుల స్వరూపము, రసనిష్పాదన క్రమము, శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత శాంతాఖ్య నవరస విభాగాదికము సాహిత్యలోక క్షుణ్ణము, సుప్రతిష్ఠితము నైనది.

రసము యొక్క యాభాసము రసాభాసమగును. 'రసస్యఆభాసః, రసాభాసః' విశ్వనాథ కవిరాజు సాహిత్య దర్పణమున 'అనౌచిత్య ప్రవృత్తత్వే ఆభాసో రసభావయోః' అని రసభావముల ఆభాసములను నిర్వచించినాడు. అనుచిత విభావాదికము వలన నుద్భవించిన రస భావములు రసాభాస భావాభాసములగునని భావము. అందలి 'యను చిత' శబ్దము గంభీరమైనది. పరిపూర్ణములు కాని, అనుకూలములు కాని యున్నగు పెక్కు విధములైన సమన్వయములకు ననువైనది. రసగంగాధరమున జగన్నాథుఁడు గూడ నిట్లే రసాభాసమును నిర్వ చించినాడు. 'అనుచిత విభావనాలంబనత్వం రసాభాసత్వమ్' అని యాతని నిర్వచనము.

శృంగార రసాభాసము నాయికా నాయకులలో నొక్కరియందు మాత్రమే యనురాగ ముండుట, అనురాగము పశుపక్షులకు గాని మ్లేచ్ఛులకు గాని సంబంధించిన దగుట, నాయికకు బహునాయక కాసక్తి యుండుట—యని మూడు విధములని ప్రాచీనులిట్లు వివరించినారు.

> ఏకత్రైవాను రాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా
> యోషితో బహు సక్తిశ్చే ద్రసాభాస స్త్రిధామతా.

ఇందు శృంగార రసాభాసము మాత్రమే వివరింప బడినది.

విశ్వనాథ కవిరాజు సాహిత్య దర్పణమున దన రసాభాస నిర్వ చనము ననుసరించి శృంగారమునకు దదితర రసములకు సంబంధించిన ఆభాసములనిట్లు వివరించినాడు.

ఉపనాయక సంస్థాయాం మునిగురు పత్నీ గతాయాంచ
బహునాయక విషయాయాం రతౌ తథాఽనుభయ నిష్ఠాయామ్
ప్రతి నాయక నిష్ఠత్వే తద్వదధమ పాత్ర తిర్యగాది గతే
శృంగారేఽనౌచిత్యం రౌద్రే గుర్వాది గతకోపే
శాంతే చ హీన నిష్ఠే గుర్వాద్యాలంబనే హాస్యే
బ్రహ్మవధాద్యుత్సాహేఽధమ పాత్రగతే తథావీరే
ఉత్తమ పాత్ర గతత్వే భయానకే జ్ఞేయ మేవ మన్యత్ర.
పరిచ్ఛేద 3-శ్లో॥లు 263-266

ఉపనాయకాశ్రయము, మునిగురు పత్నీగతము, బహునాయక విషయకము అనుభయ నిష్ఠము, ప్రతినాయక సంబంధి, యధమ పాత్రలకు, దిర్యగాదులకు జెందినట్టిది యైన రతి శృంగార రసాభాస మనబడును, గుర్వాదిగతమైన కోపము రౌద్ర రసాభాసము. హీనములగు పదార్థములు పోయినప్పుడు గలుగు శమము శాంతాభాసము. గుర్వాదులాలంబనముగ నభివర్ణితమైన హాసము హాస్య రసాభాసము. బ్రహ్మవధాదుల యందలిదియు నధమ పాత్ర గతమైనదియు నగు నుత్సాహము వీర రసాభాసము. ఉత్తమ పాత్రగతమైన భయము భయానక రసాభాసము. ఇట్లే తక్కినవియు దెలియదగినవని భావము.

భరతుడు నాట్యశాస్త్రమున అనుచిత విభావాదికము వలన శృంగారరసము హాస్యరసమగునని 'శృంగారాద్ధి భవేద్ధాస్యః' (అధ్యా 6-శ్లో 39) అని రచించినాడు. అభినవ గుప్తులవారు దీనిని వ్యాఖ్యానించుచు ఒక్క శృంగార రసాభాసమే గాక తక్కిన రసాభాసములు గూడ హాస్యరసముగనే పరిణమించునని ఇట్లు వివరించినారు.

"ఏవం తదాభాసతయా (తాయాః) ప్రకారః శృంగారేణ సూచితః. తేన కరుణాద్యాభాసేష్వపి హాస్యత్వం సర్వేషు మంతవ్యమ్. అనౌచిత్య ప్రవృత్తి కృతమేవహి హాస్య విభావత్వమ్. తచ్చా (త్ర) నౌచిత్యం సర్వరసానాం విభావానుభావౌ సంభావ్యతే." (అభినవభారతి వ్యాఖ్య.)

అభినవగుప్తపాదుల మతము ననుసరించిచో శృంగారాభాసము, కరుణాభాసము అను పరిగణనమున కవకాశము మృగ్యము. అన్నియు హాస్యరసములుగనే పరిగణింపవలసి యుండును. ఆలంకారికులు పెక్కుమంది వానినాభాసములుగనే వివరించుటచే పంచతంత్రమున నవి యాభాసములుగనే నిరూపింప బడినవి.

ఆలంకారిక మతమున తిర్యగ్గతమైన రతి శృంగారరసాభాసమగును. తిర్యక్కులకు సంబంధించిన హాసశోకాదులు రసస్థితినొందునో లేక వానిని గూడ తత్తద్రసాభాసములుగా బరిగణింపవలయునో యాలంకారికులు సూచింపలేదు. భిన్నరసాభాసములు పేర్కొనిన విశ్వనాథ కవిరాజు గూడ ఆవిషయమును స్పృశింపకుండుట విశేషము.

ఏకావళీకారుడైన విద్యాధరుడు రతితిర్యగ్గతమైనను రసస్థితి నొందుననియు దిర్యక్కులకును విభావాదికము సంభవించుననియు సవిమర్శముగ జర్చించి కాళిదాసుని కుమార సంభవమందలి తృతీయ సర్గలోని శ్లోకము నుదాహరించి సమన్వయించి యిట్లు నిరూపించినాడు:

"అపరేతు రసాభాసం తిర్యక్షు ప్రచక్షతే తన్న పరీక్షాక్షమమ్. తేష్వపి విభావాది సంభవాత్. విభావాదిజ్ఞాన శూన్యాస్తిర్యంచో న భాజనం భవితుమర్హన్తి రసస్యేతి చేన్న. మనుష్యేష్వపి కేషుచిత్తథా భూతేషు రసవిషయ భావాభావ ప్రసంగాత్. విభావాదిసంభవో హి రసం ప్రతి ప్రయోజకో న విభావాదిజ్ఞానమ్. తతశ్చ తిర్యశ్చామప్యస్త్యేవ రసః. యథా

దదౌ సరః పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా.

అత్రగజేనాలంబన విభావేన జనితా వసంతాదిభిరుద్దీపన విభావైరుద్దీపితా సురభిగండూష జలదానానుభావ ప్రకాశితా

హర్షాదిభిర్వ్యభి చారిభిరుపచితా కరేణోః సంభోగ శృంగారి
రతాం ప్రతిపన్నైవ రతిః ఏవం రథాంగ విషయాపి."

(పుట-104)

ఆఘట్టముననే విద్యాధరుఁడు అభిజ్ఞాన శాకుంతల ప్రథమాంక ములోని 'గ్రీవాభంగాభిరామ'మ్మను శ్లోకమును భయానకరసమునకు లక్ష్యముగా నొసంగినాఁడు.

పంచతంత్రిమందలి చిన్నచిన్న కథలలో రసరసాభాస నిర్ణయ మొనరించుట బహుకష్ట సాధ్యము. అందును మూలమున విష్ణుశర్మ పోషించిన రసరసాభాసములనే చంపూకర్తలు గూడ యథా మూల ముగా బోషించినచో నదివారి ప్రత్యేకతగా బరిగణింప వీలుపడదు. అమూలక స్థలములను బట్టి రసరసాభాస పోషణమున దెనుగుకవుల విశిష్టత నిర్ణయించుట మిక్కిలి సమంజసముగా నుండును.

కావ్యోచితముగ అనువదించుట వలన జంపూకర్తలు విభావాదిక పోషణమున ఎంతయో స్వాతంత్రత నవలంబించినారు. అది తిర్యగ్గతమగు టచే రసాభాసమనదగి యున్నను పాఠకునకు రసానుభూతిని గల్గించు నంతటి సామర్థ్యము గల్గియుండుటచే ఆయాసన్నివేశము లందు భిన్న రసములే పోషింపబడినవని చెప్పనొప్పునని నాయభిప్రాయము. బహు పాత్ర నిబద్ధమైన కావ్యమున ప్రాసంగికముగ నొక కథయో సన్ని వేశమో పశుపక్షుల పాత్రలతో రచింపబడినచో నట రసాభాసము గలదని నిర్ణయింపవచ్చును. అన్ని కథలును బశుపక్షులు ప్రధాన పాత్రలుగా రచింపబడిన పంచతంత్రిము వంటి కావ్యమున బోషింపబడి నవి రసములనుటయే నాకభిమతము. ఏకావళీ కారుడైన విద్యాధరుని మతముననను బంచతంత్రమందలి తిర్యగ్గతములైన కథలలో బోషింపబడి నవి రసములే కాగలవు. ఇక రసరసాభాసపోషణమున బంచతంత్ర చంపూను వాదకులు ఎంతవఱకు గృతకృత్యులైనారో సమీక్షింతము.

## 1. శృంగారరస తదాభాసపోషణము :

శృంగారరసమునకు రతి స్థాయిభావము. 'స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః' అని రస గంగాధరమున రతియననేమో నిర్వచింపబడినది. నాయికా నాయకు లిరువురకు గలిగిన ప్రేమయను మానసిక వ్యాపారము రతియనబడునని భావము. ఈ శృంగార రసము సంభోగవిప్రలంభ భేదములచే రెండు విధములు. నాయికా నాయకుల సంయోగమునకు సంబంధించినది సంభోగము, వియోగమునకు జెందినది విప్రలంభము. నాయికానాయకుల పరస్పరవీక్షణము, భాషణము ఆలింగనము చుంబనము మున్నగు చేష్టలన్నియు సంభోగశృంగారమునకు జెందును. 'సంభోగస్య పరస్పరావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేక వ్యాపారమయత్వేన ఆనంత్యాదేక విధత్వేన గణనాకృతా' అని ప్రతాపరుద్రీయ రస ప్రకరణమున వివరింపబడినది. విప్రలంభ శృంగారము అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసము నను భేదములచే మఱల నాల్గువిధములు.

కాకోలూకీయ తంత్రమున 'వృద్ధవణిజుడు-చోరుడు' అనుకథలో వృద్ధుడగు భర్తకెన్నండును స్పర్శసౌఖ్యమొసంగని యాతని భార్య ఇంట ప్రవేశించిన చోరునకు వెఱచి స్వయముగా భర్తనాలింగన మొనర్చుకొనెనని సంస్కృత పంచతంత్రమున 'సాఽపి తం చౌరం దృష్ట్వా భయవ్యాకులితా వృద్ధమపి తం పతిం గాఢం సమాలిలింగ' అనిగలదు. ఆమె యాలింగన మొనర్చి భర్తకు సౌఖ్యమొసంగిన విధానమును దూబగుంట నారాయణ కవి మనోజ్ఞముగ నిట్లభివర్ణించినాడు.

కరికుంభముల కంటెఁగడు పైన చనుదోయి
యుగ్మలి బిగియార నొత్తియొత్తి
బిసకాండముల కంటెఁ బసమించుకరముల
నతివయంతంతకు నలమియలమి
పల్లవంబుల కంటె బాగైన కెంగేల
లలితాంగి యల్లన తెలిపి తెలిపి

పికనాదమునకంటెఁ బెంపారు నెలుఁగున
బింబోష్ఠి పలుమాఱు పిలిచిపిలిచి
తెలుపునంతట మేల్కని తెలివినొంది
తనకుఁ బ్రియకాంత చేసిన ధన్యతకును
మేను పులకాంకురంబుల నీనుచుండ
నొలసి సౌఖ్యాంబు నిధిలోన నోలలాడి

సంధివిగ్ర పద్య–186.

బైచరాజు వేంకటనాథుడు గూడ నామె పరిరంభ ప్రకారమును

కచభరము విరియ హార
ప్రచయం బల్లాడఁ బఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ
కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్

ఆశ్వా౩ పద్య–201.

చోరు నుపదేశానుసారము తన కనుకూలవతిగానున్న భార్యా లావణ్యమును ఆవృద్ధవణిజుడెట్లు కొల్లలాడుచున్నాడో బైచరాజు వేంకటనాథుడిట్లు మనోజ్ఞముగ వర్ణించినాడు.

రాజాస్య ముఖతామరస వాసనల గ్రుక్క-
నానుముక్కున బంటియైన దనుక
ధరపయోధర సుధాధర రసంబునఁ జొక్కఁ
బంచబాణ పిపాస పాయుదనుకఁ
జంచలేక్షణ ఘనస్తన గుళుచ్ఛకముల
నలము హా స్తగ్లాని దొలఁగుదనుక
నాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు
బొందితాపము శాంతిఁబొందుదనుకఁ
బ్రాయముడి బోయి కసరింకఁ బాఱియుండు
పంటిచాట్పున నెఱవేరు పడిన యొడలి

పరుసు సెట్టన బీదచేపడిన పగిదిఁ
గులుకు గుబ్బెత వయసెల్లఁగొల్లలాడె.

ఆశ్వా3 పద్య-211.

ఈ వృద్ధవణిగ్దంపతుల సంభోగ శృంగార వర్ణన మమూలకము.

బైచరాజు చతుర్థాశ్వాసమందలి 'బ్రాహ్మణుడు రాజపుత్త్రిని పీడుట' యను నమూలక కథలో జయసేనుఁడు నవోఢయగు భార్యను రతి కుపక్రమించుటకు ముందు పరిరంభ మాచరించిన విధము కమనీయముగ నిట్లు వివరించినాడు.

మగువ నీ కంకణమణుల నర్ఘ్యములని
పరికించు నెపమునఁ గరముఁ బట్టె
నెత్తమ్మి తావులీనెడు నీ మొగంబని
మూర్కొను విధమున ముద్దుఁ బెట్టె
లేమ నీకంఠమాలిక దొడ్డ సొమ్మని
తడవులాగున ఘనస్తనము లంటె
బిఱుచుట్టు బిగువున విఱుగదే నడుమని
సడలించుగతిఁ జీరముడి వదల్చె

నాతినీటోమ్ము నాటోమ్మునకు సమాన
మయ్యెడినో కాదో యాఁగాములరయ వలయు
నని మహాకైతవంబున నధిపపుత్రుఁ
డంబుజానన పరిరంభ మాచరించె.

పద్య-402.

జయసేనుడు భార్యా మార్ధ్యమునకు దగిన విధముగ ప్రవర్తించుచు దన యభీష్టమును నెరవేర్చుకొనిన విధము చమత్కార సంభరితముగా నున్నది. కవి సంభోగమును వర్ణింపలేదు గాని సున్నితముగా నాయకుడు ఆమె యధరక్షత మొనర్చిన రీతినిట్లు వర్ణించినాడు.

చాతురిమీఱ మస్తకము సందిట బిగ్గరఁ గ్రుచ్చిపట్టి యా
నాతి సుధాధరంబు రదనంబున నొక్కినఁ దాళలేక ధీ

రాతిశయత్వమేది బొమలార్చుచు కన్నరమూసి వల్లభుం
జేతులఁ ద్రోచి రాజముఖి సీత్కరణం బొనరించెఁ బల్మరున్
పద్య 405.

ఈ ఘట్టమున బైచరాజు గావించిన విపుల సంభోగ శృంగార వర్ణన మాతని వర్ణనా చాతుర్యమును సూచించుచున్నది.

విప్రలంభ శృంగార వర్ణనమున చంపూకర్తలు అసమాన ప్రజ్ఞను ప్రదర్శించినారు. కాకోలూకీయమునకు సంబంధించిన వృద్ధ వణిజుడు-చోరుడు' అనుకథలో దన వార్ధకమున సేవగించు చుండెడి పడుచుభార్య విషయమై వృద్ధవణిజుడు పడు వియోగావస్థను బైచరాజు రమ్యముగ జిత్రించినాడు. విరహాగ్ని కొలిమితో నూదినట్లుగ నధికమై వృద్ధుని బాధించు చున్నదని

విరహ దహన గ్రహంబున విగ్రహంబు
కొలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నారాటపడుచు నక్షీణ విభవు
భల్లకంపిత భవు మనోభవుఁ దలంచి

ఆశ్వా3 పద్య-192.

అని వర్ణింపబడెను. విరహతాపకారకుడగు మన్మథుని

లేరెధనుర్ధరుల్పుడమి లెక్కకు మిక్కిలి యొండు రెండుగా
వారడరింతురేటి నెఱవాది తనంబది రెండు నొండుగా
నారసి వేయనేరవలదా మఱి నీవలె నెంత వింతయా
నీరజగర్భుఁడుండుఁగడు నీ కరకౌశల మెన్న మన్మథా.

ఆశ్వా3 పద్య-193.

అని వృద్ధవణిజుడు నిందించినాడు. లోకములో ధనుర్ధరులలో నెవ్వరికిని లేని గొప్పదనము మన్మథునకు గలదని చెప్పబడిన విధము చమత్కారా వహముగా నున్నది. ఇతర ధానుష్కులు ఒకటి రెండు చేయుగా మన్మథుడు రెండింటి నొక్కటిగా జేయుననుట విశేషము. వియోగబాధితు

లైన నాయికా నాయకులను మన్మథుడు గలుపునని భావము. ఇతర ధనుర్ధరుల బాణములు బాహ్యశరీరమునే చీల్చునుగాని మన్మథుని బాణములు మర్మభేదన మొనరించునని యావణిగ్వృద్ధుడిట్లు వివరించినాడు.

ఇంపున నన్యచాపధరు లేసిన తూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయఁగఁ జాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదము సేయు భవద్విశిఖంబు లెట్లు గీ
ర్తింపుదు నీదు చాపమవధీరిత శంబర కాంచనాంబరా

ఆశ్వా3 పద్య-194.

ఈ వియోగశృంగార వర్ణనమున బైచరాజు మన్మథ వైశిష్ట్యమును మనోహరముగ నిరూపించినాడు. ఇదంతయు నమూలకము.

లబ్ధ ప్రణాశతంత్రమునకు జెందిన మకరపతికథలో ఆతని భార్య యనుభవించిన ప్రియవిప్రలంభ వేదనను భానుకవి బహుమనోజ్ఞముగ 'అంతఁ బురుషవియోగంబున నక్రభామిని హృదయమ్ములో మదనాగ్ని ప్రజ్వరిల్లి కాల్పం బొగలెగయ, మనంబను పరమసఖుండు వెలికిం దెచ్చెనన, వేడి నిట్టూర్పుగాడ్పున నధరపల్లవంబు గంద, నాశ్రిత భర్తృకయగు మకరవధూటి వెండియుందన చేడియం బనిచిన' (ఆశ్వా 4 వచ 14) అని వర్ణించినాడు. జలచరమైన మకరాంగన మదనాగ్ని తాపమిందు భానుకవిచే సహజ సుందరముగ అభివర్ణింపబడినది.

లబ్ధప్రణాశమునకు జెందిన కథాభాగమున నాల్గవయాశ్వాసమున బైచరాజు అమూలకముగ రచించిన జయసేనుని కథలో విప్రలంభ శృంగారమతి మనోహరముగ బోషింపబడినది. జయసేనుని చిత్రపటమును గాంచిన భువనమోహిని యను రాజపుత్రిక పొందిన విరహతాపము ప్రబంధోచితముగ నభివర్ణింపబడినది. చెలులామె నుద్యానమునకు గొనిపోవుట, శీతలోపచారములొనర్చుట, మన్మథునర్చించుట, మున్నగు విషయములను బైచరాజు వేంకటనాథుడు చక్కగ వర్ణించినాడు. ఇందలి రాజపుత్రి వియోగభరమతి విస్తృతముగ వర్ణింపబడినది.

అందలి ప్రతిపద్యము నొక రసగుళికయే. ఎన్నియో మధుర భావములు అక్షరాకృతి దాల్చినవి. ప్రబంధయుగ పరిణతస్థితిని సూచించుచున్నవి.

చెలులు రాజపుత్రికపడు వియోగావస్థకు బాధనొంది మన్మథుని యసదృశ పరితాపము నిట్లు ప్రశంసించినారు.

తలయేఱు పట్టించె నెల దాల్పునకు భవ
 త్కంఠ నిష్కుంఠ హుంకార రవము
వికటిల త్రోటి క్రోటికిఁ దెచ్చె భారతీ
 కాంతఁ దావక భయంకర శరంబు
ముష్కనిర్భేదనంబున సాధుఁ జేసె నీ
 వైరంబు మఱి దివ్య వృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీ నెఱదాడిఁ
 జేరఁడు గ్రహరాజ శేఖరుండు

నీ పరితాపాగ్ని దపియించి నీరజారి
సంశ్రయించె సురాచార్య శరణ భూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు
శంబరామర విమత హింసా రిరంస.

పద్య—158

పరమేశ్వరుడు, సరస్వతి, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు మన్మథుని వలన నెట్టియవస్థల పాలైనారో యిందు నిరూపింపబడినది. పరివార ముత్తమ సంస్కార సంపన్నమయినను మన్మథుడు దుష్ప్రవర్తకుడుగా నుండుటకు చెలులిట్లు బాధపడి నారని పేర్కొనబడెను.

వివిధాగమాంత ప్రవేశచాతురి నెన్నఁ
 దగుశుకాదులు వినీతత ఘటింప
మహీసురాప్తి సుహృత్త మహిమ గాంచిన యుత్త
 మాళులు హితవృత్తి ననుసరింప
ఘనదాన వేగరాగముల మీఱిన జగ

త్రాణుండు నీ మనోరథము గడప
నాశువాగ్గ్రహణ మేధాశక్తి మాధవా
దృతి భజించిన మహాద్విజులు గొలువఁ
గువలయ ప్రీతికాముఁడై నెవఁడు రాజు
గాఢరూఢ ప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి
వేమునకుఁ బోయు పాలయ్యె వృద్ధసేవ.

పద్య–159.

ఇందలి శుకాదులు, ఉత్తమాళులు, జగత్త్రాణుడు, మహాద్విజులు' అనుపదములు వాని విశేషణములు అర్థద్వయము గలవి. అనేకవేదాంతములందు ప్రవేశించుటలో జాతుర్యము గలవారు శుకమహర్షి మున్నగువారని యొకయర్థము. వివిధ వృక్షముల మధ్యభాగమున ప్రవేశించుటలో జాతుర్యముగలవి చిలుకలు మున్నగునవి యని వివిధాగమాంత...యను వాక్యమునకు మఱియొక యర్థము. ఇట్లే తక్కిన వాని యందు విశేషములు గలవు. ఇందలి శ్లేషాలంకార చమత్కృతి యనుపమము.

మన్మథుని యస్త్రపీఠము, ఆయుధము, ధ్వజము, వాహనము' మున్నగువానికి బట్టిన దుర్గతిని జెలులిట్లు నిందించుట మనోజ్ఞము.

ఆర్తివహించు నీయస్త్ర పీఠమునకు
నిలువ గన్నులనీక నివ్వటిల్లె
నతియుక్తమగు తావకాయుధంబున కహో
దొరకె జండాలురతోడి మైత్రి
వ్రంతఁబాయని భవద్ధ్వజ వాశ్చరమునకుఁ
గలిగెఁ బేరలుఁగులఁ బొలిసిపోవఁ
బుట్టుగ్రుడ్డైన నీబూమెర తేజికిఁ
దగిలె మహావినీత ప్రతీతి

పొకట జాతికిఁ బాసిన యనుగుఁ జెలికి
నెసఁగె షట్కేళ వేళ మానిసితనంబు
నొడలుమాసిన నీకయ్యె నుగ్రకృత్య
పుంగభవ నిందితోలకు మేలావహించె.

పద్య—161.

మన్మథునకు గల మాతాపితృద్రోహ ప్రవృత్తి వైభవమును జెలులు దమకసిగా నగను జనుత్కారావహముగ నిట్లుగ్గడించినారు.

ఈ మదప్రక్రియ మాఁ దమ్మునాళ్ళ జరతుంగాడై యున్న తండ్రిం దివి
కేపించుటనిం దమ్ముల్ఁ జేరి తత్త్వబల పత్రిచ్ఛాయ వర్తించు నా
డె మనసాధ్వీన్ గమ్మఁజేర రమ్మనక యుద్వృత్తిన్ విజృంభింతునీ
తె మాసపోదయ లాభ మెట్లు జనికర్తృ ద్రోహియౌ వానికిన్.

పద్య—162.

చెలులు మన్మథుని నిందించిన యనంతరము చంద్రుని సుదీర్ఘముగ నుపాలంభించినారు. చంద్రోపాలంభనమునకు సంబంధించిన పద్యము లన్నింటిలో

కృతదక్షాప కృతిన్మహోమయుఁ గళంకి న్సోదరీ మందిర
ప్రతిపక్షుఁ నజనీ చరుం గురుకళత్ర ప్రాప్త భూయః కళా
పతనున్నిన్నిరసావహించెఁ ద్రిపుర ప్రత్యర్థి సర్వజ్ఞులా
శ్రితదోషస్మృతి విస్మృతి ప్రతులుగారే రోహిణీ వల్లభా.

పద్య—172.

అను పద్యము దాహరణీయము. గురుకళత్ర ప్రాప్తిమున్నగు పెక్కు దోషములున్నను జంద్రుడు పరమేశ్వరునిచే శిరోలంకారముగ గ్రహింప బడినాడని చెప్పి బైచరాజు సమస్తము తెలిసినవారలు ఆశ్రిత దోషములను విస్మరించు శీలము గలవారని సమర్థించుట మిక్కిలి మనోజ్ఞముగ నున్నది. సర్వజ్ఞ శబ్దమున శ్లేషగలదు. పద్యమందలి యర్థాంతరన్యాసము రమ్యముగా నున్నది.

నెచ్చెలులీ సందర్భమున గంధవహుని ప్రార్థించిన విధము గూడ మిక్కిలి సరసముగ నున్నది. వారాతని పరహితాచరణబుద్ధిని ఇట్లు కొనియాడినారు.

కాండభృద్ఘన బాధ గాసినొందిన మిత్రు
నోమవే సుఖవృత్తి నుల్ల సిల్ల
మోచివచ్చిన కార్యముల చోటనొసఁగవే
కుసుమబాణునకు నెక్కుడు ధనంబు
చెలిమిఁ బక్షీకరించిన మహాశిఖికిఁ జే
రుపవెలావరి సమారోహణంబు
మొదల నిన్ను సహస్రముఖములఁ గొనియాడు
చక్రికీవె నితాంత సత్త్వగరిమ
నీ విహారంబు దాక్షిణ్య నిర్భరంబు
నిను సదాగతిగాఁ జూచునిఖిలలోక
మోజగత్ప్రాణ నీ వంటి యుత్తమునకు
నర్హమే పాంథయోషాని బర్హణంబు.

పద్య–175.

ఇందు మిత్రునకు, గుసుమబాణునకు ననలునకు జక్రికి గంధవహుడు గావించిన మహోపకారము హృద్యముగ వివరింపబడెను. దాక్షిణ్య, సదాగతి, జగత్ప్రాణ యను పదములు శ్లిష్టములు.

రాజపుత్రియైన భువనమోహిని మలయానిల చంద్రాదుల వలన శోషిల్లుచు జెలికత్తెలను జూచి వెన్నెల ప్రవాహమున మునిగి వియోగ భారము నుండి విముక్తి నొందుదునని యిట్లు వివరించినది.

కనలు చుక్కల రాజుకంటఁ బుట్టిన నేమి
గాడ్పు పేరెము వాఱుఁగాక యేమి
కంతుఁడాకృతిఁ బెంచుఁగాక యేమి కుజాత
కలితుఁడై మధువుండుఁగాక యేమి

హంసమాపగ పార్శ్వకై పోవుఁగాకేమి
గండు తుమ్మెద మ్రోయుఁగాక యేమి
చిలుక వాదులకు వచ్చిన వచ్చుఁగాకేమి
కలకంఠి గలహించుఁ గాకయేమి

కమ్మ చిగురాకుచే మించుఁగాక యేమి
కళికలంతంత మొనఁ జూపుఁగాక యేమి
వెఱపు నాకేల వెన్నెల వెల్లి ...
ప్రాణ సఖులార వలవంతఁ బాయుదాన.

పద్య 183.

ఇందు వియోగులకు దాపము కల్గించు వస్తుజాతము సమగ్రముగ చేర్కొనబడెను. చంద్రుడు కుమార సమీరుడు, మన్మథుడు, వసంతుడు, హంస, గండుతుమ్మెద, చిలుక, కోకిల, కిసలయము, కళిక యనువాని విజృంభణము ఇందు సూత్రప్రాయముగ వర్ణింప బడెను. విరహోద్దీపన సామగ్రి ఇందు బుష్కలముగ బోషింపబడినది.

రాజపుత్రిపై జాలిపడి యామె పడు నవస్థకు నెచ్చెలులు బాధనొందిన విధమును భైరవకవి మనోహరముగా వర్ణించినాడు

దరహాస లేశధిక్కరణ మున్నదియెనీ
వంక వెన్నెల కేల వహ్నిగురియఁ
గినిసి మాటలు నేరవనుచు శిక్షించితే
చిలుక కేటికి వళావళి యొనర్పఁ
బ్రతి పక్షియని తిరస్కృతిఁ జేసితే సాధు
పికమున కేల వాబిఱుసుఁ జూపఁ
జూడఁబోలని చూపుఁ జూచితే చంచరీ
కమునకు నేల ఛిద్రములు వెదక

గోచరింపక యొకమూలఁ గూడి చనక
మందవహత వహింపకిట్లు తిఁమ్మరగ నేటి

కని యుదాసీనుఁ జేసితో యభ్ర వేణి
యనిల శిశువేల పీచి వాటయ్యె నిపుడు.

పద్య 187.

మన్మథ పూర్ణచంద్రి మలయ పవనుల ధాటికి రాజపుత్రి యెట్టి యవస్థల పాలైనదో చెలులు పలువిధములుగ భావించిన విధమిట్లు పైచరాజుచే వర్ణింప బడెను.

మనసు గన్న రమాకుమారికా సుతునకుఁ
బూర్వాశ్రితుండైన పూర్ణ శశికి
జీవము వంటి దక్షిణ సమీరమునకుఁ
బేరైన కుసుమాస్త్ర బృందమునకుఁ
బలుకుమారుని ముద్దు చిలుకకు నెయ్యంపుఁ
బైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళియైన గయ్యాళి తేఁటికి బెట్టు
చెట్టైనవేఁ బోఁదిఁ చిగురుమావి
కకట భయమంద వలసె హోయనఁగ వలసె
బెగడుపడి యుండవలసెఁ గంపింప వలసె
నాతురతఁ గూరవలసె బిట్టులయ వలసె
జలదరింపఁగ వలసె వేజడియ వలసె

పద్య 186.

ఇందలి క్రమాలంకార ప్రయోగము బహురమ్యముగా నున్నది. మన్మథునకు భయమంద వలసెను. పూర్ణచంద్రునకు హోయన వలసెను. మలయ పవనునకు బెగడుపడి యుండవలసెను. కుమారాస్త్ర బృందమునకు గంపింప వలసెనని యన్వయము. ఇందలి వస్తు సామగ్రి యంతయు నత్యంత ప్రియతమము, మిక్కిలి సన్నిహితము నయినను బాధ గొలుపుచున్నదని చెలులు భావించినారు. మన్మథుడు మనసు గొన్నవాడు. నాడు జాబిల్లి పూర్వమాశ్రయింప బడినవాడు. మలయ పవనుడు ప్రాణము వంటివాడు. ఇట్లే తక్కినవియు స్వీకార్యములు. ఆ చెలులు తమ రాజపుత్రిని బాధింపక విడువుడని శుకపికాదులను

మాటకు రాకు పోదిశుకమా యొకమారు జయింపరానికై
లాటము జేసె నేటికి భళా పికమా యిఁక మాను బోటినీ
పాటియె ప్రాణవయ్యెవడ చల్లుదురే యిటులైన బోటియె
చ్చోటికిఁ బోవు నీచలువ చూపవనా పవనాఘనాదృతిన్.

పద్య 192.

అని ప్రార్థించిన విధమత్యంత హృదయంగముగా నున్నది.

వియోగ బాధోపశాంతికై చెలులు శీరములు, మృణాలములు, మున్నగు వానితో శీతలోపచారము లాచరింప నవి మఱింత బాధా జనకము లైనవని

నునుమావి చిగురు పానుపు మహోతను శస్త్ర
శయ్యగాఁ దలఁచు గంజాతనయన
కడిపోని విరుల కంకటి గణించు న భూత
కంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపు గుంకుమపువ్వు తలిమ మంగభవాగ్ని
శిఖగా విచారించు సింహమధ్య
శిరము కప్రపుఁ బల్కు సెజ్జ సొక్కపుఁ గాము
శరముగా వగచు యోషాలలామ

మంచి పడమటి పన్నీరు మకరకేతు
విషముగా బుద్ధిసూహించు విద్రుమోష్ఠి
తావిపుప్పొడి శంబరాంతకు పరాగ
మని వితర్కించులలన మోహైకకలన.

పద్య 196.

అని భైచరాజభివర్ణించినాడు. చెలులు సమకూర్చిన లేతమావి చిగుళ్ళ పాన్పును రాజపుత్రిక మన్మథుని శస్త్రశయ్యగా దలంచినది. పూల పాన్పును గంటకమయాస్తరణముగా నెంచినది. కుంకుమపువ్వు పఱు పామెకు మన్మథాగ్ని శిఖగా బాధ గొలిపినది. కర్పూరపు బలుకుల సెజ్జనామె మన్మథుని శరముగా దలంచినది. పన్నీటిని మన్మథుని

విషముగా భావించినది. కవి యీపద్యమున ఏయే పదార్థములు వియోగులనేయేరీతుల బాధ గొలుపుచుండునో మనోజ్ఞముగా వర్ణించి నాడు. ఉద్దీపన సామగ్రి యీ ఘట్టమున వైచరాజుచే మధురముగ బోషింప బడినది. ఈ భువన మోహినీ జయసేనుల కథలో వైచరాజు నిర్వహించిన విప్రలంభ శృంగార వర్ణనము పంచతంత్రమునకు ప్రబంధత్వము నొసంగినది. అందాతని యలంకార పోషణము మిక్కిలి ప్రశంసార్హము.

కాకోలూకీయ తంత్రమందలి రథకారుని కథలో దూబగుంట నారాయణ కవియు, వైచరాజు వేంకటనాథుడును కృతక విప్రలంభ వర్ణనమును నిర్వహించినారు. రథకారుడు కులటయైన తన భార్యను బరీక్షింపగోరి రాజు పంపున గ్రామాంతర మేగవలెనని పలుక నాతని భార్య పరపురుషాపేక్షచే లోలోన నానందించుచు భర్తతో నెంతయో యనురాగము నభినయించుచు దుస్సహమైన భర్తృవియోగ బాధను వ్యక్తమొనర్చిన విధమును దూబగుంట, వైచరాజు మనోహరముగ నభివర్ణించినారు. పరపురుష సుఖాపేక్షచే రథకారుని భార్య భర్తృ వియోగమెంత దుర్భరమై బాధగొల్పునో వివరించుటచే దీనిని కృతక విప్రలంభమని పరిగణించుట సముచితము. దూబగుంట నారాయణ కవి రచనమున రథకారుని భార్య యాతని దూరదేశ గమనమునకై వగచుట

తడవోర్వవు ప్రాణంబులు
దడసి నినుంబాసి నాకు దప్పదు నీకున్
బడతుక లచ్చటc గలరని
తడవుచు రాకున్న విడుతుc దనువు నిజేశా

సం. వి–పద్య 222.

అని వర్ణింపబడినది. వచ్చుట యాలస్యమైనచో దాళజాలక ప్రాణములు త్యజింతునని హెచ్చరించినది. వైచరాజు ననువాదమున నామె వియోగవిలాపము విపులముగా వర్ణింపబడినది. నిర్దయుడైన రాజు

నీకెట్లు గలిగెను, నిన్ను విడిచి యుండజాలను. నన్నును నీతో గొని పొమ్ము. నా హృదయము నీవశమగుట యెఱుగవా యని యిట్లు విలపించినది.

నిక్కువమూరి కేగదవె నీకు దయా రహితాత్ముఁడైన రా
జెక్కడఁ గల్గె నిన్ను నొకయించుక సేపెడఁబాసి యుండలే
నిక్కడ నేను మీ పిఱుద నిప్పుడ వచ్చెదఁ దోడు కొంచుఁ బొ
మ్మొక్కట దీఱ నాహృదయ మక్కట నీ వశమౌటెఱుంగవే

ఆశ్వా 3–పద్య 263

ఆమె సహింప జాలనని చెప్పిన పతివియోగ స్వరూపమును బైచరాజు

నిమిషము దివసంబై దివ
సము నెలయై మాసకంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద
రమణా భవదీయ యోగ రాహిత్యమునన్

ఆశ్వా 3–పద్య 264.

అని వివరించినాడు. ఒక్కొక్క నిమిషమొక్కొక్క మాసమై ఒక్కొక్క మాసమొక్కొక్క సంవత్సరమై, ఒక్కొక్క సంవత్సర మొక్కొక్క యుగమై పతివియోగము బాధాకరమగునని యామె పలుకుటలో భావి కథను దెలియని పాఠకులకామె పత్యనురాగ మెంతటిదో యనిపించును. ఈ సందర్భమున ఆమె పతి రూపసంపదను వర్ణించి చివఱకు వచ్చుటలో నాలసించిన జత్తునని యు గన్నీరు కార్చుచు నిట్లు హెచ్చరించినది.

తడసినఁ జత్తు న్వడి ని
క్కడికే తెమ్మనుచు ముచ్చు గన్నీరొలుకన్
బుడిబుడి యేడ్పులతో న
వ్వెడ మాయలఁ బోవు మగని వీడ్కొల్పుటయున్

ఆశ్వా 3–పద్య 268

'న వినా విప్రలంభేన వియోగః పుష్టిమశ్నుతే' అని యాలంకారికులచే ప్రాధాన్య మొసంగబడిన విప్రలంభ శృంగారమును చంపూకర్తలు మిక్కిలి మనోజ్ఞముగా బోషించినారు. ముచ్చుకన్నీరొలుకునట్లు బుడి బుడి యేడ్పులతో రథకారుని భార్య ప్రదర్శించిన దుస్సహ భర్తృవియోగము సాహిత్య చరిత్రలో నత్యంత విశిష్టమైనది. అది కృతకవిప్రలంభ శృంగార వర్ణనమున చంపూకర్తల అనుపమ సామర్థ్యమును వెల్లడించుచున్నది. దానిని విప్రలంభ శృంగారాభాస మనుట కంటె కృతక విప్రలంభ శృంగార రసమనుట సముచితమని నాయభిప్రాయము.

పంచతంత్ర మందలి మిత్రభేదమున నున్న ఆషాఢభూతి కథకు రంగముగానున్న తంతువాయుని కథయందును, గాకోలూకీయ మందలి రథకారుని కథయందును శృంగార రసాభాసము పోషింపబడినది. ఈ రెండు కథలలో నాయిక యుపనాయకునితో వ్యభిచరించుట యభివర్ణితము. అనుచితా లంబనమున రతి వర్ణింపబడుటచే అది శృంగార రసాభాసమగును. తంతువాయుని కథ యథా మూలముగనే యనువదింపబడినది గాని రథకారుని కథ యందు మాత్రము అనువాదకులు స్వతంత్రతను ప్రదర్శించినారు. మూలమున వీరధరుఁడను రథకారుని కథలో నాతనిభార్య పరపురుషునితో గావించిన రతిక్రీడలు వర్ణింపబడలేదు. విటుడైన దేవదత్తుడు స్పర్శోత్సుకుడు కాగా శయ్యాధః స్థలమున భర్తయున్నట్లు తెలిసికొని రథకారుని భార్య ఆ విటునితో శరీరమును దాకుటకు గూడ తానంగీకరింపలేదని 'భో మహానుభావ న మే శరీరం త్వయా స్పర్శనీయం యతోఽహం పతివ్రతా మహాసతీ చ న చేచ్ఛాపం దత్వా త్వాం భస్మసాత్కరిష్యామి' అని చెప్పబడెను. అనువాదకులు వారి యనంగ సంగ్రామమును గూడ వర్ణించినారు. దూబగుంట నారాయణ కవి రథకారుని భార్య యుపపతితో రమించినట్లు

అని మఱియుఁ బ్రియము చెప్పుచు
ఘన పరిరంభంబు చేసి కాంతయు నతఁడున్

మనసిజ సంక్రీడలకై
ననుపమ శయ్యాతలంబు నందున్న యెడన్
సం. వి పద్య-232.

అని రచించినాడు. భానుకవి వారి యనంగ క్రీడనిట్లు విపులముగ 'అప్పుడయ్యిరువురు ననంగి పెనంగి కుసుమభల్ల మల్లయుద్ధమునకు సన్నద్ధులై గళరవహుంకారమ్ముల నిశాతబాణమ్ముల రదచ్ఛదమ్ముల వషట్కార సంచయమ్ముల దశాంగుళార్ధ ప్రయోగంబులం దలపడి మదోద్రేకమ్మున వీడెనుబ్బున నొడలెఱుంగక, చందన కర్పూర కుంకుమ పంకమ్ముల శరీరములు జొబ్బిల్ల గందవొడి యెడనెడపైఁ జల్లుకొనుచు బర్యంకతలంబు లుయ్యాలలూగ......అంతకంతకు మహోత్సవంబులం జెలువొందియున్న సమయంబున' (ఆశ్వా3 వచ100) అని వర్ణించినాడు. బైచరాజు వేంకటనాథుడు గూడ వారి మన్మథమల్లయుద్ధ విశేషముల నత్యంత సహజముగా నుండునట్లు విపులముగ నిట్లు వర్ణించినాడు.

ప్రవిఘటితాను రూప దృఢబంధము మంధర మోద కృద్గళా
రవము కటీకపోలముకుర స్తనదృష్ట నఖక్షతంబు కై
తవ పరిహాస భాషిత మతాంత చపేట మపాస్తలజ్జమ
స్రవ దుపగూహముల్లసిలె సంగమ మిద్దఱకు న్నిరాంధ్యమై

సాధీయాకృత ధారా
సాధారణ కర శిఖర నిశాత నఖంబుల్
సాధింపఁగ రతినాథా
యోధన సాధనములయ్యె యువయువతులకున్.

ఆశ్వా3 పద్య-273, 74.

బైచరాజు వేంకటనాథుడు తన యనువాదమున జతుర్థాశ్వాసమున నమూలకముగ రచించిన బ్రాహ్మణుడు రాజపుత్రిని పీడినకథ యందును రసాభాసము విపులముగ బోషింపబడినది. అందు భువనమోహిని యను రాజకన్యకు విద్యనేర్పు బ్రాహ్మణుడు విద్యామంటప

మున నుండి చదువు చెప్పుచు దదీయ సౌందర్య వయోవిలాసంబు వీక్షించి మన్మథాతురుడైన విధము విస్తృతముగ నభివర్ణితము. అనుచితవిభావము నాలంబనముగ శృంగారము వర్ణింపబడుటచే నది రసాభాసమేయగును. అందా మహా బ్రాహ్మణుడు తాను మన్మథతాపము నొందుచుండెననియు నధరామృతమిచ్చి పుణ్యమార్జించు కొనుమనియు బరహితాచరణము వలన గలుగు పుణ్యము మఱియే యితర ఘన కార్యముల వలనను గలుగదనియు నా రాజపుత్రితో నిట్లు పలికినట్లు రచింపబడినది.

నిరవధికత్వరంబఱచి నీచనుగొండల సంధి డెందపుం
దెరువరి మారచోర నిహతిం బడి మోహ విదాహవేదనన్
బొరలెడుఁ దేర్చుపుణ్యమిదిపో యధరామృత మిచ్చియిందునం
దరసినఁ గల్గునే పరహితాచరణ ప్రతిమాన ధర్మముల్

పద్య-198.

ఆమెపై గల మోహము నతడొక సముద్రముగా భావించి దానిని దాటుట కామె స్తన కుంభ ప్లవము నిట్లర్థించినాడు.

నవలా తావక మోహా
ర్ణవ మేమిట గడతు దుస్తరము వివరింపన్
భవదీయ స్తన కుంభ
ప్లవమబ్బిన గాక యీ విపత్సమయమునన్.

పద్య-199.

ఆమె లావణ్యరసమును ద్రేవ్వునట్లుగా నాస్వాదింపనిచో ఆ నిద్ర నిద్రగా దనియునిట్లు

ఆ నిద్రా సుఖతంబులు
గానేరవు లోచనములు కంఠద్వయసం
బై నీలావణ్య రసం
బోనవలా త్రేవ్వ వెడల కుండుట వలనన్

పద్య-200

అని వివరించినాడు. ఆతడు తన మన్మథతాపమును పలువిధములుగ నామెకు దెలుపుకొనుచు జివరకు రతిభిక్ష నిట్లర్థించినాడు:

ఇన్నియును జెప్పనేటికిఁ
బన్నిన మరుగాని వానిఁ బాసితినో రా
కన్నియ వన్నియ మెఱయం
గన్నెఱికపు భిక్షనాకుఁ గరుణింపఁగదే.

పద్యం 203.

దానికామె గురుడు పితృతుల్యుడనియు, పరభామాసంగను మెవ్వరికైనను గీడొనర్చు ననియు, నందును భూసురుడగు నతనికి బ్రాహ్మ్యహాని, తపోహాని, ప్రాణహాని గలిగించునని యనేక ప్రకారముల నతనికి బోధించినది. ఆమె గావించిన ధర్మబద్ధమైన కర్తవ్యోపదేశమునకు జలింపక బ్రహ్మ, చంద్రుడు, ఇంద్రుడు ననువారి పూర్వోదంతములను దనమతమున కనుకూలముగ చేర్కొనుచు వారెట్టి హైన్యమును బొందలేదని ఆ బ్రాహ్మణాధముఁడిట్లు గడించినాడు.

నీవు మాటలాడ నేర్తువు గురుఁడేల
చెప్పుకొను విరాళి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన
పలువ నలువ కూఁతుఁబట్టికొనఁడె

మరుబారిఁ బాటి చంద్రుఁడు
గురుభామం బ్రేమఁ బిలుచుకొని వినుతబుధుల్
పరిణతముని విబుధ బుధుం
గరిగమనాగమనలీలఁ గాంచుట వినవే

గౌతమ భార్యనహల్యన్
శాతోదరిఁ బదరి పర్ణశాలం గాలా
తీతమొనర్చియుఁ గూడిన
యాతని కింద్రునకు నేమి యయ్యెం జెపుమా

పద్య 210-12.

ప్రబంధములలో సర్వసామాన్యముగ నాయికలిట్టి యుపపత్తులను ప్రదర్శించుట గలదు. నాయకు డుదాహరించుట పైచరాజు వేంకటనాథుని ప్రత్యేకత. మహీసురరక్షణము కర్తవ్యమని యామె చివఱ కంగీకరించి రెండుజాములవేళకు వత్తుననగా నామెరాకకై నిరీక్షించుచు ఆ బ్రాహ్మణాధముడు ఏమాత్రపు శబ్దము వినబడిన నామె వచ్చు చున్నదని భావించినట్లు

చీమచిటుకుమన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న
నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుండాలించు
నప్పుడబల కాలి చప్పుడనుచు.

పద్య 247.

అని రచింపబడినది. ఇందా బ్రాహ్మణుని తీవ్రవియోగతాపానుభవస్థితి వెల్లడింపబడినది. ఆమె రాకపోవుటకాతడు పొందిన వైకల్యము

రాదాయెఁ జూచితే యను
రాదా యడ్డంకిఁ బట్టె రాదను నిర్మ
ర్యాదలు సీమంతినులను
హాదైవమ ప్రొద్దుపోయెనని తలయూచున్

పద్య 248

అని సొగసుగ జెప్పబడినది. ఆతడీసందర్భమున గావించిన మన్మథో పాలంభనముగూడ వేంకటనాథునిచే మనోజ్ఞముగ రచింపబడినది. అతడు ద్విజరాజును శిరసావహించిన పరమేశ్వరుని కంటిమంటలో భస్మమైతివి, ద్విజరాజనైన నేనలిగినచో నేమగునో యూహించు కొనుమని మన్మథుని బెదరించి వింటియందు నారిననుసంధానింపక నారిని నాయందను సంధానమొనర్పు మని యిట్లు ప్రార్థించినాడు.

ద్విజరాజుందలఁదాల్చు కొన్నతని దృగ్దప్తి ప్రభూతాగ్నులన్
రజమైపోయిన నిన్ను నీతిరసదూరా మార యీకేవల

ద్విజరాజల్గిన నేమిసేయునో ప్రశాంతిం గాంతిమత్సాయక
వ్రజముం గూర్పకునారి నారినను గూర్పం దేర్పఁ బుణ్యాంబగున్
పద్య 251

ఈ పద్యమందలి యెల్ల చమత్కృతియు ద్విజరాజు, నారియను పద ద్వయమున నిక్షేపింపబడినది. అతడీసందర్భమున గణనాయకుని మన్మథుని గలిపి వారినుంచిచెడ్డల నిట్లు తీవ్రముగ విమర్శించినాడు.

శివ గణనాయకా యనిన శీఘ్రమె కార్యములడ్డపాటు లే
కవు యదునాథ పంచవిశిఖా యన హస్తపదాస్థికాండముల్
చివికెడు వట్టినొప్పులొడిసెలఁ్రిస పొక్కులు గంట్లు బిబ్బపుం
డ్లవు నిటువంటి పుత్రుఁదగవా కన నమ్మధుకైటభారికిన్.
పద్య-252.

గణనాయకుని ప్రార్థించినచో గార్యము నిర్విఘ్నముగ సఫలమగును. మన్మథుని సంస్మరించినంతనే యాపాదమస్తకము తీవ్రమగు బాధగల్గు నని బైచరాజు చమత్కరించిన విధమత్యంత మనోజ్ఞము. ఇట్లీ కథా భాగమున శృంగారరసాభాసము వేంకటనాథునిచే విపులముగ బోషింప బడినది.

బైచరాజు వేంకటనాథుఁడు చతుర్థాశ్వాసమున నమూలక ముగ రచించిన 'హాలికకాంత భర్తరాజబాధ నొందుట' యనుకథ యందును శృంగార రసాభాసముగలదు. ఆ కథయందు హాలికకాంత యుపపతియైన మణిమంతునితో సుఖించుట

ఏ తెంచె నిర్నిరుద్ధ
ప్రీతిన్మణిమంతుఁగ్రుచ్చి బిగికౌఁగిట హృ
జ్జాతపృథు ప్రథనంబున
శాతోదరి పెనఁగె రెండు జాలవ్వేళన్
పద్య 476.

అని వర్ణింపబడెను. ఇందు శృంగారరసాభాసము మితితప్పక పోషింప బడినది.

## 2. హాస్యము :

హాస్యరసమునకు స్థాయిభావము హాసము. 'వాగంగాద్ వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః' అని రసగంగాధర లక్షణము.

మిత్రభేదమున వానరము—కీలోత్పాటనమను కథలో దూబగుంట నారాయణకవి వానరచేష్టలను

గుడిమెక్కి తరులపైఁ గుప్పించునవియును
దరువులపైనుండి దాఁటునవియు
నురుతరశాఖల నూఁగాడు నవియును
బ్రాకారములు బ్రాఁకిపాఱునవియు
గోపురంబుల మీఁదఁ గూర్చుండునవియును
గోళ్ళఁబ్రిక్కలు వీఁపు గోకునవియు
నిక్కుచు బొమలెత్తి వెక్కిరించెడునవి
యొండొంటితోఁ బోరి యోడునవియు

నిట్లు వానరయూథంబు లిట్టునట్టు
సహజమగు చాపలంబున సంభ్రమింప
వానిలోపల నొక వృద్ధవానరంబు
దూరమునఁ బాఱె తావిధిప్రేరణమున.

పద్య 91.

అని వర్ణించినాడు. ఇందలి కపిచేష్టావర్ణనము హాసమును గలిగించును. ఈ ఘట్టమందలి హాస్యరస పోషణమమూలకము. నారాయణకవి కల్పితమే. తక్కిన యనువాదకు లతిస్వల్పముగ కపి స్వభావమును జిత్రించినారు. తిర్యగ్గతమని కొందరు దీనిని హాస్యరసాభాసముగ బరిగణింపవచ్చును.

## 3. కరుణము :

కరుణరసమునకు శోకము స్థాయిభావము. 'పుత్రాది వియోగ మరణాది జన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తి విశేషః శోకః' అని రసగంగా

ధర లక్షణము. పుత్రాది వియోగ మరణాదుల వలన గలిగిన వైక్లబ్య మను పేరుగల చిత్తవృత్తి విశేషము శోకమనబడును.

మిత్రభేదమందలి 'కాకి-కనకసూత్రము'ను కథలోఁదాను పోగొట్టుకొనిన సంతానమును వాయసాధ్యక్షుఁడు విలపించిన విధ మును బైచరాజు వేంకటనాథుఁ డిట్లు వర్ణించినాఁడు.

నూఁగారు వొడలు మేనులతోడ నెరకునై
కిలు కూతలిడ నాలకింపలేదు
అల్లంతఁగాంచి యుల్లాస్పు పక్షములతో
శిరములంకింప నీక్షింపలేదు
మొగుబోదలయి గూఁడు దిగనాడి పెఱమ్రాఁకు
లెక్కనారసి యుత్సహింపలేదు
చక్రమక్రమ విలాసముల నంబర వీథిఁ
దిరుగఁ జిత్తమున మోదింపలేదు
ప్రేమ మొసలారఁగని మెత్తి పెనుచుచుండ
నసుఁగు మునుమలఁ దిగిచి ముద్దాడ లేదు
బహువిపద్దశ లనుభవింపంగ దినము
లరిగెఁజూచితె వాయసాధ్యక్షు బ్రతుకు

ఆశ్వా 1–పద్య 287.

వాయసాధ్యక్షుని మృత పుత్ర మమకారమిందు దయనీయముగ హృదయ విదారకముగ జిత్రింపబడినది. ఇదంతయు నమూలకము. ఈ కరుణరస పోషణము బైచరాజు స్వీయము. తిర్యగ్గతమగుటచే గరుణరసా భాసమని కొందఱు తలంపవచ్చును.

అపరీక్షిత కారిత్వమున సుతనిర్విశేషముగ బెంచిన నకులమును దేవశర్మయను బ్రాహ్మణుడు ముందువెనుక లాలోచింపక స్వహస్త ములతో జంపి విలపించిన ఘట్టమును గూడ గరుణారసము మధురముగ బోషింపబడినది. మూలమున 'పుత్రవధ శోకేనాత్మ శిరోవక్షః స్థలం

చ తాడయితా మారబ్ధా' అని బ్రాహ్మణి నకులమును జంపి విలపించి నట్లుండ ననువాదకులు మార్చి బ్రాహ్మణుడు పరితాపమొందినట్లు కరుణరస నిర్భరముగ రచించినారు. దూబగుంట నారాయణకవి బ్రాహ్మణుని పరితాపమును 'నకుల మరణంబునకుఁ బరితప్తాంతః కరణుండగుచు నుదర తాడనంబు చేసికొనియు శిరంబువగుల మోదుకొనియు ధరణిం బడి పొరలుచు మొఱలు వెట్టుచు ననేక కాలంబునం బట్టి పట్టివలె పెంచిన నకులంబుం బరామర్శింపక వధించిన పాపం బేమిటం బాయునని మఱియు ననేక ప్రకారంబుల బ్రలాపించు సమయంబున' (వచ 30) అని వర్ణించి కరుణరసమును బోషించినాడు. భానుకవి మృతి నందిన నకులము గావించిన పూర్వచేష్టలను దలంచుచు బ్రాహ్మణుడు శోకము నొందిన విధమును

చిఱుగజ్జె మ్రోఁతలు చెవుల పండువుగాఁ గఁ
  దేఁకువ వెనుకనే తెంచు విధము
చప్పుడాలించి మీసలు దీఱుచును జెంతఁ
  గూర్చుండి నిక్కి కన్గొను తెఱంగు
కలుఁగుల విహరించు నెలుకల తండమ్ము
  నెమకి పట్టుకవచ్చునేర్పు కలిమి
విషవైద్యుఁడాడించు విషధరమ్ముల ఘర్ఘ
  రారావమున డాయనరుగు బాగు

దలఁచి మదిలోన నెట్లోర్తు దైవమిట్లు
చేసె నానేర మెంతని చెప్పవచ్చు
కలుషవశత నసంప్రేక్ష్య కారినైన
నన్ను దిగనాడి పోయితే నకులముఖ్య

ఆశ్వా-5-పద్య 4.

అని వర్ణించినాడు. అనువాదకులు కరుణరస పోషణమున జూపిననేర్పు అనుపమము. ఇదియు దిర్యగ్గతమగుట యాభాసమని కొందఱు తలంప వచ్చును.

## 4. రౌద్రము :

రౌద్రరసమునకు క్రోధము స్థాయిభావము. 'శత్రుకృతాప చారేణ మనః ప్రజ్వలనం క్రోధః' అని క్రోధలక్షణము ప్రతాప రుద్రీయోక్తము. శత్రుకృతాపరాధముచే గలుగు మనః పరిజ్వలనము క్రోధమనబడును.

మిత్రభేద తంత్రమున దేవశర్మయను పరివ్రాజకుడు ధనముగల తన కంథనాషాఢ భూతికి నప్పగించి మేషయుద్ధమును జూచును. మూల మున 'అథ రోషవశాద్ధుడు యుగలస్య దూరమపసరణం కృత్వా భూయోఽపి సముపేత్య లలాట పట్టాభ్యాం ప్రహరతో భూరి రుధిరం పతతి' అని మేషయుద్ధము వర్ణింపబడినది. నారాయణకవియు భాను కవియు మేషయుద్ధమును స్వల్పముగనే వర్ణించినారు. బైచరాజు వేంకటనాథుడు విజిగీషతో బోరుచున్న మేషద్వంద్వ మనః ప్రజ్వల నము నతి మనోహరముగ

కఠిన శృంగాగ్ర సంఘటిత లోహపలాశ
　ఘళ ఘళాత్కృతుల నక్రములు బెదర
నన్యోన్య సంపాత హతి ప్రస్ఫాలభా
　గమున శోణితముబ్బి కరుడు గట్టఁ
జించి కాంగారరో చిద్ధురాధారేయ
　నేత్రాంతముల గొప్పనిప్పులురల
ఖుర శిఖాటంక సంక్షుభిత గోత్రోత్థి
　దవని రేణువుల నీరసలు గాఁగ

గళ వినిర్గత ఘోర భూత్కార నినద
మహిత కేదార చర పతంగములఁ దఱుమఁ
బరమ గర్వోన్నతములు రభములు పెండు
చెఱువు కొమ్మునఁ గయ్యంబు సేయుచుండె,

ఆశ్వా 1-పద్య 232.

అని యభివర్ణించినాడు. ఇందు రౌద్రరసము మనోజ్ఞముగ బోషింప బడినది. కొందఱిది తిర్యక్కులకు సంబంధించిన దగుట రౌద్రరసాభాస మని తలంపవచ్చును.

దమనకుని దుర్బోధ వలన బింగళకుడు సంజీవకునిపై దురాగ్రహము నొంది యాతనిని వధించుటకు నిశ్చయించుకొని మిక్కిలి క్రోధము నందినాడు. అనువాదకులలో భానుకవి నృసింహావతారా పద్యముతో బింగళకుని క్రోధమునిట్లు వర్ణించినాడు.

కరమాశ్చర్యముగా హిరణ్యకశిపున్ గై వల్యమున్ జేర్చి బం
ధురరోషానల హేతిరేఖ నమృతాంధుల్ భీతినొందన్ భయం
కరుఁడై యున్న నృసింహు చందమున నక్కంఠీరవేంద్రుండు గో
వరుఁ జెండాడి మృగౌఘముల్ గలఁగ గర్వస్ఫూర్తిమై నున్నచోన్
ఆశ్వా 1-పద్య 321

అమూలకమగు పింగళకుని క్రోధ వర్ణనము రౌద్రరస భరితము. ఇది భానుకవి స్వీయము. పశుగతమగుట గొందఱు రౌద్రరసా భాసముగా నిర్ణయింప వచ్చును.

లబ్ధప్రణాశ తంత్రారంభమున బైచరాజు వేంకటనాథుడు గావించిన కపియుద్ధ వర్ణనము మూలమున మృగ్యము. అందు తామ్రముఖుని నతని పరివారమును నెదిరించుటలో బహుమానుని యవమాన గాస్సహ మనః ప్రజ్వలనము రౌద్రరస పరిపోషకము. ఆ యుద్ధము

ఆహవ మొనరించె సము
త్సాహత నిరువాఁగు దొడరి దంతాదంతిన్
బాహా బాహి ముఖాముఖి
నాహావాఙ్ముఖర ఖచర మైనభ మొప్పన్
ఆశ్వా-4 పద్య 11.

అని వర్ణింపబడెను. ఇదియు తిర్యగ్గతమగుటచే రౌద్రరసాభాసమని కొందఱు తలంపవచ్చును.

## 5. వీరము :

వీరరసమున కుత్సాహము స్థాయి భావము. 'లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః' అని ప్రతాపరుద్రీయ లక్షణము. లోకోత్తరములైన కార్యములను సాధించుటకు బొందు గట్టి యత్నము త్సాహ మనబడును.

సంధి విగ్రహ తంత్రారంభమున ఘూకసేన సపరివారుడైన మేఘవర్ణుని నాశమొనరింప వెడలుటను వీరరసోచితముగ దూబగుంట నారాయణకవి

రంజు వెస దండు వెడలుండొకఁడు నుండకని
  యొండొరులఁ జీరుచును మెండుకొని దిక్కుల్
నిండుకొని ఘూకములఖండగతిఁ గూడికొని
  దండధర కింకరుల తండముల మాడ్కిన్
జండతర తీక్ష్ణఘన తుండహతిఁ గాకముల
  పిండుపయి గిట్టి కడికండలుగ మోఁదన్
గొండికలు పెద్దనలకుండనవి యన్నియును
  భండనపు నేలఁబడి యుండవలె నంచున్.

పద్య—13

అని వర్ణినాడు. ఇది యమూలకము. వీరరస పోషణమున నారాయణకవి సామర్థ్యమునకిది చక్కని లక్ష్యము. తక్కిన యిరువురు నీ సందర్భమున దూష్ణీభావము వహించిరి. ఇదియు బక్షీసంబంధమగుట వీరరసాభాస మని కొందరు నిర్ణయింపవచ్చును.

## 6. భయానకము :

భయానక రసమునకు భయము స్థాయిభావము. 'రౌద్ర సందర్శనాది భి రనర్థాశంకనం భయమ్' అని ప్రతాప రుద్రీయము నందలి భయలక్షణము. భయంకరమైన వస్తువుల జూచుట మున్నగు వానిచే అనర్థమును ఆశంకించుట భయమనబడును.

మిత్రభేదతంత్రమున 'నక్క–భేరి' యనుకథలో భేరి వాయువశమున వల్లీశాఖాగ్రతాడనముచే ధ్వనింపగా నక్క భయపడిన విధము మూలమున 'క్షుభితహృదయః' యని మాత్రమే చెప్పబడెను. నారాయణకవి సృగాలము పొందిన భయమును

అమ్మహాధ్వని విని యత్యంత భయముతో
మృగధూర్తమట్టిట్టు మెదల వెఱచి
కనుమూసి తెఱవ కెక్కడఁ జొత్తునని బుద్ధి
శోకించి కనువిచ్చి చూచునంత

పద్య–153.

అని వర్ణించినాడు. భేరిధ్వని యాలంబనముగ వంచకము పొందిన భయము భయానక రసముగా నాస్వాదనీయము. పశుగతమగుట భయానకరసా భాసముగా గొందఱు పరిగణింప వచ్చును.

మిత్రభేదమున 'సింహము–శశకము' అనుకథలో మృగపతి కాహారముగా దానుబోవలయు ననువార్త విన్న శశకము పొందిన భయమును దూబగుంట

పలుకు విన్నమాత్రఁ బ్రాణంబు చలియింప
శశకమపుడు మూర్ఛఁ జాలఁ దూలి
తెలిసికన్ను దెఱచి దృష్టించి తలయూఁచి
దిగులు పుట్టియాత్మ పగుల నొగిలి పద్య–256.

అని వర్ణించినాడు. దీనిని గూడ భయానక రసాభాసముగ గొందఱు భావింపవచ్చును.

లబ్ధనాశతంత్రమున మకరము సముద్ర మధ్యమున దనభార్యా రోగ శాంతికై వానరముతో నాతని హృదయమును గ్రహింపబోవుటను సూచింపగా వనచరుఁడు పొందిన భయమును నారాయణ కవి

సగము చచ్చిన మేనితోఁ జకితుఁ డగుచుఁ
గంప మొందుచు వృద్ధ మర్కటకము మూర్ఛ

మునిఁగి కన్నులు గానక మునిఁగి కొంత
వడికి దెప్పిఱి యాత్మదైవంబుఁ దూఱి పద్య–65.

అని వర్ణించినాడు. ఇది యమూలకము. ఈమర్కటపతి భయస్థితిని బైచరాజు గూడ

నగచరుఁడది విని వెఱఁ బం
డ్లిగిలిచి వడవడ వడంకి యెదపడి చెడితిన్
తెగితిఁ గడచనితిఁ బొలిసితిఁ
బొగరున నిటయితి మోసపోయితి ననియెన్. పద్య–76.

అని వర్ణించినాడు. ఇరువురు భయానక రసమును మనోజ్ఞముగ బోషించినారు. తిర్యక్సంబంధియగుట దీనిని గొందఱు భయానక రసాభాసముగ దలంపవచ్చును.

## 7. బీభత్సము :

బీభత్సరసమునకు జుగుప్స స్థాయిభావము. 'కదర్యవస్తు విలోకన జన్మా విచికిత్సాఖ్యశ్చిత్త వృత్తి విశేషోజుగుప్సా' అని రసగంగాధర లక్షణము. ఏవగింపు గల్గించు పురీషాది వస్తుదర్శనమున గలుగు విచికిత్సజుగుప్స యనబడును.

మిత్రభేద తంత్రమున 'నక్క–భేరి' యను కథలో నారాయణకవి రణరంగమును బీభత్సరస సంపన్నముగ

అఱిముఱి నంతంతఁ దఱుచు ప్రోవులు గట్టి
యఱవఱలైయున్న యరదములును
దొండముల్ గొమ్ములుఁ దొడలు మస్తకములు
ఖండంబులైన వేదండ తతులుఁ
జరణంబులూరులు బరులుఁ గంధరములు
దునకలై పడియున్న తురగములును
గంకణాంగదములఁ గడునొప్పి విఱిగిన
బాహుదండంబుల భటకులంబుఁ

గలిగి బీభత్సరౌద్ర శృంగారములకు
నాస్పదంబుగఁ గనుపట్టు నట్టినేల
గౌతుకంబునఁ బొడగాంచి కదియు నంత
నవల నొక మహాధ్వని గుండెలవియ నిగుడ.

పద్యం-152

అని అభివర్ణించినాడు. తిక్కనవలె రసశబ్దమును నారాయణకవి వాచ్య మొనరించుట గమనార్హము. రణరంగము బీభత్సాద్రి శృంగారము లను మూడింటికి నాస్పదముగా నున్నదనుటలో మొదట బీభత్సము నకే ప్రాధాన్య మొసంగబడెను. ఇందు గజతురగ భటసమూహాంగం బులు చెల్లాచెదరైనవని బీభత్స రసాస్పదముగా నభివర్ణింప బడినది. ఇప్పట్టున బైచరాజింతకంటె బీభత్సరసము నెక్కువగ పోషించుచు నిట్లు వర్ణించినాడు.

జన్యము కాంతకుంత పరుష క్షతిపాతి బృహద్వపాళిరా
జన్యము హాస్తిమస్తక రసక్షతజద్రవ లుబ్ధదైత్య దా
ర్జన్యము భానుభేది ఘనసాహస పూజన రాజమాన ప
ర్జన్యముఁ జూపెఁ బర్యుషిత సామజ లిస్రిసమేత వాతముల్

ఆశ్వా 1-పద్య 187.

బల్లెముల పోట్లచే రాజుల శరీరముల నుండి వపగారుచున్న దనియు, మత్తేభ మస్తకము లందలి మాంసము దెబ్బతిని నీరుగారుచుండ దానికై రక్కసుల మూక యహమహమికతో వచ్చుచున్నదనియు, భాను మండలమును భేదించి ఘన సాహసముతో బోరురాజుల మానములను పిడుగులు గలదనియు నందు మాంసాదికము నుండి దుర్గంధము వ్యాపించుచున్నదనియు బైచరాజు వర్ణించినాడు. దీనితోపాటా రణ రంగము గజతురగ కళేబరములతో గూడినదై నెత్తురులు, మెదళ్లు, నాంత్రముల ప్రోవులతో నెట్లు జుగుప్సావహముగా నున్నదో బైచ రాజిట్లు వర్ణించినాడు.

కదనమొకింత చేర నరుగ న్విఱుగం బడియున్న తేరులుం
బొమలుబ లేని యేనుగులుఁ బెంటలుగొన్న జిరాల్లురాలు పె
న్గదురుడివోని నెత్తురులు గాఢపుటెండలఁ గ్రాఁగి చిక్కనై
పొదలు మెదళ్లు నాంత్రముల ప్రోవులుఁ జూచి పరిహృష్టమూర్తియై

పద్య-188.

నారాయణకవి రచనమున బీభత్సముతో పాటు రౌద్రశృంగారములును జోటుచేసికొనినవి గాని వైచరాజు వర్ణనమున బీభత్సమే ప్రాధాన్యము వహించినది. అమూలకమైన యీ రణరంగ వర్ణనము కవుల బీభత్సరస పోషణ నిపుణతా నిరూపకము.

## 8. అద్భుతము :

అద్భుత రసమునకు విస్మయము స్థాయిభావము. 'అపూర్వ వస్తు దర్శనాచ్చిత్త విస్తారో విస్మయో మతః' అని ప్రతాపరుద్రీయ లక్షణము. అపూర్వములైన వస్తుదర్శనము వలన గలుగు చిత్తవికాసము విస్మయమగును.

మిత్రసంప్రాప్తి పరిచ్ఛేదమున బోయనిచే బట్టుపడిన మందరకుని విడిపించుటకై లేడి మరణించినట్లు నటించుట దానిపై వ్రాలి లఘుపతనకుడు పొడుచుచున్నట్లుండుట యను సన్నివేశము విస్మయావహమైనది. అట్లే యపరీక్షిత కారిత్వమున వైశ్యకుమారుని లగుడ ప్రహారముచే క్షపణకత్రయము నిధిత్రయముగా బరిణమించుట యద్భుత రస పరిపుష్టములు. రెండును యథామూలముగ బోషింపబడినవి.

## 9. శాంతము :

శాంతరసమునకు శమము స్థాయిభావము. 'వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వం శమః' అని ప్రతాపరుద్రీయ శమలక్షణము. వైరాగ్యాదులచే జిత్తము విషయ నివృత్తమగుట శమమనబడును.

సంస్కృత పంచతంత్రమున నాషాఢభూతి కథలో దేవశర్మయను పరివ్రాజకుని యందు నాషాఢభూతి యందును శమమభివర్ణితము. ఆషాఢభూతి 'అసారః సంసారోఽయమ్. నదీవేగోపమం యౌవనమ్' అను నుపన్యాసముతో బరివ్రాజకుని జేరినాడు. అట్లే దేవశర్మయను పరివ్రాజకుడును

పూర్వే వయసి యః శాంతః సశాంత ఇతి మేమతిః
ధాతుషు క్షీయమాణేషు శమః కస్య న జాయతే
ఆదౌ చిత్తే తతఃకాయే సతాం సంపద్యతే జరా
అసతాం తు పునః కాయే నైవ చిత్తే కదాచన.

మి. భే శ్లో– 176–177.

అని యుపన్యసించినాడు. కాని యిరువురి శమము యథార్థాశ్రితములు గావు. దేవశర్మ గుప్తముగ ధనము నుంచిన కంథ నపహరించు తలంపుతో విశ్వాసము గల్గుటకై ఆషాఢభూతి అట్లుపన్యసించినాడు. కంథను గోల్పోయిన పిమ్మట దేవశర్మ పడిన యవస్థ యాతని శమమెంతటి కృతకమైనదో విశద మొనర్చుచున్నది. ఆ పాత్రల స్వరూపస్వభావములు అవగతమైనప్పుడు అనుచిత విభావనాలంబనత్వము నాధారముగ శాంతరసాభాసము పోషింపబడినదని నిర్ణయింపవలసి యుండును. అనువాదకులు యథామూలముగ రసాభాసపోషణము గావించిరి.

రసములు తొమ్మిదేయని పెక్కండ్రాలంకారికులు నిశ్చయించినను రుద్రటుడు 'దశమో రసః ప్రేయాన్' అని ప్రేమోరసమును దశమరసముగా జేర్కొనినాడు. దానికి స్నేహము స్థాయిభావ మనినాడు. 'అన్యోన్యం ప్రీతి సుహృదోర్వ్యవహారోఽయం మతస్తత్ర' అని స్నేహితుల పరస్పర వ్యవహారము స్నేహమని యాతడు నిర్వచించినాడు. మిత్రప్రాప్తి తంత్రమారంభము నుండియు ప్రేమోరస భూయిష్ఠముగా రచింపబడినది. చిత్రగ్రీవ హిరణ్యకులకు, లఘుపతన హిరణ్యక మందర చిత్రాంగులకు మధ్య స్నేహమతి మధురముగ సర్వజన శిరోధార్యముగ బోషింపబడినది. చంపూకర్తలు యథామూలముగ నను

పదించి ప్రేయోరసమును బోషించినారు. అదియు దిర్యగ్గతి మగుటచే కొందఱు ప్రేయోరసాభాసముగ బరిగణింపవచ్చును.

## -: వరన నిర్వహణము :-

వర్ణనలు మహాకవి ప్రతిభా నిర్ణయమున నికషోపల ప్రాయములు. వర్ణించుటలో జాతుర్యముగలవాడు కవియగును. 'వర్ణనా నిపుణః కవిః' అని ఆర్యోక్తి. కవియను శబ్దము కబృవర్ణే యనుధాతువు నుండి యేర్పడినది. చాతుర్యముతో వర్ణించువాడని యర్థము.

వర్ణక్రియా విస్తార గుణవచనార్థకమైన వర్ణయను ధాతువునుండి అకారాంత నపుంసక లింగము, ఆకారాంత స్త్రీలింగమునగు వర్ణనమ్, వర్ణనా యను రూపము లేర్పడును. వానికి బూతపూయుట, వివరించుట, స్తుతించుట యనునర్థములు గలవు. మూడును ఇంచు మించు సన్నివేశమున కుత్కర్ష గల్గునట్లు చెప్పుట యనునర్థమునే బోధించును. అనగ ననగ నొక్క నగరముగలదు. దానికొక ప్రభువు గలడు అని యున్న దున్నట్లుగ గథ చెప్పినచో పఠితకుగాని శ్రోతకుగాని యేవిధమైన యుత్కంఠయు జనింపదు. నగర సౌందర్యమును ప్రభువైశిష్ట్యము నుగ్గడించినచో ఎన్నడో జరిగిన లేదా యెన్నడో జరిగినట్లు భావింపబడిన కథ కన్నులకు గట్టినట్లగును. కథాప్రత్యక్షీకరణము వర్ణనయొక్క ప్రముఖ ప్రయోజనము. వర్ణనలు ఉద్యానకాంతా చంద్రాదులను గన్నులకు గట్టినట్లు స్ఫుటములుగా జేయునని భట్టతౌతుడు కావ్యకౌతుకమున

వర్ణనోత్కలికా భోగ ప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః
ఉద్యాన కాంతా చంద్రాద్యా భావాః ప్రత్యక్షవత్ స్ఫుటాః

అని సూచించినాడు. అంతియేగాక యతడున్న విషయముల నున్నట్లుగా జెప్పుటలో వర్ణనత్వముండదనియు లేని విషయములను మనోహరముగా జెప్పుటలో వర్ణనత్వము సిద్ధించుననియు

యదత్రాస్తి నతత్రాస్య కవేర్వర్ణనమర్హతి
యన్నాసంభవి తత్రస్యాత్ సంభవత్యత్ర ధర్మతః

అని వివరించినాడు. వర్ణనల ప్రాధాన్యము గుర్తించుట చేతనే గవులు సందర్భోచితముగ సూర్యోదయోద్యానాదుల నభివర్ణించి సన్నివేశమున కుత్కర్ష గలిగించుచు గథను ప్రత్యక్షీకరించుట కుపక్రమించు చుందురు.

దండి కావ్యాదర్శ ప్రథమ పరిచ్ఛేదమున మహాకావ్య లక్షణ ములను బేర్కొనుచు గథను వర్ణనాత్మకముగా రచింపవలెనని చెప్పి యావర్ణనల నిట్లు వివరించినాడు.

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి

శ్లో 16, 17.

విద్యానాథుడు గూడ నీ వర్ణనములనే గ్రహించి ప్రతాపరుద్రీయమున బేర్కొనినాడు. ఆ యష్టాదశ వర్ణన లెచ్చట వర్ణింపబడునో యది మహాకావ్యమనిపించు కొనుననియు నందు గొన్ని లేకపోయినను అది మహాకావ్యము గాగలదనియు నిట్లు

ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూన మపీష్యతే

యని నిర్దేశించినాడు

విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమున సంధ్యా సూర్యేంద్వా దులను బేర్కొని వానిని యథాయోగముగ వర్ణింపవలెననియు నందు సంభోగము నుండి పుత్త్రోదయ పర్యంతము గల పది వర్ణనలను సాంగో పాంగముగ నిర్వహింపవలయునని యిట్లు వివరించినాడు.

సంధ్యాసూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభౌచ మునిస్స్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్రి పుత్త్రోదయా దయః
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ దశ.

అలంకార శేఖరుడు కూడ పెక్కు వర్ణనీయ విషయములనిట్లు పేర్కొని నాడు.

వర్ణ్యశ్చ రాజా దేవీచ దేశోగ్రామః పురీసరిత్
సరోఽబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రయాణ రణ వాజినః
హస్త్యర్క చంద్రావృతవో వివాహోఽథ స్వయంవరః
సురాపుష్పాంబు సంభోగః విశ్లేష మృగయాశ్రమాః
కలా ఋతువయస్సంధి ధాతువృద్ధ్యాభి సారికాః.

ప్రతాప రుద్రీయము ననుసరించి భట్టుమూర్తి కూడ నష్టాదశ వర్ణనల నుదాహరించి యవి యెందు నిర్వహింపబడునో యది మహాకావ్యమగునని నరసభూపాలీయమున నిట్లు రచించినాడు.

పురసింధు నగర్త్విన శశి
సరసీవన మధు రతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్య విభు వర్ణనముల్
ఇందు నొక కొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్యమనఁగఁ బరగు.

ఆశ్వా 2 – పద్య॥లు 166, 167.

ప్రతాప రుద్రీయమున ద్యూతమని యుండ భట్టుమూర్తి దౌత్యమని మార్చినాడు. అప్పకవి యిరువది రెండు వర్ణనలుండవలయునని యప్పకవీయమున

పురమును ఋతుషట్కమును బ్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మానీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వన విహారంబును వారికేళి

కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు
పద్మ మిత్త్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస.

ఆశ్వా 1– పద్య 29

అని వివరించినాడు. ఇట్లాలంకారికులు కావ్యమును వర్ణనాత్మకముగా రచింపవలెనని నిర్దేశించినారు.

కొందఱు తెలుఁగు కవులుఁ గూడ దమ కావ్య రచనావసరమున వర్ణనా ప్రాధాన్యమును వెల్లడించినారు. తమ కావ్యములలో నిర్వహించుటయే గాక కథా భాగమును వర్ణనాత్మకముగా రచింప వలెనని హెచ్చరించినారు. నన్నెచోడుఁడు కుమార సంభవావతారికలో 'వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ' కావ్యము రచింపవలయు ననినాడు. కర్ణ రసాయనముగా భావములు, అర్థములు, గుణములు, సూక్తులు తన కవిత్వములో నెట్లుండునో చెప్పుచు 'విరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన' నని వర్ణనలకు నొక ప్రత్యేక స్థానమొసంగినాడు. తన కావ్యమష్టాదశ వర్ణనలతో బరిపూర్ణమై యుండునని యా వర్ణనలను

వనజలకేళీ రవిశశి
తనయోదయ మంత్రి గతి రతక్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హనగ విరహ దూత్య వర్ణనాష్టా దశమున్

పద్య 44

అని వివరించినాడు. తన కావ్యమున వాని ననుసంధానించినాడు. శివకవులలో ప్రసిద్ధుడైన పాల్కురికి సోమనాథుఁడును పండితారాధ్య చరిత్ర రచనా విధానమును వివరించుచు నష్టాదశ వర్ణనలతో గథా భాగమును దాను రచించు చున్నట్లు

'తొమ్మిది రసములు తొలుకాడు దాని
నిమ్మడి వర్ణన తెరగంగ......?

అని చెప్పికొనినాడు. కొఱవి గోపరాజు కూడ సింహాసనద్వాత్రింశికలో గావ్యమున నష్టాదశవర్ణ లుండవలెనని

పురమధుజల లీలాంబుధి
పరిణయ నయ విప్రలంభ పతిగుణ సుతభా
స్కర చంద్రోదయ రణగతి
గిరివన దూతర్తు రతులఁ గృతి చెప్పఁదగున్

ఆశ్వా 1- పద్య 37.

అని చెప్పి నానినతఁడు త కావ్యమున బాటింప దలచినట్లు

కావున బదునెనిమిది యగు
నీ వర్ణన లచట నచట నించుక పెరయం
గావించెద నిటఁ బనికివి
రావనకుఁడు లక్షణాభి రామములగుటన్

ఆశ్వా 1- పద్య 38

అని సూచించినాడు. పేర్కొనక పోయినను మహాకవులెందఱో తమ కృతులతో సమయోచితముగ నష్టాదశ వర్ణనలను నిర్వహించినారు. వాల్మీకి వ్యాస కాళిదాసాదుల వర్ణనా వైదగ్ధ్యము సాహిత్యలోక ప్రసిద్ధము. అర్థ గౌరవ లబ్ధ ప్రతిష్ఠుడైన భారవి జనారాధితు డగుటకు ఉదయాద్రి శిఖరారోహణమును ఇంద్రకీలాచలా రోహణమును మధురముగ వర్ణించుటయని సూక్ష్యపమ్యముతో కుమారసంభ వమున నన్నెచోడుడు

భారవియు వస్తుకవితను
భారవియును బరగి రుదయ పర్వత శిఖరా
గ్రారోహ ణేంద్ర కీలన
గారోహణ వర్ణనల జనారాధితులై

ఆశ్వా 1- పద్య 20

అని మనోహరముగ దెలిపినాడు.

కవులలో బెక్కుమంది వర్ణనలను గావ్యత్వ సిద్ధికై నిర్వ హింతురు. సూర్యోదయమునో చంద్రోదయమునో వర్ణించుట కుప క్రమించి తమ కల్పనా సామర్థ్యమును ప్రకటించుకొనుటకై యత్నిం తురు. వారు గావించిన యీ వర్ణనలకు గథా భాగమునకు సంబంధము మృగ్యమగునట్లుగా దీర్ఘముగా నవి నిర్వహింప బడును. మహాకవులు గొందఱు వర్ణనలను సందర్భసముచితముగను రస పరిపోషకములుగను నిర్వహించుటయేగాక వర్ణనలందును జిత్రముగ గథాభాగమును బోషింతురు. అప్పుడే యీవర్ణనలకు సార్థక్యము చేకూరగలదు. కవి బ్రహ్మయగు తిక్కన విరాటపర్వమున సూర్యోదయ వర్ణమున నతడు రచించిన

ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచు నున్న సరసి
వేడి నిట్టూర్పులో యన వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మి విరుల

అను పద్యమిప్పట్టున స్మర్తవ్యము. అట్లే యాంధ్రకవితా పితామహుని మనుచరిత్రలోని సూర్యాస్తమయ వర్ణనకు సంబంధించిన "తరుణి ననన్య కాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా భరవివశాంగి" (ఆశ్వా 3— పద్య 10) అను పద్యము గూడ నుదాహరణీయమే.

మహాకవుల అనుపమ కల్పనా సామర్థ్య ప్రకటనమునకు వర్ణన లాటపట్టులు. అందాకవివతంసులు ప్రౌఢోహలను ప్రదర్శించి తమ ప్రతిభా సంపత్తిని వెల్లడించుకొందురు. వర్ణనలకు నలంకారములు గుణ పరిపోషకములగుటచే వారు వర్ణనాసందర్భమున నుత్ప్రేక్షాతిశయోక్తుల నెక్కువగ ప్రయోగింతురు. ఉపమా రూపకశ్లేషార్థాంతరన్యాసాదు లను గూడా సముచితముగ బోషింతురు. 'సౌందర్య మలంకారః, కావ్య శోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే' మున్నగు లక్షణములకు వారు వర్ణనలలో సార్థక్యమును ప్రదర్శింతురు.

పంచతంత్ర చంప్వనువాదకులు నీతిబోధకు గాక కావ్యత్వము నకును ప్రముఖ స్థానమొసంగుటచే మూలమున 'కించిత్పురమ్, కశ్చిద్రాజా' యని మాత్రమే యుండగా బెక్కుచోట్ల నాంధ్రీకర్తలా పుర సౌభాగ్యమును ఆ ప్రభువైభవమును సుందర పదబంధబంధురముగను మృదుమధుర భావ నిర్భరముగను వర్ణించి కథకు గావ్యత్వమొసంగి నారు. ఒకే వర్ణనమును ముప్వురు గావించినను ఒకేకవి భిన్నకథలలో నొకే వర్ణనమొనరించినను వారి ప్రత్యేకత ప్రస్ఫుటముగా గోచరించు చుండును. అట్లే వర్ణనముల విషయమున ముప్వురును మూడు పద్ధతు లనుసరించినారు. దూబగుంట నారాయణకవి యత్యంత సముచితముగ వర్ణనలు నిర్వహించినాడు. భానుకవి వీలయినంతవఱకు వర్ణనలను దగ్గించి కథా కథనమొనర్చినాడు. బైచరాజు ప్రౌఢకల్పనలతో పరమ ప్రాబంధికముగ వర్ణనలను నిర్వహించినాడు. ప్రబంధయుగ కవుల ప్రభావమాతనిపై వర్ణనాసందర్భమున మిక్కుటముగ గమపట్టుచున్నది. చంప్వాంధ్రీకర్తలు ముప్వురును వర్ణనలలో దమయలంకార ప్రయోగ దక్షతను నిరూపించినారు. కావున వర్ణనల ననుశీలించునప్పుడే యను వాదకుల యలంకార ప్రయోగ సామర్థ్యము గూడ యథోచితముగ సమీక్షింప బడినది.

నగరార్ణవ శైలాద్యష్టాదశ వర్ణనలు సాహిత్యలోకమున మిక్కిలి ప్రసిద్ధినొందినవి. మృగయా వృక్ష మున్నాది వర్ణనలును గొందఱు లాక్షణికులచే బేర్కొనబడి కవులచే నిర్వహింపబడినవి. ఈ వర్ణనము లలో గవులు తమ కథకు ఆవశ్యకములగు వానిని మాత్రమే గ్రహింతురు. తక్కిన వానిని బరిత్యజింతురు. అన్నిటిని కావ్యమున నిర్వహింప వలెనను నియమముండదు. చంపూకర్తలు ఏయేవర్ణనలను స్వీకరించి యెట్లు నిర్వహించినారో యిందు నిరూపింపబడును. పాత్రలరూప సంప దాదులవర్ణనము పాత్రచిత్రణకు సంబంధించిన దగుట నావర్ణనము పాత్రచిత్రణ నిరూపణ సందర్భమున బరిశీలింపబడినది.

## 1. పురవర్ణనము :

కావ్యములు సామాన్యముగా బురవర్ణనముతో నారంభింప బడును. కథా ముఖమున కలంకరణముగా నుండు పుర సౌభాగ్యమును కవులభివర్ణించి పాఠకునకు గథయందును దమ కావ్యములందును గాఢాసక్తి గలిగింతురు.

మిత్త్రభేదతంత్రము మహిలారోప్య నగర నిర్దేశముతో 'అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్' అని యారంభింపబడినది. ఆ నగర విశేషములందేమాత్రము వర్ణింపబడలేదు. చంపూకర్తలు ముగ్వురును మిత్త్రభేదమును హితోపదేశానుసారము పాటలీపుత్త్రనగరవర్ణనతో నారంభించినారు. హితోపదేశమునను 'అస్తి భాగీరథీతీరే పాటలీపుత్త్ర నామధేయం నగరమ్' అని మాత్రమే గలదు. ఆ పట్టణవైభవము రేఖామాత్రముగనైన నభివర్ణింపబడలేదు. దూబగుంట నారాయణకవి యాపాటలీపుత్ర నగరరాజమును

వేదశాస్త్రపురాణ విద్యా విజృంభిత
  కలితధాత్రీసుర కలకలంబు
గజహయారోహణ కౌశల సంచార
  మహితరాజకుమార మండలంబు
వజ్రముక్తాఫల వస్త్రసువర్ణాది
  సకల విక్రయ వైశ్యసంకులంబు
నానాయుధాభ్యాస నైపుణధోరేయ
  విశ్రుత సచ్ఛూద్ర విభ్రమంబు
కల్పితానల్ప దేవతాగార భూమి
రత్నకీలిత ఘనసౌధ రాజితంబు
నగుచు నమరేంద్రనగరంబు నగుచుధాత్రిఁ
బొలుచుఁ బాటలి పుత్రమన్పురవరంబు

ఆశ్వా 1–పద్య 48.

అని వర్ణించినాడు. అపార శక్తి సామర్థ్యోపేతులైన చాతుర్వర్ణ్యముల వారితో గూడి దేవతల నివాస భూమిగ, రత్నాంచిత ఘనసౌధ విభ్రాజితముగ నున్నట్లు పాటలీపుత్రి మభివర్ణింప బడినది. భానుకవి పాటలీపుర వైభవమును

కమనీయ సాలబద్ధమణి ప్రభాచ్ఛటా
శబలితాకాశ విశాతటమ్ము
సౌధాంతరిన స్థితి ( స్త్రైణ రుచిరరూ ) ప
రేఖా విజిత నిర్జరీ గణమ్ము
నానా ( సుధ సుమ ప్రతాన ) నూత్న రమా వి
చిత్ర తాపహసిత చైత్రరథము
సంతత మదచారి సామజ ( సంభావి )
తాకాల వర్షాగ మాభ్రిచయము
ఘన ( నవాగరు ) ధూపిత గంధ వహము
త్యాగి నృపసుత హసిత దుగ్ధార్ణవంబు
స్వర్ణరథ పరికల్పిత స్వర్ణధరము
భువన మాన్యమ్ము పాటలీ పురవరంబు.

ఆశ్వా 1—పద్య 46.

అని వర్ణించినాడు. ఆ పట్టణము మనోహరములైన ప్రాకారము లందుంచబడిన మణుల కాంతుల సముదాయముచే జిత్రవర్ణములు గలదిగా జేయబడిన దిక్తటములు గలది యనియు, నా నగర సౌధాంతర ములందున్న స్త్రీల రూప రేఖా విలాసాదులచే దేవతాగణము విజిత మైనదనియు వర్ణించుట ప్రబంధోచితము, నారాయణ కవి వర్ణనము కంటె భానుకవి వర్ణనము మధురకల్పనా విశేష బంధురము. ఈ పాటలీ పుర సౌభాగ్యమును సాంగోపాంగముగ బైచరాజు ఇరువదియేడు గద్య పద్యములలో ( పద్య 42—68 ) వర్ణించినాడు. పాటలీపురమందలి ప్రాకారము, అగడ్త, సౌధసంపద, గోపురము, నిష్కుటకము, చాతుర్వర్ణ్య వైశిష్ట్యము మున్నగునవి యిట్లు వర్ణింప బడినవి.

వనజ గర్భ కటాహ వర్ధిష్ణు వరణంబు
బలి బహూకృత పుణ్య సలిల ఖేయ
మరుణాంశు కలశ భాసుర రత్న సౌధంబు
కుధర భిద్గృహ చుంబి గోపురంబు
ధన ధవాక్రీడ సద్ధాత్ర నిష్కుటకంబు
బ్రహ్మ నిష్ఠద్విజ ప్రాంజలంబు
ప్రబల భార్గవ శౌర్య బంధుర క్షత్రంబు
పౌలస్త్య నిభ వణిగ్భాసురంబు
పద్మనాయక శుభవిభా భర్త్స్య మాన
విద్విదావాస మండలీ విహారమాణ
భూరి సంతాప తిమిరంబు పొగడ నెగడుఁ
బూరిగరిమంబు పాటలీ పురవరంబు.

ఆశ్వా 1–పద్య 42.

ఈ పద్యము పాటలీపుర వైభవమును నిరూపించునదియే యైనను దనివి తీరక బైచరాజింకను అగడ్త, సౌధములు మున్నగు వానిని విపులముగ వర్ణించినాడు. ప్రతి పద్యము నపూర్వ భావనా విలసితమే. ఆ పట్టణ మందలి కోటను బైచరాజు

మొదల నప్పులలోఁ గొంత మునిఁగి పిదప
రాసికెక్కిన పెను మచ్చరాలఁ బెరిగి
పరఁగు తన పెంపుఁ గొమ్మల పాలుఁ జేసి
కోట యవ్వీట దుర్విటు పాటుఁ దనరు.

ఆశ్వా 1–పద్య 44.

అని వర్ణించినాడు. కోట నీటిలో గొంత మునిఁగి, యనంతరము ఇంద్ర నీలములతో బెరిగి, యాధిక్యమును కొమ్మలందు గలిగి దుర్విటుని యవస్థవలె నున్నదని భావము. ఇందు కోటకు ప్రయుక్తములైన విశేషణములు దుర్విటునకు గూడ ననువర్తించును. అప్పులనగా ఋణములు, ఫెనుమచ్చరాలనగా పెద్ద మాత్సర్యములు, పెంపనగా సంపద,

కొమ్మల పాలనగా స్త్రీపరముగా జేరుటయని పక్షిటుని పరముగా నర్థ సమన్వయము. ఇందలి యాపమ్యము అనుపమము. శ్లేషాలంకార ప్రయోగ మతిమధురము. చిన్న గీత పద్యమున హృదయంగమమైన శ్లేషను ప్రయోగించి మధురమైన భావమును వెల్లడించి కోటను వర్ణించిన బైచరాజు ప్రశంసార్హుడు.

పాటలీపుర విశేష వర్ణనములో పుష్పలావికా వర్ణనము మిక్కిలి మధురముగా నిర్వహింప బడినది. స్త్రీల ముఖములకు పద్మము, కన్నులకు గలువలు, నవ్వులకు మల్లియలు, స్తనములకు బూగుత్తులు, శరీర కాంతికి జంపకములు నుపమానములుగా ప్రసిద్ధములు. ఆ యుపమాన సామగ్రిని గ్రహించి పథికుల నర్మోక్తులతో పుష్పలావీజన విహారములను బైచరాజిట్లు మధురముగ నభివర్ణించినాడు.

వదనాబ్జములె చాలు వలపులఁ బేరేప
వెలిదమ్మి లేటికి విక్రయింప
సోగ కన్నులె చాలు సొంపు సంపాదింప
గలువ లేమిటికి నంగళ్ళఁ బెట్ట
మొలక నవ్వులె చాలు ముదముఁ బ్రోదియొనర్ప
నచ్చ మల్లియ లేటి కమ్మఁ జూప
గురుకుచంబులెచాలుఁ బరితోష మొనరింపఁ
బూగుతు లేటికిఁ బుటములెత్తఁ
గాయదీధితి చాలు రాగము ఘటింప
బేర మెటిఁగింప నేల చాం పేయములకు
ననుచుఁ బథికులు నర్మోక్తు లాడనాడ
వేడ్క విహరించుఁ బుష్ప లావీజనంబు.

ఆశ్వా 1—పద్య 62.

శబ్దప్రయోగలాలసుడైన బైచరాజు నగరవైశిష్ట్యమును మనోహరమగు వచనమున 'కమలాలంకృతంబులై మురవైరి యురంబును బురుడించు సరోవరంబులును బ్రతిపర్వ రసోదయంబులై యనాతరంబు

భారతంబుంబోలు నిక్షువనంబులును వెండియుం బేరుగల వస్తువులుం గలిగి' యని వర్ణించినాడు. పట్టణ మందలి సరోవరములు ఇక్షువనములు నభివర్ణింపబడినవి. సరోవరములు కమలాలంకృతములై విష్ణుమూర్తి వక్షః స్థలమును బోలియున్నవి. ఇక్షువనములు ప్రతిపర్వ రసోదయములై మహాభారత సాదృశ్యమును బొందినవి. ఇందు కమలా లంకృతములు ప్రతిపర్వ రసోదయములు ననువానిలో రెండర్థములు గలవు. సరోవర పరముగా కమలా లంకృతములనగా పద్మములచే నలంకరింప బడినవని యర్థము. విష్ణువక్షః స్థలపరముగా కమలాలంకృత మనగా లక్ష్మీదేవిచే బరిష్కృతమని యర్థము. అట్లే ఇక్షువనపరముగ ప్రతిపర్వ రసోద యములనగా అన్ని కణుపులందును మధురద్రవము గలవని భావము. భారత పరముగ ప్రతిపర్వమున ననగా ప్రతిపరిచ్ఛేదమున కావ్యరసము గలవియని తాత్పర్యము. ఇట్లు మనోజ్ఞమైన యౌపమ్యమును సుకుమార మైన శ్లేషమూలమున సమకూర్చి బైచరాజు నగరవర్ణనము గావించిన విధ మత్యంత ప్రశస్యము.

బైచరాజు మిత్రభేద తంత్రమందలి 'మందవి సర్పిణీ—డుండు భుకము' ననుకథ చెప్పుట కారంభించుచు శబ్ద ప్రయోగ చమత్కృతు లతో మధురా పట్టణము నతిస్వల్పముగ నిట్లు వర్ణించినాడు.

కలదు త్తరమున నతిని
స్తుల వస్తువిశేష మహిమధుర మధుర ధరా
వలయ పుర మధుర తేజో
బలసారస బంధుఁడది సుబంధుండేలున్

ఆశ్వా 1–పద్య 407

మూలమున గథ 'అస్తి కస్యచిన్మహీపతేః కస్మింశ్చిత్స్థానే మనోరమం శయన స్థానమ్' అని యారంభింప బడినది. మధురానగరము, తత్ప్రభువు సుబంధుఁడను విషయము లమూలకములు.

మిత్రభేదమందలి 'కంబుగ్రీవ—వికట సంకటుల' కథలో మూల మున 'కించిత్పురమాలోకితమ్' అనియుండ బైచరాజు ఆ పట్టణము

విదిశాపట్టణమని నిశ్చయించి యందలి విశేషములను సంగ్రహముగ నిట్లు వర్ణించినాడు.

పరిఘలు కోటలు మేడలు
కరులు శతాంగములు హరులు కాల్బలములు భూ
సురులు భుజభవులు వైశ్యులు
చరణజులుం గలిగి యొప్పెసఁగు నవ్వీటన్.

కరిబృంహితంబు లూథ
త్వరపారశీ కాశ్వహేషితంబులు రథ్యా
చరదఖిల జనరవంబులు
శరనిధిఘోషించి నట్లె సఁగ విని మింటన్

ఆశ్వా 1-పద్య 569, 70.

కాకోలూకీయ తంత్రారంభమున మూలమున 'అస్తిదాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్' అనిగలదు. బైచరాజానగరమును బాండ్య రాజ్య మందలి మధురానగరముగా మార్చి యాపట్టణ వైశిష్ట్యమును ప్రబంధోచితముగ నిట్లు వర్ణించినాడు.

మధురనభోమణి ద్యుతి సమంచిత రత్న విరాజమాన ధా
మధుర విలాసినీ శ్రవణ మంగళరాగ పదీరితేక్షు హృ
న్మధుర దురంత సంపదభిమాన తృణీకృత రాజరాజది
జ్మధుర చెలంగుఁ బాండ్యమహిమండలిఁ దన్నికటాయు తాటవిన్.

ఆశ్వా 3-పద్య 5.

ఇందలి భిన్నార్థబోధకమైన మధుర శబ్దప్రయోగ చమత్కృతి సుమనోమనోహరము. సమాసభూయిష్ఠమైన శైలి పట్టణౌత్కృష్ట్య వ్యంజకము.

లబ్ధ ప్రణాశ తంత్రమున 'కాపుకొడుకు రాజబాధ నొందుట' అను కథలో బైచరాజు గావించిన కాంచీపుర వర్ణనము కేవలము స్వీయము. పట్టణమందలి యగడ్త, ప్రాకారము, మణిసౌధములు, వర్ణ

చతుష్టయము, చతురంగబలము నొక సీస పద్యమున నిట్లు వర్ణింప బడినవి.

ఆ రసాతల గభీరాపార జలఖేయ
మానాకారమ్యసాలాభిరామ
మా చంద్రమండల వ్యాయామంచు మణిసౌధ
మాబ్రహ్మ శుద్ధ విప్రాన్వవాయ
మాపాత్ర పవన స్ఫారాభ్యారూఢ సత్క్షత
మాఫలోద్యమ సముద్యమ కిరాట
మాదార్ఢ్య ధర్మ కార్యారంభ చరణ జం
బాచక్రవాళ శైలాశు తురగ

మాంబర ప్రాంశు దానధారాఢ్య నాగ
మాధ్రువస్థాన పథ శతాంగాతి శయము
బ్రహ్మకైనను బ్రస్తుతింపఁగఁ దరంబె
భూపదముగ నూపురంబు కాంచీపురంబు.

ఆశ్వా 4—పద్య 414.

పంచతంత్రారంభమున పాటలీపుర వర్ణన సందర్భమున బట్టణ మందలి యొక్కొక్క విషయమున కొక్కొక్క పద్యమును రచించి బైచరాజు పట్టణ విశేషములనన్నిటి నొక పద్యమున నిందు వర్ణించుట ముదావహము.

భానుకవి స్వీయోదంతోద్ఘాటన సందర్భమున విద్యాపురౌన్నత్యము ను

పంపావిరూపాక్ష భైరవ విఠలే
శ్వరముఖ్య దేవతా వ్రజము చేత
పరిపంథి గర్వవిభాళన శ్రీకృష్ణ
రాయ భూధవ భుజారక్ష చేత

ఆశ్వా 5—పద్య 51

రమ్యమైనదని సీస పద్యమున భివర్ణించినాడు. వర్ణనము సులభ గ్రాహ్యము లైన భావములతో నిర్వహింపబడినది.

## 2. సముద్ర వర్ణనము :

లబ్ధప్రణాశ తంత్రారంభమున వానరాధిపతికి నివాసమైన బూరుగువృక్షము సముద్రపుటొడ్డున గలదని మూలమున 'అస్తి కస్మింశ్చిత్ సముద్రోపకంఠే' అని పేర్కొనబడినది. సముద్రవైభవము రేఖా మాత్రముగనైన నందు జెప్పబడలేదు. దూబగుంట నారాయణకవి యపూర్వ కల్పనలతో నా మహాసాగరము నిట్లు వర్ణించినాడు.

రంగదుత్తుంగ తరంగ సంఘంబులు
సరసాభినయ కరాబ్జములు గాఁగ
బహు విధ పరిచలన పాఠీన పంక్తులు
ధవళవిలోల నేత్రములు గాఁగ
సురుచిత స్నిగ్ధ పాండుర ఫేన పటలంబు
చారుతరాట్ట హాసంబు గాఁగ
లాలితభూరి శైవాల ప్రవాళంబులు
విరిసిన ఘన జటా భరముగాఁగ
ఘుమఘుమధ్వని వాద్యఘోషములు గాఁగ
జండతాండ వాడంబర శంభుమూర్తిఁ
బోలునని తన్ను జనములు పొగడునట్టి
వర్ణనకు నెక్కి యొప్పు మహార్ణవంబు.

ల. నా. పద్య-5.

ఎత్తుగా నెగురుచున్న కెరటముల సముదాయములు పరమేశ్వరుని రసానుగుణముగ నభినయ మొనర్చుచున్న కరాబ్జములుగను, అనేక విధములుగ గదలుచున్న చేపల సమూహము లాతని తెల్లని కదలాడు చున్న నేత్రములుగను, మంచికాంతితో స్నిగ్ధమైన నురుగు సముదాయ మాతని సుందరమైన యట్టహాసముగను, లేతవియు ననేకములునగు

పవడపు దీగెలాతని జటా సముదాయముగను, కెరటముల సంఘర్షణము వలన బుట్టిన ఘుమఘుమధ్వని వాద్యఘోషముగ నున్నదని సముద్రుడు నకు నృత్యత్పరమేశ్వరౌపమ్యమును గల్పించి దూబగుంట నారాయణ కవి పరమ రమణీయముగ సముద్రవైభవమున నభివర్ణించి స్వీయవర్ణనా నిపుణత్వమును నిరూపించుకొనినాడు.

ఈ ఘట్టమున భానుకవి కూడ వాహినీపతి మహాత్మ్యమును సుదీర్ఘవచనమున నభివర్ణించినాడు. 'మున్ను పుడిసిటంబట్టి ద్రిమ్మింగిన నాఁటి బన్నంబు వాపుకొనుటకొఱకు, గుంభసంభవు నొడిసిపట్టికొన దిశాభాగమ్ముల వెదుకఁజూచు బాహుదండంబులన గంధవహా పేరిత మ్ములై యొండొండసముద్దండ వేగమ్ములై చనుదెంచు నిడుద తరంగంబులును......' (ఆశ్వా 4 వచ 5) అని యారంభింపబడి వచనము సుదీర్ఘముగ రచింపబడినది. అగస్త్యుఁడు తన్ను బుడిసిటబట్టి ద్రింగిన యవమానమును బోగొట్టుకొనుటకు నతనికై దిక్కులను వెదుకుచున్న చేతులోయనునట్లు కెరటములున్నవని యందు మధురముగా భావింప బడెను. ఈ వచనముననింకను బెక్కు కల్పనలతో సముద్రిమందలి యంబుకణములు, నిర్ఘోషములు, ఫేనఖండములు మున్నగునవి వర్ణింప బడినవి. పుండరీకాక్షు నుదరాద్యౌపమ్యముతో నావచనమిట్లు 'పుండరీకాక్షు జఠరంబునుంబోలె భువనపూర్ణంబై, వారవధూనికేతనంబుం బోలెఁబ్రబల భుజగ సంకీర్ణంబై, మధ్యమలోకంబునుంబోలె ననేకభూభృత్సంకులంబై, గ్రిహామండలంబునుంబోలె మీనమిథున కర్కటభాసురంబై నాకంబునుబోలె దివ్యవాహినీ సమాశ్రియంబై పొలుపొందు నజ్జలధి వేలా సమీపంబున' అని నిర్వహింపబడినది. సముద్రము విష్ణుమూర్తి యుదరమువలెను, వారకాంతల యిండ్లవలెను, భూలోకము వలెను, గ్రిహామండలమువలెను స్వర్గమువలె నున్నదను కల్పన మద్భుతము. వానికి వేయబడిన విశేషణములు శ్లిష్టములు. సముద్రిపరముగ భువన శబ్దమునకు నీరు, భుజగ శబ్దమునకు సర్పములు, భూభృత్ శబ్దమునకు పర్వతములు, మీన మిథున కర్కట శబ్దములకు జేపల దంపతులు, ఎండ్రిలు, దివ్యవాహినీ శబ్దమునకు గొప్పనదులు నని యర్థము. పుండరీ

కాకు జఠరార్థమున భువనశబ్దమునకు లోకములు, వారవధూ నికేత నార్థమున భుజగ శబ్దమునకు విటులు, భూలోకార్థమున భూభృత్ శబ్దమునకు రాజులు, గ్రహమండలార్థమున మీన మిథున కర్కట శబ్దమునకు రాశులు, నాకార్థమున దివ్యవాహిని శబ్దమునకు దేవగంగ యని యర్థములు. ఇట్లు ఉపమానములను మాలగా ప్రయోగించుట, విశేషణములను శ్లేషించుట బాణుని కాదంబరీ రచనాను సరణము. ఇట్లు భానుకవి మధురభావంసపదను సుకుమార శ్లేషాలంకార ప్రయోగముతో గూర్చి సముద్రవర్ణన మొనరించినాడు. వర్ణనలను మిక్కిలి తక్కువగా గావించు భానుకవి యిప్పట్టున దన వర్ణనాసామర్థ్యమును నిరూపించుకొనినాడు.

ఈ సందర్భమున బైచరాజు వేంకటనాథుడు గూడ సముద్ర వర్ణనమును ప్రబంధోచితముగ నిర్వహించినాడు. సముద్రుడు మేఘములను పథికులకు పానశాలయనయు, భూకాంత కటిప్రదేశమున కట్టిన వస్త్రమనియు, ఖేచరులకు భోజనశాలయనియు పెక్కు విశేషములతో

నీరదపథిక పానీయ నికేతంబు
  మేదినీయువతి కటీదుకూల
మంబరచర వరాభ్య వహార సత్రంబు
  సరిదలంకృతి కార్యకరణశాలి
కార్పణ్యభయద వీక్షణవధూజనికర్త
  రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాక నిసర్గ శుభదాయి
  నిస్తులరత్న పూరిత కరంక
ముగ్రశతధార ధారాసమగ్ర భీతి
పరవశాగత బహుకుభృద్భరణ నిపుణ
మతనుసత్వ మలక్షితౌర్వానలంబు
వఱలు దక్షిణ శరధి సర్వజ్ఞశరధి

గాంభీర్య వాహినీభరణ గోత్రరక్షణాది గుణసంపత్తిని పురస్కరించు కొని సముద్రుని నొకమహాప్రభువుగా బైచరాజిట్లు వర్ణించినాడు.

ఇమ్మహాగాంభీర్య మెవ్వనికొదవు నీ
వాహినీభరణ మెవ్వనికిఁ గలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీ
యనిమిషావాప్తి యెవ్వరికి దొరకు
నీ సత్యసౌభాగ్య మెవ్వని కెనఁగు నీ
ఘనహితాచరణ మెవ్వనికి నొదగు
నీ గాధ జీవన మెవ్వనికుండు నీ
కనకరత్నోర్మ్ము లెవ్వనికి వశము
నీ లలితరాజ సన్మాన మెవ్వనికి ల
భించు నెవ్వనికిట్టి యొప్పిదము నిత్య
మాతనికెకాక యని లోకు లభినుతింపఁ
గాలునిర్భర విభుఁడాపగా విభుండు.

ఆశ్వా 4–పద్య 6.

ఇందు సముద్రుని మహాప్రభువుగా నభివర్ణించుటలో ప్రయోగించిన గాంభీర్యము, వాహినీభరణము, గోత్ర రక్షణము, అనిమిషావాప్తి, సత్య సౌభాగ్యము, ఘన హితాచరణము, గాధ జీవనము, ఊర్మ్ములు, రాజసన్మానము, అను విశేషణములు శ్లేషమూలమున నుభయులకు సమముగా నన్వయించును. సముద్రపరముగ గాంభీర్యమనగా లోతు, వాహినీ భరణమనగా నదీభరణము, గోత్రరక్షణమనగా కుల పర్వత రక్షణము, అని మిషావాప్తి యనగా చేపలను బొందుట యని యర్థములు. మహాప్రభు పరముగా నా పదములకు గంభీరభావము, సేనాభరణము, వంశరక్షణము, దేవతాప్రాప్తి యని యర్థములు. తక్కిన విశేషములందు నిట్లే యర్థద్వయము గలదు. హృదయంగమమైన శ్లేష ప్రయుక్తము, సముద్రుని యనంతత్వాది గుణములను బైచరాజు

అపరి మితంబుడు పతర
ణ్యుపసక్తం బఖిల జలధరోపాస్యం బా
త్మ పదస్థా నిమిషంబు
ద్వీపులాక్షోమం బసంత విధమెతిఁగించున్

ఆశ్వా 4-పద్య 7.

అని వర్ణించినాడు. ఇందును సముద్రిన కనంతత్వమును గల్పించుటలో అపరిమితము, ఉడుపతరణ్యుపసక్తంబు, అఖిల జలధరోపాస్యంబు మున్నగు విశేషణములు శ్లిష్టములు. సముద్రపరముగా నా పదములకు విశాలమైనది, నీటి యోడలతో గూడినది, సమస్త మేఘములచే నుపాసింప దగినది యని యర్థములు. అనంతుని (విష్ణు) పరముగ నింతింతని చెప్ప శక్యము గానిది, నక్షత్ర సూర్య స్థానములకు సమీపమైనది, సమస్త సాగరములచే నుపాసింప దగినది యని యర్థములు.

మిత్రభేదమున 'టిట్టిభ దంపతులు—సముద్రుడు' అను కథలో గూడ బైచరాజు సముద్రుడు జలగ్రాహములచే దఱుముబడుచున్న చేపలచే జేయబడిన వింజామర సత్కారముగల పట్టభద్రు డనియు దేవేంద్రుని పట్టణ ప్రాంతమున విశ్రమించుచున్న గంగాలలనా సంశ్లేషతో నుల్లాసముగ నున్నాడనియు నిట్లు మధుర కల్పనలతో నభివర్ణించినాడు.

కలితాతి ప్రీతిరీతిం గనియె బహుజలగ్రాహ నిర్గాహధాటీ
చలపాతోత్పాత మీనాచరితసిత మహాశ్చామర గ్రామపూజా
ఫలరేఖా పట్టభద్రున్ బలరిపునగర ప్రాంత విశ్రాంత గంగా
లలనా సంశ్లేషభంగా లఘుకర నికరోల్లాస ముద్రున్ సముద్రున్.

ఆశ్వా 1—పద్య 643.

ఈ వర్ణనము కేవల మమూలకము. దూబగుంట భానుకవిగూడ గావింపలేదు. సముద్ర వర్ణనమున జంపూకర్తలు మువ్వురును మూడు విధములైన మార్గములను బ్రదర్శించినారు. భావ సంయమనముతో రూప సాక్షాత్కారమునకు యత్నించి దూబగుంట సఫలుడైనాడు.

అర్థ గాంభీర్యమునకు ప్రథమ స్థానమొసంగి యనుగుణమైన శబ్ద ప్రయోగము గావించినవాడు భానుకవి. అర్థగాంభీర్యము చెడకుండ శబ్దవిన్యాస వైచిత్రికి ప్రాధాన్య మొసంగి ప్రబంధ యుగకవుల రచనా పద్ధతిని పుణికి పుచ్చుకొనిన మహాకవి బైచరాజు వేంకటనాథుడు.

## 3. శైల వర్ణనము :

పంచతంత్రమున నగవర్ణనము మృగ్యము. కాని కాకోలూకీయమున 'ముని – మూషికాంగన' అను కథలో దేవేంద్రుడు మహర్షితో భాషించునపుడు నాతని సూతునకు భర్త కాదగినవాడు మేరు పర్వతమని చెప్పునపుడు దూబగుంట నారాయణకవి యాపర్వత వైశిష్ట్యము నిట్లభివర్ణించినాడు.

సురుచిర రత్నసానువుల శుద్ధసువర్ణ మహోన్నతాయత
స్ఫురదురు శృంగ సంఘముల సూర్యసుధాకర తారకా నిరం
తర పరివర్తనంబుల గదాధర పద్మభవాది దేవతా
పరిచిత మౌళిభాగములఁ ప్రస్తుతికెక్కి వెలుంగు నెంతయున్

సం. ని పద్య–264.

ఇందు రత్నసానువులు, శృంగసంఘములు పర్వత రాజవైభవ నిరూపకముగా వర్ణింపబడినవి. ఈ వర్ణనము దేవేంద్రుని కంటె బర్వతేంద్ర మధికమైనదని చెప్పుటకు సమర్థకముగా సాగినది. ఇది యమూలకము.

కథాకథనమునకు మిక్కిలి ప్రాధాన్య మిచ్చుచు వర్ణనలను బొదుపుగా నిర్వహించిన భానుకవి మిత్రభేద తంత్రమున 'కాండోద్భవుడు–కాకిహంసలు' అను కథలో మహారణ్యముననొక గిరి గలదనియు దాని శృంగ మిఱువది తాటిచెట్ల పొడవుండుననియు, దానిపైన ఫల సాంద్ర పరిపూర్ణమైన భూరుహ మొకటి యున్నదనియు

కలదు మున్నొక్క గిరి మహాగహనమందు
దాని శృంగమ్ము నిరువది తాటిచెట్ల

పొడవు గలదండుపై వట భూరుహంబు
పోలుచు ఫలముల సాంద్రసంపూర్ణమగుచు

ఆశ్వా 1 – పద్య 234.

అని వివరించినాడు. పర్వత వర్ణన మమూలకము. మూలమున లేక పోయినను నేదో విధముగ వర్ణనమును ప్రవేశపెట్టు స్వభావముగల బైచరాజు తన యనువాదమున పర్వత వర్ణనము గావింపకుండుట యత్యావహము.

## 4. ఋతు వర్ణనము :

కాలగమనమును సూచించునవి ఋతువులు. ఒక్కొక్క ఋతువు నందొక్కొక్క విశేషము ప్రకృతిలో బొడసూపు చుండును. మహాకవులు తమ కవితాశక్తి సామర్థ్య నిరూపకముగా ఋతువర్ణన మొనరింతురు. పంచతంత్రానువాదములో బైచరాజు ఋతువర్ణనమున నను పమ దక్షతను ప్రదర్శించినాడు. మహా ప్రబంధోచితముగ ఋతువర్ణనము నిరంహించినాడు.

ఋతువులన్నింటను వసంతము సర్వప్రాణి సౌఖ్యాపాదకమైనది. సర్వజన మనోల్లాసకరమైనది. బైచరాజు వసంతర్తు వైభవము నతి మధురముగ నిర్వహించినాడు. కాకోలూకీయ తంత్రమందలి 'బ్రాహ్మణుడు–మేకపిల్ల' యను కథలో వసంతునొక లోకోపకార మహితాత్ముని గా నిట్లభివర్ణించినాడు.

చెనటి యాకుల పాటుచే నలంగిన సాధు
తరుల కుబ్బసంగు నాదరణ మూర్తి
భీమ తీవ్ర హింబకాభిహతి స్రుక్కిన మహా
మధుర ధర్ముని నొప్పి మాన్పువెజ్జు
ఫలభంగమున మాటపట్టు జాఱిన పైక
మునకు సత్కీర్తులిచ్చిన సుదాత
హాలి నున్మత్త చండాలురి మాధవా
ర్చన ధురంధరులఁ జేసినఘనుండు

కాలిగతిఁ బేర్చు నలజళ్లఁ గేఁగఁబడిన
సరసులకు నిర్మలత్వంబు సంఘటించు
సౌఖ్య సంధాయకుండు సాక్షాత్కరించె
సన్నుతానంతుఁడవని వసంతుఁడంత.

ఆశ్వా 3-పద్య 142.

ఇందు వసంతుడు ఆదరణమూర్తి, వైద్యుడు, దాత, ఘనుడు, సుఖ సంఘాత యనుచు విశేషణములతో నొనికూడ బడినాడు. ఆతని గుణ గణము శ్లేషాలంకార సంబద్ధమై యభివర్ణింపబడుట ముదావహము. వసంతుడు వ్యర్థమైన యాకుల పాటుతో బాధపడుచున్న సాధూత్తము లకు నానందము గల్గించు ఆదరణ మూర్తియని యొక యర్థము. ఆకులు రాలుటచే బాధనొందుచున్న యుత్తమ వృక్షములకు నానందము గల్గించువాడని యర్థాంతరము. ఆకులపాటు, సాధుతరులు అనునవి శ్లిష్టములు. అట్లే కుగిలినవాని యందును నర్థద్వయము గలదు. సరసు లకు నిర్మలత్వము సంఘటించుట యనగా గాసారములకు దేటదన మొసంగుట, సరసులైనవారికి మాలిన్యరాహిత్య మొనరించుట యని రెండర్థములు.

వసంతునొక నాయకునిగా వనలక్ష్మి నొక నాయికగా మధుర కల్పనతో నాయకుని శృంగార చేష్టతో నన్వయించి వసంతకాల సౌభాగ్యమును బైచరాజిట్లభివర్ణించినాడు.

ముక్త పత్రివ్యాజమునఁ జీర సడలించి
కళికల న్పులకలఁ గలుగఁ జేసి
పొలిపోని తావులఁ బూవుదండలఁ జుట్టి
కడలేని మధుస్వాతికమునఁ దెల్చి
రణదళి ఝుంకార మణితము ల్ఘటియించి
దీవి చక్కెరలూటు మోవియాని
సరవిసున్నత ఫలస్తనములఁ గబళించి
కళదేఱు తనువల్లి గౌఁగలించి

కలికిరాచిల్క పల్కుఁ బల్కుల నలర్చి
సురభి కర్పూర రజముల సొంపొనర్చి
కలిత వనలక్ష్మిఁ గూడి రాగము వహించె
మాధవుఁడు హృష్టనిఖిల క్షమాధవుండు.

ఆశ్వా 3-పద్య 143.

చీరసడలించుట, పులకలు గలిగించుట, పూదండలు చుట్టుట మున్నగు శృంగార పురుషచేష్టలను వసంతునియందు గల్పించి యభివర్ణించుట సుమనో మనోహరముగా నున్నది. అతఁడు మాధవుఁడు, ఆమె వనలక్ష్మి. విష్ణువు లక్ష్మిని బొందుటయనునది యర్థాంతరము. హృష్టనిఖిలక్షమాధవుండు అనుటలో గూడ భూధవత్వముచే విష్ణుత్వము సూచితము.

ఈ సందర్భముననే బైచరాజు వసంతఋతువునకు ఉదాహరణ కావ్యము, భాగవతము, రాజాంతఃపురము, సముద్రతీరము, వీణా యంత్రము పోలికలుగా గ్రహించి శ్లేషమూలమున మనోహరమైన యర్థద్వయమును బొందించుచు 'మఱియు నవ్వసంతంబు కళికాభి రామంబై యుదాహరణంబును శుకసూక్తి సందర్భ గర్భితంబై భాగ వతంబును గలకంఠీకలాప దీపితంబై రాజావరోధంబును బ్రకాశిత ప్రవాహంబై సముద్రతీరంబును సంద్రష్టశారికా జాలంబై వీణా యంత్రం బును బురుడించు నక్కాలంబున' అని వర్ణించిన తీరత్యంతప్రశస్యము. దేశీయ ప్రక్రియా ప్రభేదమైన కళికలుదాహరణ కావ్యము లందుం డును. మొగ్గలు వసంతకాలమున నుండును. కావున వసంతకాలము కళికాభిరామమై యుదాహరణ కావ్యమును బోలినది. అట్లే భాగవ తము శుకమహర్షి సూక్తుల సందర్భములతో గూడినది. వసంత కాలము చిలుకపలుకలతో గూడినది. కావున వసంతకాలము భాగవ తమును బోలినది. రాజాంతఃపురము స్త్రీల విలాసములచే ప్రకాశించు చుండును. వసంతకాలము కోకిలల ఆలాపములచే విరాజిలు చుండును. కావున వసంతకాలము రాజాంతఃపురము వలె నున్నది సముద్రతీరము ప్రకాశింపబడిన నీటిప్రవాహము గలది. వసంత ఋతువు ప్రకృష్టమైన

వాయువుగలది. కావున వసంత కాలమునకు సముద్రతీరాపమ్యము సిద్ధము. వీణ తంత్రులను మీటుట కుపయోగింపబడు కోడుపుల సముదాయము గలది. వసంతర్తువు గోరువంకలను పక్షుల సముదాయము గలది. కావున వసంతర్తువు వీణాయంత్రమును బోలినది. ఇట్లు వసంతర్తు వైభవము బహూపమాన పూర్వకముగా శ్లేషాలంకార బంధురముగ నభివర్ణింప బడినది. ఈ వర్ణన మమూలకము.

సర్వభూత భయావహమైన ఋతువు గ్రీష్మము. బైచరాజు మిత్రభేదతంత్రమున 'కొంగ–ఎండ్రి' యను కథలో సుదీర్ఘముగ నైదు పద్యములలో (292–296) గ్రీష్మర్తువైభవము నభివర్ణించినాడు. మూలమున ననావృష్టి యేర్పడెనని మాత్రమే గలదు. భీష్మములైన గ్రీష్మర్తు లక్షణములిట్లు పేర్కొనబడినవి.

క్షణదాయామ విఘూతి భాస్కరమహస్సంపాతి విశ్వంభరా
ప్రణయత్సుంతము సింధు వింధ్య కుహర ప్రచ్ఛేత్త దావానలా
రణి నానామృగ మస్తకద్రుమ కుఠారంబధ్వనీనార్తి కా
రణి భైషజ్యము దోఁచె వేసవి మహోగ్రప్రేక్షణోదగ్రమై

ఆశ్వా 1–పద్య 292.

రాత్రి సమయమును దగ్గించుట సూర్యుని కాంతిపుంజ సంపాతము కల్గి యుండుట, భూమిని జీల్చుట మున్నగు గ్రీష్మర్తులక్షణము లిందు మనోజ్ఞముగ వివరింప బడినవి. భీష్మకాల మహోగ్రప్రేక్షణోదగ్రత పదబంధమునను ప్రస్ఫుటమగు చున్నది.

గ్రీష్మమందు సూర్యాతప తాపమును సహింపని వారలకు గాలులెట్లుపకరించునో బైచరాజిట్లు చమత్కరించినాడు.

అడుగిడరాదు నేల నెరయందల చూడఁగరాదు నిష్ఫల
ల్లడి గొనరాదు నెండవడఁ జల్లెడు వీఁడిఁక నేడమిత్రుఁడం
చుడుగక భానుఁజూచి వగనొందు శరీరులఁ దేర్చుగాడ్పు ల
ప్పుడు పరపోషణ వ్రతులు వో ఘనదాన కళాధురంధరుల్.

ఆశ్వా 1–పద్య 293.

కాలు పెట్టుటకు శక్యముగాక తలచూపుటకు వీలులేక నిప్పుకణములు రాల్చుచు వడగాడ్పులను వెదజల్లుచున్న సూర్యుని నమిత్రుడని ప్రజలు భావించుచు బాధనొందగ వారి తాపమును గాలులు పోగొట్టుచున్న వని భావము. దానికి దాతృత్వ శిఖామణులు పరపోషణ వ్రతులు గదా యని కవి సమర్థనము. మిత్రు నమిత్రునిగా భావించుటలోని చమత్కృతి యనుపమము. అట్లే యర్థాంతర న్యాసాలంకార ప్రయోగముగూడ నత్యంత మనోజ్ఞముగా నున్నది.

గ్రీష్మమున బడమటి వాయుపరిసారమును జలచర స్థితిగతులను వేంకటనాథుడిట్లు విపులముగ వర్ణించినాడు.

దండినిప్పుల వసంతమాడు నెండల
వడఁజల్లు పడమటి వాయువులును
గ్రోలి గుంటలు దక్క గుల్లలు చిక్కంగ
నివిరిన గొంగరాయిడికి మిడికి
కొరదయుఁ గడిసె పావరముల్లు ముచ్చంగి
కొంతెముక్కను లొంపిఁ గ్రుచ్చుకొనియె
వాలువ ముకుదమ్ము వల్లె గండెర నత్తె
గుజ్జు బేడిస జాతి కొఱుకు మడిస
నూతయలజళ్ళ చెఱువుల నుండరాక
కార్మొసల్లు నెగళ్లును గవులు విడిచి
తరలి చెంతల నూతిగుంతల వసించె
గెరలివర్తిలు నమ్మహా గ్రీష్మమునను

ఆశ్వా 1—పద్య 294.

పడమటి వాయువులు నిప్పులతో వసంతము నాడెడి నెండల గాడ్పును ప్రసరించు చుండును. జలశైత్యమునకు గొన్ని జలచరములు రొంపి యందు జేరును. కొన్ని నూతిగుంటల నాశ్రయించును. జలచర నామములచ్చ తెనుగులో పేర్కొనబడుట విశేషము.

గ్రీష్మమున సూర్యుడు శంబరశోషణము గావించుచు బథికుల యంగములకు గాకను ఘటించుచు మన్మథత్వమును జూపుచున్నాడని బైచరాజిట్లభి వర్ణించినాడు.

శంబరశోషణక్రియకుఁ జాలి దురంతతర ప్రతాపరే
ఖం బథికాంగ కంబులకుఁగాఁక ఘటించు హరింతురంగ సే
వ్యంబు మహాబలోద్ధతమునైన శతాంగము నెక్కి యున్నదా
ఘంబునఁ బద్మినీ యువతికాముఁడు కాముని దెల్పెఁ బొల్పుగన్
ఆశ్వా 1—పద్య 295.

ఇందు శంబరశోషణాదికము సూర్యుని పరముగను మన్మథుని పరముగను గూడ నన్వయించును. శంబరశోషణ మనగా నీటి నెండించుట యని సూర్యపరమైన యర్థము. శంబరాసురుని నాశన మొనరించుట మన్మథపరమైన యర్థము. తీక్ష్ణకిరణములచే సూర్యుడు పాంథులకు దాపము గల్గించును. వియోగులైన బాటసారులకు మన్మథుడును దాపకారియే. రథమునకు ప్రయోగింపబడిన హరింతురంగ సేవ్యంబు, మహాబలోద్ధతమునను రెండు విశేషణములును సూర్య మన్మథులకు సమానముగ నన్వయించును. వానికి పచ్చని గుఱ్ఱములు గలది, గొప్ప బలముచే నుద్ధతమైనది యని సూర్యపరమైన యర్థములు. చిలుక గుఱ్ఱముగా ననగా వాహనముగా గలది, వాయువుచే నుద్ధతమైనది యని మన్మథపరమైన యర్థములు. సూర్యునకు మన్మథత్వ కల్పనము శ్లేషచే బైచరాజు నిర్వహించిన విధమత్యంత శ్లాఘనీయము.

ఇంతదీర్ఘముగ వర్ణించినను దృప్తినొందక భయంకరమైన వేసవి యర్జునుని, శ్రీరాముని, మేఘారంభమును, బలిసదనమును బోలియున్న దని బైచరాజు 'మఱియు నవ్వేసవి శోషితసింధు రాజంబయి ధనంజయుం గృశీకృత దశ కంధరంబయి దాశరథిని, ఘనాఘన నర్తిత శిఖి మండలంబయి కంధరారంభంబును భోగివిరాజమానంబయి బలిసదనంబు ననుకరించె' అని శ్లేషాలంకార భూయిష్ఠముగ వర్ణించినాడు. గ్రీష్మము శోషితసింధురాజము. అనగా శోషింపబడిన సముద్రుని

గలది. ధనంజయుని పరముగ శ్లోషిత సింధురాజంబనగా సంహారించిన సైంధవుని కలవాడని భావము. కావున ధనంజయ సామ్యము సముపపన్నము. గ్రీష్మము కృశీ కృతదశకంధర మనగా కృశింపజేయబడిన దశగల మేఘముగలది అని యర్థము. కంధర శబ్దమునకు నీటిని ధరించునదని వ్యుత్పత్తి. కృశీకృతుడైన దశకంధరుననగా రావణుని గలవాడు అని రామపరమైన యర్థము. సభంగ శ్లేషచమత్కృతి మనోజ్ఞముగా నున్నది. గ్రీష్మపరముగా ఘనాఘన వర్తితశిఖి మండల మనగా మేఘ మండల పర్యంతము విజృంభించుచున్న యగ్నిమంటల సముదాయము గలదని యర్థము. మేఘారంభ పరముగ మేఘమునకు నాట్యముచేయబడిన నెమ్మిళ్ల సముదాయము గలదని భావము. గ్రీష్మపరముగ భోగి విరాజమానంబయి యనగా భోగిజనముచే ప్రకాశించుచున్నదని యర్థము. బలిసదన పరముగా బాములచే ప్రకాశించు చున్నదని యర్థము. మాలగా నుపమానములను శ్లేషాలంకృతముగ ప్రయోగించుట భట్టబాణుని కాదంబర్యనుసరణము. ఈ వర్ణనము ప్రబంధోచితము.

ఇట్లే మిత్రభేదమందలి 'రెండు హంసలు—కూర్మము' అను కథలో గూడ బైచరాజు భయంకరమైన వేసవిని

కుంజకుటీ విహారములకుం జనఁ జెంచులు నిర్ధరంబులం
గుంజరముల్నటింప బలు గూడెపుబోయలు చాలు వేఁట సాఁ
గంజెల రేఁగి సాళువపు గ్రద్దలు గూండ్లకుఁబుల్లు మోవనిం
కంజెలువుల్భయంకరముగా నొక వేసవి దోఁచెఁ దోఁచినన్.

ఆశ్వా 1—పద్య 555.

అని వర్ణించినాడు. ఇందు జెంచులు పొదరిండ్ల విహారముల కేగుట యేనుగులు సెలయేళ్ల కేగుట, గూడెములందలి బోయలు వేటాడుట, సాళువపు గ్రిద్దలు గూండ్ల కేగుట, చెఱువులు బాగుగా శుష్కించుట యను గ్రీష్మకాల ధర్మములు మనోజ్ఞముగా వర్ణింపబడినవి.

మిత్త్రిభేదమందలి 'మూఁడుచేపలు' కథలో గూడ వేసవియెంత ప్రచండముగనున్నదో యిట్లభివర్ణించినాడు.

ఘనశిలాయుత మరుత్కపిల విద్యుల్లేఖ
చండనాపహుతాశ సామిధేని
సముజమస్తక నగస్వరుపాత మహిమరు
గ్జల జరాగమహోదశాణ చక్ర
మధ్వన్య చరణాలగాగ్నందువు బహుసింధు
పాథోరస గ్రిహిబాడబంబు
ప్రేంఖదాతప శిఖిన్యాంఖంబు దశదిశా
వృతమృగ తృష్ణాతి వృష్టిఘనము
చించికాఫల హృష్ట ఘృష్టి ప్రచండ
ఖురచతుష్క క్షురతోత్కీర్ణ పరిణతాజ్య
పాక సురభిత గిరిద్రుమత్ప్రసవకంబు
కటిక వేసవి దోచె నక్కాలమునను.

ఆశ్వా 1—పద్య 577.

పెద్దరాళ్లతో గూడిన వాయువుచే గపిల వర్ణముతో నొప్పిన విద్యుల్లేఖలుంగలది, తీవ్రమైన కార్చిచ్చను నగ్నిని వృద్ధిజేయుమంత్రము, పశుపక్షుల శిరస్సులను పర్వతములకు వజ్రాయుధము, సూర్యుడను పద్మరాగమునకు గాంతినొసంగు సాన మున్నగు గ్రీష్మకాల విశిష్టలక్షణములిందు వివరింపబడినవి. పదబంధము గ్రీష్మకాల ప్రచండత్వనిరూపణ సమర్థకము.

కాకోలూకీయమంలి 'గజయూథము-శశకము' అను కథలో గూడ బైచరాజు గ్రీష్మకాల విశేషముల నిట్లు వర్ణించినాడు.

అగళద్దుర్భర తీక్ష్ణ భాస్వదభిషు వ్యాఘాతపాతక్షర
న్మృగ మస్తక్షతజంబు బశ్చిమ మరుద్వృద్ధత్రిధామజ్వాల
న్నగ మంతర్జల నిర్ఝరంబు మృగతృష్ణా వాహినీ సంచితా
ధ్వగముష్ణాగమమయ్యెఁ దొల్లి పురజిత్ఫాలాంబకాభీలమై

ఆశ్వా 3—పద్య 68.

మృగముల రక్తపాతము, దహించుచున్న పర్వతములు, అంతర్జలముగల సెలయేళ్లు, మృగతృష్ణా భ్రాంతితో గూడిన బాటసారులు గలిగి

గ్రీష్మ మెంత భయావహముగ నున్నదో వైచరాజు మనోజ్ఞముగ నభివర్ణించినాడు. ఆ యుష్ణాగమము త్రిపురాసుర సంహారకర్తయైన పరమేశ్వరుని మూఁడవనేత్రమువలె భయంకరముగా నున్నదనుటలో దాని తైక్ష్ణ్యము సూచితము. ఉపమాన మత్యంత సముచితముగా నున్నది. శైలి భావపరిపోషకముగా నిర్వహింపబడినది.

ఈ విధముగా వైచరాజు వేంకటనాథుడు భిన్నకథలలో గ్రీష్మమును సుదీర్ఘముగ నభివర్ణించినాడు. ఎందును భాషాదారిద్ర్యము గాని భావపునరుక్తిగాని కనుపింపదు. వర్ణనములు ప్రబంధోచితముగా నిర్వహింపబడినవి. గీష్మకాలమున బుష్పించు నవమాలికా శిరీష చంపక కేదంగుల ప్రసక్తిగాని ఖర్జూరము, పనస మున్నగు ఫలముల విషయము గాని ప్రాతర్నిశల దంపతులు పొందునవస్థలు గాని వర్ణింపబడకపోవుట విచార్యము. గ్రీష్మమందలి దుస్సహత్వము మాత్రమే యెల్లయెడల నభివర్ణితము.

వర్షర్తువు సర్వజన సంతాపహరమైనది. భానుకవి మిత్త్రభేదమున దమనకుడు సంజీవకునకు బింగళకునిపై ద్వేషము పుట్టించి కరటకునితో నావృత్తాంతము ముచ్చటించు సందర్భమున వర్షకాలారంభ సంరంభము నిట్లు వర్ణించినాడు.

> నీల బలాహక వ్రజము నింగిపయింగను పట్టె మంద వా
> తూలము లెల్లెడం బరగెఁ దోఁచె మెఱుంగులు దిక్కులందు ధా
> రాళ మహోగ్రవర్షము ధరావలయంబుఁ గప్పె భోగి భు
> గ్జాలము నృత్యముల్దనరె శైలములన్ దొలి వాన కారునన్
>
> ఆశ్వా 1–పద్య 275.

ప్రావృడ్కాల ప్రారంభ విశేషము లిందు మనోహరముగా వర్ణింపబడినవి. నీలమేఘ సముదాయము నింగిని గనుపట్టుచున్నది. మంద వాయువు లంతటను ప్రసరించుచున్నవి. దిక్కులందు శంపాలతలు ప్రకాశించు చున్నవి. నిరంతరము నుగ్రమునైన వర్షము భూమండలమును గప్పివేసినది. మయూరములు పర్వతము లందు నాట్యమాడు చున్నవి.

సరళములైన భావములచే వర్షాగమ సమయ వైభవమును భానుకవి యిందు సాక్షాత్కరింపజేసినాడు. ఈ వర్ణన మమూలకము. మెఱపులు, ధారాళము నుగ్రములైన వర్షము భూవలయమును గప్పుట అను వర్ష కాల గుణ వర్ణనము రాబోవు ప్రళయ నిభమైన పింగళక సంజీవక ఘోర యుద్ధమును వ్యంగ్య పఱచుచున్నది. వర్ణనము కథోత్కర్ష దాయకముగా నిర్వహింపబడినది.

బైచరాజు కాకోలూకీయమున 'శశకపింజలములు-మార్జాలము' అనుకథలో వర్షమును వర్ణించినాడు. ఆ కథాభాగమున నావర్ణనము ప్రముఖపాత్ర వహించుచున్నది. వర్షసమయ మందలి మెఱపుల విలాసములు, కర్ణపుట భేదకములగు మేఘగర్జనలు హృద్యముగ నిట్లు వర్ణింపబడినవి.

ఆహా కృచ్ఛపలా విలాసమఖిల ప్రాణిశ్రుతి వ్యగ్రగ
ర్జాహంభావ సమగ్ర ముగ్రరయ నద్యం బుత్థితాంభోనిధి
వ్యూహం బాహతకానన జ్వలన మోహో మింటితో ప్రేలఁగా
లాహింగట్టిన చాడ్పునం గురిసె ఘోరాసార మచ్చోకటన్

ఆశ్వా 3-పద్య 104.

వర్షధార యాకాశము నుండి నేలవరకు ప్రేలాడునట్లుగ గట్టబడిన కాలాహివలె నున్నదని వర్ణించుటలో గవియొక్క భావనా ప్రౌఢిమ వెల్లడియగు చున్నది.

పంచతంత్రాను వాదములందు హేమంత ఋతువైభవము మిక్కిలి మనోహరముగ బెక్కుకథలలో నభివర్ణింపబడినది. అనువాదకుల వర్ణనా సామర్థ్య నిరూపకముగా నిర్వహింపబడినది. మిత్రభేదమున 'సూచీముఖను-వానర యూథము' అనుకథలో 'తచ్చ కదాచిద్ధేమంత సమయేఽతి కఠోర వాత సంస్పర్శ వేపమాన కలేబరం తుషారోద్ధత ప్రవర్ష ఘనధారా నిపాత సమాహతంన కథంచి చ్ఛాంతి మగమత్' అని హేమంత మభివర్ణితము. భానుకవి తననువాదమున స్వతంత్ర కల్పనలతో హేమంత వైభవము నిట్లభివర్ణించినాడు.

జలధి సరిత్సుధాకిరణ శైత్య సమేధితమైన యా హిమా
చలమున నుంచి పూని వెదచల్లుచు వచ్చినయట్లు లోకమున్
గలగొనుమంచు ముంచి చలికాలము మున్ను దనర్చె నెంతయున్
జలరుహ బాంధవుండు గడు చంచలతన్ శిఖిమూల కేఁగఁగన్

ఆశ్వా 1-పద్య 281.

చలికాలము సముద్రము, నది, చంద్రుడు అనువాని చల్లదనముచే వృద్ధినొంది హిమాలయ పర్వతమునను మంచి పట్టుదలతో వచ్చు చున్నదోయనునట్లు లోకమును జుట్టుముట్టి నింపుచున్నది. సూర్యుడు గూడ జాంచల్యముతో జెట్లమూల నాశ్రయించు చున్నాడని భావము. ఇందలి భావము సులభగ్రాహ్యముగ నున్నది. కల్పనము మనోజ్ఞము. అనంతరపద్యమున బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, జనులు కాంతా కుచ దుర్గాశ్రయ ప్రాప్తిచే శీతబాధానివారితులై సుఖించు చున్నారనియు దద్బాధా నివారణమునకు మఱియొక రక్షణము లేదనియు నిట్లు

లలనా కుచదుర్గంబులు
గలుగఁగ హరి హర పయోజ గర్భులు జనులున్
దలఁప సుఖించిరి గాకీ
చలి పగఱకుఁ దలఁగ నొండు శరణము గలదే

ఆశ్వా1-పద్య 282.

అని చమత్కరించినాడు. భావము సరసము. ఇందు త్రిమూర్తుల ప్రసక్తి మాత్రము మిక్కిలి యనుచితము.

బైచరాజు గూడ నీ సందర్భమున హేమంత లక్షణముల నతివిపులముగ బదుమూడు పద్యములలో (ఆశ్వా1-పద్య 676-688) ప్రబంధోచితముగ నభివర్ణించినాడు. అందు జంద్రుని వైభవమును మనోహరముగా నతడిట్లు వర్ణించినాడు.

సదవన వైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయము నూన దాన విధియుం బరి పూర్ణకళా విలాస సం

సదయును గల్గి రాజు గనుపట్టె ననంత పద ప్రవిష్టుఁడై
యధిగత మూర్జిత ప్రసవమై కొమరొందె ధరిత్రి యెంతయున్.

ఆశ్వా 1—పద్య 678.

ఇందు రాజు అనుపదము ప్రయోగింపబడుటచే జంద్రుడను నర్థముతో బాటు ప్రభువు అను నర్థము గూడ గల్గుచున్నది. విశేషణములు గూడ రెంటికి నన్వయించుటకు ననువుగ శ్లేషింపబడినవి. ధవళ వైభవముగల వాడు చంద్రుడు. సత్పురుష రక్షణ వైభవముగలవాడు ప్రభువు. ఇందు సభంగశ్లేష. చక్రవాక పక్షుల వధించు యత్నముగలవాడు చంద్రుడు. శత్రుమండల వధోద్యోగము గలవాడు ప్రభువు. ఊర్ధ్వ గమనాభిరూపమైన యభ్యుదయముగలవాడు చంద్రుడు. రాజ్యవైభవముచే నభ్యుదయము నొందువాడు ప్రభువు. అమృత దానవిధి గలవాడు చంద్రుడు. సాటిలేని దాతృత్వముగలవాడు ప్రభువు. షోడశకళలతో ప్రకాశముగలవాడు చంద్రుడు. విలాససంపదలతో విరాజిల్లువాడు ప్రభువు. అంతములేని యాకాశపదవి నధిష్ఠించువాడు చంద్రుడు. గొప్పదైన పదవియందు ప్రకాశించినవాడు ప్రభువు. అట్టి రాజుగల్గుటచే ధరిత్రి ఊర్జిత ప్రసవమైనది ఇందు ధరిత్రికి ప్రభువునకుగల భార్యాభర్తృ సంబంధము, ధరిత్రికి జంద్రునకుగల పోష్యపోషక సంబంధము చమత్కరింప బడినది. ఇందలి శ్లేషాలంకార ప్రయోగము బహు సుకుమారముగ నున్నది.

హేమంతము పగలెల్ల నొక క్షణమైన విశ్రమింపక శ్రమించు దుక్కిటెడ్లకు, దమ సస్యక్షేత్రముల ఘాసోన్మూలనకార్య నిమగ్నలగు కూలికాండ్రకు, సేద్యపు బనులలో నలసి పరుండుట కిచ్ఛగించు ముసలియెడ్లకు నూఱట గల్గించుచున్నదని బైచరాజిట్లు వర్ణించినాడు.

ఒకత్రుటి కాలమేని పనికొగ్గక మీఁదులుచూచు దుక్కి బం
ట్రకు మడిఁజేనఁ గల్పుల కొడంబడి ఘాసములూఁడ్చుకూలి కాం
డ్రకు నెడసేద్యపుం బనులడస్సి పరుండఁదలంచు పెద్ద యె
డ్లకుఁ గలిగించె ధైర్య వికలస్థితి వాసరపంక్తు లూఱటన్

పద్య 681.

హేమంత ఋతువు నందు బురుషులు ప్రియా శ్లేషములచే సౌఖ్యము నొందుచు శీతబాధా నివారితులగుదురు. ఇది లోక సహజము. కవిసమయ ప్రసిద్ధము. బైచరాజు సంతోష కారణమునకు ముఖ్యాధారములైన ప్రియురాండ్రు వివిధ సుగంధద్రవ్యసములంకృత స్తనాలింగనములచే శీతభయార్తులైన ప్రాణభర్తల నెట్లు సుఖింప జేయుదురో యిట్లభివర్ణించినాడు.

తోషణకారణైక వసతుల్సతులత్తటి భగ్నసైంధవ
ద్వేషి విషాణగర్భరుచి విస్ఫురితాగురుదారుఖండ సం
వేషిత నూతనైణ మదమిశ్రఘన స్తనదత్త నిర్భరా
శ్లేషణలీలఁ దేలుతురు శీతభయార్తులఁ బ్రాణభర్తలన్

పద్య 683.

హేమంత సమయమందు భోగులు పెద్ద నిప్పులకుంపట్ల నపే క్షించుట, కస్తూరి కాలాగురు చందనాదుల సేవించుట, జమిలినేతగల వస్త్రముల ధరించుట, రాగరసోద్దీపకమగు తాంబూల చర్వణమొన రించుట, ప్రియాశ్లేషము లాశించుట యను విషయములను బైచరా జిట్లు వివరించినాడు.

భోగులు వుచ్చిరద్దివసమున్ పృథువహ్ని హసంతికాదిదృ
ఙ్మోగతులం గురంగ మదసమ్మిళిత ప్రతి నవ్య దివ్యకా
లాగరు చందనంబుల మహోయమళీ భవదంశుకంబులన్
రాగరసైక వీటికల రాజముఖీ పరిరంభణంబులన్

పద్య 684.

పుండువంటిచలిలో ప్రజల విభిన్న స్థితిగతు లనుపమానపు రస్సర ముగ బైచరాజు మనోహరముగ నిట్లు వర్ణించినాడు.

నిర్నిద్రదోష ఘూర్ణిత మనస్కుల భంగి
దృఢరవంబుగ నొండ్లు దీడితీడి
ధృతిబలోద్ధత విరోధితాసి తులలీల

వారక వడవడ వణఁకి వణఁకి
యవనిభృన్నికట వర్త్యను జీవులోయనఁ
జేతు లంసములపైఁ జేర్చిచేర్చి
యాభీర వల్లభులన దల వాకిళ్ల
నొకట యావుల గుంపులొత్తియొత్తి
సొగుబడినాటి కమ్మర జాతిఁ బోలెఁ
గటికి నిప్పుల కుప్పలఁ గదిసి కదిసి
పొలిచిరప్పుడు ప్రోలిన చలికతమున
నాకులత నొందిరిలలోన లోకులెల్ల

పద్య 685.

రాత్రి నిద్రలేకపోవుటచే ఘూర్ణిల్లుచున్న మనస్సుగల వారివలె ప్రజలు అపుడు గజచుచున్నారనియు, మహాబలవంతులైన విరోధులకు భయపడిన వారివలె వడవడ వణకు చున్నారనియు, ప్రభువుల ముందు దిరుగాడు పరిజనమో యనునట్లు మూపులపై భుజముల నుంచుకొన్నారనియు, ఆభీర నాయకులో యనునట్లు తలవాకిళ్లలో నాలగుంపు నుంచుకొన్నారనియు, గమ్మరజాతి వారివలె గటిక నిప్పుల కుప్పలలో నుందురనియు బైచరాజు వర్ణించిన తీరు సహజ సుందరముగా నున్నది.

శీతకాలమున వాడబడు నుష్ణపదార్థములగు నాకుకూరలు, ఆకు వక్కలు, శొంఠిపొడి, కాలాగరువులు, మున్నగునవి

శాకపు సరకులఁ బోకలు
నాకులు గొంగళ్లు దుడుపుటంబరములు శుం
ఠీ కాలాగరువుల్లోన
నైకొనఁ బ్రియమయ్యె శీతకాలము నందున్

పద్య 686.

అను పద్యమున వర్ణింపబడినవి.

రెడ్డిమడియలు దున్నట కేగునపుడు ఆరికకూడు, పుచ్చకాయల వరుగు, ఆవువెన్న, మున్నగు వేడిగొలుపు పదార్థములను సేవింతురని

ఆరికకూడు పుచ్చు వరుగావుల వెన్నయు దోసగింజ సం
బార పుటాంబురంబు తనివాఁజగ మాకొన కంపుతోడఁ దం
డారగఁ బట్టి రెడ్డిమడియల్ములు గోలలఁబూని యెడ్ల కో
ఉరులు వైచి దున్నుటకు నేఁగిరి కొండకు సాలివచ్చినన్.

పద్య 687.

అని పేర్కొనబడినది.

పల్లెజలలో గొందలు హేమంతమున జప్పిళ్లు తాగుదురనియు శరీరమందలి యవయవ సంధులలో గ్రంథులు గలుగగా గట్టిగా నూలబెట్టు చుందురనియు, గొందలు మూల్గుచుందురనియు, వాత విధ్వంసకమగు వాలుడు తైలము గోలుదురనియు నిప్పులకుంపటి శాకభక్షణము గోరుదురనియు

చవుల వేడబములు చాలించి తలసారె
దలలక చప్పిళ్ళు ద్రావువారు
కాయసంధుల మహోగ్ర గ్రంథులొ దవిన
బెట్టిదంబుగ నూలఁ బెట్టువారు
రసభూమ మఖలగా త్రిచ్ఛిద్రములఁ బ్రాఁక
నుబ్బలఁబడి మూల్గు చుండువారు
ఛీ సిగ్గుగాదొకో చేర మాకాటది
యన్నఁజెల్లెలివాపి యనెడువారు
కోరివాలుడు తైలంబుఁ గ్రోలువారు
కుములు కుంపటి శాకముల్ గోరువారు
నైరియొక కొందలచ్చలి నలస వాభ
వానిథాటి విహారంబుఁ బూనుటయును.

పద్య 688.

అను పద్యమున వేంకటనాథుడు వివరించినాడు. తత్కాల విజృంభణ మును దాని నెదుర్కొనుటకు ప్రజలు గావించు యత్నాదికమును భైచరాజు చక్కగా నిందు వివరించినాడు.

మూలమున రేఖామాత్రముగ సూచితమైన హేమంత ఋతు వైభవమును భావబంధురముగ బహువిధ కల్పనలతో బైచరాజభి వర్ణించిన విధమత్యంత ప్రశంసార్హము. బైచరాజు వేంకటనాథుని చంపూనువాదము ప్రౌఢముగను ప్రబంధోచితముగను నిర్వహింప బడినదనుటకీ హేమంతవర్ణన మొక్కటి చాలును. ఇందాకాలము నాటి సాంఘిక జీవనము గూడ సూచింపబడుట గమనింపదగిన విషయము.

## 5. చంద్రోదయ వర్ణనము :

ఒక్క బైచరాజు వేంకటనాథుడు మాత్రమే చంద్రోదయ సమయ వైభవము నతిమధురముగను విపులముగను దన యనువాద మున జతుర్థాశ్వాసమున నభివర్ణించినాడు. ఆ వర్ణనమంతయు నమూలకము.

చంద్రోదయమునకు గలువ లువ్విళులూరును. చంద్రుడు కువలయ వికాసకరుడు. కల్పనాచతురులైన మహాకవులు కువలయ చంద్రులకు భార్యా భర్తృ సంబంధమును గల్పించిరి. అది సాహిత్య లోకమున నొక సంప్రదాయముగ రూఢమైనది. బైచరాజు వారి యనుబంధము నిట్లు సరసముగ జిత్రించినాడు.

నిండారు కమ్మందేనియ మజ్జనంబాడి
కడిమి పుప్పొడి వన్నెమడుగుఁ గట్టి
రేకుగన్నులఁ జంచరీకాంజనముఁ జేర్చి
తనువల్లి ఫేనచందనముఁ బూసి
తులలేని తూఁడుఁజేతుల నూర్మికలు దాల్చి
జలకణ మౌక్తికచ్ఛటలు పూని
మొగ్గపాలిండ్ల సొంపున హిమాంబువు నుంచి
యామోద సంపద నతిశయిల్లి
హంస కంబుల నిజపదం బలవరించి
భువన మోహనమైన వైభవముఁగాంచి

కలువ విరిబోఁడి రాజురాకడ దలంచి
పొలిచె వాసక సజ్జికాస్ఫురణ నపుడు.

పద్య 233.

కలువకన్నె కమ్మతేనియతో స్నానమాడి, కడిమి పుప్పొడి వర్ణముగల వస్త్రము దాల్చి, రేకులను కనులందు దుమ్మెదలనెడి యంజనమును బూసికొని, లతయను శరీరమున నురుగు అను చందనము వహించి, సాటిలేని తూండ్లను చేతులందు, గెరటములను కంకణములను ధరించి, యింకను వివిధములైన విలాసములతో ప్రభువగు చంద్రుని రాకకై వాసకసజ్జికవలె నెదురుచూచు చున్నదని భావము. కల్పనము బహు సరసము, పరమ రమణీయము.

చంద్రోదయ మందలి నక్షత్రముల శోభను వేంకటనాథుఁ డతి సుకుమార భావసంపదతో మృదుమధుర పదబంధముతో నిట్లు వర్ణించినాడు.

కనలు సంధ్యార్చిఁ బేర్చిన నభః కరిమేన
బుటములెత్తిన నీరు బొబ్బలనఁగఁ
గాల మాంత్రికుఁ డంధకార దానవ బలి
క్రియకు రాల్చిన పేల గింజలనఁగఁ
దాండవ భ్రమిఖ మూర్ధజకుఁ డంజలి పుటం
బున విధిర్చిన కమ్మపూవు లనఁగ
మైరవ సింధు సంపర్క శర్కర దేవ
మును లొనర్చిన లింగమూర్తు లనఁగఁ
గమల గర్భాండ గోస్తనీ కాయమాన
జటిల పరిపక్వ ఫలగుళుచ్ఛము లనంగఁ
నఖిల జనలోచనోత్సవం బాచరించెఁ
దామరస వైరికులదార తారకములు.

పద్య 235.

నక్షత్రములు మండుచున్న సంధ్యాసమయ మనెడి యగ్నికి దపించు చున్న యాకాశమనెడు నేనుగు యొక్క శరీరముపై పొటమరించు

చున్న నీటిబొబ్బల వలెను, కాలమను మాంత్రికు డంధకారమను దానవునకు బలికిగ్రియగా వైచిన పేల గింజల వలెను, నర్తక శిఖామణి యగు పరమేశ్వరుడు దోసిట సమర్పించిన కమ్మని పూవుల వలెను, మహర్షు లారాధించిన శివలింగమూర్తులవలెను, బ్రహ్మాండమను ద్రాక్ష పందిటియందు వ్రేలాడుచున్న పరిపక్వములైన ఫలముల వలెను జన లోచనోత్సవము గల్గించు చున్నవని భావము. నక్షత్రములిందు బహు విధములుగ నుత్ప్రేక్షింపబడిన విధమత్యంత ప్రశంసార్హము. వైచ రాజు భావనాపటిమను విశదపఱుచు చున్నది.

సూర్యుడస్తమింపగా జంద్రు డుదయించు చున్నాడు. ఈ సందర్భమున ప్రాగ్దిశావధూటి గురుద్రోహియైన చంద్రుడు తన్ను సమీపింపగా బొందిన విన్నదనమో యనునట్లు వెన్నెల యంతటను వెదజల్లు చున్నదని వేంకటనాథుడు

స్నేహావిరక్తిం గాలగతిచేఁగని మిత్రుఁడు చామరిక్రియా
మోహితుఁడౌట గన్గొని ప్రమోద విధిందనుఁజేరె నీ గురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయని బూనిన శక్రదిగ్గగ
న్మోహిని మోము విన్నఁదనమోయనఁ బొండిమ దోఁచె నయ్యెడన్
పద్య 236.

అను పద్యమున నుత్ప్రేక్షించినాడు.

ఉదయచ్ఛంద్రాగమన క్రమమును వేంకటనాథుడిట్లు మనో హారముగ నభివర్ణించినాడు.

బలభిద్దిశావశా ప్రతిమ గామిని ముద్దు
గులుకుటీరిక నవ్వ తెలివి చెప్పి
యుదయ మస్తకీడ నూడికోటులు మోవఁ
గూలిన చౌదంతి కొమ్ముఁ బోలి
గగనవాహిని రొంపి గాడికొండొక దోఁచు
కమలాప్త రథరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణి కరఁబున నెత్తి
చూచు క్రొన్నెమలీక సురటి నొరసి

యంచుగను పట్టి మఱియించుకంత మెఱసి
సగము పర్యాయకమున సాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ
జదలఁ బూర్వకళాసీమ చందమామ

పద్య 237.

ఉదయించుచున్న చంద్రుడు ముందు లేశమాత్రముగ గనుపించి, క్రమక్రమముగ సగముగను, బూర్ణముగను భాసించుట లోకసహజము. అట్లుదయించు చున్న చంద్రుడు ప్రాచీ దిశాంగన మొలక నవ్వువలెను, దేవేంద్రుని యైరావతపు గొమ్మువలెను, సూర్యుని రథ చక్రమువలెను, క్రొత్తదైన నెమలియీకలు విసనకఱ్ఱవలె నున్నదని కవి భావించిన తీరు ఆతని ఊహా సమర్థతను నిరూపించు చున్నది. ఈ పద్యము వసుచరిత్ర యందలి చంద్రుని క్రమావిర్భావ నిరూపక మగు 'హరి దంభోరుహ లోచనల్...తూర్పునన్' (ఆశ్వా 4-పద్య 17) అను పద్యమును దలపించు చున్నది.

చంద్రమండలము రజతవర్ణముతో నున్న దేవతల కాహారమైన అన్నవత్తి, ఆకాశగంగలో దేలుచున్న దంతముతో జేయబడిన యొడ్డు నకు జేర్చుసాధనము, మబ్బును నేర్గునుదోలు సింహము, క్షీరసముద్రము నుండి పుట్టిన వెన్నముద్ద యని యద్భుత కల్పనలతో భావనాప్రౌఢి మతో, వక్రోక్తి మార్గమున బైచరాజు మిక్కిలి శ్లాఘనీయముగ నిట్లువర్ణించినాడు.

అది సుధాకర బింబమా కాదు మడికాసు
వన్నె వేలుపుటన్న వత్తిగాని
యది చంద్రమండలంబా గాదు చదలేటఁ
దేలు దంతపుటరిగోలు గాని
యది నిండు చలివెలుంగా గాదు మబ్బుకే
నుఁగుఁదోలు తెఱనోటి మెకముగాని

యది చకోరములవిందా గాదు దుగ్ధాబ్ధి
కడ జనించిన వెన్నకరడు గాని
యది నిశామిత్రిమా కాదు మది వియుక్త
యవఘరట్ట శిలావలయంబుగాని
యని జనులూహిచికీర్తింప నతిశయిల్లెఁ
బోడజాబిలి కలువపూఁబోఁడి కలిమి.

పద్య 238.

ఈ పద్యమందలి వక్రోక్తి మార్గము శ్రీనాథుని భీమఖండమందలి 'కాదు కాదుదయాద్రి కనకకూటంబిది' యను (ఆశ్వా 2—పద్య 42) పద్యమును దలపించుచున్నది.

వెన్నెల చకోరపక్షుల కాహారమనియు జంద్రికిరణములను జకోరపక్షులు భక్షించి బుభుక్షను దీర్చికొనుననియు నొకప్రసిద్ధమైన కవితా సంప్రదాయము. తదనుగుణముగ బెక్కండ్రు మహాకవులు చిత్ర విచిత్రములైన కల్పనలు గావించినారు. చేపుచున్న చంద్రికిరణములను గొన్ని గ్రుచ్చి గ్రుచ్చి తృప్తినొందక త్రాగుట, మఱికొన్ని యఱ్ఱులు చాచి ప్రాణవాయు సంచారమున కవకాశములేసంతిగా త్రాగినేల జూచుట, మున్నగు చకోరపక్షుల జ్యోత్స్నాభక్షణములను బహురమ్యముగ బైచరాజిట్లభివర్ణించినాడు.

చేఁపు పుట్టిన గభస్తికలు ముక్కులఁ గ్రిచ్చి
గ్రుచ్చి యూరటలేక గ్రోలుఁ గొన్ని
యఱ్ఱులానఁగఁద్రావి యసుమరుచ్చరణకుఁ
జోటుచాలక నేలఁ జూఁచు గొన్ని
కడుసిగ్గుదేరు తొల్పడుపు దోమటఁ జొక్కి
యానందముగఁ జిందులాడుఁ గొన్ని
నిగరంపు మోవి తేనియలతోన దొరల్చి
చెలుపలిచ్చిన సంతసించుఁ గొన్ని

యోలముల డాఁగి తలచూప నోడి తల్ల
డించునరికొట్టిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁ బట్టించి పేరెముల్వారుఁ గొన్ని
కైరవాప్తాతపములఁ జకోరకములు

పద్య 241

వర్ణనమతిమనోజ్ఞముగ నిర్వహింపబడినవి. ఇట్టి చకోరముల కౌముదీ భక్షణ చమత్కార వర్ణనలకు గురుస్థానీయుడు తిక్కన. నిర్వచనోత్తరరామాయణ షష్ఠాశ్వాసమున నాకవిబ్రహ్మగావించిన సుదీర్ఘ వర్ణనము బహుచమత్కార భరితము. అందు 'తివిచినవకంబు దీప్తులు ద్రెంచి' యను (పద్య 46) పద్య ముదాహరణీయము. ఈ భావములనే యనంతుఁడు భోజరాజీయమున 'నునులేఁత వెన్నెల కొనలు మెల్లన దుంచి' అను (ఆశ్వా 2–పద్య–197) పద్యమున మనోహరముగ గూర్చినాడు.

## 6. సూర్యోదయ వర్ణనము :

కర్మసాక్షి, దినకరుడు నగు సూర్యుని యుదయము సర్వజీవులకు చైతన్యప్రదము. ప్రకృతి సౌభాగ్య కారకుడైన సూర్యుని యుదయమును గావ్యరచయిత లెల్లరు మధురముగ నభివర్ణింతురు. చంపూకర్తలు గూడ సూర్యోదయ వైభవము నభివర్ణించినారు.

అసంప్రేక్ష్యకారిత్వ ప్రకరణమున దూబగుంట నారాయణకవి దారిద్ర్యోపహతుడైన వైశ్యకుమారుడు తన స్వప్నవృత్తాంతమును బురస్కరించుకొని జరుగబోవు శుభమున కనుకూలముగ గృహాలంకారణాదులను గావింపుమని దాదితో జెప్పుసందర్భమున సూర్యోదయ వైభవమును

పాకశాసన పురప్రాసాదశిఖరాగ్ర
గురుతర సౌవర్ణకుంభమనఁగ
బూర్వదిగంగనా స్ఫురిత ఫాలస్థలీ
దీపిత సిందూరతిలక మనఁగ

బహుళ వీచీ స్ఫురత్ ప్రాగ్దిగంభో రాశి
కూల ప్రవాళ నికుంజ మనఁగ
నమరాధిపతి సతి హస్తాబ్జ విన్యస్త
మోహన మాణిక్య ముకుర మనఁగ
నరుణ కిరణుండు పొడసూపె నఖిల జనక
రాబ్జములతోడఁ గుముదవనాలి మొగుడ
జారచోరుల చిత్తంబు జల్లనంగఁ
జక్రవాకంబు లానంద జలధిఁ దేల

పద్య 48.

అని వర్ణించినాడు. ఉదయించు సూర్యుఁడెఱ్ఱగా నుండుటచే సువర్ణ కుంభము వలెను, సిందూర తిలకము వలెను, ప్రవాళ నికుంజము వలెను, మాణిక్య ముకురము వలెను, ప్రకాశించు చున్నాడని భావింపబడెను. సమస్త ప్రజల చేతులతోపాటు కలువలును ముకుళించినవి. జార చోర చిత్తములు ఝల్లు మన్నవి. చక్రవాకము లానందించినవి. ఇందు నారాయణకవి భావనాపటిమ వెల్లడియగుచున్నది. భావములు సరళములు.

భానుకవియు దంతువాయుని కథలో దూతి యింటికేగు సందర్భమున సూర్యోదయ వైభవమును

ప్రాచీ దిశావధూ ఫాలదేశమ్మునఁ
బొలుపొందు చంద్రింపుఁ బొట్టనంగ
జంభాసు రారాతి సౌధోపరిస్థితిఁ
గొమరారు కాంచన కుంభమనఁగఁ
బ్రథమాచ లేంద్రమ్ము పైఁగనుపట్టి శో
భిల్లిన జేవుఱు గల్లనంగఁ
గోక వియోగాగ్నిఁ బోకార్చుటకు నెత్తు
సమయా భయశయాంబు జంబనంగఁ

జంద్రుఁడ పరాద్రిఁజేర భూజనులు నిద్ర
దేఱఁగలువలు ముకుళింప వారిజాత
వితతి వికసింపఁ జీకటి విరియఁగెంపు
మెరయ మార్తండ బింబమ్ము మింటఁబొడమె.

ఆశ్వా 1—పద్య 148.

అని యభివర్ణించినాడు. ఇందు ప్రథమ ద్వితీయ చరణములలో నారాయణకవి పద్యాను సరణము గలదు. పూర్వాద్రిపై ప్రకాశించు చున్న జేగురురాయి వలెను, చకోర పక్షులకు వియోగము గలుగ కుండుటకై ధరించిన యభయహస్త మందలి యంబుజము వలెను సూర్యుని వర్ణించుట మిక్కిలి మనోహరముగా నున్నది. సూర్యుడుద యించునపుడు చంద్రుడస్తాద్రి చేరెను. చీకటి యదృశ్య మయ్యెను. కెంపు మెఱసినది. సూర్యోదయ సమయ సన్నివేశములను భానుకవి యిందు బొందికగా బూస గుచ్చినట్లు రచించిన తీరు మనోహరముగా నున్నది.

బైచరాజు వేంకటనాథుడు గూడ మూడు స్థలములందు సూర్యోదయ రామణీయకమును ప్రౌఢముగ వర్ణించినాడు. మిత్రభేద తంత్రమున దంతువాయుని కథలో దూర్పుకొండపై సూర్యుడుద యించిన రీతిని

సింధు జామాతృ దక్షిణ చక్షురంగంబు
మందేహ గర్వ నిర్మథన కేళి
సకల వేద ద్రుమస్కంధంబు జలరుహ
ప్రభవ రాత్రించరోద్భవ మహంబు
సంజ్వరార్త రథాంగ సమ్మోద ప్రతిపాది
దారుణ తిమిర కాంతార వహ్ని
కమలినీవదన ప్రకాశపోషణ మూల
మాశ్రిత జనజీవ నౌషధంబు

కుముదసమ్మోద మథన నిస్తిమిత వేగ
మసిపత ద్వీర కృతసు రాయతన మార్గ
మలఘు నీ హార కరటిపాకల వరంబు
గ్రిహావతంసంబు పూర్వాద్రిఁ గాననయ్యె.

ఆశ్వా 1—పద్య 265.

అని వర్ణించుట సందర్భమున కౌచిత్యపుష్టిని జేకూర్చు చున్నది. సూర్యుడు విష్ణుని దక్షిణ నేత్రము, మందేహ వినాశకుడు, సకల వేద వృక్షమునకు బోదె, విరహాతప్తములగు చక్రవాకములకు సమ్మోద కరుడు, జీకటి యను కాంతారమున కగ్నియని పలువిధములుగ స్తుతింప బడినాడు. ఇందు సూర్యుని మహాత్మ్య ముగ్గడింప బడినది.

వేంకటనాథుడు తృతీయాశ్వాసమునను శశికపింజలుల కథ యందును సూర్యోదయమును

ఎక్కువఁబ్రాంత పక్కణ కుటీ శిఖరంబుల నెక్కిలార్చుచుం
గుక్కుటకోటి మ్రోసె నెసగూరు మిటారుల పుట్టినిల్లుగ
బ్బెక్కిన మబ్బు శైలగుహాలిఁగె దిశల్వెలుఁగొంచె నిక్కలం
జక్కవ జోళ్లుగేరె జలజాత హితుండుదయించెఁ దూర్పునన్.

పద్య 107.

సూర్యోదయ మందలి కుక్కుటముల మ్రోతలు, మబ్బుల పలాయన ములు దిక్కుల ప్రకాశములు, చక్రవాకముల యానందములు మధుర ముగా వర్ణింపబడినవి.

చతుర్థాశ్వాసమునను బైచరాజు 'బ్రాహ్మణుడు—రాజకన్య' యను కథలో సూర్యోదయ విశేషముల నతి విపులముగ బదునాలుగు పద్యములలో ( 304 — 317 ) వర్ణించినాడు. సూర్యోదయమందు జోరులు, చక్రవాకములు, సతీపతులు, కుక్కుటవ్రాతములు నను వాని కార్యకలాపములు

గొందు ల్వీడ్కొని పక్కణాంతర కుటీ కూటాధ్వ సంధుల్వరా
స్కందుల్చూడ నవక్రిచక్రిములు ముచ్చట్లాడ నిచ్చారతిన్
గ్రిందుల్మీదులుగా సతీపతులు గాఁగిళ్లాడ దీప్తద్విశ
ల్పొందుల్ గూడఁ ద్రిభంగిభంగి మెరసెం బుంస్త్రూక్షట వ్రాతముల్

పద్య 304.

అని సమాజసుందరముగ నుండునట్లు వర్ణింపబడినవి.

సూర్యోదయమున స్త్రీల కబరినుండి పూలురాలుట, శరీరము నుండి యంగలేపములు క్రిందపడుట, మున్నగునవి లోకసమాజములు. పైచరాజు రాత్రినొక స్త్రీయని యుత్ప్రేక్షించి యా లక్షణములను మధురముఁగ నిట్లు వర్ణించినాడు.

ధారాధరస్మయోదయ వియచ్చి కురబం
ధమునఁ దారాలతాంతములు రాలె
రోదసీ తను సమారోహాంధ కారమై
మద విలేపనరేఖ మసలిపోయెఁ
జక్రవాక స్తన స్థాత్ప్ర నీ హార ఘ
ర్మాంబువు ప్రత్యక్షమై యడంగె
మధుపకజ్జల భాసమాన కైరవ లోచ
నముల నిద్రాముద్రినలు వెట్టె
మలయనిలయ సుగంధ సంబంధ మంద
పవన నిశ్వాస వీచికల్బారు దీరె
సంప్రభూత కళారమ్య సౌమ్య సమ్య
గంగ సంగ శ్రీమాయామ యామవతికి.

పద్య 308.

రాత్రియను స్త్రీయొక్క మేఘమను చికురబంధము నుండి తారలను పూలు రాలినవి. రోదసి యను శరీరమున బూయబడిన యంధకార మను నంగలేపము క్రింద పడినది. చక్రవాక పక్షులను స్తనముల

నున్న మంచను స్వేదజలము హరించినది. తుమ్మెదలను కాటుకతో ప్రకాశించుచున్న కలువలను కన్నులందు నిద్ర యావహించినది. మలయపవనములను పరిమళముతో గూడిన మంద నిశ్వాసములు వరుసగా వచ్చుచున్నవి. రాత్రిని స్త్రీగా భావించుట సూర్యోదయమున ప్రకృతిలో గలుగు విశేషములను గూడ నందు జమత్కారవంతముగ గల్పించుట కవి కల్పనా సామర్థ్యమును వేనోళ్ల చాటుచున్నది.

కడచిన రాత్రియందు మన్మథ మల్లయుద్ధములందు విడిచిన వస్త్రాలంకరణాదులను స్త్రీలు సూర్యోదయ వేళయందు గ్రహింతురని

తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నిన చీరలు గాఁగిలింతలుం
బగఁగొని యడ్డగింపఁగఁ దెపుల్చిన హారములున్ భరంబునన్
దిగిచిన సొమ్ములు న్మదవతీ తిలకంబులచేత వేఁకువ
న్మగుడ సపర్యఁ గైకొనియె మాన్యులుగారె గుణప్రదీపకుల్

పద్య 309.

అని బైచరాజు వర్ణించి గుణప్రదీపకులు మాన్యులు గదాయని సమర్థించిన తీరు రమ్యముగా నున్నది. అర్థాంతర న్యాసాలంకారము కవి లోకజ్ఞతా సూచకము. భర్తలతో సుఖించియు దృప్తినొందని జవరాండ్ర దయనీయ స్థితిగతులను బైచరాజిట్లు వర్ణించినాడు.

కవిసి కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచిలోఁ
జివికెడువారు హస్తముల జీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరుల మోవులాని యరగన్నిడు వారును శయ్యలం బరా
భవ మొనరింపలేక వగ పొల్పెడు వారును నైరి జవ్వనుల్

పద్య 310.

ప్రాతఃకాలమునందు గోమరాండ్ర యలకలు, కుంకుమబొట్లు లోచనములు, కాటుకలు, అధరములు, ఆననములు, నేయేరీతుల నుండునో బైచరాజిట్లు విపులముగ వర్ణించినాడు.

శ్రమవార్ని మజ్జన జటిలాలకంబులు
సంఘూతకుంకుమ స్థాసకములు
జాగరారుణితలోచన సరోజంబులు
కాంతచుంబనముక్తకజ్జలములు
కర చపేట నిరస్తకరినకచిత్రింబు
లభినవ దిగలంకృతాధరములు
సృణినమత్కారికా భరణ భృద్గళంబుల
నూననిద్రా ముద్రితాననములు

గాఢపరిరంభ సంభ్రమ క్లామ్యదచల
గురుపయోధర భర హార కువలమణులు
కలితతాంబూల రసరక్త గల్లతలము
లమరఁ గోమరాంద్రుపొలిచి రహర్ముఖమున

పద్య 313.

కలువలకు జంద్రునకు సాహిత్యలోక ప్రసిద్ధమైన భార్యాభర్తృ సంబంధమును బైచరాజు సూర్యోదయవర్ణన సందర్భమున నిట్లు చమత్కరించినాడు.

గాసిలిరాజు మన్ననలు గాంచిన నేనొరుఁ జూడనంచుక
న్మూసిన భంగిఁగైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగ వనవహ్ని సముత్థిత ధూమరాజులో
నాసరసీజ గర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్.

పద్య 317.

రాజసన్మానములను బొందుచున్న నేను నితరుని జూడనని కలువకాంత పతివ్రతవలె సూర్య దర్శనమును నిరాకరించి కన్నుమూసిన విధముగ ముకుళించినది. పద్మినీ భాస్కరుల వియోగ వనవహ్ని నుండి పుట్టిన పొగగుంపులో యనునట్లు తుమ్మెదలు పద్మగర్భముల నుండి బైటపడి

నర్తించినవి. రెండును మనోజ్ఞములైన యుత్ప్రేక్షలు, రాజశబ్ద ప్రయోగమున శ్లేష. చంద్రుడు ప్రభువు ననునర్థద్వయము గ్రాహ్యము. చంపూ రచయితలు ముప్వురిలో బైచరాజు గావించిన సూర్యోదయ వర్ణనము పరమ ప్రబంధోచితముగ నిర్వహింప బడినదని చెప్పక తప్పదు.

## 7. ఉద్యాన విహార వర్ణనము :

పంచతంత్ర కథాభాగమున ఉద్యాన విహార వర్ణన కవకాశము లేకపోయినది. కావున నారాయణకవియు భానుకవియు చంప్వను వాదములలో నుద్యాన వర్ణనము గావింపలేదు. బైచరాజు వేంకట నాథుడు మాత్రము చతుర్థాశ్వాసమున 'బ్రాహ్మణుడు రాజపుత్త్రిని పీడిన కథ'లో రాజపుత్రికా వియోగ పరితాపోప శాంతికై నెచ్చెలు లామెను ఉద్యానవనమునకు దీసికొని వెడలినట్లు రచించి యా ఘట్ట మున ఆరామవైభవము నపూర్వ కల్పనాచాతుర్యముతో నభివర్ణించి నాడు. ఈ కథ అమూలకము, బైచరాజుచే స్వయముగా రచింపబడిన దగుటచే ఆ వర్ణనము బైచరాజు ప్రజ్ఞానైపుణ్యములను నిరూ పించుచున్నది. చెలులు రాజపుత్రికి ఆరామ లతా పుష్పాదులను జూపుచు సౌఖ్యమును గలిగింప గోరినట్లు

కలకంఠి కతిశయోత్కలికా విలాసంబు
  దార్పదే యా రామ ధామకేళి
లీల నేత్రత్రి యాళికి నమందానంద
  లహరిం బుట్టింప వేలతలు విరులు
వికసిల్లు నీ పద్మినికి సదామోదంబు
  జరుపదే కాసారసార విహృతి
శిఖి బర్హతులిత కైశికకు సంతాపంబుం
  దాపదే ఘనకదంబక కులంబు
సడలెను గదమ్మ లావు కాంచనకలాప
పరిచయము మానెనమ్మ చెప్పరపువంత

వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ
కొమ్మ మాప్రాణప్రాపుకెట్లోర్చుకొనఁగవచ్చు పద్య 112.

అను పద్యము వలన దెలియుచున్నది. ఇందలి పదప్రయోగము చమత్కారావహము. శ్లేషాలంకార ప్రయోగ మత్యంత మధురము. కలకంఠి యనుచో రాజపుత్రి, కోకిలయని యర్థద్వయము. ఉత్కళిక యనగా ఉల్లాసము, మొగ్గయని యర్థద్వయము. ప్రియాళి యనుట లోని ఆళి శబ్దమునకు చెలి, తుమ్మెద యనియు బద్మినికి నవగా బద్మినీ జాతి స్త్రీ యగు రాజపుత్రికకి బద్మలతకుననియు, ఘనకదంబకుల మనుచో గొప్పవియైన కడిమి చెట్ల సముదాయము, మేఘముల సముదాయము నని యర్థద్వయము. శ్లిష్ట ఘనపదములు సాభిప్రాయములు. బైచరాజు పదప్రయోగమును భావపుష్టిగా బోషించుట ప్రశంసనీయము.

రాజపుత్రికతో నెచ్చెలులు తుమ్మెదల సహజ జీవనమును నింద్యముగ వివరించిన విధమును బైచరాజిట్లు రచించినాడు.

కరటుల పొందునం గడుపుఁగాలము బల్లవసంగమంబునన్
దిరుగుఁ గుజాతిమైత్రి నెడ్ తెవ్వక శీధువుఁగ్రోలు మాలలం
దరసిననుండు బ్రోత తలుచాత్మ భవైక సుపర్వ ధర్మముం
గుఱుచయొనర్చు నెట్లు పొసఁగుం జెలిదీని ప్రియాళిగాఁ గొనన్
పద్య 114.

ఏనుగుల చెక్కిళ్ళయందు గాలము గడుపుట, చివుళ్ళ కలయికయందు దిరుగుట, చెట్లమైత్రిని విడువక పుష్పాసవమును గ్రోలుట మున్నగునవి తుమ్మెదల సహజధర్మములు. వానిని శ్లేష ప్రయోగ సామర్థ్యముచే బైచరాజిందు నింద్యముగ జిత్రించినాడు. నింద్య జీవనుల సంపర్కముతో గాలము గడుపుట, విటులలో గూడి యుండుట, నీచజాతి వారితో స్నేహము గావించి మధుపాన మొనరించుట మొదలైనవి నింద్యార్థకములు.

ఆ సందర్భముననే కోకిలలను దపస్వినులని కవి యిట్లు చమత్కరించినాడు.

కలగుణముల్ త్యజించి పలుగాకులవంటి వనంగ వచ్చునే
ఫలదళ పారణల్ వినయపాటవముల్ మఱి ప్రాప్తకాల భా
షల సుమహత్తరుల్ చెలిమి సల్పఁగ నున్కి దగుం ద్విగంగదీ
ప్తులు వెలిగాఁ దపస్వినులు వో కలకంఠులు మాకుఁ జూడఁగన్.
పద్య 115.

ఫలదళ పారణలనుచో ఫలములను జీల్చి తినుట యనునది కోకిల పరమైన యర్థము. ఫలములు, ఆకులు తినుటయని తపస్వినుల పరమైన యర్థము. అట్లే సుమహత్తరుల్ అనునప్పుడు పెద్దచెట్లని కోకిలపరమైన యర్థము. ఎక్కువ మహత్త్వము గలవారు అని తపస్వినుల పరమైన యర్థము. శ్లేషప్రయోగము సుకుమారము. భావప్రదర్శనము మిక్కిలి మనోజ్ఞము. రాజహంసలను జెలులు వర్ణించు నప్పుడును సన్న్యాసిపరమైన మఱియొక యర్థము శ్లేష చేసిద్ధించునట్లు రచింపబడినది.

సరసులలో సువర్ణ పరిషక్తములై కనుపట్టు కోశముల్
గరమనురక్తి చూచి మృదుల స్వరముట్టి పడన్ సుభాషితో
త్కరము విధాతకెక్కుడగు గౌరవమొప్పఁ బఠించుఁ జూచితే
హరిణ విలోచనా పరమహంస వతంసము లూర్జిత స్థితిన్
పద్య 116.

సరసులలో ననునప్పుడు, సువర్ణ, కోశ, సుభాషిత యను వానియందు మనోహరమైన యర్థ ద్వయము.

పున్నాగ వృక్షవర్ణన సందర్భమున నందలి మకరందము తుమ్మెదల సముదాయము మున్నగు విషయముల నాధారముగ గైచ రాజు గజకల్పనము గావించి

గమకంపుం బసనేలకై దిగిన శాఖల్ హస్త పాద్విభ్రమ
భ్రమఁ బుట్టింప లతాంతబిందు కులముల్ పైఁదేర నుద్యద్ద్రవ
త్సుమధూళీ మదధారలూర నళిపంక్తుల్ గప్ప నుద్యాన పా
నమహిం గానఁగనయ్యెఁ జూచితివె పున్నాగంబు బింబాధరా.
పద్య 118.

అని రచించుట యాతని కల్పనా పాటవ నిరూపకము. పున్నాగ శబ్ద మందలి నాగమునకు ఏనుగను నర్థము గూడ గలదు గాన గజకల్పనము సమర్థనీయము. చిలుకల ముఖారుణిమము కోపముయొక్క ఫలముగా

చదువుల మేలు లేదొ శుకసంతతి గాదొ వినీతరీతి చా
లదొ భజియించు నీ చతురులన్మతి మాటకు వచ్చు నిచ్చలుం
బదివదిగా నొనర్చు ఫలభంగము నెమ్మొగ మెట్టిజేయు న
ల్లదె పరికింపు చిల్క హృదయంబునఁ గోపముఁ జిక్కెఁదొయ్యలీ

పద్య 120.

అని చమత్కరింప బడినది.

ఈ సందర్భముననే నీటికాకి వర్తనమును వివరించుచు ఉదాహరణ కావ్యమును రచించుచున్న కవి స్థితిగతులుగా బైచరాజు

సరళగభీర శబ్ద ఘనసార సమృద్ధిఁ బ్రసిద్ధిగన్న యా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతితుల్ భజియింపఁబాద వి
స్ఫురణ ఘటింపుచుం గొడుసుపుట్టక యుజ్జ్వల ధారచే నుదా
హరణముఁ జేయుచున్న కవి నారసి చూడు మరాళ గామినీ

పద్య 121.

అని శ్లేషచే జమత్కరించుట పరిశీలనార్హము. సరసులగూడి యనగా గానార మందుండుట, చారుగతి యనగా జక్కని నడక, ఉదాహరణ మనగా పైనుండి గ్రహించుట మున్నగునవి కాకిపరమైన యర్థములు సత్పురుషుల సముదాయము సేవింప బద్యపాదములు చెడకుండ నుజ్జ్వలములైన ధారలతో నుదాహరణ కావ్యము రచించుట కవి పరమైన యర్థము.

వసంతకాలమందలి తిలకవృక్ష సౌభాగ్యమును అర్థాంతముగ వసంత తిలక పద్యమను అర్థము గలుగునట్లు బైచరాజు

నిరుపమ ఘనరస పుష్టి
స్ఫురణం బాదములు మెఱయ భూ భువనమునన్

సరి జెప్పఁగలదె యిందిం

దిర కుంతల యీ వసంత తిలకంబునకున్ పద్య 122.

అని రచించినాడు. మేఘజల వృష్టిచే క్రేళ్లు ప్రకాశింపగా వసంతకాల మందలి తిలకవృక్షము అనుపమముగా నున్నదని భావము. రసశబ్ద ముచే గావ్యరసము, పాదముచే బద్యపాదములు, వసంత తిలక పదముచే ఆవృత్తమునను నర్థద్వయము శ్లేషచే సిద్ధించినది. ఇక్కడ గందపద్య మునకు బదులు వసంత తిలక వృత్తమే రచింపబడి యుండినచో జమత్కార మినుమడించి యుండెడిది.

పలాశ వృక్ష సముదాయమును రాక్షస బృందమను నర్థాం తరము గలుగునట్లు పైచరాజిట్లభి వర్ణించినాడు.

విరికొఱవులఁ బథికపరం

పరఁజూడుం జూడు మిట్టి పరుషపలా శో

త్కరమునకు నెట్లు గలిగెం

ధరణీ సురదండవిధి సుధా మధురోష్ఠీ పద్య 123.

కొఱవులవంటి ఎఱ్ఱనిపూలతో బలాశ వృక్షసమూహము పాంథుల పరంపరను జూచునని భావము. పువ్వులనెడి కొఱవులతో బాంథ పరం పరను రాక్షస బృందము చూచునని యర్థాంతరము. పలాశ శబ్దము నకు మాంసాశనుడు అనగా రాక్షసుడని యర్థము. అట్టి పలాశ సమూహమునకు బ్రాహ్మణుల దండవిధి గలిగెననగా బ్రాహ్మణులు మోదుగుకఱ్ఱను బట్టుకొందురని యొక యర్థము. బ్రాహ్మణుల శిక్ష గలిగెనని రాక్షసపరమైన యర్థాంతరము.

వనమందలి క్రిందుగనున్న చెట్లనుద్దేశించి పైచరాజు పలువిధము లైన నాయికా నిరాకరణముల నందినను మఱలని రాజులవలె నుత్కళి కాప్తి నొందుచున్నవని.

వేవెడఁగేల డీలుపడఁ ద్రేసినఁ బైఁబడ వక్త్రశీధు ని

ష్ఠీవన మాచరించిన వడిం జరణంబునఁ దన్నినన్ రహిన్

బోవని పార్థివస్ఫురణఁబొందియు నుత్కళి కాప్తి నొందు హే
లావతి యిట్టి నీచతరులం బరికించితే యిమ్మహావనిన్
పద్య 125.

అని రచించినాడు. చేతితో దిగులుపడునట్లు త్రోయుట, నిష్ఠీవన మాచరించుట, చరణములతో దన్నుట నాయికాచేష్టలు. వానివలన నాయకున కుత్కంఠ గలుగును. ఉత్కళికా శబ్దమునకు నాయక పరముగ నుత్కంఠ యని యర్థము. వృక్షపరముగ మొగ్గ తొడుగుట యని యర్థము. నీచతరులనగా క్రిందుగా నున్న చెట్లని యొక యర్థము. మిక్కిలి నీచులని యర్థాంతరము. ఇందు వర్ణింపబడిన నాయికాచేష్టలు దోహదక్రియలకు సంబంధించినవి. కవి సమయము లందు గర్ణికార వృక్షమునకు నాయికాభాషణము, పొన్నకు నగవు, మావికి చేసంజ్ఞ మున్నగునవి దోహదక్రియలుగ ప్రసిద్ధి గలదు. వానినన్నింటిని బైచరాజీ సందర్భమున రాజపుత్రికి సమన్వయించి యిట్లు చమత్కరించినాడు.

నెలఁత నీ పలుకులో నిది కర్ణికారంబు
వనిత నీ నగ వెటింగినది పొన్న
మెలఁత నీ కనుసన్న నలరు బొట్టుగ ముద్దు
పొలఁతి నీచే సంజ్ఞఁ బొదలుమావి
ముగుద నీ సమ్ముఖమ్మున గ్రోలు సంపెంగ
రామ నీ హృదయ పారగము క్రోవి
పడఁతి నీపద మూసపడు సశోకము వినఁ
బ్రియపడు నీ పాట పేరింకణమ్ము
అతివయుష్మత్పద గ్రహాశ్రితము పొగడ
యువిద వావిలి యలరు నీ యుసురు కలిమి
బంధు మధ్యమ మివ్వనా భ్యంతరంబు
విద్రుమాధర కన్నిచ్చ విశ్రమింపు పద్య 126.

చంపక మల్లికా పున్నాగ కేతకుల సహజ స్వభావముల నుక్తి వైచిత్రిలతో యథాసంఖ్యాలంకార ప్రయోగ పూర్వకముగా భైచరాజిట్లు చమత్కరించినాడు.

ఘనసుమనః కులంబున నెట్లు పుట్టెనో
  యొరుల చేరువనున్న నుడుకుఁజూపు
బహుపత్రిభరణ సౌభాగ్య మెట్లందెనో
  యుగ్రగంధ స్ఫూర్తి నుల్లసిల్లు
నిరవధికామోద భరిత మెట్లయ్యెనో
  మహీపుణ్యతరుల కొమ్మలఁ బెనంగు
సతతాభివృద్ధి రాజసమెట్లు గల్గెనో
  కఠినకంటక మైత్రిఁగడపు బ్రొద్దు

ననుచు బెనుచూర పోలె జెల్లాట మెసఁగ
నసమ కుసుమాపచయ కౌతుకాప్తి నడరి
సంపెఁగల మల్లికా గుళుచ్ఛములఁ బొన్న
విరుల మఱిగేదఁగుల రెమ్మ వెలఁదులంత

పద్య 127.

ఇందును శ్లేష ప్రయోగింపబడినది. సుమనః కులమనగా బుష్ప కులమని యొక యర్థము. దేవతల కులమని యర్థాంతరము. ఇతరుల సమీపమున నున్నప్పుడు తాపమును జూపు సంపెగకు బుష్పకుల సంభత్వమెట్లు లభించెనని పుష్పపరమైన యర్థము. పరుల చేరువకు దాపము పొందుదానికి దేవకులమున బుట్టుక యెట్లు కలిగెనో యనుట యర్థాంతరము. దేవకులోద్భవులు రాగద్వేషాదుల కతీతులని భావించుట సహజము. ఇట్లే తక్కినవానియందు నర్థచమత్కృతి పోషింపబడినది. గీతపద్యమందలి సంపెగల, మల్లికా గుళుచ్ఛముల, బొన్న విరుల, గేదగుల యను వానికి సీసమందలి యొక్కొక్క పాదముతో యథాసంఖ్యముగ నన్వయము.

రాజపుత్రిక ఉద్యానవన విహార సందర్భమున జెలులు చివుళ్లు పండ్లు, పుష్పాడి, తేనియలు సమర్పించుచు మన్మథపూజ గావించిన విధమును బైచరాజు మనోజ్ఞముగ నిట్లు వర్ణించినాడు.

కోయిలనోరు సోకని చిగుళ్లు నికారపుఁ జిల్క భిన్నము
ల్నోయని పండ్లు కాలవడి లేవడి తెమ్మెర కూనరాశిగా
వేయని కమ్మపుప్పొడి ప్రవృద్ధ పిపాస మదాళి కుత్తుకం
బోయని తేనియల్గమిచి పూవిలుకాని భజింప నంగనల్

పద్య 128

కోయిల మూతిసోకని చివుళ్లను, జిలుక యెంగిలింపని ఫలములను, మందమారుత స్పర్శనందని పుప్పొడిని, కొదమతుమ్మెదలు పిపాసతో నాస్వాదింపని మధువును జెలులు మన్మథునికి సమర్పించిరనుట హృదయంగమముగా నున్నది. ఈ పద్యము నన్నిచోడుడు కుమారసంభవమున పార్వతి పరమేశ్వరుని బూజించినరీతిని వర్ణించిన ఘట్టములోని 'మొలపులించి వాసనసల్లఁబసిగొని' అను (ఆశ్వా 3-పద్య 108) పద్యమును దలపింప జేయుచున్నది.

ఇట్లు బైచరాజు వేంకటనాథుఁడు ఉద్యానవనవిహార వర్ణనా నిర్వహణమున స్వీయకల్పనలతో శబ్దశైలూషీనాట్య భంగిమలతో పాఠకులకుల్లాసము గల్గించినాడు. భావామృత వృష్టిచే సాహిత్యపిపాసువులను సంతృప్తిపఱచినాడు. ఎల్లయెడలనాతని కల్పనా ప్రౌఢిమ, అలంకార ప్రయోగదక్షత ప్రస్ఫుట మగుచున్నవి.

## 8 జలకేళి వర్ణనము :

నాయిక నెచ్చెలులతో గూడి యుద్యానవిహార మాచరించి జలక్రీడ గావించుట యొకసంప్రదాయము. తెనుగు ప్రబంధములలో ఈ వర్ణనము ప్రముఖపాత్ర వహించును.

సంస్కృతపు పంచతంత్రమున జలవిహారవర్ణనము మృగ్యము. చంపూకర్తలలో బైచరాజు మాత్రము అమూలకముగా చతుర్థా

శ్వాసమున రచించిన 'బ్రాహ్మణుడు రాజపుత్రిని పీడుట' యను కథలో రాజకన్య గావించిన జలక్రీడను మనోహరముగా వర్ణించినాడు. రాజపుత్రిక చెలులతో జలకేళికి వెడలు సంరంభమును బైచరాజు కవితాసంప్రదాయ సిద్ధమగు సుపకరణసంపదను వినియోగించి యిట్లు వర్ణించినాడు.

మోమోటనలరుతమ్ముల తావులగలింపఁ
గను సన్నలను ఝషకముల సలపఁ
జూడనాసవమైత్రిఁ జొక్కఁగ యళిరేప
నరగుత్తికగుసంకు సలటఁ బెట్టఁ
గైవసంబగు బిసాగ్రముల నుస్మాలింప
మాటకు లోనైన మధుపులోలుకఁ
జనుమాన మందిన జక్కవలనురేఁప
దండఁ బాయసి కుముదములఁ జెండఁ
జరణముల నాశ్రయించిన సన్మరాళ
నీడజముల పయోభూతి నేలఁ గలప
నెత్తుకొని రెంత నిర్దయులీ లతాంగు
లనఁగఁ గంకేళికాంక్షఁ గాలఁగ కరిగి

పద్య–130

మోమాటను బద్మసుగంధమును భేదించుట, కనుసన్నలతో మీనములను శాసించుట, చూపులతో దుమ్మెదలను స్వాధీనపఱుచుకొనుట మున్నగు విషయములలో ముఖమునకు బద్మము, కన్నులకు జేపలు, చూపులకు దుమ్మెదలు, కంఠమునకు శంఖము, చేతులకు దామర తూండ్లు, మాటకు మధువు, స్తనములకు జక్కవలు వరుసగా కవితా సంప్రదాయానుసారముగ ప్రయోగింపబడినవి.

రాజకన్య చెలులతో జలకేళిగావించిన సరోవరము
చేరువగాంచి రక్కలికి చేడియలవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకుల ఝంకృతి భాంకృతి సంగమంగళా

గారవము గుంజపుంజ బిసఖండన చండమరాళలోలవాః
పూరము దారికోరకిత పుండరిగ పూగ కుటీరతీరమున్.

పద్య 131

అని యభివర్ణింప బడినది. తుమ్మెదల ఝుంకారములు, రాజహంసల కదలికలతో గూడిన నీటిప్రవాహము ఇందు మనోజ్ఞముగా వర్ణితము. ఆకాసారము పట్టపురాణివలె నున్నదని కవి కంకణము, ఊర్మి యను పదములను శ్లేషాశ్రయముతో నిటు వర్ణించినాడు.

చుట్టు సహస్రాఖ్యసాలికల చొక్కపు బృందావులు సోడుముట్టఁజూ
పట్టు నిరిల్లు కంకణవిభల్ సదమనోత్సవ మాచరింపఁగా
మట్టపుటూర్ములన్నెఱయ పుంజు సరోరుహ రాగపూగముల్
పట్టపురాణి రీతిఁగనుపట్టు సరోవరముఁజూచి యుబ్బుచున్.

పద్య 134.

ఇంకను ఆకాసార వైభవమును బైచరాజు శ్లేష మూలకమైన యుపమా సంపదతో

'కదియంజని ప్రహృష్ట చక్రంబు గావున రాజహంసోప లాలితంబయి, సిద్ధసంతాన వేష్టితంబు గావున మత్స్యకూర్మ కుక్కుటాద్యాసన భాసమానంబయి, విడంబిత శంబరారంభంబు గావున నాకాంత పాఠీనాంకంబయి, కుముద ప్రకాశోదయంబు గావున నా విష్కృత పుష్కరంబయి, యలరుచుండుటకు'

వచ 142.

అని వర్ణించినాడు. ప్రహృష్టచక్రము, సిద్ధసంతాన వేష్టితము, శంబరారంభము, మున్నగు సమాసములన్నియు శ్లిష్టములు. ఈ వచనము బాణుని కాదంబరీ రచనమును, ఈ వర్ణ సముచ్ఛేద సరోవర వర్ణనమును దలపించుచున్నవి.

కాసార ప్రవేశావసరమున కాంతలు మన్మథుని మదేభముల వలె నున్నారని యిట్లు బైచరాజు చమత్కరించినాడు.

ఒసపరి నడకలు మృదు సా
రసవిసర విజేతలగు కరంబులు గంధో
ల్లసనము కొమ్ములు నమరఁగఁ
గుసుమాస్త్రుని మదపుటేనుఁగుల గతిఁ జెలువల్.

పద్య 143

విలాసగమనములు, పద్మముల నపహసించు కరములు, జలక్రీడా విహారోచితములగు కొమ్ములు స్త్రీల దంతిత్వస్థాపకములు. మన్మథమత్త గజౌపమ్య ప్రయోగమాధుర్యము సహృదయైకవేద్యము. ఈ ఔపమ్యము కవి కత్యంత ప్రియతమ మైనది.

జలక్రీడ గావించుచున్న స్త్రీల విలాసములను, పరస్పర సల్లాపములను బైచరాజు మిక్కిలి సరసముగ నభివర్ణించినాడు. ఒక పద్మముఖి లేజిగురు కొమ్ముతో నొకచెలిని జేతివలయములు ధ్వనించునట్లు కొట్టగా ఆ వ్రేటునకు గంచుకభేదన మొంది కనుపట్టు నామె స్తన యుగ్మమును కవి అండభేదన మొంది వెలువడిన చక్రవాక ద్వంద్వము వలె నున్నదని

పొగడంజొచ్చిన భంగి రత్నవలయంబుల్ మ్రోయఁజేయెత్తి కెం
జిగురుంగొమ్మున వైచెనొర్తు నొక రాజీవాస్య యవ్వ్రేటు నం
బగులం గంచుకముబ్బి చన్నుఁగవ చూపట్టెన్మఖా గ్రమ్ములం
దగనండంబులు వ్రచ్చి వెల్వడు నరిద్వంద్వంబు చందంబునన్

పద్య 145

అను పద్యమున జమత్కరించినాడు. స్తనములకు జక్రవాకౌపమ్యము సాహిత్యలోక ప్రసిద్ధము.

పట్టుదలతో బుఱ్ఱటకొమ్మును నీటితో నింపి ఒక చెలి యింకొక చెలిపై ప్రయోగింప ఆమె స్తనవల్కలము దిసిగిపోగా ఆమె యొర నుండి తీసిన మన్మథుని ఖడ్గమట్లున్నదని

పూని ఘటాళిఁ బ్రీతుల్ మొరయ బుట్టటకొమ్మున నీరునించి యా
రా నెఱజాణ నానొక నరాకటి యొండొక బోటిపైవ నె
మ్మొనదరంటఁ దాఁకి నెటిమించినఁ బయ్యెదవ్రియ్య నంతన
మ్మానిని యెమొప్పె పేరొటఁ దెమల్చిన పూవిలుకాని వాలనన్

పద్య 146

అని వర్ణింపబడెను. స్త్రీలను గుసుమాస్త్రుని ఖడ్గలతలుగా సరిపోల్చుట కవి సాంప్రదాయ సిద్ధము.

మన్మథుని తూపులను బోలిన చూపులను బ్రసరించుచు నొక చెలి విలాసముగ దోసిటబట్టి జలమును వేఱొకచెలి కన్నులలోనికి జల్లగా నామె తటాలున రెండుచేతులతో ముఖము గప్పుకొన్నది. అది రోహిణీ విరహార్తినున్న చంద్రుని జిగురాకులతో గప్పినట్లున్నదని

మదనశరి తూపుగూను పసమాపు నొయారపుఁజూపు నూరెలం
దియపులుగట్ట విభ్రమవతీమణి యొక్కతె యున్న గన్నులం
దొరల జలంబుఁజల్లెనది దోయిట వక్త్రముఁగప్పె రోహిణీ
చిరవిరహార్తి నొందిన శశిం జిగురాకులఁదార్చి చూడ్పనన్.

పద్య 147

అని కల్పింపబడినది. ముఖమును జంద్రునితో, చేతులను గిసలయములతో బోల్చుట కవి సమయ సిద్ధము.

జలక్రీడలాడుచున్న స్త్రీలు మన్మథుని యేనుగులో యను నట్లున్నారనియు ఆసరసిని జయించిరనియు బైచరాజిట్లు

గతియతివేల రాగకరిగా నెఱిగాంచిన వాలువాలముల్
ప్రతిరసింత్రాం ఘుమ్రిలం బెనఁగఁ బైపసముద్దులు గుల్క సమ్మద
స్థితి మితి మీఱఁ గొమ్ములను జేతులు పుష్కరలక్ష్మి దెల్పఁగా
హితసరసిం జయించి రలయింతులు కంతుని దంతులోయనన్.

పద్య 151

అని వర్ణించినాడు. ఇందలి మన్మథగజౌపమ్య మందలి సరసత్వము సహృదయైక వేద్యము.

విపులమగు ఈ జలకేళీవర్ణనమున వేంకటనాథుని ఊహాప్రౌఢిమ పరిస్ఫుటమగుచున్నది. ఇందలి ప్రతిపద్యమాతని కవితాపాటవ నిరూపకమే.

## 9 వివాహ వర్ణనము :

సంస్కృత పంచతంత్రమునను, దూబగుంట భానుకవుల యను వాదములందును వివాహవర్ణనము గనుపింపదు. బైచరాజు వేంకటనాథుడు మాత్రము చతుర్థాశ్వాసమున 'బ్రాహ్మణుడు-రాజపుత్రికను బేడిన కథ'లో భువన మోహినీ జయసేనుల వివాహవైభవమును మనోజ్ఞముగా వర్ణించినాడు. కథ యమూలక మగుటచే ఆ వివాహ వర్ణనమాతని స్వీయము.

వివాహోత్సవ సర్వస్వమునకు రంగస్థలమనదగు కల్యాణ మంటపము బ్రహ్మసభ, యజనవాటము, వసంత సమయము మున్నగు వానిని బోలియున్నదని

'అతి ముక్తాభిరామంబై బ్రహ్మసభను, బుణ్యద్రవ్య సమీచీనంబై యజన వాటంబును, బల్లవకుసుమ విలసితంబై వసంత సమయంబును, ప్రసిద్ధవర్ణ గౌరవంబై సంగీతంబును, నాట్యకార్యంబు నందనరి భరతంబును, బర్వ ధూర్వహంబై భారతంబును ...(వచ 354)

అని వర్ణింపబడినది. విశేషణములు శ్లిష్టములు. రచనము కాదంబరి కనుసరణము.

సుకీర్తి ప్రభువు అల్లుని విష్ణు స్వరూపునిగను, దన పుత్రికను లక్ష్మీదేవిగను భావించి కన్యాదానము గావించినట్లు బైచరాజు

దానవ శాత్రవుఁగా జయ
సేనుని నారాచకూఁతు సిరిగా మది న

మ్మానవపతి దలపోసి య
థానియతిని ధారఁబోసెఁ దనయన్ సనయన్

పద్య 356

అని యభివర్ణించినాడు.

రాజపుత్రుడు ముసుగుననున్న వధువు ముఖావిలాస సంపదను జూచుటకో యనునట్లు గెడ్డముపట్టి ముఖము పైకెత్తి మంగళసూత్రము గట్టినాడని బైచరాజిట్లు రచించినాడు.

అంతటఁ జిత్రిభాగ్యవని కాంతరితంబరి తశ్చర ధ్ధరా
కాంతపటావ కుంత వృతకామినిఁ గన్గొనరామి వక్త్రిసం
క్రాంత విలాసలక్ష్మిఁ గనుకై వడి గడ్డముపట్టియెత్తి ధీ
మంతుఁడు రాజనందనుఁడు మంగళసూత్రముఁగట్టె నింతికిన్

పద్య 362

వివాహ సమయమందలి తలంబ్రాల వేడుక వధూవరులకే గాక చూపఱులకు గూడ నెక్కువ యుల్లాసము గొల్పుచుండును. తెల్లని ముత్యములు వధూవరుల యెఱ్ఱని చేతులనుండి పోసికొనబడినవై జాతి కెంపులవలె ప్రకాశించు చున్నవని యిట్లు పేర్కొనబడెను.

అపుడు వధూకరోన్నమితరై తెలిముత్తెపుసేసఁ బ్రాిద్ధరా
ధిపసు తునౌదల న్మదవతీమణి నించె విభుండు నమ్మద
ద్విపని భయాన మౌళిఁ బోదివెందలఁ బ్రాలవి జాతికెంపుల
ట్ల పరిమిత ప్రియాప్రియ కరాంబుజ శోణిమ నొప్పె నెంతయున్

పద్య 363

వధూవరుల మధ్యనున్న పట్టువస్త్రపు తెర తొలగింపబడగా వారిరువురు సానురాగముగ జూచుకొనుచుండ నదియదనని విజృభించి మనోభవుడు ఆ యిరువురి మర్మస్థానములను సవ్యసాచియై బాణములచే భేదించెనని యిటు చమత్కరింప బడినది.

సరివెట్టె మండ్రాల పుట్టికల సందునఁబుట్టిన పట్టుపుట్టమును
దెరఁ దెరలింపఁజూచె సుదతిం బతి యమ్మోహమునఁజూచె నింతియు
య్యధరపుఁజూపులం గలిసి యేసెఁ బరస్పర మస్తకమ్ము
ల్యరముల నిల్పి నెన్నడుము సారసబాణుఁడు సవ్యసాచియై

పద్య 364

వివాహమునకు సంబంధించిన మధుపర్కము, మొనగసలు, కంకణములు కట్టించుట, మంగళసూత్రధారణము, బ్రహ్మముడులు వేయించుట, లాజహోమములు, సన్నికలు మెట్టించుట, మొదలగు నాచారములన్నియు బైచరాజుచే మనోహరముగా నభివర్ణింపబడినవి.

## 10 యుద్ధ వర్ణనము :

పశుపక్షుల యుద్ధమును వర్ణించు కవులు పొట్టేళ్ళ పోరాటములు, కోడిపుంజుల పెనగులాటలు, మల్లయుద్ధ సంగ్రామములు చూచుటకేగాక వినుటకుగూడ నానందము గల్గించును.

మిత్రభేద తంత్రమందలి 'దూతీజంబుకాషాఢభూతుల'ను కథలో మేషయుద్ధము గలదు. యథామూలముగ దూబగుంట నారాయణకవి మేషద్వంద్వము తలలు విదుసట్లు, రక్తము స్రవించునట్లు యుద్ధ మొనర్చిన విధమును

ఆచమనం బొనరింపఁగ
నా చేరువ మేషయుగళ మత్యుగ్రముగాఁ
ద్రోచియును మస్తకంబుల
దాచియుఁ దమలోనఁ బోరఁ దానవ్వేళన్
తగరు దోయితలలు దాఁకంగ దాఁకంగఁ
బగిలి రక్తమొలికి పడుచుగట్టి

పద్య 172–173

అని మనోహరముగ వర్ణించినాడు. భాసుకవికూడ మేషయుద్ధము

ఒండొకటిఁ బాసి తాఁకుచు
నుండఁదలల్వ్రగిలి రక్తము గ్రుబ్బుచు నుండన్
అండములు వెడల జవ్వనుమఁ
గొండల క్రియఁ బోల్చె మేష కుంజరకుల లీలన్

ఆశ్వా 1-పద్య 129

అని వర్ణించినాడు. వైచరాజు రౌద్రరససంభరితముగ నోజోగుణ భూయిష్ఠముగ 'కఠిన శృంగాగ్రసంఘటితలోహపలాశ......' (ఆశ్వా 1-పద్య 232) అని రచించినాడు.

సంస్కృత పంచతంత్రమున కాకోలూకముల యుద్ధము వర్ణింపబడలేదు. దూబగుంట నారాయణకవి, భానుకవి కాకోలూక యుద్ధమును మనోహరముగా వర్ణించినారు. ఉలూకపతియైన ఉపమర్దుఁడు తన ఘూకసేనను 'రణము వెసరణము వెడలుండొకఁడు నుండక...' అని యుత్సాహపఱిచి కాకములపై యుద్ధమున కుపక్రమించినాడని నారాయణకవి రచించినాడు. లయగ్రాహి వృత్త ప్రయోగము యుద్ధోత్సాహ నిరూపకము. ఘూకసేన రాజాజ్ఞను పాటించినతీరు నతఁడు

ఉఱికి కొన్నిఁటి కంఠముల్ నఱికివైచి
యేచి కొన్నిఁటి వక్షంబులూచివైచి
కదిసి కొన్నిఁటి పార్శ్వముల్ చదిపివైచి
గ్రుచ్చి కొన్నిఁటి కడుపులు వ్రచ్చివైచి

సంధివిగ్ర—పద్య 15

అని వర్ణించెను. ఘూకసంగ్రామమును 'అయ్యూలూకంబులు కాకంబులకు మహాపరిభవంబు పాదించి' అని సూచించినాఁడు.

భానుకవియు మేఘవర్ణుఁడు తన పరివారముతో బలిభుక్కులపై బడి చీల్చిచెండాడిన విధమును '...నిజాగ్రకేళిబునొండియున్న వాయస విసరంబులపై బడి చరణనఖముఖంబులన్ జంచుపుటంబుల భేదింపఁ దొడం

గిన, నందు పరిదేవనారుతమ్ముల గగనమ్మున కెగసియు, నన్యభూజమ్ము లన్ జేరియు, దిగ్భ్రమంబొందియుఁ, గృతాంతనిలయమ్ము డాసియు నిట్లనేక ప్రకారమ్ములఁ బలాయనత్వంబునందిన...' (ఆశ్వా 3-వ 7) అని వర్ణించినాడు. వర్ణనోత్సుకుడైన బైచరాజు ఈ సందర్భమున దూష్ణీభావమువహించుట విశేషము.

లబ్ధప్రణాశతంత్రాంధ్రీకరణమున బైచరాజు బహుమానతామ్ర ముఖులను గపినాయకుల యుభయసేనలు అహమహమికతో యుద్ధ మొనరించినవిధము నిట్లు వర్ణించినాడు.

లావుల్ పేర్కొనినొంతురుర్విఁ బిడికిళ్లం డెబ్బ్ల పాగ్వాచల
గ్రావంబుల్ పెకలించి ఱువ్వుదురు మగ్గన్మార్గ వృక్షాగశా
ఖావర్గంబుల నెత్తి మొత్తుదురు సుక్కుం జిక్కఁగంఠచ్ఛటల్
గావుల్ పట్టుదురొండొరుల్ మదమణంగం బ్రింగనవ్వానరుల్
చఱతురు పెడచేతుల నోఁ
గఱతురు తెఱనోళ్ల బిసిత ఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు
పఱె బోవని కలిమి బలిమిఁ బ్లవగాధ్యక్షుల్

అశ్వా 4-పద్య 12,13

సామూహిక కపియుద్ధము రామాయణమునందలి కపియుద్ధమును బోలి యున్నది. ఇట్లు వర్ణించియు దనివినొందక బైచరాజు ఆ కపియుద్ధము అహర్ముఖము, బౌద్ధకర్మము, యౌవన వివాహము, కుకవిత్వము నను వానిని బోలియున్నదని

'ఆ ప్లవంగ సంగరం బావిష్కృతారుణంబు నవ్యక్త తారకంబు నగుచు నహర్ముఖంబును, లుంఠితా గమనంబు లుంచిత శ్మశ్రుశిరోజంబునగుచు బౌద్ధకర్మంబును, నదృష్టశాస్త్రంబున నక్షత పరికరంబు నగుచుయౌవన వివాహంబును, బరిభ్రంశిత చరణంబుం బ్రణష్ట వళీవిలాసం బునగుచుఁ గుకవిత్వంబు ననుకరించె' (అశ్వా 4-వ 15)

అని వర్ణించినాడు. ఇందలి విశేషణములు శ్లిష్టములు. ప్లవంగ సంగ రార్థమున అరుణ శబ్దమునకు ఎఱుపనియు, తారక శబ్దమునకు గంటి గ్రుడ్డనియు నర్థములు. దివసారంభార్థమున ఆ రెండింటికి అనూర, నక్షత్రములని యర్థములు. ఇట్లే తక్కిన వానియందు నర్థద్వయము ప్రతిపాదితము.

బహుమానుఁడు తామ్రముఖసేన నెదుర్కొనగా నతడు బహుమాను నెదరించుట, వారి వీరాలాపములు బైచరాజుచే నిట్లు వర్ణింపబడెను.

> అప్పుడూర్ధ్వ శిఖుండైన యనిల సఖుడు
> పోలె మత్తామ్రముఖుఁడు చూపులనతి స్ఫు
> లింగ సంఘాతముదయింప నింగి నింగి
> దాఁకు చందాన బహుమానుఁ దారసించి
>
> తఱిమివధింప శత్రునకుఁ దానసమీక సమీకరంతనై
> యఱిముఱిఁ బల్కెనోరి జరఠా పెఱతావునకేగు నా బలం
> బెఱిఁగియుఁ జావనేల యిపుడీవన నబ్బహుమానుఁడోరి ద
> బ్బఱలకు రాకు తాఁకు వెడపల్కులకోర్చిన వాఁడఁగాఁ జుమీ
>
> ఆశ్వా 4 - పద్య 17, 18

కపినాయకుల యుద్ధమును బైచరాజు మహావీరోచితముగ నిర్వహించుట ప్రశంసార్హము.

## 11. నాయకాభ్యుదయ వర్ణనము :

పంచతంత్రము ఒకేనాయకు నాశ్రయించి రచింపబడినదిగాదు గావున నాయకాభ్యుదయ వర్ణనమునకు అవకాశము మృగ్యము. అనువాదకులు కథాగమనమునకు ప్రధానకారకుడనదగు సుదర్శన ప్రభ్వాన్నత్యమును అభ్యుదయమును మనోజ్ఞముగ నభివర్ణించినారు. మూలమైన హితోపదేశమున ఆ ప్రభ్వభ్యుదయ వర్ణనము గనుపింపదు. ఆ వర్ణన యనువాదకుల సామర్థ్య నిరూపకము. సుదర్శన ప్రభువైభవ

మును ఔదార్యవిక్రమాది గుణసంపత్తిని సూరబయంట నారాయణకవి యిటు వర్ణించినాడు.

ఆపుర మేలుచుండు నమరాధిపతి ప్రతిమానవైభవో
ద్దీపితుఁడార్య సన్నుతుఁడు ధీయుతుఁ డాఢ్యుఁడు బాహువిక్రమా
టోప విజృంభితుండసఁగడున్ బొగడొంది సుదర్శనుండు నా
భూపకులావతంసుఁడు ప్రభుత్వముఁ బేరును బెంపునొప్పఁగన్

మి భే—పద్య 49

భానుకవి సమస్తభూమండలమున సుదర్శనుని దృష్టి వ్యాపించుచుండె ననియు నాతని రూపము స్త్రీలకు మన్మథభ్రాంతి గలిగించుచుండు ననియు నాతడు మూడులోకములందు వ్యాపించిన కీర్తిగలవాడనియు శత్రుసంహారకుడనియు నిట్లు కీర్తించినాడు.

తనదృష్టి యష్టదిగ్గజమహీమండల
పద్మాంతరస్థమై పరగుచుండఁ
దనరూపమంగనా జనమానసములకుఁ
బంచశిలీముఖ భ్రాంతిఁజేయ

... ... ... ఆశ్వా 1—పద్య 47

సుదర్శన ప్రభు వర్ణనమున బైచరాజు ప్రదర్శించిన వైదగ్ధ్య మనుపమము. ఆ రాజు రూపసంపద, దానమహిమ, శౌర్యవైభవము, నీతి విధానము, మున్నగువానిని బైచరాజిట్లు వర్ణించినాడు.

తనరూప మనురూప ధరఘూతి గురుసూతి
మధుపూత పద్మజాత మూర్తిగాఁగఁ
దనదాన మినసూను ఘనగారి మనవారి
ధర వాహ పదదేహ తాపి గాఁగఁ

... ... ... ఆశ్వా 1-పద్య 69

పద్యగమనము శ్రీనాథుని పద్ధతి ననుసరించు చున్నది. నాలుగు సముద్రముల తరంగములు సుదర్శనుని కీర్తి నర్తకికి రంగములుగా

నున్నవనియు, నాతని తేజస్సను నగ్నిహోత్రునకు శత్రురాజ్యము లాజ్యము లైనవనియు, నాతని ఖడ్గమను వజ్రాయుధమునకు శత్రుకుల ములు గోత్రపర్వతము లైనవనియు నాతని రూపమను కలహంసకు స్త్రీల మానసములు మానససరోవరము లైనవనియు బైచరాజిట్లు వర్ణించినాడు.

తన యశశ్శోనటికి గోత్రావల చ్చతురబ్ధి
ఘనతరంగములు రంగములు గాఁగఁ
దన మహాస్సప్త జిహ్వునకుఁ బ్రాజ్యారి రా
జ్యములు నిస్తులత రాజ్యములు గాఁగ
... ... ... పద్య 71

వర్ణనము ప్రబంధోచితము. రూపకాలంకార ప్రయోగమతిమధు రము. రంగములు, రాజ్యములు మున్నగు పదములు అర్థవిశేషము లతో నావృత్తము లైనవి. భూమి దిగ్గజములను ఆదిశేషువును ఆది వరాహమును రాజులను వీడి విష్ణుసన్నిభుడైన సుదర్శనుని పొందు నాశించినదని బైచరాజు

అతిశీధుమద వికారత మేనులెఱుఁగని
కరటుల సఖ్యమగ్రాహ్య మనియుఁ
గుత్తుక విసము వాకునఁ దీపుఁగల పాప
జాతితో నెయ్యంబు జరుగదనియు
... ... ... పద్య 73

అను పద్యమున జమత్కరించినాడు. సుదర్శనుని సర్వభూభరణ సామ ర్థ్యము ఇందు మనోహరముగా వర్ణింపబడినది. ఎల్లప్పుడును దిగ్గజములు శీధుమదవికారముచే నొడలెఱుంగక యుండును. కావున భూకాంత వాని సంపర్కము నిరాకరించినది. సుదర్శను నాశ్రయించినది. అతని కట్టి మదవికారము లేదని భావము. కంఠమున విషము మాటల తీపి గలది పాపజాతి. కావున ధరాణికాంత ఆ జాతిని వీడి సుదర్శనుని

బొందినది. సుదర్శనుడు దోషరహితుడని కవి వ్యంగ్యముగ దెలుపుట గమనార్హము. నాయకాభ్యుదయ వర్ణనమున బైచరాజు వేంకట నాథుని ప్రౌఢిమ వెల్లివిరియు చున్నది.

అష్టాదశ వర్ణనలలో జేరకపోయినను ప్రాతఃకాల వర్ణనము, సూర్యాస్తమయ వర్ణనము, ముని వర్ణనము, వేట వర్ణనము మున్నగు మఱికొన్ని వర్ణనములుగూడ సాహిత్యలోక ప్రసిద్ధములు. ఆంధ్ర పంచతంత్ర చంపువులలో నవిగూడ మిక్కిలి హృదయంగమముగా నిర్వహింప బడినవి.

## 12. ప్రాతఃకాల వర్ణనము :

సూర్యోదయమున కారంభమున నుండుటచే నాలంకారికులు దీనిని సూర్యోదయాంతర్గతముగా భావించి యుందురు. భానుకవి ప్రథమాశ్వాసమున దుష్టబుద్ధి సుబుద్ధుల కథలో ప్రభాత సమయ సౌందర్యమును

కలువలఁబాసి తుమ్మెదలు కంజగృహమ్ముల డాయఁ గుక్కుటం
బులు రొదసేయ జక్కవల పొందులు మించఁగ నీడజంబు చె
య్యుల విహరింపఁ జీకటి సమూహమణంగ జగజ్జనం బిలా
తలి నలరంగఁదారకల దర్పము దప్పఁ బ్రభాత మొప్పినన్

పద్య 308

అని వర్ణించినాడు. తుమ్మెదలు కలువలను విడిచి పద్మముల నాశ్ర యించుట, కుక్కుటములు ప్రజలను మేల్కొల్పుట, చక్రవాకములు సుఖించుట మున్నగు ప్రభాత కాలమందలి ప్రకృతిలోని విశేషము లన్నియు సహజసుందరముగ నిందు బేర్కొన బడినవి. బైచరాజు వేంకటనాథుడు చతుర్థాశ్వాసమున 'హాలికకాంత రాజబాధ నొందుట' యను కథలో ప్రభాత సమయ సన్నివేశమును సుందరముగ '...దిక్కులు ప్రకాశప్రతతిం బొందె బిచ్చుకలు పిచపిచ మనియె, గాకంబులు గూశ లిడియె, దధిమథన ఘుమఘుమ ధ్వానంబులు నెరసె, గోవత్స కోలా

హాలంబులు వినవయ్యె' (వచ 504) అని వర్ణించినాడు. ఈ ప్రాతఃకాల వర్ణన లమూలకములు.

## 13. సూర్యాస్తమయ వర్ణనము :

ఇది చంద్రోదయమునకు బూర్వస్థితి యగుటచే నాలంకారికులు అష్టాదశ వర్ణనలలో దీనిని జేర్కొనక విడిచియుందురు.

కాకోలూకీయ తంత్రానువాదమున బైచరాజు మేఘవర్ణుడు శత్రువధోద్యుక్తుడై చిరంజీవిని వీడి వెడలిన యనంతరము సూర్యాస్తమయ సన్నివేశము నిట్లు చిత్రించినాడు.

అరుణగభస్తి బింబమపరాద్రిఁదిరోహితమయ్యెఁ బన్నగా
భరణిశిరోధి హాలహాలభంగి నిఱుల్నెరసెన్ విరోధి భీ
కరగతి వంతగూఁబ పరిగాఢ మహీధర భూజదుర్గకో
టరములు నిర్గమించె వికటప్రకటాననముల్ ముడించుచున్

ఆశ్వా 3–పద్య 153

పరమేశ్వరుని కంఠమందున్న హాలహాలమువలె జీకట్లు అంతట వ్యాపించు చున్నవను కల్పనము మనోజ్ఞము. మూలమున 'అస్తమయవేళాయామ్' అని మాత్రమే గలదు. ఈ తంత్రముననే 'వృద్ధవణుజుడు–చోరుడు' అను కథలో రజస్వలయైన సరోజకాంతను బట్టపగలు సంగమించుటచే బొందిన పాపమును బరిహరించుకొనుటకు భృగుపాతంబొనర్చు చున్నాడే మోయనునట్లు సూర్యుడస్తాద్రి చేరినాడని బైచరాజు 'రజస్వలాంభోజిని దివాసంగమక్రీడా సంప్రాప్త దురితప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చిన విధంబునఁ దపనుండపరగిరిఁ దిరోహితుండయ్యె' (ఆశ్వా 3, వచ 187) అని వర్ణించినాడు. సూర్యునకు బద్మమునకుగల సాహిత్యలోక సిద్ధమైన దాంపత్య సంబంధమును బైచరాజు చమత్కరించుట ప్రశంసార్హము. ఈ వర్ణన మాతని సంభావనా సామర్థ్య నిరూపకము. వ్యాపించుచున్న కటికచీకటి వేశ్యలకు జోరులకు వైశ్యులకు నెట్లు రక్షణ మొసంగునో బైచరాజు

పిసవెట్టి ఉంకు గుబ్బెతల తప్పులు దప్ప
దాల్చుట కిది కన్నతల్లి యిల్లు
కడుపు కక్కుఱితి పిల్పుడుగను ముదిలంజె
నజడుల కిది పిన్నవయసుమందు

... ... ... పద్య 188

అను పద్యమున రమ్యముగ వర్ణించినాడు. ఈ వర్ణనమంతయు నమూాలకము.

'బ్రాహ్మణుడు రాజకన్యా నిరాకరణము' అను కథలోఁగూడ బైచరాజు సూర్యాస్తమయ వైభవమును మనోహరముగ నభివర్ణించినాడు. సూర్యాస్తమయ సందర్భమందలి ముదిరిన యెఱ్ఱని కాంతులను గుసుంభారుణ వస్త్రములుగను, కుంకుమ రసములుగను, జెంగల్వ పాన్పులుగను, మావిచిగుళ్లుగను బశ్చిమ దిక్కాంతాంతః పుర కాంతలు భావించిరను నపూర్వకల్పనతో బైచరాజు

ఇవి చెందిరిక చీరలవుఁగదా తిరిచి కు
చ్చెలఁబోసి కటులఁగీల్గొలుప వచ్చు
నివి కుంకుమ రసంబులవుఁగదా గబ్బి గు
బ్బల జొకటంబుగా నలఁద వచ్చు

... ... ... అశ్వా 4–పద్య 224

అను పద్యమును రచించెను. పద్మిని హృద్గతమైయుండ వారుణీకాంతా సమాగమలాభ ప్రాప్తికి శరీరత్యాగ మొనరించుటకై భృగుపాతము గావించుట కేతెంచెనో యనునట్లు సూర్యుడు పశ్చిమగిరి నలంకరించెనని బైచరాజు

తన చిత్తంబునఁ బద్మినిం బవలుపొందన్ వారుణీకేళికిం
జనఁబైకొన్న ప్రదోష.పీడకు వహించన్నేర్చె నింకెట్లు గాఁ
దనునో మంగలవాఁడనంచు భృగుపాతప్రీతి నేతెంచెనో
యన సేవించె సరోజబాంధవుఁడు పశ్చిమగ్మాభృత్కూటమున్

పద్య 225

అని వర్ణించుట చమత్కారావహము. సంధ్యాకాల మందలి యెఱ్ఱని కాంతులను జిలుకలారబండిన బింబఫలములనియు, సింహము లంతటను వ్యాపించిన రక్తమనియు, మదపుటేనుగులు సల్లకీలతల చివుళ్ళనియు, వృద్ధశార్దూలములు మాంసపు ముద్దలనియు, బాటలాధరలు గైరిక ద్రవమనియు భ్రాంతినొంది తదనుకూలముగ ప్రవర్తించిన విధమును బైచరాజు

పరిపక్వ బింబ విభ్రాంతి దవ్వుల రాజ
కీరడింభములు గ్రుక్కిళ్లు మ్రింగ
గ్రత్యగ్ర శోణిత భ్రమ నుపస్థితములై
పంచాననంబులు బయలునాక
... ... ... పద్య 228

అని మధురకల్పనతో రచించుట యాతని యనుపమ ప్రతిభా సంపత్తిని వెల్లడించు చున్నది. సూర్యాస్తమయమందలి విశేషములను మనోజ్ఞములగు కల్పనలతో నభివర్ణించి బైచరాజు తన ప్రౌఢరచనా వైదగ్ధ్యమును నిరూపించుకొని నాడు.

## 14. మృగయా వర్ణనము :

కొందఱాలంకారికులు దీని నంగీకరించి నారు. బాహుపరాక్రమాభివృద్ధికి వేట దోహదకారి కాగలదు. బోయల యుత్సాహపూరితములైన వాక్కులు, వేటకుక్కల పౌరుషములు, ప్రభుపరాక్రమములు మృగయావర్ణనమున మనోహరముగ జిత్రింపబడుచుండును.

బైచరాజు వేంకటనాథుడు ద్వితీయాశ్వాసమున హిరణ్యకునితో జరాంగుడు స్వీయ పూర్వోదంతమును వివరించు ఘట్టమున వేటను వర్ణించినాడు. అడవిబోయలు పచ్చాకులు, రాతిపువ్వులు, పందికోరలు, గజదంతములు మున్నగువానిని ప్రభువగు పుష్కరునకు గానికలుగా నిచ్చి సింహమును, శరభమును, వనగజమును, గండభేరుండమును నెదుర్కొందుమని యుత్సాహము ప్రదర్శించిరి. ఆ యుత్సాహము

కొసవెంట్రుకలఁ బట్టి కూపెట్ట సింగంబుఁ
బట్టి తేకున్న నీ బంటఁ గాను
... ... ... పద్య 194

అను పద్యమున వివరింపబడినది. ఆ వేటకుక్క యమునివాహనమైన లులాయస్వామినైన నెదరింప గలదనియు, జలాధిపతియైన వరుణుని వాహనమైన మొసలిని గూడ గూల్చివేయుననియు, వర్ణించి యా కుక్కలకు గల పులిగాఁడు, చిలుకుటమ్ము మున్నగు నామములను గూడ బేర్కొనుచు

అడగించుఁబో యిమ్మహా సారమేయంబు
జముఁడెక్కు కాసార స్వామినైనఁ
గూల్చుఁబోయమ్మహాకుర్కురం బబ్ధిశు
ముద్దులాయము కాఱుమొసలినైన
... ... ... పద్య 196

అను పద్యము రచించినాడు. ఇందు గుక్కకుగల కాసారము, కుర్కురము మున్నగు పర్యాయపదములను వరుసగా బునరుక్తి గాకుండునట్లు ప్రయోగించుట కవియొక్క శబ్దానుశాసనత్వమును నిరూపించును. నల్లని వేషములతో గిరాతులు ముందునడువగా అశ్వారూఢుడై పుష్కరప్రభువు వేటకేగుట

ఏలలఁబాడుచుఁదగ విలు
గోలలఁగొని నల్లప్రజలు గుములై నడవ
న్నీలాంబరుఁడై విభుఁడు
ద్వేలాశు కళావిరాజి తేజీనెక్కెన్

పద్య 198

అని వర్ణింపబడినది. ప్రభుబాణము లగ్ని నుండి యుద్భవించిన పొగవలె నల్లగానున్నవనియు, బహుతీక్ష్ణములైన కంకపత్రములచే ప్రకాశించుచున్నవనియు, నధిజ్యమైన ధనువునారినుండి ప్రతిధ్వనించుచున్నవనియు బెద్దపులులను సంహరించుట కతిసమర్థములుగా నున్నవనియు ఖైచరాజ

శిఖిఘూమ శ్యామలములు
ప్రకరగరుద్వి సరభాసురములుద్య జ్జ్యా
ముఖరితములు రాజశిలీ
ముఖములు బహుపుండరీక ముఖముల వ్రాలెన్

పద్య 203

అని వర్ణించినాడు. బాణములకు శిలీముఖములనియు, బెద్దపులులకు పుండరీకములనియు, పైచరాజు ప్రయోగించుటలో సుమనోహరమైన శ్లేష ప్రయుక్తము. శిలీముఖ పుండరీకములకు బాణము. పద్మమునని యర్థాంతరములు. తుమ్మెదలు పద్మమున వ్రాలెనను రమ్యమైన మఱి యొక యర్థము నిక్షేపింపబడినది. వాని విశేషణములును శ్లిష్టములే. శిఖిఘూమమువలె నల్లనైనవి, తీక్ష్ణములైన రెక్కలచే ప్రకాశించునవి, వింటినారివలె ధ్వనించునవి, అనునవి తుమ్మెదపరమైన యర్థములు. శ్రవణమాత్రముననే రుచిరార్థద్వయము స్ఫురించునట్లు రచించిన వేంకటనాథుని ప్రతిభ ప్రశస్యము.

ఈ సందర్భమున వేటకు యజనవాటము, ప్రబంధము, పయో నిధానము, కృతయుగము, విభాండకాశ్రమము మున్నగువానిని బోలి కలుగా జెప్పి విశేషణముల నుభయార్థకములుగా ప్రయోగించి పైచరాజు దీర్ఘమైన వచనమును

'అయ్యాఖేటంబు శాసితపశు ప్రకరంబుగావున యజనవాటంబును, ధ్వని ప్రధానంబు గావున సుప్రబంధంబును, భంగదుర్నిరీక్ష్యంబు గావునం బయోనిధానంబును, నఖండ ధర్మసంపన్నంబు గావున గృత యుగం బును......' ( 208 )

అని రచించెను. శాసిత పశుప్రకరమనునప్పుడు వేటపరముగ శిక్షింప బడిన పశు సముదాయము గలది యని యర్థము. వేయబడిన బలిపశు సముదాయము గలది యని యజనవాటిక పరమైన యర్థము. అట్లే ధ్వని ప్రధానమనుచో, బశువులయు బోయలయు నఱపులు ప్రధాన ముగా గలదియని వేటపరముగను, వ్యంగ్యార్థ ప్రధానమైనదని ప్రబంధ

పరముగను అర్థద్వయము. ఇట్లే తక్కినవాని యందును రెండేసి యర్థములు గలవు. ఈ వచనము బాణుని కాదంబరీ రచనాను సరణముగ నిర్వహింప బడినది.

## 15. ఆశ్రమ వర్ణనము :

అలంకార శేఖరు డాశ్రమవర్ణనమును చేర్కొనినాడు. పంచతంత్ర కాకోలూకీయ మందలి 'ముని–మూషికాంగన' యను కథలో

'...గంగాయాస్తటే జపనియమ తపః స్వాధ్యాయోపవాస యోగక్రియాఽనుష్ఠాన పరాయణైః పరిపూత పరిమిత జలజిఘృక్షుభిః కందమూల ఫలశైవలాభ్యవహార కదర్థిత శరీరైర్వల్కల కృతకౌపీన మాత్ర ప్రచ్ఛాదనైః తపస్విభి రాకీర్ణ మాశ్రమ పదమ్'

అని యాశ్రమవర్ణనము గావింపబడినది. చంపూకర్తలు ముప్వురును దీనిని విడచుటకు హేతువు మృగ్యము. బహ్వాసక్తితో వర్ణనలను నిర్వహించిన బైచరాజు గూడ నుపేక్షించుట యాశ్చర్యకరముగా నున్నది.

## 16. ముని వర్ణనము :

విశ్వనాథ కవిరాజు మునివర్ణనమును చేర్కొనినాడు. పంచతంత్రమున నపరీక్షిత కారిత్వతంత్రమున 'కోమటి–క్షపణకుడు' అను కథలో బౌద్ధ సన్యాసి ప్రత్యక్షమైనాడని 'క్షపణ కరూపీ దర్శనం గత్వా' అని చెప్పబడెను. అందా క్షపణక రూపవర్ణనము గనుపింపదు. చంపూకర్తలు ఆ సిద్ధపురుష రూపవైభవమును గన్నులకు గట్టినట్లుగా నభివర్ణించినారు. గజాజినము ధరించి చంద్రరేఖను జటాజూటమున నలంకరించుకొని కరుణారస పరిపూర్ణుడై మంచిగంధము, మంచు యొక్క కాంతితో సమానమైన తెల్లని దేహకాంతితో గూడిన సిద్ధుని రూపమును దూబగుంట నారాయణకవి

బద్ధగజాజినాంబరము బాలశశాంక కలావతంస స
న్నద్ధ జటాభరంబు కరుణారసపూర్ణమునైన మూర్తితో

శుద్ధ పటీరహీరరుచి శోభితవర్ణమునైన మూర్తితో
సిద్ధవరేణ్యుఁ డొక్కరుఁడు చెచ్చెరనాతనిఁజేరి యిట్లనెన్

అసం. కారి—పద్య 40

బైచరాజుగూడ గెంజడలు, విభూతిగలిగిన ఆ సిద్ధుని తెల్లని దేహమును ఇతర విశేషములను నిసర్గసుందరముగ నుండునట్లెట్లు వర్ణించినాడు.

చేరి తృతీయ యామమున సెట్టిగలంగి సదుల్లసన్మరు
ద్భూరుహ భంగిఁగెంజడలు భూతి వళక్షితమైన మేన నిం
డారఁగఁగావికావు మసినంటిన మోము, సలక్ష్మ శుభ్రరో
చీరుచి సేవగింప నొక సిద్ధుడు వచ్చి సదాదరాయతిన్.

అశ్వా 5 – పద్య 48

బైచరాజు చతుర్థాశ్వాసమున 'బ్రాహ్మణుడు – రాజపుత్రిని పీడుట' అను కథలోఁగూడ సిద్ధుని రూపమును

"చిఱుత కెంజడలఁ గీల్చిన జాతిపటికంబు
గళమున రుద్రాక్ష కంఠమాల
యపరంజి పసిఁడి కామాక్షులు డామూఁపు
పై గొండ్లిఁ గావించు యోగపట్టె'

పద్య 101

అను సీసపద్యమున మధురముగ వర్ణించినాడు. చెట్టునుండి దిగివచ్చి నట్లు సిద్ధుడు రాజుచేర నేతెంచెననుట మిక్కిలి మనోజ్ఞమైన భావన. ఈ వర్ణన మమూలకము. మనుచరిత్రలోని "ముడిచిన యొంటి కెంజడ మూయమువ్వన్నె..." (అశ్వా 1 – పద్య 59) అను పద్యమును దలపించు చున్నది.

## 17. వన వర్ణనము :

విశ్వనాథ కవిరాజు వనవర్ణనమును బేర్కొనినాడు. ఆలంకారికులు మృగయా, వనవిహార వర్ణనములను బరిగణించుటలో వనవర్ణనము సూచింప బడినట్లే యగును.

మిత్రభేద తంత్రమున 'సింహము-ద్వీపి వాయస జంబుకముల'ను కథలో "అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే" యని యారంభమున గలదు. ఆ కథానువాదమున భానుకవి 'మున్నొక వనంబు నింబ కదంబోదుంబర జంబూ జంబీర మాధవీ మధూకోద్దాల...'అని యొక దీర్ఘవచనమున పెక్కు వృక్షనామములం పేర్కొని యనంతరము ఆ వనమును

'నృత్యరంగంబునుంబోలె నటనటీ శోభితంబై, శరన్న భోభాగం బునుంబోలె చక్రి బాణాసన విరాజితంబై, భారత సమరస్థలంబుంబోలె నర్జున రమ్యంబై రమణీ జనవదన శృంగారంబును బోలెఁ జందన తిలక రమణీయంబై యొప్పు' (అశ్వా 1—వచ 215) అని యభివర్ణించెను. ఇందలి యుపమానములు బహుచమత్కారావహములు. వనము నటనటీ శోభితమై నృత్యరంగమువలెనున్నదనుటలో వనార్థమున నటశబ్దమునకు ఇరుగుడు లేక దుండిగము అను వృక్షమనియు, నటియను శబ్దమునకు శాకిదొండ లేక గువ్వగుత్తి యనియు నర్థములు. వనము చక్రిబాణా సన విరాజితంబై శరన్న భోభాగంబును బోలిన దనుటలో గగనార్థ మున చక్రిబాణాసన మనగా ఇంద్రధనుస్సని యర్థము. వనార్థమున చక్రిమనగా జక్రివాకము, బాణమనగా నల్లగోరింట చెట్టు అని యర్థ ద్వయము. ఇట్లే తక్కిన వానియందును మనోజ్ఞముగ రెండర్థములు నిక్షేపింప బడినవి. ఇందలి ఉపమలు అపూర్వములు. శ్లేషాలంకార ప్రయోగము విద్వజ్జన రంజకము. 'బకదంపతులు – కర్కటకము' అను కథలోగూడ పైచరాజు ప్రౌఢపదబంధ బంధురముగ వనవర్ణన మిట్లు గావించినాడు,

కలద్రభంకష భూజరాజి శుకపాక గ్రస్త శస్త స్వదు
త్ఫల దృగ్వాక్షమము కూలముద్రిజ ఝరీ భంగాంగ సంఘర్ష జా
విలఘోష ప్రతిఘోషి తద్విరద విడ్భ్రమ ముగ్ర ద్వీపి
స్థలకృ త్కీల దరీనికాయమొక కాంతారంబు దుర్వారమై

పద్య 741

శుకపోతముల చేష్టలు గజఘీంకారములు పెద్దపులుల నివాసములు గంభీరముగ వర్ణింపబడినవి. తృతీయాశ్వాసమున 'గజయూథపతి – శశము' అను కథలోగూడ బైచరాజు గజయూథము సంచరించిన ఘోర కాంతారములను వర్ణించినాడు. ఆడకోతులు మధురముగ పాడు చుండగా బశవశములైన పందులు పాములు గలది, ఆరముగ్గిన పండ్ల యందలి యాశచే ముండ్ల పందులచే జీల్చబడిన వృక్షములు గలది యనియు నింకను పెక్కు విశేషములతో బైచరాజు

మదవనే చరవధూ మధురగాన ధ్వాన
  వివశకుంజ క్రోడ విషధరములు
పరిపక్వ ఫలవిలుబ్ధ స్తబ్ధ రోమదం
  ష్ట్రాటంక భిన్నగోత్రారుహములు
  ... ... ... పద్య 75

అను పద్యమును రచించెను. లబ్ధప్రణాశ తంత్రమందలి బైచరాజధిక ముగ గల్పించి రచించిన 'నక్క–తాఁబేలు' అను కథలో వన వర్ణము పెక్కు విశేషములతో విపులముగ (ఆశ్వా 4 – పద్య 522–528) నిర్వహింపబడినది. అందు జిత్రముగ పెక్కు చెట్లపేర్లు వరుసగా

కలిగొట్టు మోఁదుగు కానుఁగు గలుగు వా
  విలి మేడి నేరేడు సెలసు బలుసు
మఱ్ఱి మంకెనమద్ది మారేడు బూరుగు
  గోరంట లొద్దుగు క్రోవిరావి

పద్య 522

అను పద్యమున చేర్కొన బడినవి.

ఇట్లు బైచరాజు గావించిన యమూలకవన వర్ణనలలో ప్రౌఢ భావసంపదతోపాటు విషయ వైవిధ్యము గూడ వెల్లివిరియు చున్నది.

## 18. వృక్ష వర్ణనము :

అలంకార శేఖరుడు వృక్షవర్ణనమును ప్రత్యేకముగ చేర్కొని

నాడు. మిత్రప్రాప్తి తంత్రమున విష్ణుశర్మ న్యగ్రోధ వృక్షవైభవమును 'తస్య నాతిదూరస్థో మహోచ్ఛ్రాయో నానావిహంగోపభుక్త ఫలః కీటైరావృత కోటరచ్ఛాయా శ్వాసిత పథికజన సమూహో న్యగ్రోధ పాదపోమహాన్. అథవా యుక్తమ్.

ఛాయాసుప్త మృగః శకున్తనివహై ర్విష్వగ్విలుప్తచ్ఛదః
కీటైరావృత కోటరః కపికులైః స్కన్ధే కృత ప్రశ్రియః
విస్రబ్ధం మధుపై ర్నిపీత కుసుమః శ్లాఘ్యః స ఏవ ద్రుమః
సర్వాఙ్గైర్బహు సత్త్వసంగ సుఖదో భూభారభూతోఽపరః'

అని విపులముగ వర్ణించినాడు. భానుకవి మాత్రము న్యగ్రోధమును శాల్మలిగా మార్చి యది పుష్పసముదాయముచే నకాల సంధ్యారుణిమ భ్రాంతిని, దట్టముగా వ్యాపించిన ఆకుల నీడచే బహుళపక్ష మందలి చీకటి సామ్యము నొసంగుననియు నింకను బెక్కు విశేషములతో 'అది కుసుమ విసరద్యుతి చేత నకాల సంధ్యారాగ విభ్రమంబును, బహుళతరసాంద్ర పర్ణసిబిడచ్ఛాయవలన బహుళ పక్ష తమస్సదృశ ప్రభావంబును జేయుచు......' (అశ్వా 2-వచ 4) అని వర్ణించినాడు.

కాకోలూకీయ కథారంభమున విష్ణుశర్మ 'తస్య సమీపస్థోఽనేకశాఖా సనాథోఽతిఘన తరపత్రచ్ఛన్నో న్యగ్రోధ పాదపోఽస్తి' అని వటవృక్షమును బెక్కు శాఖలు గలది, మిక్కిలి యెక్కువ దట్టముగా నాకులచే గప్పబడినది యని వర్ణించినాడు. దూబగుంట నారాయణకవి సంధివిగ్రహ పరిచ్ఛేదమున వటవృక్ష వైభవము నిట్లభి వర్ణించినాడు.

మెండగు శాఖలన్ ధరయు మిన్నును దిక్కులు నాక్రమించి మా
ర్తాండ మరీచి జాలములఁదార్కొనసీయని యాకు జొంపముల్
నిండి మహోండ జంబులకు నిల్కడగా నొక కానలోన బ్ర
హ్మాండము ముట్టి యెక్కవట మద్భుతమై పెనుపొందు నెంతయన్
అనుదినంబును దన చల్లఁదనము చేత
జలద మెబ్భంగి సకల జీవులను బ్రోచుఁ

దాను నా చందమున జంతుతతి భరించుఁ
గారవము కిమ్ముగా నా మహీరుహమ్ము.

పద్య 5, 6లు

మూలమందలి 'అనేక శాఖాసనాథః, అతి ఘనతర పత్రచ్ఛన్నః' అను విశేషణములు మొదటి పద్యమున వివరణాత్మకముగా రచింపబడినవి. రెండవ పద్యమున మేఘౌపమ్యము నారాయణకవి స్వీయము. భాను కవి వటవృక్షమును

తన శాఖలేర్చి మార్తండుని తేరి ప
  ద్ధతికి మిక్కిలి విరోధం బొనర్ప
తన నీడ ధారుణీ ధవళాంగ తాత్మికి
  నాతపత్రి క్రియ నతిశయిల్ల
... ... ... అశ్వా 3 పద్య 5

అను పద్యమున వర్ణించినాడు. ఆ వృక్షశాఖలు గగనచరుడైన సూర్యుని రథమున కడ్డుగా నున్నవి, ఆ చెట్టునీడ భూకాంతకు గొడుగుగా నున్నది మున్నగు భావములు భానుకవి స్వతంత్రముగా భావించినవి. అమూలకములు. బైచరాజు వేంకటనాథుడుగూడ వటవృక్షము నిట్లు వర్ణించినాడు.

ఫలరుచి విద్యుదర్చిఁ దెలుపం బలిభుగ్రుతులుగ్రి గర్జలై
రొయలయఁగఁ బెల్లుగా డిగిన యూడలు పుష్కర వర్షధారలై
నిలువఁగ వార్షికాభ్రిసరణిం గగనస్థల చుంబియై దళ
ద్దళముల కల్మిఁ గార్కొను నుదగ్రివటం బొకఁడొప్పు నున్నతిన్
అశ్వా 3 – పద్య 6

ఇందలి భావములును మూలాతిరిక్తములే. భయంకరమైన వటవృక్షమును వర్షకాల మేఘముగ గని భావించుట యనుపమము. ఫలముల కాంతి మెఱపుల కాంతిగను, కాకుల యఱపులు మేఘగర్జనలుగ,

క్రిందికి దిగిన యూడలు పుష్కర వర్ష ధారలుగ బైచరాజు భావించుట యత్యంత మనోహరముగా నున్నది.

లబ్ధ ప్రణాశతంత్రమున విష్ణుశర్మ 'అస్తి కస్మింశ్చిత్ సముద్రోప కంఠే మహాం జంబూ పాదపః సదాఫలః' అని జంబూ వృక్షమును బహుక్లుప్తముగ వర్ణించినాడు. ఆంధ్రీకర్తలు పుష్కరారు జంబూ వృక్షమును మేడిచెట్టుగా మార్చి వర్ణించినారు. దూబగుంట నారాయణ కవి యీ మేడిచెట్టును గోరిన గోరికల నొసగు కల్పవృక్షము వలె నున్నదని

కామిత ఫలముల నొసఁగం
గా ముందటఁ గల్పకంబు గానంబడిన
ట్లా మేడి కడు ఫలించెను
నా ముందటి భాగ్యవాసనకు దృష్టముగాన్

లబ్ధనాశ – పద్య 10

అని వర్ణించినాడు. ఔపమ్యము మూలకము. సార్థక్యము మృగ్యము. భానుకవియు జతుర్థాశ్వాసమున మేడివృక్షము నిట్లు వర్ణించినాడు.

కలదొక మేఁడిమ్రాను మధుగర్భమనన్ దనయందు జంతుభృ
త్ఫలములు విష్ణుదేహమునఁ బద్మభవాండములట్లు పుట్టుచున్
నిలుకడ చేటునొంద ధరణిన్ గ్రితుకారణమై ద్విజవ్రజం
బులకు నభీష్టదంబయి నభోమణి చుంబిత దీర్ఘశాఖనై

పద్య 6

ఇందలి విష్ణుదేహౌపమ్యము, ద్విజసమూహాభీష్ట ఫలప్రదాతృత్వము అమూలకములైన మధుర కల్పనలు. బైచరాజు మేడివృక్షమును ఈశ్వరౌపమ్యముతో నిట్లభివర్ణించినాడు.

జరఠకపీంద్రుఁడట్ల గిరిసాగరతీరము నందు మాసితాం
బురుహ భవాండమండ పరిభూషితుఁడై వెలుగొందుచున్న యీ

శ్వాసుఁడన నుజ్జ్వల జ్జటిల సారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భమునాఁ జనుమేఁడి దోఁచినన్

ఆశ్వా 4—పద్య 25

## 19. సరోవర వర్ణనము :

జలక్రీడా వర్ణనమున సరోవర వర్ణనమొక యంగముగా గణనీయము. కాని యలంకార శేఖరుడీ వర్ణనమునకు ప్రత్యేకస్థానమొసంగినాడు. కాసార వర్ణనము సర్వప్రబంధ సామాన్యముగ గోచరించును.

దూబగుంట నారాయణకవి సంధివిగ్రహ పరిచ్ఛేదమున 'గజయూథపతి-శశకము' అనుకథలో జంద్రసరోవరమను పేరుగల కాసారమును పుష్పసౌరభ శీతజల పరిపూర్ణతాది విశేషములతో '...కైరవహల్లకాది చంచన్నవ పుష్పసౌరభ విశంకట శీతపయః ప్రపూర్ణమై' (పద్య 82) యని వర్ణించినాడు. ఆ సరోవర తీరమందలి వృక్ష సముదాయమును

కుసుపక తింత్రిణీ లికుచకోమల తాల తమాల సాలకే
సర కదళీ లవంగ పనస క్రముకార్జున నారికేళ ని
ర్జరకేసకామ్ర వంశముఖ చారు మహీరుహ పంక్తిచేత సు
స్థిరతరమైన యక్కొలని తీరము సొంపువహించు నెంతయున్

పద్య 83

అను పద్యమున జక్కగా జేర్కొనినాడు. ఈ ఘట్టమున భానుకవి సరోవరమును విష్ణుని శరీరముగ నిట్లు మనోజ్ఞముగ నభివర్ణించినాడు.

కరిపతినీవు వంపఁ జనికంటిమి చంద్రసరోవరమ్ముఁ బ్ర
స్ఫురదురు శంఖచక్రములఁ బొల్చి పయోరుహలక్ష్మి నెంతయున్
సుగుచిరమై జనార్దను తనుక్రియ నెప్పుడు మీఱుదానిఁ బు
ష్కరయుతమైన దాని జలజంతు తతిన్ దగుదాని నొక్కచోన్

ఆశ్వా 3 – పద్య 4

సరోవరమందలి శంఖచక్రములు, పద్మసంపద కాసారమునకు జనార్దనుని రూపసామ్యమును జక్కగా గల్గించు చున్నది. పయోరుహాలక్ష్మి యనుచో బద్మముల సంపదయని కాసారపరముగను క్షీరాబ్ధిజయైన శ్రీదేవియని జనార్దనుని పరముగను అర్థద్వయము. వర్ణనము సుకుమార భావభరితము. కల్పనము రమ్యము. బైచరాజు వేంకటనాథుడు యాదవ స్థానము, యోగిరాజు, ప్రాతఃకాలము మున్నగు విషయముల నుపమానములుగా గ్రహించి మనోహరమైన శ్లేషాలంకారమును బోషించుచు 'తత్సరోవరం బావిష్కృత పుష్కరంబు గావున యాదవ స్థానంబును మత్స్యకూర్మ విలాస భాసురంబు గావున యోగిరాజును బ్రకాశితాహిమకరంబు గావున బ్రాతఃకాలంబును...' (అశ్వా 3 – వచ 77) అను వచనమున జంద్ర సరోవరమును వర్ణించినాడు. సరోవరార్థమున బుష్కరమనగా బద్మము. యాదవస్థానార్థమున స్థలవిశేష మని యర్థము. సరోవరార్థమున మత్స్యకూర్మ విలాస భాసురమనగా జేపలయు దాబేళ్ళయు విలాసములచే ప్రకాశించుట. యోగరాజను నర్థమున మత్స్యకూర్మముల యాకృతి విశేషములచే ప్రకాశించుట యని యర్థము. కాసారార్థమున ప్రకాశితాహిమకర మనగా వెలుగు చున్న పాములు, మకరములు గలది యనియు. ప్రాతఃకాలార్థమున తేజరిల్లుచున్న సూర్యునిగలది యనియు నర్థద్వయము. తక్కిన భాగ మున నిట్లే సుగమముగ శ్లేషాలంకారము ప్రయోగింప బడినది. చంపూకర్తలు గావించిన ఈ సరోవర వర్ణనము అమూలకము.

బైచరాజు వేంకటనాథుడు ప్రథమాశ్వాసమునను 'కచ్ఛపము–హంసద్వయము' అను కథలో గాసారము నభివర్ణించినాడు. ఆ వర్ణన మున హంసల వైభవమును, బద్మముల పరాగమమును, ద్విరేఫముల విజృంభణము నతిసంగ్రహముగా

కేలెత్తి యినుముఁ జల్లిన
రాలని యొకకానలో మరాళీ వికస
న్నాళీక మధూళీ మ
త్తాళీ నాళీ ఖురాళియగు కొలనొప్పున్. పద్య 556

అని రచించినాడు. దీనితో దనివినందక బైచరాజు ఆ కొలను సంగ్రామము, సురగ్రామము, వైకుంఠధామము, హోమము మున్నగువానిని బోలియున్నదని 'అది సమగ్ర శరంబును సమదసారంగ భాసురంబును స్వర్ణపత్రి రుచిరంబునునై సంగ్రామంబును, ననిమిష కులాధారంబును నమృత రసపూర సంభారంబును ననవద్య తరువిస్ఫారంబునునై సుర గ్రామంబును...' (వచ 557) అని వర్ణించినాడు. ఇందలి ఔపమ్యము శ్లేషమూలకము. కాసారార్థమున శర, సారంగ, పత్ర అనువానికి నీరు, తుమ్మెద, చెట్లయాకు అనియు సంగ్రామార్థమున బాణము, ఏనుగు, చుఱకత్తె యనియు నర్థద్వయము. అట్లే సరోవరార్థమున అనిమిష కులమనగా జేపల కొలమనియు, అమృతరసమనగా అమృతము వంటి నీరనియు, అనవద్య తరువనగా చక్కని చెట్లనియు సురగ్రామమను నర్థమున అనిమిష కులమనగా దేవతల కులమనియు, అనిమిష రస మనగా బీయూషము అనియు, అనవద్య తరువనగా గల్పవృక్షమనియు రెండర్థములు. ఇట్లే తక్కిన భాగమునను మనోహరముగ శ్లేషాలం కారము ప్రయోగింపబడినది. బైచరాజుని కాసార వర్ణనమాతని పాండిత్య వైభవ నిరూపకము. ఈ వర్ణనము పాఠకునకు గాసార విశేషములను గ్రహించుటలో నుల్లాసము గల్గించును. ఆతని పద విన్యాస చమత్కృతులు తల యూపింప జేయును.

## 20. నదీ వర్ణనము :

దీనిని అలంకార శేఖరుడు పేర్కొనినాడు. కాకోలూకీయ తంత్రమందలి 'శశ కపింజలుల' కథలో విష్ణుశర్మ 'మార్గాసన్నం నదీ తటమాసాద్య' అని నదియొద్దు ప్రసక్తిగావింప నాంధ్రీకర్తలలో బైచ రాజు వేంకటనాథుడు ఆ నది యమునానదియని నామకరణ మొనరించి యా నదీవైభవమును మనోజ్ఞముగ వర్ణించినాడు. పరిమళించుచున్న పద్మములందలి మధుపిపాసువులైన తుమ్మెదల గీతములు, అఘమర్షణ స్నానమాచరించు జనుల పాపములను గ్రహించు జలసంపద, బ్రహ్మ నిష్ఠులైన ద్విజులకు హితమైన ఇసుక యను విషయములలో విరాజిల్లు చున్న యమునానదిని బైచరాజిట్లు వర్ణించినాడు.

చనికంటిం బ్రాంత కాంతకుసుమ నిరవధిక శ్లాఘ్య సౌరభ్య సంప
ద్వనజాత వ్రాతరోధోవన వమధు మధు వ్యగ్రమత్తాళి గీతన్
జనిత శ్రద్ధానిమజ్జ జ్జన భవ హరణో చ్ఛండకాండ ప్రపూతన్
వినిష క్త బ్రహ్మనిష్ఠ ద్విజహిత సికతాన్విత ఖద్యోత జాతన్
ఆశ్వా 3-పద్య 119

ఆ యమునానది కాళియునకు నివాసస్థలమని, శ్రీకృష్ణున కాట పట్టు, రాసక్రీడ గావించువారికి నిమజ్జనగృహము, పాములకు హాలహాలము అని పెక్కు విశేషములతో నిట్లు బైచరాజుచే ప్రశంసింప బడినది,

మనికి చోటిదిగాదె యనువాస రాచాంత
ఖచర జీవితమరుత్కాళి యునకు
నాటపట్టిదెగాదె యరివధా గతగోప
వేష బృందావర్తి విష్ణువునకు
... ... ... పద్య 121

కాకోలూకీయ తంత్రమున 'ముని-మూషికాంగన' అను కథారంభంబున విష్ణుశర్మ 'అస్తి విషమ శిలాతల స్ఖలితాంబు నిర్ఘోష శ్రవణ సంత్రస్త మత్స్య పరివర్తన సంజనిత శ్వేతఫేనశబల తరంగాయా గంగాయాస్తటే...' అని గంగానదీ వైశిష్ట్యమును క్లుప్తముగ వర్ణించినాడు. ఆంధ్రీకర్తలలో బైచరాజు మూలముతో బోలికలేని విధముగ స్వీయ కల్పనలతో గంగానదీ విశేషములను

కైటభాహిత పదాంగద మౌక్తిక చ్ఛాయ
విధికమండలు సమన్విత మరాళి
మారారి మకుట మందారమాలిక వియత్
కృష్ణధేను క్షరత్ క్షీరధార
... ... ... ఆశ్వా 3-పద్య 300

అని వర్ణించినాడు. విష్ణుమూర్తి నూపురమునందలి ముత్యాల కాంతి గలది, బ్రహ్మ కమండలువు వంటి హంసలుగలది, పరమేశ్వరుని జటా

మకుటమందలి మందారముల, ఆకాశమను నల్లని యావునుండి కారిన పాలధార అని పలువిధములుగ గంగానది కీర్తింపబడినది.

చతుర్థాశ్వాసమునగూడ వైచరాజు 'నక్క—తాబేలు' అను నమూలక కథలో సెలయేటిని వర్ణించినాడు. అది జగదేకవీరుని తర వారి ధారచే జీల్చబడిన సకల ధరణీ భృత్సంకులమైనదని

అలఘు తరవారి ధారా
దళిత ప్రతికూల సకల ధరణీ భృత్సం
కులమై యొక సెలయేఱు
పొల్పలమున జగదేకవీరు పోలిక నమరున్

పద్య 529

అని వర్ణించినాడు. సెలయేటికి జగదేకవీరు నౌపమ్యము మనోహర ముగా నున్నది. అలఘు తరవారిధారా, ధరణీభృత్ అనుచో మనోజ్ఞ మైన శ్లేష. ఆ పదములకు నదీపరముగ గొప్ప నీటిధార, పర్వతము అని యర్థములు. కత్తియంచు, ప్రభువు అని వీరుని పరమైన యర్థ ములు. ఆకాసారము పంచవట స్థానము, సమీరణము, కిష్కింధ నగరము మున్నగువానిని బోలియున్నదని 'అది రామలక్ష్మణాలం కృతంబై పంచవట స్థానంబును సత్వసంపన్నంబై సమీరణంబును గజ గవయ విహార యోగ్యంబై కిష్కింధా నగరంబును...' (వచ 530) అని వైచరాజు వర్ణించినాడు. ఇందు విశేషణములు శ్లిష్టములు. రామ లక్ష్మణ యను పదములకు మత్స్యవిశేషము, ఆడ బెగ్గురు పక్షి యని నదీపరమైన యర్థములు. పంచవట స్థానమనునప్పుడు దశరథ పుత్రులని యర్థము. నదీపరముగ సత్వసంపన్నంబై యనగా జలచరములతో గూడినదనియు సమీరణార్థమున బలముగలదియనియు నర్థములు. ఇట్లే తక్కిన విశేషణము లందును సుకుమారమైన శ్లేష ప్రయోగింప బడినది.

## 21. అనావృష్టి వర్ణనము :

ఆలంకారికులు అనావృష్టి వర్ణనమును బేర్కొనలేదు. గ్రీష్మ

సమయ బీభత్సమున నిది యంతర్భూతమగునను దృష్టితో విడిచి యుందురు. విష్ణుశర్మ పంచతంత్రమున కాకోలూకీయ తంత్రమున 'గజయూథపతి-శశకము' అను కథలో 'తత్ర కదా చిన్మహత్యనా వృష్టిః సంజాతా ప్రభూత వర్షాణి యావత్ తయా తడాగహ్రద పల్వల సరాంసి శోషముపగతాని' అని యనావృష్టిని వర్ణించినాడు. దూబగుంట నారాయణకవి యతిసుకుమార భావములతో అనావృష్టి నిట్లు వర్ణించినాడు.

ఏకొండ చూచిన నెరగలివడిఁ బర్వి
పొగలేని యనలంబు లెగయుచుండ
నేచెట్టు చూచిన నెలమిఁ బచ్చనియాకు
వెదుక మందునకైనఁ జిదుమలేక
... ... ... సం. వి-పద్య 77

కొండలందు కార్చిచ్చు వేగముగ వ్యాపింప బొగలేని మంటలు ప్రజ్వరిల్లుట, చెట్లయందు మందునకైన పచ్చనియాకులు లేకుండుట మున్నగు ప్రకృతి బీభత్స మిందును మనోహరముగ వర్ణింపబడెను.

భానుకవి ప్రథమాశ్వాసమున 'కచ్ఛపము-రెండుహంసలు' అను కథలో అనావృష్టి యెంతభయంకరముగా నున్నదో

చండకరాంశు జాలము కృశాను శిఖావళి మాడ్కినుగ్రమై
నిండె దిశాంతరాళముల నీరజషండము నాశపంక్తితో
నెండె సరోవరమ్ముల నహీన తటాకములన్ ఝషమ్ములొం
డొండఁ గృశమ్ములై సొరిగె నుష్ణజలంబులు దమ్మునేఁపఁగన్
పద్య 254

అని వర్ణించినాడు. సూర్యుని కిరణములు అగ్ని శిఖాసముదాయము వలె భయంకరమై రోదోభాగము నిండుట, కొలనులతో గూడ బద్మసముదాయ మెండుట, చేపలు వేడి నీటి యందు బాధనొందుచు కృశించుట యను భావములు అనావృష్టి యెట్లు భీకరముగా నున్నదో నిరూపించు చున్నవి.

## 22. ఝంఝామారుత వర్ణనము :

ఆలంకారికులచే బరిగణింపబడలేదు గాని బైచరాజు 'మదోత్కట మను సింహము—ద్వీపి— వాయసగోమాయువులు' అను కథలో ఝంఝామారుతము నద్భుతముగ నిట్లు వర్ణించినాడు.

సుషిరాస్యస్థల జాత ఝుంకరణక క్షుణ్ణాశ మభ్రోచ్చల
ద్దృషదాస్ఫోటన పాటితంబు కుజశ్రేణీ గ్రస్త కూలంకషా
విషమున్మూలిత రూఢమూల వివిధోర్వీజంబు బాహ్యాకిర
ఝ్ఝషక స్థాన జలంబు నొక్క నొక ఝంఝామారుతం బుద్ధతిన్

ఆశ్వా 1–పద్య 480

శైలి ఝంఝామారుత స్వభావ నిరూపకము. వేళ్లతో గూడిన చెట్లను పెకలించుట, కాసారమందలి నీళ్ళు నెగురగొట్టుట యను రెండు లక్షణములును ప్రభంజన వేగమును శక్తి సామర్థ్యములను వెల్లడించుచున్నవి.

## 23. గుహావర్ణనము :

ఆలంకారికులు దీనిని పేర్కొనలేదు. బైచరాజు ప్రథమాశ్వాసమున 'భాసురకమను సింహము—శశము' అను కథలో నపూర్వ కల్పనలతో గుహానిట్లు వర్ణించినాడు.

దంతి దంతాగ్ర నిర్దళిత మస్తక గళ
న్మూలత్న ముక్తౌఘ మండనాకృతంబు
బహుళ తిర్యక్ ప్రభవ ప్రతిహతస్యదన ద
ఝ్ఝరఘనస్తనిత లాస్యద మయూర
మచ్ఛభల్ల పరిహారార్థ మస్తాత్మీక
చ్ఛత్రి పంకీకృత తల్పతలంబు
... ... ...

పద్య 336.

ఈ వర్ణన మమూలకము. ఆ గుహాసూచనములైన ముత్యముల పరివా

హాముచే దెల్లదనము గలది, నాట్యముచేయుచున్న మయూరములు గలది యని పెక్కు చమత్కృతులతో మనోజ్ఞముగ వర్ణింపబడినది.

## 24. గర్భవతి వర్ణనము :

విశ్వనాథకవిరాజు సంభోగము మొదలుకొని పుత్రోదయ పర్యంతము వర్ణింపవలయునని సూచించినాడు. అందు గర్భవతి వర్ణనమును మాత్రము బెక్కండ్రు కవులు బహుసమర్థతతో నిర్వహించినారు. బైచరాజు వేంకటనాథుడు పంచమాశ్వాసమున దేవశర్మ భార్యయగు యాజ్ఞసేని గర్భవతి యగునప్పటి స్థితిగతులనిట్లు మనోజ్ఞముగ వర్ణించినాడు.

ఓఁ కర బలిసె జిట్టుముల సందడి మించె
గలకవాటెఁగ పోల ఫలక యుగళి
బుద్ధి మృద్భక్షణంబునకు నువ్విళులూరె
రశ్మి చామనమేన అచ్చుజేసె
... ... ... పద్య 6

చెక్కిళ్ళు పాలిపోవుట, మృద్భక్షణమునకు బుద్ధిపోవుట, చూచుకములు నల్లదనము నొందుట మొదలైన అంతర్వత్నీ లక్షణములన్నియు బూసగుచ్చినట్లుగ సొగసుగ బైచరాజుచే ఈ పద్యమున నభివర్ణింపబడినవి. ఈ పద్యము భట్టుమూర్తి వసుచరిత్రలో రచించిన 'నాళీక ముఖికి నెన్నడుము గానగనయ్యె...' (ఆశ్వా3-పద్య) అను పద్యమును దలపించుచున్నది.

ఇట్లు చంపూకర్తలు తమ యనల్పప్రతిభా పాండిత్య నిరూపకములగు నైకవిధ వర్ణనా చమత్కృతులతో పంచతంత్రము నాంధ్రీకరించుట ప్రశంసనీయము. ప్రతివర్ణనము యొక్క సార్థక్యమును ఇదమిత్థముగ నిరూపించుట కష్టసాధ్యమేయగునుగాని కథా భాగమున కుత్కర్ష గల్గుట, కవుల కల్పనా సామర్థ్యమూ విష్కరింపబడుట యను రెండుప్రధాన ప్రయోజనములు వర్ణనల వలన జేకూరినవని నిర్ణయింప వచ్చును.

## -: శైలీ విన్యాసము :-

సాహిత్య విమర్శ యందు శైలీ విన్యాసాను శీలనము ప్రముఖ పాత్ర వహించుచున్నది. అది యాధునికమనుట సమంజసము. శైలి యను పదము ఆంగ్ల మందలి 'Style' అను పదమునకు సమానార్థక ముగ దెనుగున వ్యవహరింప బడుచున్నది. కొందరీపదమును 'Style' అను నాంగ్ల పద వికృతిగా భావించుచున్నారు. కాని సంస్కృతాంధ్ర సాహిత్యములలో శైలియనుపదము ప్రయోగింప బడకపోలేదు. అది నేటి వ్యవహారమున ప్రసిద్ధమైన యర్థమునగాక యర్థాంతరమున ప్రయుక్తము. ఆప్టే పండితుడు తన సంస్కృతాంగ్ల నిఘంటువునందు శైలి యను పదమునకు 'A mode of expression, or interpretetion' అని యర్థ మొసంగి దానికి ప్రమాణముగ మనుస్మృతి వ్యాఖ్యలో కుల్లూకభట్టు రచించిన 'ప్రాయేణచార్య వర్యాణామియం శైలీ యతెస్వాభి ప్రాయమపి పరోపదేశ మివ వర్ణయతి' యను వాక్యము నుదాహరించి నాడు. అభిప్రాయ వ్యక్తీకరణ విధానము లేదా సమన్వయ పద్ధతి యను నర్థములో కుల్లూకభట్టు శైలి యను పదమును ప్రయోగించినాడనుట స్పష్టము. మనోహర ప్రకారమను నర్థమున శ్రీనాథుడు శృంగార నైషధమున 'ఒప్పిదపు శైలి బఱితురు ప్రౌఢ భామినుల్' (ఆశ్వా 7—పద్య 157) అని ప్రయోగించినాడు. సంస్కృతాంధ్రి భాషలలో ఒకానొక పద్ధతి లేదా విధానము అను నర్థము నందు శైలి యను పదము వ్యవహృతమగుట యథార్థమేగాని రచనా విధానమను నర్థమున ఆపద మాధునికముగనే రూఢమైనది.

ఆలంకారికులు రచనావిధానమునకు సంబంధించి పేర్కొనిన శయ్య, రీతి యనునవి శైలికి సన్నిహితము లైనవి. 'పదానామన్యోన్య మైత్రీ శయ్యా' 'విశిష్ట పదరచనా రీతిః' అని శయ్యారీతులు నిర్వచింప బడినవి. పరస్పర సాపేక్షికములైన పదముల కూర్పు శయ్య. విశిష్ట మైన పదబంధ విన్యాసము రీతి. పదబంధ ప్రయోగ విషయమున ఆలం కారికులు ఏయే పదములు, ఏయే వర్ణములు రసపోషణ విషయమున

ప్రయోగింపదగినవో పేర్కొనుటయు శైలికి సంబంధించిన విషయము గనే పరిగణింపవచ్చును. ధ్వన్యాలోక కర్త ఆనంద వర్ధనాచార్యులవారు సంఘటనాస్వరూప వివరణ సందర్భమున 'శృంగారేఽపి దీర్ఘసమాసా దృశ్యతే రౌద్రాదిష్వసమాసాచేతి' అని చెప్పి రెండు లక్ష్యముల నొసంగినాడు. శృంగార రసమునకు 'మందార కుసుమ రేణు పింజరి తాలకా' అనియు

'అనవరత నయనజల లవ
ని పతన పరిముషిత పత్రలేఖంతే
కరతల నిషణ్ణమబలే
వదనమిదం కం న తాపయతి'

ఉద్యో

అను శ్లోకము నుదాహరింపబడెను. అట్లే రౌద్రరసమునకు 'యోయః శస్త్రం బిభర్తి స్వభుజ గురుమదః' అను వేణీసంహారక నాటక శ్లోక ముదాహరింప బడెను. ధ్వనికారు లుగ్గడించిన శృంగార రసమున దీర్ఘసమాస రచనమును, రౌద్రమున అసమాన రచనమును రసగంగా ధర కర్తయైన జగన్నాథ పండితుడు ఖండించినాడు. ఎట్టి పదబంధము ఏయే రసములకు సముచితమను విషయమున ఆలంకారికులు యభి ప్రాయము లెల్లను శైలికి సంబంధించినవేయని నా యభిప్రాయము.

శైలి యనునది భాషకును, భావమునకును గూడ సంబంధించి నది. అది యర్థ నిరపేక్షికమైన వట్టి శబ్దాడంబరము కాదు. అట్లని భాషాపుష్టిలేని వట్టి భావోద్ఘాటనమును గాదు. ఒక్కొక్క కవిశైలి యొక్కొక్క విధముగా నుండును. ఒకేకవి రచనమునను సన్నివేశాను గుణముగా శైలి మారుచుండును. అది కవి యాత్మీయతకు సంబంధించి నదని పాశ్చాత్యుల యభిప్రాయము. కావుననే 'Style is the man' అను సూక్తి యేర్పడినది. 'Style is the shadow of the man' అను నానుడియు లేకపోలేదు.

ఆంధ్ర సాహిత్యమున నన్నయశైలి ఆఖ్యానశైలి యనియు, తిక్కనది నాటకోచిత శైలియనియు ఎఱ్ఱాప్రగడది వర్ణనాత్మకశైలి యనియు విమర్శకులచే నిర్ణయింపబడినది. నన్నయశైలి ఆఖ్యానాత్మక మనుటలో నితర శైలులు ఆతని కవిత్వమున లేవనజాలము. ప్రాధాన్య వివక్షచేనట్లు చెప్పబడినదనుట సముచితము. ఇట్లే తక్కిన కవుల విషయమునను దలంపవలయును. పదప్రయోగ బాహుళ్యమునుబట్టి నన్నయశైలి సంస్కృత పదభూయిష్ఠము. తిక్కనశైలి అచ్చతెనుగు పదముల యాధిక్యము గలది. ఎఱ్ఱనార్యునిశైలి నన్నయతిక్కనల శైలీ సమ్మేళనము గలదియనియు ఆధునిక విమర్శకులు తలంతురు. శ్రీనాథుడు శైలియని స్పష్టముగ బేర్కొనక పోయినను దత్పూర్వకవుల రచనా విన్యాసములను

వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయ భట్టుమార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వచియింతుఁ దిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతుఁ బ్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు

అని పేర్కొనినాడు. ఇవన్నియు భీమనాదుల శైలీవైవిధ్య నిరూపక ములే యనదగినవి.

చంపూనువాదకులు పంచతంత్రమును గావ్యమార్గమున రచించిన వారగుటచే శైలికి ప్రాముఖ్యము నొసంగినారు. శబ్దప్రయోగమును కేవలము గథాకథన సమర్థకముగాగాక ప్రౌఢముగను వర్ణనాత్మకముగను గూడ నిర్వహించినారు. అందును ప్రౌఢిమను మొదటి నుండి తుదివఱకు దన యనువాదమున ప్రదర్శించిన మహాకవి బైచరాజు వేంకటనాథుడు.

అనువాదకులు మువ్వురును గథాకథనశైలిని మనోజ్ఞముగ బోషించినారు. కథాకథనమున సీసపద్యము మిక్కిలి యెక్కువగా నుపకరించును. విపులమైన కథను సీసమిమ్పుకొనినట్లు ఇంకొక పద్యమి మిడ్చుకొన జాలదు. కావున గథాకథనమునకు సీసమును ముగ్గురు చంపూకర్తలు గ్రహించినారు.

## 1. దూబగుంట నారాయణకవి యనువాదము :

మిత్రభేదమందలి 'సింహము–శశము' అనుకథ.

ఆన్మృగేంద్రుండు మహోజవంబునఁ బాఱ
  నతనిముందఱ దాను నతిరయమున
నెలయించి చెవులపో తెంతయు దూరంబు
  గొనిపోయి మున్ను చూచిన యగాధ
జలములు గలకూప సన్నివేశంబున
  నిలుచుండి నీ శత్రునికి నివాస
యోగ్యంబు నెలవిది యూహించి డగ్గఱి
  చూడుమా యనఁ దొంగి చూచునప్పు
డాత్మదేహంబు కూప జలాంతరమునఁ
గాంచి వేఱొక సింహంబు గాఁ దలంచి
కన్నుగానక మార్ఖ్యంబు కతన నుఱికి
యిపుడ మృతిఁ బొందె దుర్బుద్ధియగుటఁ జేసి

పద్య 273.

నారాయణకవి కథను సంగ్రహముగా సీసపద్యమున నిమిడ్చినాడు. శశక సంభాషణమును గాని, ప్రతిబింబ సందర్శనోద్భూత సింహమనః ప్రజ్వలనమును గాని వర్ణింపక కవి కథాకథనమునకే యిందు ప్రాధాన్య మొసంగినాడు.

## 2. భానుకవి యనువాదము :

1. ప్రథమాశ్వాసము – 'ధర్మ బుద్ధి పాపబుద్ధుల' కథ

ధర్మబుద్ధి మహానిధానమ్ము గని దుష్ట
బుద్ధి కెఱింగించి యిద్ధనమ్ము
గొని యింటి కరుగద మన సమ్మతింపన
య్యిరువురుఁ దమయున్న పురముడాసి
తమచేతి ధన మొక్క తరుసమీపమున ని
క్షేపించి యాత్మని కేతనములఁ
బొంది మిత్రతఁగడు పొలుపొంద నుండి రం
దొకనాఁడు దుష్టబుద్ధికి నధర్మ
బుద్ధి పుట్ట ధర్మబుద్ధికిఁ జెప్పక
యపహరింతు ననుచు నాత్మఁ దలఁచి
యర్ధరాత్రి సమయ మందొక్కఁడును జని
యద్భుతంపుటర్థ మపహరించె

పద్య 292.

పద సంయోజనము శ్రవణమాత్రముననే యర్థస్ఫోరకముగా నున్నది. శైలి కథాకథన దక్షము.

3. ఖైచరాజు వేంకటనాథుని యనువాదము :

పంచమాశ్వాసము – 'దేవశర్మ – నకులము' కథ

గౌడదేశంబునఁ గలఁడా గమాభ్యాస
జడుఁడు విప్రుఁడు దేవశర్మ యనఁగ
నతఁడు సోమసుధాత్మసుత యాజ్ఞసేనినాఁ
బెంపొందు కులకన్యఁ బెండ్లియయ్యె
సంతులేకల శరజ్జలజలోచన యాయి
గన్న తాతికిఁ గుందుగన్న గుంటి
కెఱఁగుచు మఱుగుచు నెవ్వరే వ్రతములఁ
జెప్పిరా వ్రతములఁ జేసికొనుచును
సుతులఁగని పెంచు గరితలఁ జూచి యేచి
యిచ్ఛముచ్చట నొందుచు నిట్టులుండఁ

గొంతకాలంబు పోయిన గొడ్డుపీగి
కాంతిజిత హేమ సుమగర్భ గర్భమయ్యె పద్య 5

సంస్కృతసమాస జటిలమగు శైలిలో విహరించు బైచరాజు దేవశర్మ కథను చిన్నచిన్న పదములతో నలతి యలతి తునియల గాహాల సంధింప బడిన విధముగ రచించుట ముదావహము.

పంచతంత్రిమందలి కథలు చిన్నవైయైనను దదాంధ్రీకరణమున జంపూకర్తలు పాత్రల సంభాషణములను ప్రత్యేకతతో దీర్చినారు. వారు ప్రదర్శించిన నాటకోచితశైలి హృదయంగమ మైనది.

*1. దూబగుంట నారాయణకవి యనువాదము :*

1) మిత్రిభేదమందలి 'భాసురకమను సింహము – శశకమ'ను కథలో సింహముతో శశము పలుకుట.

అప్పుడు చూచి మృగేంద్రుఁడు
నిప్పులు కనుదోయినుండి నెగయఁగ నోరీ
చొప్పడదు వేళదప్పిన
యప్పటి యశనంబు నాకు నహితంబగుచున్
పద్య 263

ఓరీ యని సంబోధించుట సంభాషణమునకు సహజత్వము నొసంగు చున్నది. అట్లే 'నిప్పులు కనుదోయినుండి నెగయగ' యనుటలో మృగేంద్రుని ముఖస్థితియు నాటకోచితముగ రూపొందింపబడినది.

2) మిత్రలాభమందలి మందరకుడు చిత్రాంగుని కథయ పూర్వకమగు స్వాగతము నొసంగుట.

ఎచ్చటనుండి వచ్చితిది యేమి మృగోత్తమ నీ మదిన్ భయం
బచ్చుపడంగ నున్నయది యవ్వల నెంతటి కార్యమయ్యె నీ
వచ్చుట పెద్దలెల్ల నిటవచ్చుట గావున నన్నపానముల్
పుచ్చుక మా నివాసమునఁ బొంది వనంబు నలంకరింపవే
పద్య 173

పద్యము చిన్నచిన్న వాక్యములలో రచింప బడినది. నారాయణకవి క్లిష్టతలేని పదబంధములతో నాటకీయముగ రచించినాడు. ఒక మహా పురుషుని యాగమనమునకు స్వాగతము పల్కినట్లు రచింపబడినది.

## 2. భానుకవి యనువాదము :

1) ప్రథమాశ్వాసము–'సింహము ద్వీపి వాయసగోమాయువు' లను కథలో కాక ద్వీపిజంబుకములకు ఉష్ట్రమునకు జరిగిన సంభాషణము.

ఉష్ట్రకులేంద్ర! యెందుండి నీ రాకన
నేను వర్తకు నోసరించి యిచట
నణఁకువ నున్నాఁడ ననఁ బని వారలు
నా విధంబెట్లని యడుగఁ జెప్పె
దను విను స్వర్ణకుండను శెట్టి బహుపదా
ర్థము సంగ్రహించి ప్రయాగమైన
త్రోవను బేరంబు తొలఁగి రాఁగి యాడంగ
సమకట్టి గోనెను సరకునమ
పూని నా వీఁపుపై నెత్తి కానమున
నరుగ భారము నధికమై రాఁగికొనంగ
నొక్క చరిలోన నాగోన చక్కవైచి
మున్ను నిచ్చట దాఁగితి మదము దఱిగి

పద్య 217

ఎందుండి నీరాక యనుట మిక్కిలి సముచితముగా నున్నది. సమాధాన మొసంగగ నా విధంబెట్లని యడుగుట, వివరించుట సంవాదాత్మక ముగా నున్నది.

## 3. వైచరాజు వేంకటనాథుని యనువాదము :

1) ప్రథమాశ్వాసము 'సింహము – శశము' అను కథలో సింహము శశముతో సంభాషించుట.

ఏమేమీ నిను నడ్డగించుకొనెనా యిట్లాడెనా నిక్కమా
నామేలే సమరేచ్ఛ యెంత బలుసేనా పోదమా చూపవే
వా మున్నెక్కడఁగంటి నప్పురము గర్వగ్రంథి మచ్ఛాత దం
ష్ట్రామోఘాభి హతిన్వ్యధింతుఁ దగ నాహారింతుఁ దన్మాంసమున్
పద్య 360

ఏమేమీ యని యారంభించి సింహము గావించిన సంభాషణము మిక్కిలి నాటకోచితము. తిమ్మనగారి ఏమేమీ కలహాశనుండచటికై యేతెంచి యిట్లాడెనా...' అను పద్యమును దలపించుచున్నది.

2) ప్రథమాశ్వాసము–టిట్టిభ దంపతుల కథలో గరుత్మంతుడు టిట్టిభముతో బలుకుట.

ఏమేమీ నాసుభట
గ్రామణినని నీవు పల్కఁగా టిట్టిభశం
శామగ్నుఁడుగా కబ్ధి
స్వామి మహామిక నిట్టి వాఁడయ్యెఁగదా
పద్య 632.

శైలి సహజ సంభాషణాత్మకము. సుపర్ణుని యౌద్ధత్యము, సముద్రునిపై నతనికిగల లఘుభావము పద్యమున పరిస్ఫుటము. బైచరాజట్లు నాటకోచితముగ రచించిన ఘట్టములు పెక్కులుగలవు.

వర్ణనాత్మక శైలిని గూడ యథోచితముగ జంప్వానువాదకులు మువ్వురును నిర్వహించినారు. మిత్రభేదమందలి 'నక్కభేరి' అనుకథలో యుద్ధ భూమిని దూబగుంట నారాయణకవి యిట్లు వర్ణించినాడు.

అఱిముఱి నంతంతఁ దఱుచు ప్రోవులు గట్టి
యఱవఱలై యున్న యరదములును
దొండముల్ గొమ్ములుఁ దోడలు మస్తకములు
ఖండంబులైన వేదండతతులు
... ... ... పద్య 152

ఇందు సంస్కృత పదములు, తెనుగుపదములు మనోజ్ఞముగ గూర్చ బడినవి. నారాయణకవి శైలిలో సంస్కృతపద భూయిష్ఠత బహువిరళము. దీర్ఘ సంస్కృత సమాస బంధురముగ నాతడు రచింపగలడని చెప్పుటకు సంధివిగ్రహ పరిచ్ఛేదమున 'గజయూధపతి—శశకము' అనుకథలోని సరోవరవర్ణనము చక్కని లక్ష్యము. 'కురువక తింత్రిణీలికుచ కోమల తాల తమాల సాలకేసర...' (పద్య83) అని వృక్షనామములను చేర్కొనుటలో సుదీర్ఘ సమాసము ప్రయుక్తము. సుహృల్లాభ తంత్ర మందలి హిరణ్యక మంథరకుల సంభాషణ మందలి

కులిశ సన్నిభ నఖకుంభాంకుశ విభిన్న
మదభరాభీల కుంభి కుంభప్రకీర్ణ
మాంసరక్తాను భవ మోద మానసమునఁ
బొదలుచుండును నెంతొ యొప్పిదముగాఁగ

పద్య 141

అను పద్యముగూడ దీర్ఘసమాస రచనా విశిష్టముగా నున్నది. తక్కిన తావులందిట్టి రచనము గానరాదు. వర్ణనాత్మక శైలి యందును అల్ప సమాసరచనమే నారాయణకవి కభీష్టము.

కథాకథనశైలికి ప్రాధాన్యమొసంగిన భానుకవి వర్ణనాత్మక శైలిని గూండ నక్కడక్కడ పోషించినాడు. లలిత పదబంధ బంధుర మైన యాతని వర్ణనాత్మక శైలికి ప్రథమాశ్వాస మందలి తంతు వాయుని కథలోని సూర్యోదయ వర్ణనము ఉదాహరణీయము.

ప్రాచీ దిశావధూ ఫాలదేశమ్మునఁ
బొలుపొందు చంద్రదంపు బొట్టనంగ
జంభాసురారాతి సౌధోపరిస్థితిఁ
గొమరారు కాంచన కుంభమనఁగ
... ... ...

పద్య 148

భావప్రాధాన్యముతో సముచిత సమాస విన్యాసము గావించుట భాను

కవి వర్ణనాత్మక శైలిలోని ప్రత్యేకత సుదీర్ఘ సంస్కృత పద బంధ రచనము భానుకవి రచనలో స్పష్టముగ చూడవచ్చును.

వర్ణనాత్మక శైలిని బహుసన్నివేశములలో ప్రదర్శించిన మహాకవి బైచరాజు వేంకటనాథుడు. సంస్కృత పదప్రచురమైన పదబంధము ఈతని వర్ణనాత్మక శైలిలో విశిష్టస్థానమునలంకరించును. ప్రథమాశ్వాసమందలి మూడవ చేపలకథలో కవి వేసవిని ఈ కవివృషభమిట్లు వర్ణించెను.

ఘనశిలాయుత మరుదుత్కలిత దుర్యల్లేఖ
  చండదావ మహానాశ సాంధసి
సమజమస్తక నగ స్వర్ణపాత సమీనమురు
  గ్గలజరాగ మహోద శాసకి (ము)

పద్య 577.

వేసవిలోని విశేషములనొక్కొక్కటిగా చూపి యొక్కొక్క సంస్కృత సమాసము ప్రయుక్తము. శైలి సన్నివేశోత్కర్షకముగా సాగినది. అట్లే తృతీయాశ్వాసమందలి 'శశకపింజలుల' కథలోని యమునా నదీ వర్ణనమునకు జెందిన

చని కంటిం బ్రాంత కాంత కుసుమాధిక శ్లాఘ్య సౌరభ్యసంప
ద్వన జాత వ్రాత రోధోపవన వసంత మధు వ్యగ్ర మత్తాళిగీతన్
జనిత శ్రద్ధా నిమజ్జజ్జన ఘన మహోచ్చండ కాండ ప్రపూతన్
వినిమక్త బ్రహ్మనిష్ఠ ద్విజహిత సుకృతాన్వీత ఖద్యోత జాతన్

పద్య 119

ప్రాంత–కాంత, జాత–వ్రాత మున్నగు పదాలలోని వర్ణావృత్తి శ్రుతి రంజకముగా నున్నది. అట్లే సమాసాంతములను వ్రాతన్, గీతన్, పూతన్, అన్వీతన్, జాతన్ అని తన్నంతములుగా రచించుట కవి రచనాశిల్ప ద్యోతకము. వర్ణనాత్మక శైలికి వన్నె చేకూర్చుచున్నది.

ముచ్చటగొల్పు నచ్చతెనుగు పదములతో వర్ణనలను నిర్వహించుటలో గూడ బైచరాజు బహువిదగ్ధుడు. ప్రథమాశ్వాసమున 'బకకర్కటకముల' కథలో గ్రీష్మఋతువును వర్ణించుచు బైచరాజు రచించిన

దండి నిప్పుల వసంతములాడు నెండల
వడఁజల్లు పడమటి వాయువులును
గోవి గుంటలు దక్క గుల్లలు చిక్కంగ
నవిరిన గొంగ రాయిడికి మిడికి
కొరదయుఁ గడిసె పాపరములు ముచ్చంగి
కొంటె ముక్కును లొంపిఁ గ్రుచ్చుకొనియె
వాలువ ముకుదమ్ము వల్లె గండెరనత్తె
గుజ్జు బేడిసజాతి కొఱకు పుడిస
నూతయులజళ్ళ చెఱువుల నుండరాక
శాకొమ్మనల్లు నెగల్లును గవులు విడిచి
తరలి చెంతల నూతి గుంతల వసించెఁ
గెరలి వర్తిలు నమ్మహా గ్రీష్మమునను పద్య 294

అను పద్యము చక్కని లక్ష్యము.

విశేషణములను బెక్కింటిని సమ విభక్తికములుగ బాదాంత సమతతో ప్రయోగించుట శ్రీనాథుని శైలీవైవిధ్యమున నత్యంత విశిష్టమైన లక్షణము. తాదృశమైన శ్రీనాథుని శైలీవిన్యాసమును బంచతంత్ర చంపువను వాదకులు అనుసరించుట ముదావహము. దూబగుంట నారాయణకవి రచించిన

శాల్యన్నఘృత సూప శాక భక్ష్యములతో
వాసనగల రసావళుల తోడ
బహుఫలంబులు గల పానకంబుల తోడఁ
గమనీయ మాంసఖండములతోడ
... ... ... మిత్రభేద-పద్య 321

అను పద్యము, భానుకవి రచించిన

పంపావిరూపాక్ష భైరవి విఠ్ఠలే
శ్వరముఖ్య దేవతా వ్రజము చేత
పరి పంథి గర్వవి భాళన శ్రీకృష్ణ
రాయభూధవ భుజా రక్ష చేత
... ... ... ఆశ్వా5-పద్య 51

అను పద్యము బైచరాజు వేంకటనాథుడు రచించిన

చకిత స్వాంతముతో మహామహి రజశ్ఛన్న ప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజ నిర్వేదైక నిశ్వాసపీ
చికతో బమ్మెరపోకతో నటకుఁ గళ్చెల్లుబ్బక క్షోభమొం
డొక కాంతార మృగంబు భిన్నఖురటంకో ద్రగమే తెంచినన్
ఆశ్వా2-పద్య 176

అను పద్యము లక్ష్యములు.

చంపూకర్తల శైలీవిధానమున వృత్తవైవిధ్యము ప్రముఖపాత్రి వహించుచున్నది. భావము యొక్క స్పష్టతా ప్రతిపాదనమునకు గీత పద్యము, కథాకథనమునకు వర్ణనమునకు సీసపద్యము, నిర్దిష్టము, విశిష్టమునగు భావవ్యక్తీకరణమునకు వృత్తము స్వీకరింపబడుట యొక సంప్రదాయమైనది. కథా సన్నివేశముల ననుసరించి విశిష్టతనో విలక్షణ తనో ప్రదర్శింపబోవునపుడు పదప్రయోగములో విభిన్నతను ప్రదర్శించుటతో బాటు ఉత్సాహమత్తకోకిలాది వృత్త విశేషములను ప్రవేశ పెట్టుట గూడ మహాకవుల రచనా శిల్పమున నొక విశేషముగా బరి గణనీయము. ఔచిత్యము ననుసరించి వృత్తవైవిధ్యమును నిర్వహించుట మహాకవుల శైలీ విన్యాసవైదగ్ధ్య ప్రదర్శకము. చంపూనువాదకులు ముప్పురును సందర్భ సముచితముగ బెక్కు విశేషవృత్తములను ప్రయో గించుట ప్రశంసార్హము.

## *1. నారాయణకవి యనువాదము:*

1) మూర్తీభవించిన నైరాశ్యముతోనున్న సుదర్శన ప్రభు వుతో దశశక్తి సామర్థ్యముల నెఱింగించి యాతని దైన్యమును

బోగొట్ట దలంచి విష్ణుశర్మ యుత్సాహముతో బల్కు సమయమున "అని సుదర్శనుండు పల్కు నట్టి యవసరంబునన్...'(మి. భే-పద్య 59) అని యుత్సాహ వృత్తము స్వీకరింపబడినది.

2) సంజీవకుని అంకెను విని భ్రాన్తపడిన పింగళకునితో దమనకుడు సంజీవకుని దెత్తునని మహోల్లాసముతో పల్కుట –
'అతఁడు నీకను మంత్రిగాఁ దగు నాయనం గొనివత్తు...' మిభే-పద్య 60 అని తరలము నిర్వహింపబడినది.

విభిన్న సన్నివేశములలో ప్రయుక్తములైన మఱికొన్ని ఇతర వృత్తములు :

మిత్రభేదము — మత్తకోకిల – పద్యములు – 474, 520
సుహృల్లాభము — ఉత్సాహము – పద్య 126
సంధి విగ్రహము — 1. లయగ్రాహి – పద్య – 13
2. ఉత్సాహము – పద్య – 209
3. తరలము – పద్య – 278, 329

## 2. ఘనకవి యనువాదము :

ప్రథమాశ్వాసము — 1 కవిరాజ విరాజితము – పద్య 158
2 మత్తకోకిల – పద్య 172
ద్వితీయాశ్వాసము — మత్తకోకిల – పద్య 12
చతుర్థాశ్వాసము — మహాస్రగ్ధర – 9
ఇంద్రవజ్రము – పద్య 21
మత్తకోకిల – పద్య 50

## 3. భైరవరాజుని యనువాదము :

ప్రథమాశ్వాసము — ఉత్సాహము – పద్యములు – 615, 770
తృతీయాశ్వాసము — 1 మహాస్రగ్ధర – పద్య 119
చతుర్థాశ్వాసము — 1 ఉత్సాహము – పద్య 556
2 మత్తకోకిల – పద్య 567

దూబగుంట నారాయణకవి, భానుకవి గావించిన పంచతంత్రాను వాదములలో శైలి సుగమముగ వైశద్య ప్రధానముగ నున్నది. బైచరాజు వేంకటనాథుని శైలి ప్రౌఢము, జటిల సంస్కృత సమాస బంధురము, ప్రాబంధికమునై యున్నది. పండితులకును క్లేశకరమైన దనుట యత్యుక్తి గానేరదు. పదప్రయోగమున వేంకటనాథుని ప్రతిభ యనన్య సామాన్యమని యంగీకరింపక తప్పదు. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు వేంకటనాథుని సంస్కృత పాండిత్యము, సమాస ఘటనము ఆతని యవగుణములుగ బరిగణించుట[1] చింత్యము. కాని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారు ఈ యభిప్రాయమును ఖండించినారు[2]. ఖండనము సముంజసముగా నున్నది. తెనుగుకవులు తమ కావ్యములందు సంస్కృత సమాస బాహుళ్యమును ప్రయోగించుట ప్రసిద్ధమైన విషయము. బైచరాజు పూర్వకవి రాజుల మార్గమునే యనుసరించినాడు. బైచరాజు వేంకటనాథు నుద్దేశించి కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు 'భారత కవిత్వం మొదలుకొని తెలుగు గ్రంథాలలో యేయే కవుల విశేషాలు ఆయా కవుల కవిత్వాలలో కనబడతాయో అన్ని విశేషాలు వొకచో ప్రబంధంలో చూడాలంటే యీ వేంకటనాథుడి కవిత్వంలో చూస్తేచాలు ననుకొంటాను' అని ప్రశంసించినారు[3]. ఈ ప్రశంస ప్రత్యక్షర సత్యబద్ధమైనది. కావున సంస్కృతపద ప్రచురమైన వేంకటనాథునిశైలి గుణవత్తరమైన దేయని చెప్పనొప్పును.

## -: జాతీయములు - నుడికారములు :-

జాతి జీవనవిధానమును సూచించు రమణీయ వాక్య విన్యాసమును జాతీయ మనియు, తత్తద్భాషా రామణీయక నిరూపకవాక్య రచనావిశేషమును నుడికారమనియు, జాతీయము, నుడికారము అను

1 భారతి — సంపుటము 18 — పుటలు 627 - 32

2 వాఙ్మయ వ్యాసమంజరి — పుట 165

3 కథలు-గాథలు — సంపుటము 3 — పుట 288

పదములను స్థూలముగా నిర్వచింపవచ్చును. నుడికారముకనే పలుకు బడియను వ్యవహారమును గలదు. సంస్కృతమున ఇట్టి వానిని లోకోక్తు లందురు. "లోకోక్తీనాం భవేద్యోగో యథావచ్ఛ్రుతి రంజనమ్" అని లోకోక్తి వివరింపబడినది. శ్రుతిరంజనము లోకోక్తి జీవ లక్షణము. ప్రతికావ్యమున నిట్టి వనేకము ప్రయోగింపబడు చుండును. రచనమునకు అవి సొగసును జేకూర్చు చుండును. ఇట్టివానిని బెక్కింటిని బంచతంత్రి చంపూనువాదకులును సందర్భ సముచితముగ బ్రయోగించి నారు. బైచరాజు సంస్కృత సూక్తులనుగూడ ప్రయోగించుట విశే షము. కొన్ని లక్ష్యములు :

*1. దూబగుంట నారాయణకవి :*

మిత్రిభేదము — అవుడుగఱచి (పద్య 261) నిప్పులు కను
దోయినుండి నెగయగ (పద్య 263)

సుహృల్లాభము — పెన్నిధానంబు గన్న పేదయుంబోలె
(పద్య 89) ఇసుమంత (పద్య 156)

సంధి-విగ్రిహము — కాలిపై గోరును బోలవీవు (పద్య 236)
పాిణముల్ తీపనియుండ (పద్య 246)

లబ్ధనాశము — మును పీనుఁగుగా (పద్య 63) సగము
చచ్చిన మేనితో (పద్య 65)

అసంప్రేక్ష్య కారిత్వము — పలపలని వేడ్క తోడుత వెలవెలనై
(పద్య 19) చిత్తంబు జల్లనగు (పద్య 48)

*2. ఘనకవి :*

ప్రథమాశ్వాసము — నోచిన నోములు (పద్య 25) తొక తొ్రక్కిన
భుజంగమ్ము చందము (పద్య 190)

ద్వితీయాశ్వాసము — అల్లారు ముద్దు (పద్య 86)

తృతీయాశ్వాసము — అనంగి పెనంగి, ఉయ్యాలలూఁగ (పద్య 100)

చతుర్థాశ్వాసము — కుడిచి కూర్చుండ్ (పద్య 34) ఎఱిఁగి మెఱిఁగి (పద్య 62)

3. బైచరాజు వేంకటనాథుడు :

ప్రథమాశ్వాసము — కనుంగవ జలజల నశ్రువు ల్దొరుగ (పద్య 227) నేయిపూసిన కత్తి (పద్య 229) నిప్పుత్రొక్కిన కోతి వడువున మడి మలూదక (పద్య 236) మూఁడుకాళ్ల ముసలి (పద్య 316) నాలుగేన్ కాయలు కాయ వచ్చెలువ గర్వమున (పద్య 588)

ద్వితీయాశ్వాసము — కూరలు నారలు (పద్య 153) కంటికెట్లు కూర్కువచ్చు (పద్య 230)

తృతీయాశ్వాసము — మిట్టుకను గ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగ (పద్య 134) తలపేను పంటిసందిది పులు కాలనుముల్లు (పద్య 260) కోతిగొమ్మ గొన్నట్లు (పద్య 363)

చతుర్థాశ్వాసము — దంతాదంతిన్ బాహాబాహి ముఖాముఖి (పద్య 11) విత్తొకటి వి త్తినఁ జెట్టొకటౌనె (పద్య 166) వేయుబొంకి పెండ్లి సేయుదురు (పద్య 287) ఏఁడులు పూఁడులు (పద్య 544)

పంచమాశ్వాసము — అత్తులలేని కుమారుని బొత్తులలో నునిచి (పద్య 20) చెప్పక చెప్పెదున్ (పద్య 25) తుకతుక పోనడచె (పద్య 59)

సంస్కృత సూక్తులు — యథారాజా తథాప్రజా (ఆశ్వా 1 - పద్య 401) న్వాశ్రితావన సమో నహి ధర్మవు

(ఆశ్వా 1 - పద్య 508) కించిద్భయమతి భయమ్ (ఆశ్వా 2 - పద్య 178) ఆత్మ వత్సర్వ భూతాని (ఆశ్వా 3 - పద్య 129) కామాంధోఽపి న పశ్యతి (ఆశ్వా 4 - పద్య 265)

## -: నామకరణ ప్రత్యేకత :-

కథ యనునంతనే అది సంభవించిన ప్రదేశ మెయ్యదియో ఆ పాత్రల నామము లేవియో తెలిసికొనుటకు శ్రోత ఉవ్విళ్లూరుచుండును. కథా పరమార్థా స్వాదనకు ఆ నామకరణ మెంతయో దోహద మొనర్చును. కావున విదగ్ధుడైన కవి కథా ప్రవృత్తదేశమునకు, ఆయా పాత్రలకు గథోచితముగ నామకరణ మొనరించును.

విష్ణుశర్మ పెక్కుకల్పిత పాత్రలతో జిన్నచిన్న కథలను జమత్కార జనకముగ రచించినాడు. ఆ పాత్రలకు ఆ కథ ప్రవర్తించిన ప్రదేశములకు గథోత్కర్షకముగ బేర్లుంచినాడు. చంపూకర్తలు పంచతంత్రి కథల ననువదించుచు మూలమందలి పాత్రల నామములను దేశముల సంజ్ఞలను గ్రహించుటలో గూడ స్వాతంత్ర్యము నవలంబించినారు. అందు గొన్నింట సార్థక్యము చేకూరినది. కొన్నింట ప్రయోజనము మృగ్యమైనది. ఎట్లో పరిశీలింతము.

### మిత్రభేద తంత్రము :

1) పంచతంత్రము అమరశక్తియను ప్రభువర్ణనముతో ఆరంభింపబడినది. అతనికి బహుశక్తి ఉగ్రశక్తి అనంతశక్తియని ముప్వురు పుత్రులు గలరనియు, సుమతి యాతని మంత్రియనియు నందు గలదు. చంపూకర్తలు హితోపదేశానుసారము సుదర్శన ప్రభువర్ణనముతో గథనారంభించిరి. ఆ ముప్వురు రాజపుత్రులు, మంత్రియు గథలో

ప్రాధాన్యము వహింపక పోవుటచే చంపూకర్తలు వారినామములను గ్రహింపలేదు. ఈ అమరశక్తి వసించిన నగరము మహిళారోప్యమని పంచతంత్రమున గలదు. హితోపదేశాను సారము అనువాదకులు పాటలీపురమని మార్చి రచించినారు.

2) వర్ధమానునికథ మహిళారూప్యనగరమున ప్రవర్తించినట్లు పంచతంత్రమున గలదు. దానిని బూటగుంట నారాయణకవి మహిళాపురమనియు, భానుకవి మహిళారోప్య నగరమనియు బైచరాజు మహిళానగరమనియు మార్చినారు.

3) 'నక్క–భేరి అనుకథలో భానుకవి మాత్రము నక్కకు లంబకర్ణుడని పేరుంచినాడు. నామము సార్థకము. మూలమునగాని యితరానువాదములగాని నామకరణము మృగ్యము. అట్లే ఈ కథలో బైచరాజు 'పరవిక్రమ సింహాపుర నికట వటకాంతారమున' (ఆశ్వా.1 పద్య 86) అని విక్రమసింహాపురమును బేర్కొనుట కేవల మమూలకము. ఇది కవినివాసస్థల నిరూపణకు గొంతవరకు నుపకరించుచున్నది.

4) 'మందవిసర్పిణ యనుపేను–అగ్నిముఖమను నల్లి' యను కథలో మూలమున బేనుపేరు మందవిసర్పిణి. నల్లిపేరు అగ్నిముఖము. అనువాదకులు మువ్వురు పేనుపేరు యథాతథముగ గ్రహించినారు. నల్లినామమును మాత్రము మార్చినారు. నారాయణకవి డిండికుడనియు భానుకవి డిండిభమనియు బైచరాజు దుందుభుకమనియు వ్యవహరించినారు. అగ్నిముఖమను నామము సార్థకము.

5) 'సింహము–ద్వీపి–వాయసగోమాయువు'లను కథ చోళమండలమున జరిగినట్లు బైచరాజు చెప్పుట యమూలకము

6 కచ్ఛపము–హంసద్వయమను కథలో మూలమందలి వికట సంకటులను హంసల పేళ్లు బైచరాజుచే విడువబడినవి. ఆతడు కథలో విదిశా నగరమును బేర్కొనుట యమూలకము.

7) మూడు చేపల కథలో విష్ణుశర్మ ఆచేపలకు అనాగత విధాత,

ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుడు అను పేర్లుంచినాడు. అనాగత విధాతయనుపేరు అనువాదములు మూడింట సమానమేగాని ప్రత్యుత్పన్న మతియను పేరును భానుకవి ఉత్పన్నమతియనియు, వైచరాజు ప్రత్యుత్పన్న ప్రజ్ఞుడనియు మార్చినారు. అర్థమున వ్యత్యాసము కనుపించదు. భానుకవి యద్భవిష్యుడను నామమును భవిష్యమతి యని మార్చినాడు.

8) 'వానరయూథము – సూచీముఖమను' కథలో వానర నామము పేర్కొన బడలేదు. భానుకవి మాత్రము వలిముఖుడని పేరు పెట్టినాడు.

9) 'ధర్మబుద్ధి-పాపబుద్ధి' అనుకథలో నారాయణకవి ధర్మబుద్ధి యను పేరు మార్చి సుబుద్ధియని రచించినాడు. తక్కినవారు మూలము ననుసరించిరి. పాపబుద్ధియని మూలమున నుండగా నారాయణకవియు వైచరాజును దుష్టబుద్ధియనియు, భానుకవి కుబుద్ధియనియు మార్చినారు. శబ్దభేదమేగాని యర్థభేదము గానరాదు.

10) 'వణిజుడు–లోహతుల' యనుకథ కావేరీతటమందలి మహిషాపురమున సంభవించినట్లు వైచరాజు రచించుట యమూలకము.

## మిత్రసంప్రాప్తి తంత్రము :

1) ఈకథ యందలి లఘుపతనకుడు నివసించు బూరుగు వృక్షము మహిళారోప్యనగర సమీపమున నున్నట్లు వైచరాజు రచించుట యథామూలకమే గాని ఆవాయసము సరయూకాననమున కేగినున్నట్లు రచించుట యమూలకము. అట్లే చిత్రాంగుని కథయందు జింకపేరు చిత్రాంగదుడని రూబగుంట వైచరాజు మార్చినారు. అందలి పుష్కరుడను ప్రభువు ఉత్కల మందలి కటక నగరాధిపతియని వైచరాజు రచించుట యమూలకము.

2) 'తామ్రచూడుడు-బృహత్స్ఫిక్' అనుకథలో మూలమందలి పరివ్రాజకుని పేరు తామ్రచూడుడు. అనువాదకులు ముప్వురును

చూడాకర్ణుడని మార్చినారు. అశ్లేమూలమందలి బృహత్‌స్ఫిక్ అను నామమును మార్చి నారాయణకవి బృహస్ఫిక్ అనియు, భానుకవి బృహస్ఫియనియు, బైచరాజు బృహస్ఫోటుడనియు రచించినారు. అన్యథాకరణమునకు నెట్టి విశేష ప్రయోజనము సిద్ధించుట లేదు. మూలమందలి బృహత్‌స్ఫిక్ అనునామము సార్థకము. పెద్దపిరుదులు గలవాడని యర్థము.

3) 'బ్రాహ్మణి-తిలచూర్ణము' అనుకథలో బ్రాహ్మణుని నామమును భానుకవి వేదాగ్రేసరుడని పేర్కొనినాడు. నామకరణము సార్థకము.

4) 'పుళిందుడు-నక్క- అతితృష్ణచే జచ్చుట' అనుకథలో నారాయణకవి నక్క పేరు దద్రుకమనియు, బైచరాజు దహ్యాకమనియు పేర్కొనుట యమూలకము.

## కాకోలూకీయ తంత్రము

1) పంచతంత్రమున మేఘవర్ణునకు నైదుగురు మంత్రులున్నట్లును జివరకు జిరంతినుడు, పితృసచివుడునగు స్థిరజీవిచే నతడులూకవిజయ మొందినట్లును రచింపబడెను. తెలుగుకవులు మంత్రులైదుగురనియే పేర్కొనిరి. మూలమందలి మంత్రులపేర్లు-ఉజ్జీవి, సంజీవి, అనుజీవి, ప్రజీవి, చిరంజీవి, స్థిరజీవి, నారాయణకవి ఉద్దీపి, సందీపి, ఆదీపి, ప్రదీపి చిరంజీవి యని మార్చినాడు. భానుకవియు బైచరాజును నారాయణకవి ననుసరించిరి. కాని ప్రోద్దీపికి బదులు ప్రదీపియని యన్యథాకరించిరి. చిరంజీవి పితృసచివుడని యనువాదకులు పేర్కొని కథ రచించిరి. జీవి యను పదాంశమునకు దీపియని మార్చి అనువాదకులు దానికి ముందు భిన్నోపసర్గలు చేర్చినారు. అన్యథాకరణమునకు విశేషప్రయోజనము గనుపింపదు.

2) 'గజయూథపతి-శశము' అనుకథలో మూలమున గజ యూథపతి పేరు చతుర్దంతము. శశముపేరు లంబకర్ణుడు. నారాయణ

కవి శశపతి పేరు శిలీముఖుడనియు మంత్రి పేరు విజయుడనియు రచింపగా దక్కినయిరువురు వానినే స్వీకరించిరి. విజయుడను నామము సార్థకము.

3) శశ కపింజలుల కథలో జంపూకర్తలు శశకనామము దీర్ఘ కర్ణుడని రచించుట యమూలకము. మూలమున మార్జాలనామము తీక్ష్ణదంతుడని కలదు. సార్థకముగానున్నది. నారాయణకవి దధికర్ణు డనియు భానుకవి ధార్మికుడనియు మార్చిరచించినారు. ధార్మికుడను నామమందలి వ్యంగ్యము మనోహరము. ఈకథ యమునాతీరమున జరిగినట్లు భానుకవి రచించుట, బైచరాజు యమునాతీరమందలి వింధ్య భూమియందు సంభవించినట్లు రచించుట యమూలకము.

4) 'వృద్ధవణిక్కు-చోరుడు' అనుకథలో వణిజుని పేరు కామా తురుడని మూలమున నుండగా ధనగుప్తుడని నారాయణకవియు, సార్థ వాహుడని భానుకవియు వసుగుప్తుడని బైచరాజును మార్చుట యన్యథా కరణము. కామాతురుడను నామమే సాభిప్రాయముగా నున్నది. ఆసెట్టి భార్యపేరు రూపవతియని బైచరాజు రచించుట సార్థకము; కామాతురుడు కుండిన రాజధాని నివాసియని బైచరాజు పేర్కొనుట యమూలకము.

5) వీరధరుడను రథకారుని కథలో రథకారుని భార్యపేరు కామదమని యని మూలమున గలదు. ఆనామము సార్థకము. అను వాదకులు విడచుట చింత్యము. ఈ కథ కేరళదేశమునకు సంబంధిం చిన దని బైచరాజు రచించుట యమూలకము.

6) 'మండూకపతి-సర్పము' అనుకథలో దూబగుంటనారాయణ కవి మండూకనాథుని పేరు జలపాదుడని రచించినాడు, భానుకవియతని ననుసరించినాడు. ఇది యమూలకము. బైచరాజు పాపఱేని పేరు మందవిదుషని మార్చినాడు. మంద విషుడను మూల మందలి నామము సముచితముగా నున్నది.

## లబ్ధప్రణాశ తంత్రము :

1) ఈ తంత్రమునకు నాయకుడనదగిన కపిపతి పేరు రక్తముఖు

డనియు ప్రతి నాయకుడనదగిన మకరపతి పేరు కరాలముఖుడనియు మూలమందుగలదు. కపీంద్రునకు నారాయణకవి బలివర్ధనుడు, భాను కవి బలివర్ధనుడు, వైచరాజు బహుమానుడు అని మార్చి రచించినారు. కరాలముఖుని నామమును నారాయణకవియు, వైచరాజును క్రకచుడ నియు, భానుకవి శింశుమారుడనియు రచించుట యన్వర్థాకరణము. నామకరణము సార్థకము. వైచరాజు బహుమానుని నివాసము దక్షిణ శరధితటమని రచించుట యమూలకము.

2) 'సింహము – నక్క – గార్దభమను' కథలో మూలమున సింహము పేరు కరాలకేసరము, నక్కపేరు ధూసరకము. సింహ నామమును వైచరాజు దీర్ఘదంష్ట్రమనియు, నక్కనామమును ఘటకు డనియు మార్చినాడు. ఈనామములు సార్థకములు. నారాయణకవియు భానుకవియు నామకరణమును త్యజించినారు.

3) 'రజకుడు–గార్దభము' అనుకథలో మూలమున జాకలిపేరు శుద్ధపటుడు. కథలో నాతనికి స్వల్పప్రాధాన్యము గలదు గావున చంపూకర్తలు ఆనామమును విడచిరి.

## అపరీక్షిత కారిత్వతంత్రము :

1) 'కోమటి–క్షపణకుడు' అను కథలో మూలమున నతని పేరు మణిభద్రుడని యున్నది. భానుకవి సౌవర్ణియని మార్చినాడు. తక్కిన వారు విడిచినారు.

2) 'బ్రాహ్మణుడు–నకులము' అనుకథలో నారాయణకవియు, వైచరాజును బ్రాహ్మణునిపేరు యాజ్ఞసేనియనియు, భానుకవి సస్యసేని యనియు పేర్కొనినారు. యాజ్ఞసేని యనునామము సముచితము. ఈ కథ గౌడదేశమునకు సంబంధించినదని నారాయణకవియు, వేంకట నాథుడును రచించుట యమూలకము.

3) 'బ్రాహ్మణుడు–సక్తుపూర్ణకలశము' అనుకథలో బ్రాహ్మ ణుని పేరు స్వభావకృపణుడని మూలమున గలదు, నామము సార్థకము.

నారాయణకవి సోమశర్మ తండ్రి యని పేర్కొటనులో విశేషము గాన రాదు. ఆ బ్రాహ్మణుడు దాశార్ణభూతల వాసియని బైచరాజు పేర్కొనుట యమూలకము.

ఘానుకవి యధికముగ రచించిన కథలలోని నామములు :

1) ప్రథమాశ్వాస మందలి 'కాకి–హంస' యనుకథలో వాయసము పేరు కాండోద్భవుడు. హంసపేరు చక్రి.

2) ద్వితీయాశ్వాస మందలి 'మూషికము–గజమిథునము' అను కథలో మూషికనామము విఘ్నకుడు. వారణపతిపేరు భీముడు. నామములు కథోచితములు. ఈ కథకు రంగస్థలము ప్రభంజన నగరమనియు నది శోణిత నదీతీరమున గలదనియు పేర్కొనబడెను.

3) తృతీయాశ్వాసమున 'విటుడు–వేశ్యమాత' యనుకథలో వేశ్యమాత పేరు చిత్రాంగి.

4) పంచమాశ్వాస మందలి 'శిష్యులు–గురువు' అనుకథలో శిష్యులపేర్లు సితాసితులు. యతి పేరు సిద్ధవటుడు

బైచరాజు క్రొత్తగా రచించిన కథలలోని నామములు :

1) చతుర్థాశ్వాసమందలి 'బ్రాహ్మణుడు రాజపుత్త్రిని వీడుట' యను కథలోని నామములన్నియు సార్థకములు. అందు రాజపుత్రిపేరు భువన మోహినియనియు, ఆమె తండ్రిపేరు సుకీర్తియనియు, గురువు నామము మందుడనియు, భర్తనామము జయసేనుడనియు పేర్కొన బడెను. ఈ యాశ్వాసమందలి 'హాలిక కాంత భర్తృ రాజబాధనొందుట' యనుకథలో గాపుకొడుకు విహారభద్రుడనియు, భార్య ఇచ్ఛావతి యనియు, సార్థకముగా నామకరణ మొనరింపబడెను. అట్లే హాలికుడు కాంచీపుర వాసియనియు పేర్కొనబడెను. ఈ యాశ్వాస మందలి 'నక్క–తాబేలు' అనుకథలో గూర్మము నామము అభిజాతుడని గలదు.

పంచతంత్రి కథలలోని పాత్రలకు, అవి ప్రవర్తించిన ప్రదేశము లకు సందర్భోచితముగ నామకరణ మొనరించి కథలకు పుష్టిని బరి పూర్ణతను బొందించి చంపూకర్తలు తమ రచనా శిల్ప కౌశలమును వెల్లడించుకొనిన విధమత్యంత ప్రశంసార్హముగా నున్నది.

## -: ప్రయోగ విశేషములు :-

చంప్వనువాదకులు శబ్దశాస్త్రజ్ఞులేయైనను వారి యనువాదము లందు కొన్ని ప్రయోగములు లక్షణమునకు విరుద్ధములుగా గనుపట్టు చున్నవి. గ్రంథపీఠికా కర్తలు వానిని గమనించి పేర్కొనినారు. వాని సామంజస్యము ననుశీలించుట సముచితము.

బాలవ్యాకరణమున 'అత్తునకు సంధి బహుళము' అని అకార సంధి సూత్రింపబడినది. సామాన్యముగ హ్రస్వమగు అకారమునకు అచ్చుపరమగుచో సంధిరాకుండుట, యడాగమముగలుగుట ప్రయో గము లందు గానవగును. యడాగమముతో నున్నరూపములే శ్రుతి సుభగములుగ నుండును. చంపూకర్తలు సంధించిన రూపములను ప్రయోగించుట విశేషము. దూబగుంట నారాయణకవి మిత్రభేదమున సన్నెఱిగి (పద్య 112) కాకని (పద్య 268) ఉన్నెడకు (పద్య 269) అనియు, సంధి—విగ్రహమున అనకతివ (పద్య 244) అనియు, లబ్ధనాశ మున మే తెల్ల (పద్య 87) అనియు ప్రయోగించినాడు. భానుకవి ప్రథమాశ్వాసమున విష్ణుశర్మను (పద్య 54) పెద్దగుచు (పద్య 220) విధాతనువాడు (పద్య 259) అనియు ద్వితీయా శ్వాసమున రక్షితగు (పద్య 25) అనియు ప్రయోగించినాడు. వైచరాజు చతుర్థాశ్వాస మున కానుకిచ్చినన్ (పద్య 9) అనియు ప్రయోగించినాడు. ఇందు భానుకవి ప్రయోగించిన తత్సమాకార సంధి రూపములు తక్కినవాని కంటె మిక్కిలి శ్రుతికటువుగా నున్నవి. దూబగుంట నారాయణకవి మిత్రభేదమున ప్రయోగించిన ఇంటాతని అను రూపము గూడ శ్రవణ దుర్భరముగా నున్నది. ఇకార సంధి ప్రవర్తింపక యడాగమ సహిత ముగా నుండుటయే సహజము.

చిన్నయసూరి 'క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు' అని బాల వ్యాకరణమున క్త్వార్థకేకారమునకు సంధిని నిషేధించినాడు. చంపూ కర్తలు సంధిగావించిన రూపములను ప్రదర్శించినారు. దూబగుంట నారాయణ కవి దాగున్నవాడు (మి. భే–పద్య 373) అనియు భానుకవి మేసచట (ఆశ్వా1–పద్య67) కలిగున్నది (ఆశ్వా1–పద్య 246) అనియు బైచరాజు పాసిఉలు (ఆశ్వా1–పద్య 299) అనియు ప్రయో గించినారు. ఇట్టి ప్రయోగములు పూర్వ కవులును బహువిరళముగ ప్రయోగించినారు. కావుననే ప్రౌఢవ్యాకర్త 'ఇ ప్రత్యయాంతావ్యయం బునకు సంధియు జూపట్టెడి' అని సూత్రించినాడు.

'కువర్ణకంబు పరంబగునపుడు కార ఋకారంబులకు నగాగమం బగు' అని చిన్నయసూరి బాలవ్యాకరణమున ఉకార ఋకారములకు కువర్ణకము పరమగుచో నగాగమము నిత్యముగనగునని విధించినాడు, చంపూకర్తలు నగాగమ రహితములైన రూపములను ప్రయోగించి నారు. దూబగుంట నారాయణకవి చెవులపోతుకు (మి. భే–పద్య 254) గారవముకిమ్ము (సం వి–పద్య6) భానుకవి భూతలాధిపుకు (ఆశ్వా1– పద్య 155) రాజుకు (ఆశ్వా 1–పద్య 333) బైచరాజు పడుచుకు ఆశ్వా3–పద్య 208) అని ప్రయోగించినారు. నగాగమము లేని రూపములు ప్రాచీనకావ్యములలో నాచనసోమన, శ్రీనాథాదు లెచ్చ టెచ్చట ప్రయోగించిరో కళాప్రపూర్ణ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు బాలకవి శరణ్యమున వివరించినారు[4]. అశ్లీలార్థ స్ఫురణ కలుగకుండుటకు నగాగమును విధించుట సముచితము. భానుకవి యొక్క తొలి ప్రయోగమున నట్టి యర్థస్ఫూర్తి గలదు. అట్టివి పరిహార్య వ్యములు. తక్కినవి యుపేక్షింపదగినవే.

బాలవ్యాకరణమున చిన్నయసూరి 'క్రియాఫలము కర్తృగామి యగుచో గొనుధాతువను ప్రయుక్తంబగు' అని సూత్రించి వండుకొను

4 పుటలు 81–8

మున్నగు రూపములను సాధించినాడు. ఈ కొనుధాతువుతోఁ గూడిన రూపములను జంపూకర్తలు ఉక ప్రత్యయాంతముగా ప్రయోగించుట విశేషము. దూబగుంట నారాయణకవి మిత్రభేదమున పొడుచుక (పద్య 96) మోచుక (పద్య 112) కట్టించుక [పద్య 191] ఎత్తుక [పద్య 546] తోడుక (పద్య-555) సుహృల్లాభమున వ్రిచ్చుక (పద్య 11) కూడుక (పద్య 162) పుచ్చుక (పద్య 173) త్రెంచుక (పద్య 236) సంధి విగ్రహమున పట్టుక (పద్య 50) తీర్చుక [పద్య 220] అని ప్రయోగించి నాడు. భానుకవి ప్రథమాశ్వాసమున పుచ్చుక (పద్యములు 64, 289) పట్టుక [పద్య 139, ఆశ్వా 5 పద్య 46) విడిపించుక (వచ 143) చిక్కంబట్టుక (పద్య 154) చేసుక (పద్య 315) ద్వితీయాశ్వాసమున తప్పించుక [వచ 45] కొనుక (పద్య 85) తృతీయాశ్వాసమున అంటుక (పద్య 71) చతుర్థాశ్వాసమున అంపించుక [వచ 26] కౌగిలించుక (వచ 58) కూడుక (పద్య 71, ఆశ్వా 5 పద్యములు 18, 19) పంచమాశ్వాసమున ఎత్తుక [పద్య 8] సంధించుక (వచ 11) పాతుక (పద్య 15) బంధించుక [వచ 24] సంగ్రహించుక [వచ 43] అని ప్రయోగించి నాడు. ఈ రూపములు బాలవ్యాకరణ విరుద్ధములే. కాని ఇట్టి రూపములను అనంతుడు, అప్పకవి. మున్నగు లాక్షణికులే గాక శ్రీనాథాదులును ప్రయోగించినారని బాలకవిశరణ్యమున నుదాహరణ పూర్వకముగా నిరూపింపబడెను[5].

చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు తమ 'కథలు—గాథలు' అను గ్రంథ తృతీయ సంపుటమున వేంకటనాథుని రచనా విన్యాసములను గుణదోష విమర్శ పూర్వకముగ సమీక్షించుచు నాతని ప్రయోగ విశేషములను బదుమూఁడింటిని జూపి వాని సాధుత్వా సాధుత్వములను జర్చించి యున్నారు[6]. వారు పేర్కొనిన ప్రయోగములు :

5 పుటలు 127—36

6 పుటలు 300—306

1 వేమునకుఁ బోయు పాలయ్యె వృద్ధసేవ
2 దొరికెఁ జండాలుర తోడి మైత్రి
3 అధివసియించె న్నిజ ప్రియా విముఖింబై
3 బల ధిక్కృత, నాకపులఁ బంపిన న్నిశ్శంకన్
5 పందకుఁ గాక పలాయన, కందళి
6 కూతురి నెలుకంగా జేసె
7 దూతియా రేతిరిఁబోయి చీర నగరి ప్రతిరథ్య
8 మంచము క్రిందఁ దూటికొని మానము గైకొని
9 విట విటీ జాతి
10 కొయ్యలూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు
11 చని తస తన వాగ్వాదములను దానికి శశకపింజలమ్ములు సెప్పెన్
12 పోసునకుఁ దుదఁ గాలు ద్రివ్వన్
13 నాఁటికి నది సరిపోయె మఱుసునాఁ డుదయమునన్

ఔప విభక్తిక చిహ్నమైన పకారా దేశముతో వేఁపకున్ అని యుండుటకు బదులు వేమునకున్ అని ప్రయోగింపబడినది. అట్లే పోరికిన్ అనుటకు పోరునకున్ అని రచింపబడినది. ఔపవిభక్తిక వికారములు ఎక్కడో తప్ప నిత్యములు కావని పై రెండు ప్రయోగములను వేంకటశాస్త్రిగారు సమర్థించినారు. చండాలురతోడి మైత్రియనుచో మాలవాఁడను నర్థమున దోషము లేదుగాని చండ, అళి యను పదవిభాగమున దుమ్మెదలను నర్థమున బహుత్వమున రేఫా దేశమున కవకాశము లేదు కవికీమాత్రము తెలియక పోదని చెప్పి శ్రీశాస్త్రిగారు శ్లేషలో నిట్టి నీహారలేశాలు సహింపబడగలవని సమర్థించినారు. అధియనునుపసర్గ పూర్వకమైన వస్ ధాతువున కించుకాగమము గలుగగా నధివసించెన్ అని యగునుగాని ఇయుడాగమము ప్రాప్తించి అధివసియించెన్ అను రూపముండదని శ్రీ శాస్త్రిగారు పూర్వపక్షమొనర్చి పెక్కండ్రు మహాకవులు ఇట్లు ప్రయోగించినారని వేంకట

నాథుని ప్రయోగమును సమర్థించినారు. అవ్యయీభావ సమాసమగుటచే నిశ్శంకమునన్ అని మువర్ణక సహితముగా నుండవలెనని చెప్పి శ్రీశాస్త్రిగారు ఆంధ్రకవి ప్రయోగములు మువర్ణక రహితములుగ నున్నవనియు నట్లైన ప్రవాహ సుఖమునకు లోపము గలుగదనియు పేర్కొని నిశ్శంకన్ అను వేంకటనాథుని ప్రయోగమును సమర్థించినారు. పంచనుగాక యనునప్పుడు పంచ యను శబ్దమునకు శబ్దరత్నాకరమున పిడికి యనునర్థము నంగీకరించిన దోష ప్రసక్తి యుండదని సూచించినారు. కస్తూరిన్ అనునప్పుడు మహాకవులు గొందరు ప్రథమేతర విభక్త్యంతములుగా దుగాగమాంతమును ప్రయోగించినారని శ్రీశాస్త్రిగారు సమర్థించినారు, కేతిరి యనుచోట శబ్దరత్నాకరకారుడు కేయను పదమును వికృతిగా భావించుటచే నది రాత్రికి వికృతిగా బరిగణింపబడి యుండుననియు నట్లైన కేతిరియనునదియు రాత్రికే వికృతి కావచ్చుననియు శ్రీశాస్త్రిగారు వివరించినారు. మంచముక్రింద దూఱికొని యనుచో కొనుధాత్వను ప్రయోగ ప్రయోజనము స్వార్థనిర్వాహణమని శ్రీశాస్త్రిగారు స్మరించినారు. అట్లే విట విటీజాతి యను ప్రయోగమున విశేషము గావలసి యుండగా సంస్కృతకవులేగాక తెలుగుకవులును బాటించలేదని చెప్పి శ్రీశాస్త్రిగారు 'నదనదీ' యను కాళిదాస ప్రయోగము నుదాహరించినారు. పెండ్లికొడుకుకు అనుచో నగాగమము లేదనియు నిట్టి నగాగమ రహిత ప్రయోగములు పూర్వాంధ్ర సాహిత్యమునను గలవని శ్రీశాస్త్రిగారు సూచించినారు. తన తన వాగ్వాదముల ననుచో 'తమతమ' యని యుండవలెనని భావింపరాదనియు తిక్కనకూడ 'తనతన మదినున్న తెఱంగు తథ్యము చెప్పుడా' యని ప్రయోగించినాడనియు లోకవ్యవహార మట్లుండి యుండుననియు జెప్పి శ్రీశాస్త్రిగారు వేంకటనాథుని సమర్థించినారు. మరునాడుదయమునన్ అనునపుడు మరున శబ్దమౌపవిభక్తిక మగుటచే ఔపవిభక్తిక వికారములు నూటికి దొంబది తొమ్మిది వఱకు నైచ్ఛికములనియు టవర్ణకాప్రాప్తిని శంకింప బనిలేదనియు శ్రీశాస్త్రిగారు సూచించినారు. కాని యట్టి

టివర్ణక రహిత ప్రయోగము వ్యవహారమునను గనుపింప లేదనియు వారు పేర్కొనినారు. ఈ సందర్భమున 'ఆ పాతాళ గభీర పయో పూర్ణ మహాప్రవాహమైనను' అను ప్రయోగము నొసంగి శ్రీ శాస్త్రి గారు పయఃపూర్ణ యని దిద్దిన యతిబాధ తప్పనుగాని ప్రాసభంగ మగునని హెచ్చరించి సకారాంత శబ్దముల విషయమున బండితులు గూడ బొరపాటు నొందుచు మనోతృప్తి వగైరాల నుచ్చరింతురని ప్రవచించి ప్రతి కవియు భ్రాంతివలన నిట్టివాని నక్కడక్కడ ప్రయో గించునని సమర్థించినారు. ఇట్లు వేంకటనాథుని ప్రయోగములను శ్రీ వేంకటశాస్త్రిగారు సమర్థించిన విధము నాతని కవిత్వమును ప్రశం సించిన రీతి పరమశ్లాఘ్యముగా నున్నది.

పౌరుషేయములగు కృతులలో దోషములు సంభవింపక తప్పవు. కాళిదాసాదుల రచనము లందును త్రియంబకాది పాణినీయ వ్యాకరణ విరుద్ధప్రయోగములు గనుపట్టుచునే యున్నవి. దోషము లన్వేషించుట కుపక్రమించిన నెవ్వని కృతియందైనను లభింపకపోవు. కేతన ఆంధ్ర భాషాభూషణమున

> నేరములు కాళిదాస మ
> యూరాదులకైనఁ గలుగ నొరులకు లేవే
> సారమతులైన సుకవుల
> కారుణ్యము కలిమి నేర్పు కవిజనములకున్ పద్య 11

అని యుగ్గడించుట సమంజసముగనే యున్నది. దండ్యాచార్యుడు కావ్యాదర్శమున కావ్యమునందు దోషము చిన్నదేయైన నుపేక్షింపరా దని ప్రథమపరిచ్ఛేదమున

> తదల్పమపి నో పేక్ష్యం కావ్యేదుష్టం కథం చన
> స్యాద్వపుః సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్
> కారిక 7

అని శాసించినాడు. కాని మహాకవుల కావ్యములందును దోషములు గలవు. 'దృష్టంకిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం న నిర్గుణమ్' అను

చొప్పున ఏదోషమును లేని కావ్యము ఏసాహిత్యమున నుండజాలదు. దోషములుండుట సహజమే. కాని మహాకవుల రచనలలో గుణ బాహుళ్యమున దోషలేశములు నిమగ్నములగును. 'ఏకోహిదోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అను కాళిదాసోక్తి ప్రత్యక్షర సత్యబద్ధమైనది. దోషములలో రసాపకర్షకములు పరి హార్తవ్యములు. 'రసాపకర్షకాః దోషాః' అనునార్యోక్తి సర్వదా శిరోధార్యము. అవి నిత్యదోషములుగ బరిగణనీయములు. రసాస్వాదన ప్రతి బంధకములుగానివి అనిత్య దోషములు. అవి యుపేక్ష్యములు. కావ్యములందు సామాన్యముగ నట్టి దోషములే పెక్కులుండును. పంచతంత్రి చంపూంగ్రీకరణము లందలి దోషము లట్టివే. కావున ఆ యనువాదములు విద్వత్ప్రశంసార్హములు, సర్వజనా స్వాద్యములు గాగలవు.



# 6. ఇతర పంచతంత్రానువాదముల సంగ్రహ పరిచయము

ప్రాక్పశ్చిమ దేశములలో బహుళ ప్రచారమునన్న సంస్కృత పంచతంత్రి మాంధ్రభాషలో జిరకాలము నుండి యనువదింపబడు చున్నది. ఒక్కొక్కయనువాద మొక్కొక్క ప్రత్యేకతతో సంతరింప బడినది. అందు తొలియనువాదమెప్పుడు రచింపబడినదో నిర్ణయించి చెప్పశక్యముగా కున్నది. లభించిన యాధారముల బట్టి పెక్కుశతాబ్దుల క్రిందటనే పంచతంత్రము తెలుగుకవుల దృక్పథమున బడి మధురాకృతిని బొందినదని యూహింపవచ్చును. ఇక పంచతంత్రమేయే కాలము లలో ఏయేరూపములలో ఏయేరీతుల నాంధ్రీకరింపబడినదో పరిశీలింతము. ప్రసిద్ధములైన రెండు ఆంగ్లానువాదముల గూడ సమీక్షింతము.

## 1. శ్రీయుతులు వేటూరివారు పేర్కొనిన యనువాదము :

సుప్రసిద్ధ విమర్శకాగ్రేసరులైన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తమ ప్రబంధరత్నావళి యను నొక సంకలన గ్రంథమందు అముద్రితము, అప్రసిద్ధము అజ్ఞాతకర్తృకములైన గ్రంథజాతము నుండి పద్యములను దాను సేకరించిన వానిని ప్రచురించుచు బంచతంత్రమను శీర్షికలో నాల్గు పద్యముల నుదాహరించియున్నారు[1] కవి నామకాలాదికము దొరకిన నాగ్రంథ ప్రాశస్త్య మెట్టిదో చర్చించి నిరూపించుట కవకాశముండెడిది. లభింపక పోవుట మన దురదృష్టము. అందుదాహృతములైన పద్యములు :

అన్యదేశ మెల్ల నాత్మదేశంబుగా
తలఁచువాఁడు నెపుడుఁ దలఁకు లేక
రమణ సేఁత యెల్లరాజ్యంబు సేఁతగాఁ
దలఁచువాఁడు ప్రియుఁడు ధరణిపునకు

చెలువుగ దుష్కరంపుఁబని సేసియుఁ జేసితినాక కూరితం
బలుకఁడు ప్రేసినం గడవఁ బల్కిన నుల్లములోన నొండుగాఁ
దలఁపక పల్కుచొప్పిదము తథ్యముగాఁ దగఁ బల్కె మోసలన్
బిలువక వచ్చియున్నతఁడు భృత్యుఁడు రాజునకెన్ని భంగులన్

బలుకొఱడు వోలె నెండకు
జలికిని వానకును నోర్చి జనపతి నెవ్వాఁ
డలవడఁ గొలుచును వానికి
వలనొప్పఁగ సిరులు దాన వచ్చి వసించున్

మానుగఁ బతి పిలిచినఁ దన
చేసెడి పని గాదనక వేగ చేయని యనలం
బైనం గోరవలయు నింపుగ
నైనను సేఁదంగవలయు నర్థిని భృత్యుల్

1 పుటలు 151 - 155

ఈ పద్యములలో నుత్తమసేవకుడెట్లు ప్రవర్తింపవలయునో యెట్టి ప్రతిఫలమును బొందునో మనోహరముగా నిరూపింపబడినవి, ఈ పద్యము లేసందర్భమున జెప్పబడినవో గుర్తించుట కష్టము. దమనక పింగళకుల సంభాషణముననో దమనక సంజీవకుల సంభాషణముననో, కరటకదమనక సంభాషణముననో యీ పద్యములు పేర్కొనవడి యుండునని యూహింపవచ్చును. ఇందలి పదరచనము భావమైశద్యము, మనోజ్ఞముగా నున్నవి. గ్రంథమంతయు లభించినచో పంచతంత్రానువాదములలో దీని స్థానమును నిర్ణయించుటకు నవకాశము లభించెడిది. ఈ యనువాదము బహుశః చంపూ పద్ధతిలో నిర్వహింప బడినదేమో. చెప్పజాలము.

## 2. సకల నీతి సమ్మత మందలి యనువాదము :

సుమారు క్రీ. శ 1420 ప్రాంతమునందున్న మడికి సింగన యను మహాకవి నీతిబోధకములైన పెక్కు పద్యములను సేకరించి సకలనీతి సమ్మతమును పేర నొక సంకలన గ్రంథమును సంధానించినాడు. అందు 189 పద్యములున్నట్లు పీఠికలో నిడుదవోలు వేంకటరావుగారు సూచించినారు[2]. మడికి సింగన తన సంకలన గ్రంథమున పంచతంత్రానువాద పద్యముల నుదాహరించి నాడేగాని యనువాదకుని నామమును బేర్కొనకుండుట విచార్యము. మడికి సింగన తక్కిన గ్రంథములందలి పద్యముల విషయమునను గర్తృనామములను బేర్కొనలేదు. తన సంకలన గ్రంథమున బంచతంత్ర పద్యములను బేర్కొనుటనుబట్టి సింగనకాలమున ఆ యనువాదము లోకప్రశస్తి నందియుండునని యూహింప వీలున్నది. సింగనకాలమునుబట్టి ఆ యనువాదకుడు క్రీస్తుశకము పదునేనవ శతాబ్దికి బూర్వుడే యైయుండవలెనని నిర్ణయింపవచ్చును.

సకలనీతి సమ్మతమున నుదాహరింపబడిన పంచతంత్ర పద్యములు ముక్తకప్రాయములుగా నున్నవి. అందు దుర్గసంరక్షణము, ఆజ్ఞాపాలనము, ప్రజాపాలనము, రాజాదాయ వ్యయపరిశోధనము, రాజ

2. సకలనీతి సమ్మతము - పీఠిక పుట 26

నీతి, రాజులకు గొఱగాని గుణములు, వైద్యనీతులు, పురోహిత నీతి, జ్యోతిషకుడు, విద్వాంసుడు, రాయబార పరికారము, చారుల నీతులు, రాజభృత్య నీతులు, భృత్యులకు గొఱగాని రాజుల లక్షణములు, సేవక నీతులు, సేవకు గొఱగాని రాజులు, షోడశసంధి పరికారములు, సామము, భేదోపాయము, మంత్రి రక్షణార్థములు, అనసూయత, దండయాత్ర, ప్రయాణ వ్యసనపరీక్ష, కార్యత్వరిత నీతులు, అధికార్థముల సయోధ్యపరికారము, సోమనీతులు, శత్రు నపనమ్మిక నీతులు అను శీర్షికలకు సంబంధించిన నీతులు పద్యరూపమున కూర్పబడినవి. ఇట్లు బహువిధములైన నీతులను అనువాదకర్త రచించుటయేగాక నీతిశాస్త్రమును జదువువాడు దేవేంద్రునకైన నోడడని

పెక్కేలనీతి శాస్త్రముఁ
దక్కక నెవ్వండు సదువు ధర నెవ్వఁడు పెం
పెక్కఁగ వినునాఁతడు దాఁ
జిక్కఁడు సురపతికినైన సిద్ధం బెండున్

ఆశ్వా 1–పద్య 43

అని వచించినాడు. పంచతంత్రమందలి కథాముఖములోని 'అధీతే య ఇదం నిత్యం...' (శ్లో 10) అను శ్లోకమున కీపద్యమనువాదము.

గ్రంథము చంపూపద్ధతిలో రచింపబడి యుండునని యూహ. పెక్కు పద్యము లమూలకములుగ నున్నవి. అనువదింపబడిన పద్యములు తేటతెల్లముగ మృదుమధుర పద బంధురములుగ నున్నవి. ప్రజాపాలనమునకు సంబంధించిన ఘట్టమున ఈ యాంధ్రీకర్త

పరులవలన గాని పడకుండఁ దనప్రజఁ
బూని యరసి ప్రోవలేని రాజు
రాజుగాఁడు వాఁడు రాజరూపంబున
జగతిఁ బుట్టినట్టి జనుఁడుగాని

ఆశ్వా 1–పద్య 118

అనుపద్యమును రచించినాడు. దీనికి గాకోలూకీయ మందలి

యో న రక్షతి విత్రస్తాన్ పీడ్యమానాన్ పరైః సదా
జంతూన్ పార్థివరూపేణ స కృతాంతో న సంశయః

శ్లో 70

అను శ్లోకము మూలము. శ్లోక భావ మూటఁగొనబడి పద్యమున విశద పఱుపబడిన విధము ప్రశంసార్హము. ప్రజాపాలన విషయమున ప్రభువు లెట్లుండ వలయునో మిత్రభేదమున

అజామివ ప్రజాం మోహాద్యో హన్యాత్పృథివీపతిః
తస్యైకా జాయతే తృప్తిర్న ద్వితీయా కథంచన

శ్లో 242

అని చెప్పబడినది. దానినీ యాంధ్రీకర్త

ప్రజ నజంబుఁబోలెఁ బట్టి పత్త్రియుఁ బసికై
తగిలి చంపెనేని దానఁ దృప్తి
యొకఁగ దొక్క మాటికగుఁగాని భావుణీ
శునకు మఱియు వలయు నదియు లేదు

ఆశ్వా 1–పద్య 125

అని రచించినాడు. అనువాదము వైశద్య పరిధానముగ సాగినది. ఈ ఘట్టమందే రూపకాలంకార పరిష్కృతమగు మిత్రభేద తంత్రమందలి

గోపాలేన ప్రజాధేనోర్విత్తదుగ్ధం శనైః శనైః
పాలనాత్పోషణాద్గ్రాహ్యం న్యాయ్యాం వృత్తిం సమాచరేత్

శ్లో 241

అను శ్లోకము మనోహరముగ

వినుగోపాలుని క్రియఁగాఁ
పనుధేనువుచేత విత్తమను దుగ్ధంబుల్
గొనవలయు నిత్యమొసఁగెడి
యన ఫలరోషాధికముల నవసి శునకున్

ఆశ్వా 1–పద్య 126

అని యాంధ్రీకరింప బడెను. అలంకారముగూడ గ్రహింప బడెను.

రాజాదాయము వ్యయపరిహార సందర్భమున బాలకుడు తన రాజ్యము నెట్లనుభవింప వలయునో మితిమీఱిన నెట్లు పరిణమించునో ఆంధ్రీకర్త

తన భూమి నొయ్య నొయ్యన
జనపతి యొక కొలఁదితో రసాయన భాతిన్
జను ననుభవింప ననిశము
ననువుపడు దాను మీఱెనేని విషముగఁ బిదపన్

ఆశ్వా 1–పద్య 137

అని రచించినాడు. దీనికి మిత్రభేదమందలి

శనైః శనైశ్చ యో రాజ్యముపభుంక్తే యథాబలమ్
రసాయనమివ ప్రాజ్ఞః స పుష్టిం పరమాం వ్రజేత్

శ్లో 238

అను శ్లోకము మూలము. రాజనీతి స్వరూపము పంచతంత్రమున

సత్యాఽనృతా చ పరుషా ప్రియవాదినీ చ
హింస్రా దయాలురపి చార్థపరా వదాన్యా
భూరివ్యయా ప్రచుర విత్త సమాగమా చ
వేశ్యాంగనేవ నృపనీతి రనేక రీతిః

మి భే–శ్లో $45_9$

అని వివరింపబడఁగా ఆంధ్రీకర్త పరమ రమణీయముగ నలఁతి యలఁతి పదములతో ఆటవెలదిలో నిట్లనువదించినాడు.

వ్యయము నార్జవంబు దయయు హింసయు బొంకు
నిజముఁ దియ్యఁదనము నిష్ఠురంబుఁ
బలువు రిత్తజనులు గలిగి యారయఁ బణ్య
రమణి పోలెనుండు రాజనీతి ఆశ్వా 1–పద్య 189

వేశ్యాంగనవలె నుండు రాజనీతిని ఆటవెలది పద్యమున ననువదించుట మిక్కిలి చమత్కార భరితముగా నున్నది. రాజసేవకు లెట్లుండవల యునో విష్ణుశర్మ మిత్రలాభమున నిట్లు రచించినాడు.

గవార్థే బ్రాహ్మణార్థేచ స్త్రీవిత్తహరణే తథా
ప్రాణాం స్త్యజతి యోయుద్ధే తస్యలోకాః సనాతనాః

శ్లో 111

ఆ శ్లోకమిట్లు తెనిగింపబడినది.

కోరి తన ధనంబు కొఱకును విప్రుల
కొఱకు సతుల కొఱకు గోగణంబు
కొఱకు నని మొనర్చి నెఱయు నెవ్వఁడు ప్రాణ
మిచ్చు నతఁడు ముక్తికేశ్వరుండు

ఆశ్వా 2-పద్య 433

నృపసంశ్రయ ప్రయోజనమును దమనకుడు కరటకునితో

సుహృదా ముపకార కారణాత్ ద్విషతా మప్యకార కారణాత్
నృపసంశ్రియ ఇష్యతే బుధైః జఠరం కో న బిభర్తి కేవలమ్

మి. భే-శ్లో 22

అని పల్కినట్లు మూలమందుండగా ననువాదయిత యిట్లు రచించినాడు.

కడుహితులకు సహితులకును
వడిమేలును గీడుఁజేయవలసిన వారల్
పుడమిపులఁ గొలువవలయును
గడుపెవ్వఁడుఁ బ్రోచుకొనఁడె కరటక చెప్పుమా

ఆశ్వా 2-పద్య 460

సేవకు డెట్లుండవలయునో మూలమున మిత్రభేదమున

ద్యూతం యో యమదూతాభం హాలాం హాలాహలోపమామ్
పశ్యే ద్దారాన్ వృథాకారాన్ స భవే ద్రాజవల్లభః

శ్లో 57

అని రచింపబడగా నది యిందిట్లనువదింపబడినది.

ద్యూతమెల్ల జముని దూతయుగా ధనం
బెల్ల హాలహాలము నింతులెల్ల

ఘోరతములైన కారాగృహములుగఁ
దలఁచునతఁడు ప్రియుఁడు ధరణిపునకు

ఆశ్వా 2-పద్య 484

ఘోరతరములైన యను నమూలక విశేషణము సాభిప్రాయముగా నున్నది. సామోపాయముచే గార్యము సిద్ధించుచుండగా బండితులు దండోపాయము నెట్లుపయోగింపరాదో విష్ణుశర్మ

సామ్నైవ యత్ర సిద్ధి ర్న తత్ర దండో బుధేన వినియోజ్యః
పిత్తం యది శర్కరయా శామ్యతి కోఽర్థః పటోలేన

మి. భే.-శ్లో 409

అని రచింప నీ యనువాదమున నది

అరయుసామమునన యగు కార్యములకును
దండముల నొనర్పఁ దలఁప రరులు
జగతిఁ బైత్యశమము శర్కర నగుచుండఁ
జేతి పోట్లకాయ చింతయేల ఆశ్వా 2-పద్య 581

అని రచింపఁబడినది. అధికాధముల సయోధ్యప్రకారమును నిరూపించు సందర్భమున నాంధ్రీకర్త యొకవృత్తమును

గండతలంబులం బెలుచఁ గ్రమ్ముల సన్మదవారికై యళుల్
పిండగుదెంచి యంటి కడుఁబ్రేమ బలాయత మూర్తులయ్యు వే
దండ విభుల్సహించి తమదర్పము సూపక చూచినట్ల హీ
నుండగువాసికల్గునె ఘనుండు దలంప ధరాతలంబునన్

ఆశ్వా 3-పద్య 962

అని రచించినాడు. దానికి మూలమిట్లున్నది.

గండస్థలేషు మదవారిషు బద్ధరాగ
మత్త భ్రమద్భ్రమర పాదతలాహతోఽపి
కోపం నగచ్ఛతి నితాన్త బలోఽపి నాగ
స్తుల్యే బలే తు బలవాన్ పరికోపమేతి మి. భే.-శ్లో 134

మూలమున దుర్బలునియందే బలవంతుడు కోపించునని యుండగ ఘనుడు హీనునకు గోపింపడని యనువదింప బడుట విశేషము. కాకోలూకీయము నందలి

ఆసనే శయనే యానే పాన భోజన వస్తుషు
దృష్టాదృష్ట ప్రమత్తేషు ప్రహార స్త్వరయోఽరిషు

శ్లో 228

అనుశ్లోకము సమగ్రానుసారముగా తెనిగింపబడినది.

యానపాన భోజనాసన శయనంబు
లందు రంధ్ర మొక్కటైనఁ దెలియఁ
గనిననైనఁ జొచ్చి కడతేర్చు నదిగాన
వైరియొద్దివాని వలదు నమ్మ

ఆశ్వా 3—పద్య 988

మూలశ్లోకమందలి సారము స్వతంత్రతా బంధురముగ [illegible] గ్రథించితము నను వదింపబడినది.

సకల నీతి సమ్మతమున ఈ పంచతంత్రానువాదమందలి నీతి బోధక పద్యములు మాత్రమే గ్రహింపబడినవి. వాని నాధారముగ బరిశీలించినను ఈయనువాదము దూబగుంట నారాయణకవి మున్నగు వారి చంప్వనువాదములకు దీసిపోదని నిర్ణయింపవచ్చును. కథలకు సంబంధించిన పద్యములు లభించియుండిన ఈయనువాదకుని యూహా చాతుర్యము, భావనా సామర్థ్యమును సువ్యక్తములై యుండెడివి. సంస్కృతపంచతంత్ర మందలి సుమధుర భావభరితములు, కవితా వైభవసనాథములు నైన రెండు శ్లోకముల యనువాద పద్యములు మాత్రము సకల నీతి సమ్మతమున చేర్కొనబడినవి. వానిని బట్టి ఈ పంచతంత్రానువాదకుని ప్రతిభా సంపత్తిని గ్రహింపవచ్చును. ఆ పద్యములు—వాని మూల శ్లోకములు :

1) చెలువం బేది యరణ్యవాసగతులై శ్రీరాములున్ బాండవే
యులు చేటొందిరి వృష్ణి వీరులుఁ దైత్యేంద్రుఁడైన లంకేశుఁడుం

గలఁగెన్మర్త్యులచే నలంగె నలుఁడీ కష్టంపు రాజ్యంబుకై
తలపోయంగడు దుఃఖహేతువిది వ్యర్థం బొప్పదాసింపఁగన్

ఆశ్వా 3-పద్య 884

రామస్య వ్రజనం, బలేర్నియమనం, పాండోస్సుతానాం వనం,
వృష్ణీనాం నిధనం, నలస్య నృపతేః రాజ్యాత్పరిభ్రంశనమ్,
నాట్యాచార్యక మర్జునస్య, పతనం సంచిత్య లంకేశ్వరే
సర్వం కాలవశాజ్జనోఽత్ర సహతే కః కం పరిత్రాయతే

కాకో-శ్లో 252

3) హారుమెడనున్న సర్పము గణాధిపు నెల్క గ్రసింపఁ జూచు న
య్యురగము ద్రుంప షణ్ముఖమయూరము సూచు గజాస్యుఁ జంపనా
గిరిసుత వాహనంబయిన కేసరి చూచునటేల యిమ్మహే
శ్వరు పరివార మిట్లనినఁ గన్గొన నన్యులు మానసేర్తురే

ఆశ్వా 3-పద్య 924

అత్తుం వాంఛతి శాంభవో గణపతే రాఖుంక్షుధార్తః ఫణీ
తం చ క్రౌంచరిపోః శిఖీ గిరిసుతా సింహోఽపి నాగాశనమ్
ఇత్థం యత్ర పరిగ్రహస్య ఘటనా శంభోరపి స్యాద్గృహే
తత్రాన్యస్య కథం న భావి జగతో యస్మాత్స్వరూపంహి తత్

మి. భే-శ్లో 170

అనువాద పద్యము లందు సమాసజాటిల్యము గాని యన్వయక్లిష్టతగాని గానరాదు. భావము తేట తెల్లముగ నావిష్కరింపబడినది. రచనము స్వతంత్రతా నిర్భరము. రెండు పద్యములు రచయిత రచనా విదగ్ధుడను విషయమును జెప్పక చెప్పుచున్నవి. అజ్ఞాత నామకుడైన ఈ మహా కవిచే అతిప్రాచీన కాలముననే సంస్కృత పంచతంత్రము ఆంధ్రమున సుందరాకృతిని సంతరించుకొనుట గణనీయము. దాని సంపూర్ణ స్వరూపము నాస్వాదించు భాగ్యము దుర్లభమగుట చింత్యమనక తప్పదు.

3 నేబతి కృష్ణయామాత్యుని రాజనీతి రత్నాకరానువాదము :

నేబతి కృష్ణయామాత్యుని రాజనీతి రత్నాకరమను పంచతంత్రానువాదము ఒకప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీ లిఖిత పుస్తక భాండాగార మందుండెడిది. దీనియందలి విశేషములను ఆచార్య బిరుదరాజు రామరాజుగారు 'ఖుతుబ్షాహీ సుల్తానులు-ఆంధ్రసంస్కృతి' అను గ్రంథమున వివరించినారు. నేడా గ్రంథము గూడ అలభ్యమైనది. కాని ఆచార్య రామరాజుగారు 'చరిత్ర కెక్కని చరితార్థులు' అను విమర్శవ్యాస సంకలన గ్రంథమందు 'నేబతి కృష్ణయామాత్యుడు' అను శీర్షిక గల వ్యాసమందు రాజనీతి రత్నాకర మందలి కొన్ని విషయములను తెలియజేసినారు. ఆవ్యాసమాధారముగ ఆ పంచతంత్రానువాద స్వరూపమిందు సంగ్రహముగ పరిశీలింపబడుచున్నది.[3]

ఈ రాజనీతి రత్నాకర గ్రంథమును మొదట వెలుగులోనికి దెచ్చిన వారు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు. వారు 'పోతన అనువాద విధానము' అను విషయముపై వ్యాసము వ్రాయుచు నిట్లు పేర్కొనినారు.[4] 'ఉస్మానియా విశ్వవిద్యాలయము నందలి తాళపత్ర గ్రంథ సంచయములో పంచతంత్రము యొక్క యాంధ్రీకరణము రాజనీతి రత్నాకరమను పేర నొక యముద్రిత గ్రంథమున్నది. దాని రచయిత పేరు కృష్ణయామాత్యుడు. తద్గ్రంథపీఠిక యందలి పద్యముల వలన నీ కృష్ణయామాత్యుడు బమ్మెర పోతనార్యుని వంశములోని వాడనియు, నీయన కోవగలవారు బెడందకోట (బీదరు) లో సుల్తాను వద్ద 'నేబతి' (ధనము లెక్కించువాడు) పని చేసినందున వారికి నేబతి యని యింటిపేరు పౌరుషనామముగా వచ్చినదనియు తెలియుచున్నది ...'

మహమ్మదుషాహియను తెనుగు కవులు పేర్కొను మహమ్మదు ఖులీఖుతుబ్షా (క్రీ. శ 1580-1612) ప్రభువునకు నేబతి కృష్ణయా

3 పుట 105-115; 4 ఆంధ్ర భాగవతోపన్యాసములు పుట 23-24

మాత్యుఁడు ప్రధానిగా, హితుడుగా, కవివరుడుగా సన్నిహితుడై యుండెడివాడని క్రిందిపద్యము వలన గ్రహింపవచ్చును.

సరస చౌరాసి దుర్గ రక్షాధురీణుఁ
డైన మహమదు శాహు సుల్తాను కీవు
గల ప్రధానివి హితుఁడవు కవివరుఁడవు
భళిర శ్రీకృష్ణ కొండ మాంబా సుపుత్ర.

ఆశ్వా 1-పద్య 36

రాజనీతి రత్నాకరమనగా రాజనీతులకు సముద్రము వంటిదని యర్థము. నామము సార్థకము. అది ఆరాశ్వాసముల గ్రంథము. కృష్ణయామాత్యుఁడు ఈకృతిని తన ఇలవేలుపగు అనంతగిరి శ్రీ నరసింహున కంకిత మొసంగినాడు. కవి విశిష్టాద్వైత సంప్రదాయమునకు జెందినవాడు. ఆతడి పంచతంత్రమును విశిష్టాద్వైత సంప్రదాయను గుణముగా నాంధ్రీకరించుట విశేషము. పీఠికయందు మొదట శ్రీమహా విష్ణువు, క్రమముగా శ్రీమహాలక్ష్మి అనంత గరుడ విష్వక్సేనాదులు పూర్వాచార్యులు స్తుతింపబడిరి. ఈయను వాదము నతడు విష్ణు కథగా రూపొందించినట్లు

వర రాజనీతి రత్నా
కరమీకృతి చరిత విష్ణుకథ నాథుఁడు శ్రీ
నరసింహుడట భళి బం
గరువునకున్ బరిమళంబు గలుగుట గాదే

అని వెల్లడించినాడు. తనకు బూర్వము పంచతంత్రాను వాదములున్నను ఈ కవి చూచియుండ డనుటకీ పద్యము తార్కాణము.

భళిర తొల్లిటి కవులు ప్రబంధకర్త
లగుచు నీ రాజనీతి రత్నాకరంబు
సేయకుందురె (రు?) మున్నునే జేయు సుకృతి
కలన నీ కృతి రచియింప గలిగెఁగాక

[illegible]

కందాళ రంగాచార్యుని నోట దన కవితావైభవాదుల నిట్లు పలికించి యున్నాఁడు.

స్వర్ధునీ వీచికా సంఘాత ఘుమఘుమ
  న్నిర్ఘోషముల మించి నీటుగెలిచి
వాగ్భామినీ పాద వనజాత కాంచ నాం
  గద ఝుళం ఝుళ రావగతుల దెగడి
నిర్జర ద్రుమజాల నిస్సరన్మకరంద
  ధమధమన్నాద సంతతుల గేరి
కాంచీ నితంబినీ కాంచీ లతాఘంటి
  కా ఘణం ఘణ రవక్రమము మించి

వెలసె భవదీయ సరసోక్తి విరచితాన
వద్య గద్య సుపద్య కావ్య ప్రబంధ
దండ కోదాహరణ కవితా నిగుంభ
నములు కృష్ణ ప్రధానీంద్ర నవరతీంద్ర.

పరువపు బొండుమల్లియల బంతులోకోయన జాజులోయనన్
విరవిర వాదిపువ్వులన వెన్నెలలో కుముదంబులో యనన్
సరసిజ కర్ణికా కృతుల చల్లని తావుల పిక్కటిల్లుచున్
నెరసె భవత్కవిత్వములు నేబతి కృష్ణ కళాధురంధరా!

ఆశ్వా 1-పద్య 33, 34

రాజనీతి రత్నాకరము శ్రీరంగ పట్టణ వర్ణనముతో ప్రారంభింపబడినది. శ్రీరంగ వైభవ మిరువది గద్య పద్యములలో విపులముగ నభివర్ణింపబడినది. పురవర్ణనము, చాతుర్వర్ణ్య వర్ణనము, చతురంగ బల వర్ణనము, వారవిలాసినుల వర్ణనము ప్రౌఢముగా నిర్వహింపబడినవి. అందలి తొలి పద్యము.

ఇందిరా సుందరీ కేళి మందిరంబు
నిజవనీ సార భాగతేం దిందిరంబు

ధరణీ కాంతా పదాబ్జనూపురము దనరు
రమ్య విభవాకరంబు శ్రీరంగ పురము.

సుదర్శన చక్రవర్తి 'తన దండ శ్రీమద్రామాయణ మహాకావ్యంబునకు ననేకార్థంబు పుట్టి కర్ణపర్వంబుగా శ్రీవైష్ణవ స్వాములు వినుపింప సంతోషించుచుండ' విష్ణుశర్మ సభాప్రవేశ మొనరించుట మున్నగు ఘట్టములలో విశిష్టాద్వైత పరిభావము సుస్పష్టము. మిత్రభేదతంత్రారంభమున విష్ణువర్ధనుడను బేహారి కంచి వరదరాజస్వామికి గోపుర ప్రాకారమంటపము లనేకము కట్టించుట, అనంతర మాతడు నందక సంజీవకములను వృషభములను బూన్చిన బండిపై వర్తకమునకు బయలుదేరి కొన్నాళ్ళు ప్రయాణించి వెంకటనామ శైలమున కేగుట, అందు దిగువ తిరుపతిలోని వరదరాజస్వామిని దర్శించి క్రమముగా వేంకటేశ్వరస్వామి దివ్యదర్శనభాగ్యము పడయుట, అటు పిమ్మట 'నీవు దెచ్చిన సంజీవక వృషభంబుల నాకు సమర్పించరా' యని స్వామి కోరగా సంజీవకమును స్వామికి సమర్పించుట మున్నగు పెక్కు కథాంశములనూలక కల్పనలు. వైష్ణవ సంప్రదాయ ముద్రితములు.

ఇట్లు విడువబడి అచ్చటివారిచే బెంచబడుచున్న సంజీవకమును గవి యిట్లు వర్ణించినాడు.

దినదినము నరవ పిళ్ళలు
పనుపడగా నానవాల పాసెపుముద్దల్
వినుపింప వృషభ మెచ్చెన్
మిన మినమని మేని చాయ మించులు జూపన్

ఆ సంజీవక వృషభ విశేషమును కృష్ణయామాత్యు డిట్లు కొనియాడినాడు.

కోనేరు తీర్థంబు గ్రోలి వచ్చుటలచే
వేంకటేశ ముఖాబ్జ వీక్షణమున
సతత వైష్ణవ దివ్య సల్లాప కథలచే
ద్రవిడ ప్రబంధార్థ తతులచేత

శ్రీ భాగవత భక్త శేషంబు గొనుటచే
సజ్జనోత్తమ వికస్పర్శనమున
కల్పకారామ సంగతి జరించుటచేత
వివిధ మున్యాశ్రమ విహారణముల

గాంచె సుజ్ఞాన విభవంబు గాంచెయుక్తి
గాంచె రామాయణాది భాగవత పురాణ ?
వేదవేదాంత శాస్త్రార్థ విశదబుద్ధి
భళిర సంజీవకుఁడు కళా ప్రౌఢిమమున.

ఆశ్వాసాంత గద్యలందు ఆ యా యాశ్వాసములందలి ప్రధాన కథాసన్నివేశములు పేర్కొనబడినవి. అందును వైష్ణవముద్ర మిక్కుట ముగా గలదు. రాజనీతి రత్నాకరమును వైష్ణవ ప్రబంధముగా రూపొందించి యనువదించిన నేబతి కృష్ణయామాత్యుడు ప్రశంస నీయుడు. అనువాదములలోకెల్ల విలక్షణము, అత్యంత విశిష్టమునైనది ఈ రాజనీతి రత్నాకరము. నేడిది యలభ్యనుగుట యాంధ్రుల దురదృష్టము.

## 4. తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయమందలి వ్రాతపతి:

తంజావూరిలోని శరభోజీ మహాప్రభువులు స్థాపించిన సరస్వతీ మహల్ అను పేరుగల గ్రంథాలయమందున్న వ్రాతప్రతుల రూప మున నున్న తెనుగు గ్రంథముల పట్టికయందొక పంచతంత్రానువాదము పేర్కొనబడినది[5]. ఆ గ్రంథముల పట్టికయందు గ్రంథముల పేర్లతో బాటు వివిధ గ్రంథముల కొన్ని భాగములును స్వల్పముగ నుదాహ రింపబడినవి. ఆ గ్రంథములు సమగ్రములో కాక[6] రేఖామాత్రముగ

5. A descriptive of the Telugu manuscripts in the Tanjore Maharaja Sarfoji's Saraswati Mahal Library — Published from the income derived from the Maharaj of Bobbili Endowment for the furtherence of research in Telugu learning — PP. 282 - 83.

చేర్కొన బడినది. ఆ ముద్రిత గ్రంథజాల సూచికయందు 'పంచతంత్రి కథ' యను శీర్షికలో ఒక యనువాద పుటాద్యంతములు నిర్దేశింపబడినవి.

గ్రంథారంభము—

శ్రీ రమణీ శుభయుగ క
స్తూరీ కుంకుమ పటీర శోభిత వక్షున్
నీ రజపత్రి నిభాక్షున్
శ్రీరామున్ మహితనాము సేవింతు మదిన్

అని శ్రీరామభద్రుని తలంచి పంచతంత్రి యను ప్రబంధంబు శ్రీవిల సిల్లు వాక్యరూపంబుగా విన్నవించెద నది యెట్లనిన—పాటలీపుర మేలే రాజు సుదర్శనుండనేవాడు ఆయన కుమాళ్ళు విద్యావంతులుంగాక రాజ్యమున్ను జేయనేరక అవివేకులై యుండగా జూచి బుద్ధిలేని కొమాళ్ళు పదివే కనే అంతకన్నా వివేకి అయిన కుమారుడే చాలు నని కస్తి పడుచున్న రాజును జూచి...'

గ్రంథాంతము—

'నీవెవ్వండ వెక్కడికి బోవుచున్నా వనంగాను దొంగను తిప్పా వొగ్ఘుల యింటనే ఆవుల దొంగిలించ బోవుచున్నాను. ఇద్దరముగూడా పోదాము రమ్మని బ్రాహ్మణుని యింటివాకిటికి బోయిన వెనక బ్రహ్మ రాక్షసుండు దొంగను జూచినను తిప్పావర్ఘులను పట్టిన వెనక నీవు ఆవులను దోలుకపొమ్మనగా దొంగ ఆగ్రహించి నీవు పట్టినపుడే బ్రాహ్మణుడు మేలుకొనును. నే నావుల దోలుకపోయిన వెనుక నీవు పట్టుమనగా యిద్దఱికిన్ని జగడమై కూంతలు బెట్టగా...'

గ్రంథమును గూర్చి తెనుగునను ఆంగ్లమునను ఇట్లు చెప్పబడెను. 'సమగ్రము గాదు. వ్రాత చక్కనిది. తప్పులు గలవు. శైథిల్య మధికము. గ్రంథపాతము గానగు. కీటకదష్టము గ్రంథకర్తృత్వ నామము వ్యగ్రము'. 'This work is Panchatantra Katha of unknown authorship. This is evidently based upon the same work in Sanskrit. The manuscript is incomplete.'

ఈ రచనము వచనరూపమున నిర్వహింపబడి నట్లున్నది. అందును నిత్యవ్యవహార ప్రసిద్ధమైన వాక్య సంయోజనతో రచింపబడినది. గ్రంథపాత్రల నామములు గూడ దత్తాలోచితములై యున్నవని తిప్పావఝ్ఝల పాత్రిచే గ్రహింపవచ్చును. సంస్కృత పంచతంత్ర కథలో ఆ బ్రాహ్మణుని పేరు ద్రోణుడు. అతని యింటనే చోరరాక్షసులు ప్రవేశింతురు. ఆ కథ కాకోలూకీయమందు నున్నది. ఈ గ్రంథమున ఈ కథ చిట్టచివర నున్నట్లు చెప్పబడినది. కావున ఈ యనువాద మసంపూర్ణముగ లభించినదని స్పష్టముగ గ్రహింపవచ్చును. ఇందలి వ్యావహారిక భాషను బరిశీలించినచో నది యక్షగానములందలి భాషకు సన్నిహితముగా గనుపించుచున్నది. కావున క్రీ. శ. 17, 18 శతాబ్దులమధ్య నెన్నడో ఈ యనువాదము రచింపబడి యుండునని యూహింపవచ్చును.

**5. పరవస్తు చిన్నయసూరి రచించిన నీతిచంద్రికానువాదము :**

క్రీ. శ. 1806 నుండి క్రీ. శ. 1862 వఱకు నుండిన పరవస్తు చిన్నయసూరి తెనుగుభాషాధ్యేతలకు సరళమగు వచనరచనాశైలు లలవడుటకై నీతిచంద్రిక యను తెనుగు గ్రంథమును రచించినాడు. నీతిచంద్రిక యనగా నీతులకు వెన్నెల యని యర్థము. చకోరములకు వెన్నెల ఆహ్లాదకరమగునట్లు ఈ రచనము నీతిబోధచే సర్వసామాన్యజనయువకులకు నానంద మొసంగగలదని తాత్పర్యము. ఇందు ప్రయుక్తమైన బహువిధములైన నీతులు పాఠకుని నయశాస్త్ర ప్రవీణునిగా జేయును. ఇందలి సంస్కృతాంధ్ర భాషాప్రయోగ వైచిత్రి పాఠకులకు వ్యుత్పన్నత నొసంగును. అట్లే పాత్ర చిత్రణ వర్ణనాదికము చదువరుల మనస్సుల నుయ్యాల లూగించును.

వెంకటాద్రియందు నివసించు శ్రీనివాసుని స్తుతితో గ్రంథ మారంభింపబడెను. లక్ష్మీదేవిని అనంతునిగూడ కవి సంస్తుతించెను. పూర్వకవిస్తుతిలో కవిత్రయము నాచనసోమన స్మరింపబడిరి. శ్రీనాథ

పెద్దనాదులకు స్థానము లేకపోవుట గమనింపదగినది. చిన్నయసూరి నీతిచంద్రికా రచనాప్రణాళికను గ్రంథారంభమున నిట్లు పేర్కొనినాడు.

ఒనరగాఁ బంచతంత్రి హితోపదేశ
ములను బరికించి వానిలో వలయు నంశ
ములను గొని కొంత యభినవంబుగను గూర్చి
కృతి రచియించెద నీతిచంద్రిక యనంగ

తుదముట్టఁగ నీ కబ్బము
పదిలముగాఁ జదివినట్టి బాలుర కోలిం
బొదలును భాషాజ్ఞానము
కుదురుం గొదలేక నీతి కుశలత్వంబున్

ఇందు బంచతంత్రి హితోపదేశములను బరికించి వానినుండి కొన్ని విషయములను గ్రహించి కొన్నిటిని జతపఱిచి చిన్నయసూరి నీతిచంద్రిక రచించినట్లు తెలుపబడెను. దీనినిబట్టి నీతిచంద్రిక కేవలము పంచతంత్రానువాదము గాజాలదని స్పష్టమగుచున్నది. హితోపదేశము గూడ కొంతవఱకు మూలమన దగినదే. కొంత స్వీయముగూడ నందు చొప్పింపబడినది. నీతిచంద్రికను సాంతముగ జాగరూకతతో జదివినచో భాషాజ్ఞానము, నీతి కౌశలము గలుగుననుట యథార్థము. ఆ పద్యము నీతిచంద్రికకు కవి స్వీయముగా గావించిన సమీక్ష యనదగినది.

సంస్కృతాంధ్ర వచన కావ్య సముదాయమున బంచతంత్రము విశిష్ట స్థానము నలంకరించును. భాషాసారళ్యము గలిగి పఠితలకు సులభముగ భాషాజ్ఞానము నీతి గఱపుటలో బంచతంత్రము ప్రముఖపాత్ర వహించును. పంచతంత్ర [illegible] అందలి నీతివైవిధ్యమును గథాచమత్కృతిని గ్రహించి [illegible] చిన్నయసూరి మాత్రము విష్ణుశర్మ [illegible] స్థానము గ్రహించినవాడై బాలురకు భాషాజ్ఞానము [illegible] నీతిచంద్రికను సంతరించినాడు. విష్ణుశర్మ

వలెనే తానును గథనాలంబముగ గొని నీత్యుపదేశము గావింప దలచినట్లు

నవ భాజనమున లగ్నం
బవు సంస్కారంబు వోలియుదటుగావున మా
నవులకుఁ గథాచ్ఛలంబునఁ
జవి పుట్టఁగ నీతివచన సరణిఁ దెలిపెదన్

అను పద్యమున సూచించినాడు. నయ విద్యను మానవులు నేర్వవలసిన యావశ్యకమును గూడ జిన్నయసూరి

నీతిలేనివాని నిందింత్రు లోకులు
లేదు సేగి లాతి లేకయున్న
గాన మానవుండు పూనిక నయవిద్య
గడనసేయ మొదలఁ గడగవలయు

అని సూచించినాడు.

**నీతిచంద్రికయందు** మిత్రలాభము, మిత్రభేదమనను రెండు పరిచ్ఛేదములు **మాత్రమే** గలవు. గ్రంథ మసంపూర్ణముగా నున్నది గ్రంథమున **బూర్వార్ధ**మని యుండుటచే నుత్తరార్ధమున మఱి రెండు పరిచ్ఛేదముల **నతడు** రచింప దలచి యుండునని యూహింప వచ్చును. అట్లైన ఈ యనువాదము నాలుగు పరిచ్ఛేదములలో గూర్పబడి యుండెడిది. అప్పుడా గ్రంథము హితోపదేశానుసరణ మనదగి యుండెడిది. ఐదు తంత్రములుగల పంచతంత్రముకంటె నాల్గు పరిచ్ఛేదములుగల హితోపదేశమే నీతిచంద్రికకు మూలమని గణింపవలసి యుండును. నీతిచంద్రిక పాటలీపుత్రమను పట్టణమును సుదర్శనుడను పరిపాలించు చున్నాడనుటతో నారంభింపబడుట, మిత్రలాభము ననంతరము మిత్రభేదము రచింపబడుట, హితోపదేశమే నీతిచంద్రికకు సన్నిహితమైనదని నిర్ణయించుటకుపోద్బలకములుగా నున్నవి. అంత మాత్రమున కేవలము హితోపదేశమునకే నీతిచంద్రిక యనువాద

మున జాలవు. పంచతంత్రమందలి పెక్కు కథలు, నీతి శ్లోకములు యథోచితముగ నీతిచంద్రిక యందనూదితము లైనవి.

పంచతంత్రి కథలలో ప్రాచీనానువాదకులు అనువదించిన కథలనే చిన్నయసూరియు నీతిచంద్రికయందు గ్రహించినాడు. వానితో బాటు హితోపదేశమందలి పులి – హేమకంకణము, ముసలి గ్రద్ద – దీర్ఘకర్ణుడను మార్జాలము అను కథలను మిత్రభేద పరిచ్ఛేదమందలి 'ధావకమల్లుడను చాకివాడు – కుక్క – గాడిద' యను కథను గ్రహించి యనువదించినాడు. బాలురకు బోధింపరానివను దృష్టితో బంచతంత్ర మందలి మిత్రభేదమున నున్న ఆషాఢభూతి కథకు సంబంధించిన దూతి– తంతువాయ కథను విడిచినాడు. చంపూకర్తలు హితోపదేశము నందేయున్న 'గోపి – జారద్వయము' అను కథ ననువదింపగా జిన్నయ సూరి యీ కథనుగూడ నుపేక్షించినాడు. బాలుర కుత్తమ సంస్కార మును బెంపొందించు కథలను మాత్రమే గ్రహించి యౌచిత్య పోషణ మున కత్యంత ప్రాధాన్య మొసంగి నీతిచంద్రికను రచించిన చిన్నయ సూరి యభినంద్యుడు.

నీతిచంద్రిక యను గ్రంథ నామమునుబట్టి ఆ గ్రంథము నీత్యుప దేశ ప్రధానమైనదని యెల్లరకును స్ఫురించు చుండును. కథాచ్ఛలమున నీతిబోధ గావింతుననని చిన్నయసూరి గావించిన ప్రతిజ్ఞనుబట్టి పాత్ర చిత్రణ వర్ణనా నిర్వాహణాదికముచే నందు గావ్యత్వముగూడ బోషింప బడినదని భంగ్యంతరముగ సూచింపబడినది. సూక్తిగుంఫనము, పద జంఘాటము గలదేయైనచో నీతిచంద్రిక కింతటి ప్రశస్తి కల్గియుండెడిది గాదు. ఇక జిన్నయసూరి నీతిచంద్రికయందు ప్రదర్శించిన కావ్యపద్ధతి యెట్టిదో పరిశీలింతము గాక.

మిత్రభేద పరిచ్ఛేదమున జిన్నయసూరి 'వానరము – కీలోత్పా టనము' అను కథలో గ్రోతుల చేష్టల నత్యంత సహజముగ నుండునట్లు ఇట్లు చిత్రించినాడు.

'...కోతులు దేవాలయము దాపునకు వచ్చి ప్రాకారములు ప్రాకుచు బ్రాంత మహీరుహముల మీదికి గుప్పించి దాటుచు వ్రేలు కొమ్మలు కాళ్ళతోఁబట్టి తలక్రిందుగా వ్రేలుచు బెనుగొమ్మలు కరములతోఁబట్టి యూచుచు విమానములమీద గూర్చుండి వికృతముగా బరులు వీపు గీఱుకొనుచు, నిక్కుచు బొమలెత్తి యుఱుగొట్టి బెదిరించుచు బండ్లిగిలించుచు వెక్కిరించుచు నొకటినొకటి సఱువుమీద బండించుకొని మేని పేల నేఱి నోర వేసికొనుచు గిలకల నావములు గావించుచు నొండొంటితోఁ బోరుచు ఫలములు భక్షించుచు మాఘవులానుచు స్వాభావిక చపల భావముతో దిరుగుచుండెను'.

ఈ కపిచాపల్య వర్ణనమంతయు నమూలకము. మూబగుంట నారాయణ కవియు నింత దీర్ఘముగ వర్ణింపలేదు. ఈ కపి చపల స్వభావవర్ణనము కావ్యత్వ పరిపోషకము.

ఆషాఢభూతి కథలో నతఁడు దేవశర్మ యను పరివ్రాజకుని ధనమపహరింప నెంచి సమీపించి సేవించిన విధమును చిన్నయసూరి—

'...సర్వాలింగిత భూతలంబుగం బ్రణామంబు గావించి లేచి ముకుళిత కరుండగుచు నాతనికిని మఱువడకుండ నొక్కప్రక్క కొదిగి నిలుచుండి యాతండు వాక్రుచ్చు ధర్మంబులు తదేకాగ్ర హృదయుండుం బోలె నాలకించుచు విలక్షణుండుంబోలె దూరిత తారళ్య విస్తారిత నయనుండగుచు జిరంత నాత్మీయ ధర్మ సంశయ నిరాకరణ చణప్రస్తుత ప్రకరణార్థ శ్లాఘమానుండుం బోలెం బరవాహిత మస్తకుండగుచు శ్రవణాంతరాయా సహిష్ణుండుం బోలెం దత్రత్య జనసల్లాపంబులు భ్రుకుటిత ముఖుండయి సీత్కార పూర్వకంబుగ నిష్ప్రకర సంజ్ఞచే వారించుచు నిర్భరానంద వివశుండుంబోలె సబాష్ప నిమీలితలోచనుండగుచు దదుపన్యాసావసానంబున నచ్చటి జనులం గాంచి 'స్వాములు కడు బడలి యున్నవారు. ఇక్కడి వారందఱు గొంత సేపెడ గలుగనుండుడు. భిక్షానంతరము రండు. పొండు.' అని యువ్వలికనిపి యొక్క తాళవృంతంబు పుచ్చుకొని ప్రక్కనిలువంబడి యల్లన వీచుచుండె'

అని యభివర్ణించినాడు. ఇంకా ఆషాఢభూతి ప్రదర్శించిన అతివినయము అతిలోక రమణీయముగా గురువిశ్వాస జనకముగ నున్నది. ఇందాతని వినయము, వేదాంత జిజ్ఞాసయందలి శ్రద్ధ, గురుభక్తి ప్రసన్నమధురముగ చిత్రింపబడినది. కృతకమే మాయను శంక లేశమాత్రముగనైన బాలకునకు గలిగింపదు. గురువును జేరి తన్ను శిష్యునిగా బరిగ్రహింపుడని ఆషాఢభూతి దేవశర్మ నర్థించునపుడు 'తమయందు గుప్తంబై యున్న సాధ్యంబయిన యర్థంబు తమకు శుశ్రూష యొనరించి పడయం గోరినవాడ' అను పల్కులలో చిన్నయసూరి ప్రయోగించిన శబ్దప్రయోగ చమత్కారము సుమనోమనోహరము. అర్థ శబ్దమునకు వేదాంత విషయమను నర్థముతో బాటు ధనమను నర్థముగూడ నిందు గ్రహింపదగినది. అశ్లే యిందలి అనన్యసామాన్యము, గుప్తము నను పదములు సాభిప్రాయములు. తెలుగువారి సంభాషణములందు ఆషాఢభూతి యుదాహరణీయుడగుటకు విష్ణుశర్మకంటె చిన్నయసూరియే ప్రధాన కారణుడు. చిన్నయసూరి మూలమునకు మెఱుగులు దిద్దుచు ఆషాఢభూతి పాత్రను పోషించిన విధ మత్యంత గణనీయముగా నున్నది.

ఆషాఢభూతి తన ధనసర్వస్వము నపహరింప ఆ పరివ్రాజకుడు పరితాప మొందిన విధమును గూడ నిట్లు చిన్నయసూరి మధురముగ చిత్రించినాడు.

"ఓహో ఆషాఢభూతీ! యోహో యాషాఢభూతీ! యని యెలుంగెత్తి పిలిచి పిలిచి సంజప్రొద్దు వెలుంగునకు గరంబు మఱుంగు పెట్టుకొని కనుమేర దూరంబు చూపుసారించి పాఱఁజూచుచు యాతాయాత జనంబులం జేరంబోయి వాని యంగమచ్చంబు చెప్పి యిట్టివాని బొంతె మోచుకొని పోవువానిం జూచితిరా యని యడిగి నలువలంకులకుం బోకి పోకి వెదకి వెదకి వేసరి కడకుం దన్నా దురాత్ముండు ప్రతారించెనని యెఱింగి శిరంబు పంకించి నిట్టూర్పు నిగిడించి మేషయుద్ధంబుచే జంబుకంబును నాషాఢభూతిచే నేనును స్వదోషంబు వలనం జెడితిమి ఇంక నేమి చేయవచ్చునని చింతించుచుం జనియె"

ఇందు సన్న్యాసికి గల ధనవ్యామోహ మెంతటిదో విశదపఱుపబడినది. పాత్రల మనః స్థితిగతులను హావభావ ప్రకటనముతో సహజసుందరముగా నుండునట్లు చిత్రించుటలో జిన్నయసూరి సామర్థ్యమును గ్రహించుటకు ఈ సన్నివేశ మొక్కటి సరిపోవును.

వర్ణనల విషయముననను నీతిచంద్రిక యందు జిన్నయసూరి కావ్యపద్ధతి ననుసరించినాఁడు. మిత్రలాభమందు మంథరుఁడు లఘుపతనక హిరణ్యకులతో మిత్రుఁడగు చిత్రాంగుఁడింకను రాకుండుటకు జింతించు సందర్భమున జిన్నయసూరి సాయంసమయ విశేషములనిట్లు మనోహరముగా నభివర్ణించినాఁడు.

> 'అక్కడక్కడ మేఁతకుఁ బోయిన శకుంతల సంతానములు కొఱఁకులుమాని యిరవులకు రాఁ దొడంగె. వ్రేలు తమతమ కదుపులను దోలుకొనిపల్లియలకుఁ బోవుచున్నారు. సూర్యుఁడు ప్రతీచీ ముఖమునందు సిందూరతిలకము నందము వహించు చున్నాఁడు.'

సూర్యుఁడు పశ్చిమ దిక్కాంతా ముఖమున సిందూరతిలకమై సౌందర్యాపాదకుఁ డగుచున్నాఁడనుటలో గావ్యత్వము ప్రస్ఫుటమగుచున్నది. చిన్నయసూరి ఆషాఢభూతి కథలోఁగూడ సాయాహ్న భానుని

> 'సమయజామదగ్న్యుఁడు కరసహస్రంబు ఖండింప రక్త పరిభాభాసమానుండును బ్రతాపహీనుండునయి కృతవీర్యసూనుండునుం బోలె భానుండు చూపట్టెను'

అని వర్ణించినాఁడు. సూర్యునకు గార్తవీర్యార్జునౌపమ్యము, అస్తమయ సహస్ర కిరణారుణిమమునకు రక్త ప్రభాసామ్యము మనోజ్ఞముగ నిరూపింపబడెను ఈ సూర్యాస్తమయ వర్ణనము ప్రాబంధికము.

చిన్నయసూరి మిత్రభేదమందలి 'నక్క—భేరి' అనుకథలో గావించిన యుద్ధభూమి వర్ణనము గూడ మహాకావ్యోచితముగా నున్నది. అందు భిన్నమైన చతురంగ బలమును హృదయంగమముగా నతఁడిట్లభివర్ణించినాఁడు.

'విశాలాంగంబులయి నేలంగూలిన శతాంగంబులును ఖండిత శుండా దంత కాండంబులయి కెడసి కొండలపిండు విడంబించు వేతండ తండంబులును ముంగాళ్లువిఱిగి డొక్కలు పెరిగి మాఱు నొడలు వ్రైచి దాఱుమాఱుగం బడియున్న వారువంబులును నెఱమగంటిమి మెఱయ వాతెఱంగొఱుకుచుం జూపు జంకెనల పొంకంబు వదలని శిరంబులును వాలుదొఱంగని కరంబులును గరంబు మెఱయ వీరశయనంబు నొందిన యోధవారంబు గలిగి ఘోరంబయి వివిక్తంబయిన యొక్క పోలికలని...' గజములు నశ్వములు వీరయోధులు నేలగూలిన విధమును జిన్నయ సూరి మిక్కిలి దయనీయముగ నిందు వర్ణించినాఁడు.

చిన్నయసూరి గావించిన వర్ణనలలోనెల్ల దలమానిక మనదగినది రాజాంగనల జలక్రీడా వర్ణనము. మిత్రభేదమున 'కాకి–కనక సూత్ర' మను కథలో రాజాంగనలు సుందరమందగమనంబుల నొయ్యారంబు మీఱ నీరంబుల డిగి యల్లనల్లనడుగులిడుచుఁ గటి ద్వయసంబుగ డిగి సలిల విహారంబు సలుపుచు సరస సంభాషణలతో గులికిన విధమిట్లు వర్ణింపబడినది.

'...ఒక్కలతాంగి తోయంబులు దోయిలించి దోయిలించి యొక్క తోయజాక్షిపయిం జల్లి యదిమాఱుకొని యేచేది నిలువక చల్లుమా చూతమనుచు మీఁదంజల్లిన ధారాసారంబునకు దాళం జాలక కేలొగ్గి పెడమొగంబిడి పెఱకేలెత్తి మ్రొక్కుచు నమ్మమ్మ చాలుంజాలు నీజోలికింక రాను మానుమన నయ్యది యిస్సిరో యింత పిఱికివెనా మఱి యొక్క తెఱవ నెఱజాణవేని నాపంకముఁజలుము. చిలుకు తుక దాసితోడనా యింత బింకంబు పొంకించెదవని పురికొలిపి...' ఆ సమయమున గాక మొక నుపహారమును మ్రుచ్చిన గంటికొని యేగు చుండ ఆకాంతలు పలికిన పలుకులు గూడ ముచ్చటగొలుపుచున్నవి. వారి రమణీయ భాషణము లిట్లు రచింపబడినవి.

'ఆ కాకంబు వద్దనరాగ ప్రభారింపనొప్పింగాంచి యామినీంబని భ్రమించెంగాంబోలు నని యొక కాంత తెలంచినది. మఱియొక్క తె

కాదు కాదు మెడందగిలించు కొని గులుకులాడం బోయెదునని నవ్వుచు నీయందంబునకు హారంబొక్కటి తక్కువ యని మొగంబడ్డంబుగ సుందరంబుగఁ బంకించి చేయెత్తి జుట్టన నెటికవిఱుచుచు (జక్కసిహారమున్న యిప్పలుగాకి కాకి యెక్కడ నుండి వచ్చెనో యింక నెక్కడం బొఱివైచెడునో యెవ్వరికిం జేపడునో...'

రాజకాంతల చతురసంభాషణతో గూడిన ఈ జలక్రీడా వర్ణనము అమూలకము. చంప్వను వాదకులు గూడ నీ వర్ణనము గాపింపకుండుట గమనింపదగ్గ విషయము.

నీతిచంద్రికలోని వర్ణనలలో మిత్రభేద మందలి పింగళక సంజీవకుల యుద్ధవర్ణనము అత్యంతమనోజ్ఞముగా నిర్వహింపబడినది. విష్ణుశర్మగాని చంప్వనువాదకులుగాని ఆ వర్ణనమునకు ప్రాధాన్య మొసంగకుండుట చిన్నయసూరి ప్రత్యేకతను వెల్లడించుచున్నది. సేనాపతిగా సంజీవకుని యుద్ధ నిశ్చయమును వినిన పింగళకుడు 'ఆహాహా సాహసంబు! ప్రలయ జ్వలనంబునయి శలభంబు విలంఘింపం దలంచె. హా! కావరంబని యధిక్షేపించుచుం గ్రోధదుర్నిరీక్షుండయి హర్యక్షవల్లభుండు విపక్ష శిక్షాదీక్షంబూని సముత్థితుండయి' నిర్గమించినాడని వర్ణింపబడెను. ఇందలి ప్రలయ జ్వలన శలభోపమ్యము ఆతని యౌద్ధత్యమును సూచించుచున్నది. హర్యక్షపదము సార్థకము. క్రూరాకారావృత్తిగల వచనరచనము క్రోధానల ప్రజ్వలన సూచకము. వచ్చుచున్న సంజీవకుని స్థితి 'ఖుర ప్రహారముల దుమారంబులాకాశంబు నిరవకాశంబుగం గరోహించి ప్రావృషేణ్య ధారాధర వ్రాతంబు విడంబింప ధరాతలంబదర దురవలోక భీకరాకారంబు మీఱం బొఱలెంచె'నని వర్ణింపబడినది. ఇందును సంజీవకుని బలసంపద, యుయుత్స మనోహరముగా నిరూపింపబడెను. అహమహమికా పూర్వకమైన పింగళక సంజీవకుల యుద్ధమును జిన్నయసూరి విపులముగ నిట్లు వర్ణించినాడు.

'హర్యక్షవల్లభుండు.....బొఱలెంచు నుక్షాధ్యక్షు వీక్షించి ధరాధరంబులు మాఱుచెలంగ క్ష్వేళారవంబు గావించి సటాఘాటంబుల

నిక్కం గర్ణంబులు జిక్కించి పింగళేక్షణంబుల విస్ఫులింగంబు లెగయ నరాళ దంష్ట్రాకరాళంబుగ నాస్యగహ్వరంబు దెఱచి జిహ్వాపల్లవం బల్లార్చుచుం గుప్పింపం జొప్పు దప్పించి వృషభేంద్రుండు సముత్క్షిప్త వాల విక్షేపంబు మీఱం జెల్లు ద్రుళ్లి వెనుకటి కాళ్లం బయల జాడించుచు భూనభోంతరంబు బీటిల్ల నుదారారావంబు గావించుచు మస్తకంబు వాంచి వాఁటవాలుగం గొమ్ములొడ్డుకొని మెఱపుమెఱసిన తెఱగున నుఱికి యురమ్ము గ్రుమ్మ సమ్మోకమ్ముల మొకిమీఁదం బొమ్మ సిల్లి తెప్పునం దెప్పిలి ముప్పిరిగొను కోపంబు దీపింప నాటోపించి లాఘవంబున లంఘించి వజ్రఖంబులగు నఖంబులూఁదుకొన మూపురంబు చఱచినం దొరుగు కీలాలజాలంబు నగశృంగ నిస్సరజ్ఝరీ పూరంబు ననుకరింప గోవల్లభుండు తొలంగక మలంగి శాతశిఖరంబులగు ఖురంబులు కరంబు డిగ నురంబు దాచిన నత్తాపుకంబెం దత్ప్రాభవంబు గుండియ లవియింప బెండుపడి కంఠీరవవల్లభుండు దండతాడిత భుజంగంబు భంగి రోజుచు నిలిచి...'

చివఱకు పింగళకుఁడు సంజీవకుని నేలం గూలద్రోచి మూంగాళ్ళ నొత్తిపట్టి కుత్తుకం గఱచి నెత్తురు గుటగుటం ద్రావి యాఁబసవని యుసురునకుం బాచి ప్రశాంత క్రోధుండయి పాఱలి యిరవున కరగినట్లు వర్ణింపబడినది. పింగళక సంజీవకుల యుద్ధము జగజెట్టి వీరుల మహాయుద్ధమట్లు విపులముగ మనోహరముగ నభివర్ణింపబడినది. అత్తాపుకంబె దత్ప్రాభవంబు గుండెలవియించినట్లు పింగళకుఁడు తలంచుటలో ఆ మహానాయకుఁడెంతటి యభిమానధనుఁడో భంగ్యంతరముగ నుగ్గడింప బడినది. చిన్నయసూరి పింగళక సంజీవకుల పారస్పరికమైన విజిగీషను నిష్పాక్షిక సుందరముగ వర్ణించుట యభినందింప దగినది.

కథాకథనమును గ్రాంథికముగ నిర్వహించుచు సందర్భ సముచితముగ నిట్టి నీతిశ్లోకముల గూర్చి చిన్నయసూరి నీతిచంద్రికను నవరత్నఖచిత స్వర్ణాభరణముగ తీర్చినాడు. నీతిచంద్రిక యందలి

నీతులు సార్వకాలికములు, సార్వజనీనములునైన పరమ సత్యములు. అవి బాలుర కుత్తమ సంస్కారము గలిగించునట్టివి. నైతికముగ నున్నతపథమునకు గొంపోవ సమర్థకములు. బహులోకజ్ఞతా ప్రదాయకములు, భిన్న విషయబోధకములునైన యీ సూక్తులు సుచిరములై సూత్రబద్ధములుగా నున్నవి. అందుగొన్ని :

1) తల్లిదండ్రులు చెప్పినట్లు విని చదువుకొని లోకులచేత మంచివాడని పించుకొన్నవాడు బిడ్డఁడుగాని తక్కినవాఁడు బిడ్డఁడా.

2) బిడ్డలకు విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రుల దోషము.

3) ఎట్టి రత్నమైనను సానపెట్టక ప్రకాశింపనట్లు బాలుడెట్టి వాడయిన గురుజన శిక్ష లేక ప్రకాశింపఁడు.

4) సాధుసాంగత్యము సర్వశ్రేయములకు మూలము.

5) ఎవ్వరికైనను విధి తప్పించుకో వశము గాదు.

6) లోభమెంత చెడుగుణము ! అన్ని యనర్థములకు లోభము కారణము.

7) విపత్కాలమందు విస్మయము కాపురుష లక్షణము.

8) చేసిన కర్మ మనుభవింపక తీరునా.

9) తన్ను మాలిన ధర్మము మొదలుచెడ్డ బేరముగలదా.

10) శరీరము క్షణభంగురము, గుణములు కల్పాంత స్థాయులు

11) ఎంతవారికి గాని పూర్వకర్మ మనుభవింపక తీరదు.

12) కానున్నది కాకమానదు.

13) పరులకు వలసినన్ని ధర్మములు చెప్పవచ్చునుగాని తాము నడచుకోలు దుష్కరము కాదా.

14) సత్సంగతికంటె లోకమందు మేలేదియు లేదు.

15) ఎంతవారికిగాని దైవ మలంఘ్యము.

16) ప్రాణులకు సుఖదుఃఖములు సహజములు.

17) ఉదరపోషణము కయి పనులకు శరీరమమ్మి కొనుట మిక్కిలి హేయము.

18) పురుషుడు సాధువర్తను డయ్యెనేని సర్వలోక పూజ్యుడగును. కానిచో గర్హ్యుడగును.

19) దైవంబు ప్రతికూలంబగునేని బుద్ధికౌశలంబెల్ల వ్యర్థంబై చను.

20) వివేకరహితుండగు వారం గొలుచుట నిష్ఫలంబగుట మాత్రంబు గాదు; ప్రాణహానియు నాపాదించు

చిన్నయసూరి కథానుగుణముగ పంచతంత్రి హితోపదేశము లందలి నీతిశ్లోకముల నాంధ్రీకరించుటయు ప్రశస్యముగ నున్నది. శ్లోకానువాద విషయమున హితోపదేశమే ప్రముఖస్థాన మలంకరించుచున్నది. మూలశ్లోకములందలి భావములు ముచ్చట గొల్పునట్లను వదింపబడినవి. గ్రంథారంభమున మాత్రమే పద్యములు గలవు గాని మిగిలిన భాగమంతయు వచనమునందే గలదు. కొన్ని నీతిశ్లోకములు — వాని యనువాదము :

1) యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్
హితో — ప్రాస్తావిక

యౌవనంబు కలిమి దొరతన
మరయమి యనునట్టి వీనియందొకండొకండే
పొరయించు ననర్థము నాఁ
పెనఁగిననో నాల్గు చెప్పవలయునె చెప్పుమా.

2) అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శకమ్
సర్వస్య లోచనం శాస్త్రం యస్య నాస్త్యంధ ఏవ సః
**హితో — ప్రాస్తావిక**

పలు సందియములఁ దొలఁగించు
వెలయించు నగోచరార్థ విజ్ఞానము లో
కుల కక్షి శాస్త్రమయ్యది
యలవడ దెవ్వానికి వాఁడె యంధుఁడు జగతిన్

3) ఉద్యమేన హి సిధ్యంతి కార్యాణి న మనోరథైః
న హి సింహస్య సుప్తస్య ప్రవిశంతి ముఖే మృగాః

పం. తం. — మి. సం. — శ్లో 138

'పురుషకారముచేత కార్యములు సిద్ధించును. రిత్తకోరికల చేత సిద్ధింపవు. నిద్రించు సింహము నోరను మృగములు తమంతట వచ్చి చొరవు'

4) యత్ర విద్వజ్జనో నాస్తి శ్లాఘ్యస్తత్రాల్పధీరపి
నిరస్త పాదపే దేశే హ్యేరండోఽపి ద్రుమాయతే

హితో—మి.లా.—శ్లో 74

'విద్వాంసులు లేనిచోట స్వల్పబుద్ధియు సమ్మానింపబడుచున్నాడు. మ్రాఁకులేని దేశమందాముదపు జెట్టు మహావృక్షము గదా'.

5) అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్

హితో—మి—లా—శ్లో 75

'వీడు తనవాడని వీడు పరుడని యెన్నిక లఘు బుద్ధులకు. మహాత్ములకు లోకమే కుటుంబము.'

6) స్థానభ్రష్టా న శోభన్తే దంతాః కేశా నఖా నరాః
ఇతి విజ్ఞాయ మతిమాన్ స్వస్థానం న పరిత్యజేత్

హితో—మి—లా—శ్లో 107

'దంతములు కేశములు నఖములు నరులును స్థానభ్రంశముఁ

బొందిరేని రాణింపరు. కాఁబట్టి మతిమంతుఁడీ యర్థము తెలిసికొని స్థానము మానవలె నను బుద్ధి మానుకోవలెను'

7) స్థాన ముత్సృజ్య గచ్ఛన్తి సింహాస్సత్పురుషా గజాః
తత్రైవ నిధనం యాన్తి కాకాః కాపురుషాః మృగాః
హితో—మి—లా—శ్లో 108

'గజములు సింహములు సత్పురుషులు స్థానము విడిచి విచ్చల విడి సంచరింతురు, కాకములు మృగములు కాపురుషులును స్థానము మానఁజాలక వినాశముఁ బొందుదురు.'

8) అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితాని చ
వంచనం చావమానంచ మతిమాన్న ప్రకాశయేత్
హితో—మి—లా—శ్లో 140

'అర్థనాశము మనస్తాపము గృహమందలి దుశ్చరితము, వంచనము, పరాభవమును బ్రకాశింపఁ జేయఁదగదని పెద్దలు చెప్పుదురు'

9) సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సంగమః సజ్జనైస్సహ
హితో—మి—లా—శ్లో 165

'సంసార విష వృక్షమునకు రెండు ఫలములమృత తుల్యములు. కావ్యామృత రసపాన మొకటి, సజ్జన సంగతి యొకటి'.

10) ధర్మాయ యస్య విత్తేహా వరం తస్య నిరీహతా
ప్రక్షాళనాద్ధి పజ్కస్య దూరాదస్పర్శనం వరమ్
హితో—మి—లా శ్లో 195

ధర్మార్థము ధనముగోరుటకంటె నిస్పృహత్వము మంచిది. అదుసుఁ ద్రొక్కనేల కాలుగడుగ నేల'

మూలమందలి భావమును దేటతెల్లమొనర్చుట అనువాదమందలి ప్రత్యేకత, అనువాద పద్యములను బరిశీలించినచో చిన్నయసూరి

పద్యరచనలో నారితేరిన వాడనియు, వచనమును సమీక్షించుచో మనః పరిపక్వత గలవాడనియు స్పష్టమగును. సంస్కృతాంధ్ర భాషా ప్రావీణ్యమును, కథాచ్ఛలముచే నీతి కుశలతను బాలురకొదవించిన చిన్నయసూరి చిరస్మరణీయుడు.

*6 కందుకూరి వారి విగ్రహ సంధ్యనువాదము :*

ఆంధ్రసాహిత్యమున ఆధునిక యుగమునకు అధినేతగా గొందరిచే గుర్తింపబడిన కీర్తిశేషులు వీరేశలింగం పంతులు గారిచే చిన్నయ్యసూరి రచించిన నీతి చంద్రికకు బరిశిష్ట గ్రంథము రచింపబడెను. నీతి చంద్రిక విగ్రహము, నీతి చంద్రిక సంధి యను పరిచ్ఛేదములు గల గ్రంథము రెండు భాగములుగా ముద్రింపబడెను.

విగ్రహము ముందుగా రచింపబడినది. పీఠికలో దేవతాస్తుతి, పూర్వాంధ్ర కవితా ప్రశంస గావించిన పిదప వీరేశలింగం పంతులుగారు చిన్నయసూరి నీతిచంద్రిక యను పేర వచనమున సగము రచింపగా దాముత్తరార్థమును బుధులు ప్రశంసించునట్లు రచింపదలచినట్లు

చిన్నయ సూరి ధీరుఁ డెదఁ జేరిచి సారెకు గారవింపఁగా
మున్ను రచించి మించె సగమున్వచనంబుగ నీతిచంద్రికన్
సన్నుతికెక్క దానికిదె సాటియటంచు బుధుల్మనంబులం
దెన్నఁగ నిప్పుడేను రచియించెదఁ దక్కిన యుత్తరార్థమున్

అని పేర్కొనినారు. నీతి చంద్రికకు సాటి గ్రంథముగా బండితులు సన్నుతించునట్లు పంతులుగారీ గ్రంథమును రచింపయత్నించినారు గాని లోకమున చిన్నయ్యసూరి నీతి చంద్రికకుగల ప్రశస్తి దీనికి లభింపలేదు.

పంతులుగారు పెక్కాంధ్రకృతులను బంచతంత్ర హితోపదేశ భారతములను బహువారములు పరికించి యందలి కథలను గొన్ని నూతనములైన కథలను గలిపి విగ్రహపరిచ్ఛేదమును సంతరించినట్లు

పేరిచి సావకాశముగ విగ్రహమీయది వ్రాయఁబూని నే
నారసి పెక్కులాంధ్రి కృతులంతటఁ బోక హితోపదేశమున్

భారత పంచతంత్రములుఁ బల్మఱునుం బరికించి వానిలోఁ
గోరిక యూరకథల్గొనియుఁ గూర్చితిఁ గొన్నిటి నూతనంబుగన్

అని యుగ్గడించినారు.

పండితులామోదించునట్లుగా విగ్రహమును వారు ప్రాచీనాంధ్ర కవుల మార్గము ననుసరించియే పదవాక్య పద్ధతులను నిర్వహించినట్లు

దీన సామాన్యముగఁ దొంటి తెలుఁగుకవుల
వాడియున్నట్టి పదవాక్య పద్ధతులనె
యేర్చి కూర్చినవాఁడ గవీంద్రులకును
మించుగా డెందముల రుచియించు కొఱకు

అని తెలిపినారు.

విగ్రహసంధి పరిచ్ఛేదములు రెంటిని బరిశీలింపగా విగ్రహతంత్రమందలి పదవాక్య సంయోజనము సులభ గ్రాహ్యము గాదనిపించును. శైలి జటిలముగా నున్నది. పండితైక వేద్యముగ నున్నదనవచ్చును. కావున గధారచనా ప్రయోజనము నెరవేరకున్నదని నిర్ణయింప వచ్చును. వీరేశలింగం పంతులుగారు కూడ నీ విషయమును అంగీకరించి సంధితంత్ర రచనా సందర్భమున

ఇంతకుమున్ను నేను రచియించిన విగ్రహతంత్ర మెల్లచో
నెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁ బడ్డదటంచుఁ బల్మఱున్
పింతగ నాకు లేఖలను బెక్కురు వ్రాయుచు నుంటఁజేసి యు
త్యంతము గ్రాసితిన్ సులభమాగతి దీనిని సంధితంత్రమున్

అని సూచించినారు.

సంధి పరిచ్ఛేదమును కూడ విగ్రహ పరిచ్ఛేద రచనమువలె హితోపదేశ భారత పంచతంత్రములను బరిశీలించి వానియందలి కొన్ని కథలను, కొన్ని క్రొత్త కథలను గలిపి రచించినట్లుగా నారిట్లు చేర్చినారు.

పలుమఱు హితోపదేశంబు భారతమును
పంచతంత్రింబుఁ బరికించి వానిలోన
పలమను కథలను గొని దీని వ్రాసినాఁడఁ
గొ్రత్తగాఁ గొంత యందందుఁ గుదురు పఱిచి.

విగ్రహము సంధి యను పరిచ్ఛేదములు రెండును ప్రత్యేకముగా ప్రచురింపబడుటకు గారణము బహుశః పీఠికలు రెండు రచింపబడుటయే కావచ్చును. అనువాద విషయమున హితోపదేశమునే ప్రధానముగా గ్రహించినట్లు తోచుచున్నది. విగ్రహసంధి పరిచ్ఛేద నామకరణము గూడ హితోపదేశమే మూలమను విషయమును సూచించు చున్నది. ప్రధానకథగూడ హితోపదేశమునే యనుసరించి రచింపబడినది. అందును, వీరి యనువాదమందును హిరణ్యగర్భుడను మరాళ శ్రేష్ఠునకును జిత్రవర్ణుడను మయూర నాథునకును సంభవించిన విగ్రహ సంధులే కథగా స్వీకరింప బడినవి. పంచతంత్రమందలి లబ్ధప్రణాశము నకు సంబంధించిన ప్రధాన కథయగు మర్కట మకరముల కథ యట్లే యపరీక్షితకారిత్వ ప్రధాన కథయగు బ్రాహ్మణ నకులముల కథయు ఈ యనువాదమున అవాంతర కథలుగా గ్రహింపబడినవి. కావున వీరేశలింగం పంతులుగారి యనువాదమునకు హితోపదేశమే మూల మనదగును. రెండు పరిచ్ఛేదముల పీఠికల యందును వారుగూడ హితోపదేశమునకే ప్రథమ స్థాన మొసంగినారు.

విగ్రహ పరిచ్ఛేదానువాదమున ప్రధాన కథగాక యవాంతర ముగా కోతి–శశము, కపోతము–సాళువము, గాడిద పులితోలు కప్పు కొనుట, గజయూథపతి–శశకము, కాకము–హంస, పులి–బకము, నక్క– నీలీరస భాండము, కాకోలూకీయము, మార్జాలము–మూషికము అను కథలు గలవు. సంధి పరిచ్ఛేదమున ప్రధాన కథ గాక వణిజుడు–కాల సర్పము, శశ కపింజలములు–మార్జాలము, బ్రాహ్మణుడు–సక్తుపిండి ఘటము, బ్రాహ్మణుడు–మేకపిల్ల, మర్కటము–మకరము, నక్క– కూర్మము, మందవిషుడను పాము–మండూకపతి, బ్రాహ్మణుడు–నకులము

అను నవాంతర కథలు గలవు. వీనిలో కోతి-శశమను కథ పంచతంత్రి హితోపదేశముల నుండి మార్చి రచింపబడినది. పంచతంత్ర హితోప దేశములకెట్టి సంబంధము లేని కథలుగూడ వీరి యనువాదమున గలవు. విగ్రహ పరిచ్ఛేదమందలి కపోతము-సాళువము, కాకము-హంస, పులి-బకము, మార్జాలము-మూషికము అనునవి యట్టికోవకు జెందును. వానిని భారతమునుండి గ్రహించిరో లేక స్వీయముగా రచించినారో పరిశీలనార్హము. ఒక్క ఖైచరరాజుని చంపనువాదమున మాత్రమే యుండి పంచతంత్ర హితోపదేశములలో గానరాని 'సక్క-కూర్మము' అను కథను వీరేశలింగం పంతులుగారు సంధి పరిచ్ఛేదమున ననువదించుట విశేషము. హితోపదేశమందలి విగ్రహ పరిచ్ఛేదమున ప్రసిద్ధములైన రథకారుని కథ, నాపితుడు-భిక్షుక సంహారమను కథ విడువబడినవి. అట్లే సంధి పరిచ్ఛేదమున ప్రసిద్ధికెక్కిన ముని-మూషికాంగన యను కథయు విడువబడినది.

వీరేశలింగం పంతులుగారు పాత్ర పోషణమున ఎంతయో సామర్థ్యమును వెల్లడించినారు. విగ్రహ పరిచ్ఛేదమున 'గజయూథపతి-శశకము' అను కథలో గజయూథ గమనముచే దనపరివారము పొందిన వినాశమునకు వ్యథిత హృదయుడైన శశపతియగు శిలీముఖుని మనః స్థితిని పంతులుగారు

> '...ఆదారుణ భాషణము శ్రవణములందూటి హృదయదారుణము గావింపఁ గరగుపత్త కన్నుండై హరిహరీ యని కన్నులు మూసికొని, కొంతసేపు చిత్రామమానంగా త్రుండయి జీచ్చవడియుండి మంత్రి ప్రియత్నంబునం దెలిసి దీర్ఘ నిశ్వాస పురస్సరముగా నలుదెసలుం జూచి యల్లన లేచివచ్చి కార్యచింతా పరత్వంబున సమాత్యులంగని శిలీముఖుండు...'

అని మనోహరముగా రచించినారు. ఆ శశపతి తన పరివారమునకు గలిగిన ఘోరప్రమాదమునకు పరితపించిన విధము సత్యాంత సహజముగ

నుండునట్లు పంతులుగారు రచించినారు. భంగ్యంతరముగ శిలీముఖుని పాలనపరత్వము వ్యక్త మొనర్పబడినది.

సంధిఁజేను పరిచ్ఛేదమున దేవశర్మ యను విప్రుని. గార్య యాజ్ఞ సేని సంతాన ప్రాప్తికై పడినపాట్లను కందుకూరివా రత్యంత మనోజ్ఞముగ

'... ఆతని భార్య యాజ్ఞసేని సంతానము లేనిదయి పుత్రులంగని పెంచు తన యీడు చేడియలంగని ముచ్చటపడుచు, బిడ్డల నిమిత్తము యోగులని వేషములు వేసికొను వారినెల్లఁ గాళ్లు కడుపులు పట్టుకొని యాశ్రయించి వారిచే వేళ్లు వెల్లంకులు గట్టించుకొనుచు ఱాతికి గుడి గన్న గుడికి మొ్రక్కుచు ఎవ్వరే తీర్థము పేరు చెప్పిన నచ్చటికి బోయి మునిగి వచ్చుచు లోకములో లేని నోములు, వ్రతములు పట్టుచుండెను'

అని వర్ణించినారు. సంతానకాంక్షిణి యగు స్త్రీమనస్తత్త్వమతి సహజముగను సుందరముగ నిందు నిరూపింపబడినది.

వర్ణనలును గందుకూరివారి యను వాదమున మిక్కిలి మనోహరముగ సందర్భ సుందరముగ నిర్వహింపబడినవి. విగ్రహపరిచ్ఛేదమందలి 'పులి–బకము' అనుకథలో ప్రౌఢముగను ప్రబంధోచితముగను అటవీ వర్ణనము గావింపబడినది. అందలి లతలు, తుమ్మెదల పిండు, పక్షుల సముదాయము ఎట్లున్నవో దీర్ఘ వచనమున నిట్లభి వర్ణింపబడినవి.

'అందు నిరంతర పరిపుల్లనవ మల్లికా వల్లికా మతల్లికా వేల్లిత నికుంజ రంజితంబయి, కుసుమవిసర పరిమళ మిళిత గళిత మకరంద బిందు సందోహాస్వాదనాగత మిళింద బృంద సుందరంబై నికట విటపి విటప పచ్చటారటచ్ఛకుంత సంతానాశ్రాంత తాంత వాశ్రాంత దిగంతరాళంబయి, పొదలు పొదరుటడవి యొక్కటి యుండెను.'

విగ్రహ పరిచ్ఛేదమున శుకము ప్రభువగు చిత్రవర్ణునితో కర్పూర ద్వీప విశేషములను 'ఎక్కడఁజూచిన నప్సరస్సమన్వితంబును సుమనో విరాజితంబునై మాఱట స్వర్గంబునాఁ జూడ్కికి వేడ్కఁగొలు

చున్నది' అని చెప్పినట్లు రచింపబడినది. ఈ ద్వీపవర్ణనము సంగ్రహముగను, శ్లేష బంధురముగను, బహురమ్యముగ నిర్వహింపబడినది. అప్సరస్సమన్వితమనగా నీటితో గూడిన సరస్సులతో గూడినదని ద్వీప పరమైన యర్థము. అప్సరలతో గూడినదని స్వర్గ పరమైన యర్థము. సుమనో విరాజితమనగా పుష్పములతో ప్రకాశించు చున్నదని ద్వీప పరమైన యర్థము. దేవతలతో ప్రకాశించు చున్నదని స్వర్గపరమైన యర్థాంతరము. సుకుమార పద బంధములో శ్లేషాలంకారమును కవి ప్రయోగించిన తీరు మిక్కిలి ప్రశంసాపాత్రము.

వీరేశలింగం పంతులుగారు నీతి ప్రవచనమునను చాతుర్యమును ప్రదర్శించినారు. సమయోచితముగ సంస్కృతాంధ్ర సూక్తులను బెక్కింటిని విగ్రహ సంధి పరిచ్ఛేదములలో ప్రయోగించినారు. అందు గొన్ని :

1) లోకంబున సాధునింద కంటె మిక్కిలి పాతకం బెద్ది
2) ఏ వారికి గాని బలవద్విరోధంబు లగ్గుగాదు
3) తాత త్రవ్వించిన తటాకంబని పొంగి బ్రుంగందగదుగదా
4) అన్యాదోపకారి తన కిల్బిషంబున దానె కాలిపోవును
5) దుర్జనుని తోడంగూడి నడచుట యెడను తోడరుటకె కారణంబగును
6) అతివినయము ధూర్త లక్షణము
7) మిత్త్రచిత్త్ర వృత్తులకు జేసిన మేలు వమ్మగుటయే గాక, చేసిన వారికి గోరములును బ్రాప్తములగును
8) చలిమిమై జీదు మేపింపవచ్చుంగాని బలిమిమెయిం బాలు నాప్రింపరాదు
9) ఎంత పొరలినను దైవానుకూల్యంబు లేని కార్యంబులు సిద్ధింబొందవు గదా
10) నిటల లిఖితాక్షరంబులు తుడిచి వేయ నెవ్వరిచేనగును

11) పోరునష్టము పొందులాభము
12) పాపీచిరాయువు
13) ఆత్మవత్సర్వ భూతాని
14) మాహింస్యాత్సర్వ భూతాని
15) శరీరమాద్యంఖలు ధర్మ సాధనమ్
16) ఆత్మార్థం పృథివీం త్యజేత్
17) వినాశకాలే విపరీత బుద్ధిః
18) ధర్మోజయతి
19) ఆలస్యాదమృతం విషమ్
20) అత్యుచ్ఛ్రియః పతన హేతుః

కొన్ని పంచతంత్ర హితోపదేశ నీతి శ్లోకానువాదములు :

1) ఉపదేశోహి మూర్ఖాణాం ప్రకోపాయ నశాంతయే
పయఃపానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్

పం–తం–మి–భే శ్లో 420

'పాములకు బాలుపోయ విషవృద్ధియగునట్లు వివేక శూన్యులకు హితవాక్యంబులు గఱప దుర్మదం బెక్కును.' (విగ్రహ)

2) ఉద్యతేష్వపి శస్త్రేషు దూతో వదతి నాన్యథా
సదైవావధ్య భావేన యథార్థస్య హివాచకః

హితో–విగ్ర–శ్లో 17

'దూతయయినవాడు విరోధియని రోధ క్రోధంబున గృపాణపాణియయి ప్రాణంబులు గొన గమకించుచున్న నైన త్రాసంబువాసి వాంఛయోడక యథార్థంబె వచియింపవలయు' (విగ్రహ)

3) స్థానేష్వేవ నియోక్తవ్యా భృత్యాశ్చాభరణాని చ
న హి చూడామణిః పాదే ప్రభవామీతి బ

పం. తం – మి. భే – శ్లో 78

'చూడామణి స్థానమునం బాదుకల నిడ గూడనట్లు మహోత్తము
లుండదగిన పదంబునందు నీచుల నెప్పుడును నిలుపరాదు'
(విగ్రహ)

ఇట్లు కందుకూరి వీరేశలింగం పంతులుగారిచే విగ్రహసంధి పరిచ్ఛేదములు సుమనోమనోహరముగ రచింప బడినవి.

## 7. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి యనువాదము :

కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు గూడ చిన్నయసూరి విడిచిన పంచతంత్ర భాగము ననువదించినట్లు ప్రసిద్ధి గలదు. కాని నేడాగ్రంథ మలభ్యము. 'వీరేశలింగ గ్రంథావళి' లోని తొమ్మిదవ సంపుటమున వేంకటరత్నముగారి యనువాదముపై వీరేశలింగం పంతులుగారు గావించిన విమర్శన వ్యాసము లభించుచున్నది[6]. ఆ వ్యాసమును బట్టి వీరికిని వీరేశలింగం గారికిని అభిప్రాయ భేదమున్నట్లు తెలియుచున్నది. అందలి విమర్శ దీవ్రత నొందినదనియే చెప్ప వచ్చును. ఆ వ్యాస మాధారముగ వేంకటరత్నం పంతులుగారి యను వాద పద్ధతి ఇట్లు పేర్కొనబడు చున్నది.

కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి యనువాదము వచన మున సాగినది. దానికి వారి శిష్యులైన శ్రీ శివశంకర పాండ్యా బి. ఏ. గారు లఘుటిప్పణి వ్రాసియున్నారు. కొక్కొండవారు ఈ గ్రంథమును విగ్రహమనుపేర రచించినారు. అనువాదము హితోపదేశము ననుస రించి నట్లున్నది. అందు గవిగారిని గూర్చి 'శ్రీ బిల్వనాథ మహాదేవ వాత్సల్యైకోది తోపలబ్ధ సంస్కృతాంధ్ర కవితా పరికాండు' లని పేర్కొనబడినది. అనువాదము

శ్రీపిందుయ్యండితఁడా శ్రీశైకవశుఁడై చెన్నారు మున్నా నగుం
గావించెం గృత కృత్యుఁగా విజయుఁగాఁగాంక్షింతు మంచెల్లనున్
సేవంజేసి కృతార్థులౌటకన నిల్చెం బార్థ సూతాకృతిన్
శ్రీవిద్యుద్ధన వర్ణుఁడవ్వఁడతనిన్ సేవింతు నారాయణున్

---

6 పుటలు – 173 – 218

అను పద్యముతో నారంభింప బడినది. వీరేశలింగంగారు పై పద్యమందలి గావించెన్ అను పదము దేనితో నన్వయించును? మొదట శ్రీవద్యుండని చెప్పి మరల శ్రీవిద్యుద్ఘనుండని ప్రయోగించుటకు ప్రయోజన మేమి యని ప్రశ్నించినారు. అల్లే అనువాదమున కథయందు మహాభారతమందలి పవన శాల్మలీ తరుసంవాదము ప్రాస్తావికముగా రచింప బడగా దాని యునికి మిక్కిలి యనుచితముగా నున్నదనియు కందుకూరి వారు ఖండించినారు. ఆ వ్యాసమందు చేర్కొనబడిన కొక్కొండవారి కొన్ని యనువాద పంక్తులు :

> 'ఆశ్రయించినను ఫలచ్ఛాయా సమన్వితంబగు మహావృక్షమునే యాశ్రయింపవలెను. ఒకవేళ దైవికంబుగ ఫలంబులు లభింపక పోయినను ననివార్యంబగు దాని నీడ నేడు మాపనోపును. సింహ ప్రసాదంబున గజంబును వనంబున నిర్భయంబుగ జరించుట గానమె? అట్లు ప్రబలుం జేరిన లాఘువాస్పదులకును గౌరవంబబ్బును. ద్వేష్యులును సర్వజగన్మాన్యు లగుదురు. ఇక నార్యులు ప్రశంసనీయు లగుదురని యుగ్గడింపనేల...'

ఇందలి వచనము సరళము సుబోధకముగ నున్నది. చిన్నయసూరి, కందుకూరి గావించిన పంచతంత్రానువాదములకు గల ప్రశస్తి కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి యాంధ్రీకరణమునకు రాలేద నియే చెప్పవచ్చును.

### 8. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారి యనువాదము :

పరవస్తు చిన్నయసూరికి సమకాలికులై పలువిధముల ప్రతిభటింప దలపడిన కృష్ణమూర్తి శాస్త్రిగారు పంచతంత్రము ననువదించి నట్లు కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రలో చేర్కొనినారు. కాని యనువాదము నేడు లభించుట లేదు.

### 9. వావిళ్లవారు ప్రచురించిన యనువాదము :

వచనమున రచింపబడిన పంచతంత్రమొకటి వావిళ్ల రామ

స్వామిశాస్త్రుల వారిచే ప్రచురింపబడినది. అది పంచతంత్రమునకు సంపూర్ణమైన వచనాంధ్రీకరణము. అదే ప్రతిని కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ వారును ముద్రించినారు. వారందు ఆ పంచతంత్రము చిన్నయసూరి ప్రణీతమని పేర్కొనుట విచార్యము. వావిళ్లవారి ప్రచురణలో గ్రంథకర్తృనామము ఎచ్చటను పేర్కొనబడలేదు. మిత్రలాభ మిత్రభేదములను మాత్రమే చిన్నయసూరి రచించినట్లు లోకవిదితము. అవతారిక లేకపోవుట, గ్రంథాదినిగాని, పరిచ్ఛేదాంతము లందుగాని అనువాదయితనామము సూచింపబడకపోవుట గమనింప దగినది. రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు బాలురకొఱకు బంచతంత్ర మును వచనమున దెనిగించినారనియు దానినే వావిళ్లవారు కాళహస్తి వారు ప్రచురించినారనియు గొందరందురు.

ఈ వచనానువాదమున మిత్రభేదము, సుహృల్లాభము, సంధి విగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్య కారిత్వమను నైదు పరిచ్ఛేద ములు గలవు. హితోపదేశానుసారము పాటలీపుర సుదర్శన మహా రాజుల వర్ణనముతో గథ ఆరంభింప బడినది. పంచతంత్ర మాధారముగ ఈ యనువాదము రచింపబడినను అందలి కొన్ని కథలిందు విడువబడి నవి. మిత్రభేదమందలి ఆషాఢభూతి కథలో వచ్చు నాపితదూతి - తంతువాయుని భార్య యను కథ, కాకోలూకీయ తంత్రమందలి వృద్ధ వణిక్కు-చోరుడు అనుకథ, రథకారునికథ అపరీక్షితకారిత్వ తంత్ర మందలి క్షపణకుని కథలో నాపితుని కథ యీ యనువాదమున విడువ బడినవి. ప్రసిద్ధములైన యితరానువాదములందీ కథలు గ్రహింపబడి నవే. తంతువాయుని కథ, రథకారునికథ కులటావృత్తాంతము గలవి గావున బాలురకట్టి కథలను బోధింపరాదను తలంపుతో ఈ యను వాదకుడు విడిచియుండును.

ఈ యనువాదమందలి వచనము మిక్కిలి సరళము సుస్పష్టము నైయున్నది. ఏకవార పఠన మాత్రముననే కథ సులభగ్రాహ్యము కాగలదు. అన్వయక్లేశ మీ గ్రంథమున మృగ్యమనవచ్చును.

ఈ యనువాదకుడు పాత్రల స్వభావ చిత్రణమున నెంతయో సహజత్వమును బోషించినాడు. మిత్రభేదమందలి వానరము-కీలోత్పాటనము కథలో కపి చపల స్వభావమును కవి యిట్లు నిరూపించినాడు

'అప్పుడా సమీపవృక్షముల నాశ్రయించి తిరుగుచున్న కోతులు దేవాలయము చెంతకు వచ్చి గుడియెక్కి చెట్లపైకి గుప్పించి దూకుచు జెట్లపై నుండి దాటుచు గొప్పకొమ్మల నూగులాడుచుఁ బ్రాకారములు ప్రాకి పరుగెత్తుచు గోపురంబుల మీఁదఁ గూర్చుండుచు గోళ్లతోఁ బ్రక్కలు వీఁపులు గోకుకొనుచుఁ గనుబొమలెత్తి వెక్కిరించుచుఁ బండ్లిగిలించుచు నొకదానితో నొకటి జగడమాడి యాడిపోవుచుఁ బండ్లు భక్షించుచుఁ దేనెలు ద్రావుచు స్వాభావికమైన చపలత్వము చేతఁ దిరుగుచుండెను'

అట్లే సింహము-శశకమను కథలో మృగపతికాహారముగా వెడలవలసిన వంతు తనకు వచ్చుటను దెలిసిన శశకము పడు యవస్థను కవి

'ఆమాట వినగానే కుందేలు ప్రాణములు కొట్టుకొనుచుండగా మూర్ఛపోయి కొంతసేపటికి మూర్ఛ దెలిసికొని కన్నుల దెఱచి దృష్టించి తలయూచి చింతా సముద్రములో మునిగి ముహూర్త మాత్రమునకు దెలివి దెచ్చుకొని మనసులో నుండు దిగులు విడిచి సాహసముతో దన మనంబున నిట్లని వితర్కించెను'

అని వర్ణించినాడు. చిన్న జంతువగు శశము భయంకర మృత్యుభీతి కెట్లు కలగుండు వడినదో కవి మనోహరముగా జిత్రించినాడు.

ఈ యనువాదమున వర్ణనలు సందర్భ సముచితముగ నిర్వహింపబడి యనువాదమునకు గావ్యత్వమును జేకూర్చుచున్నవి. మిత్రభేదమందలి నక్క-భేరి యనుకథలో యుద్ధభూమి వైభవము

'ఒక దిక్కున గుప్పలుగా గూలియున్న తేరులును, తొండంబులు కొమ్ములు తొడలు తలలును తెగిపడియున్న యేనుగులును మెడలు

కాళ్లు పక్కలు గొనుకలయి పడియున్న గుఱ్ఱములును, ముక్కులు చెక్కులు వ్రేళ్లు కాళ్లు చేతులు మూతులు తెగి భూమిమీఁదఁ బడిన భట సమూహంబునుం గలిగి భయంకరమైన యొక యుద్ధభూమి యగుపడెను'

అని వర్ణింపబడెను. ఈ వర్ణనమునకు జంపూకర్తల యనువాదములు మూలమున దగినవి. ఈ యనువాదకుడు సంధి విగ్రహపరిచ్ఛే దారంభ మున గావించిన వట వృక్ష వర్ణనము గూడ నత్యంత మనోహరముగా నున్నది. వాయసాధిపతి యగు మేఘనాథుడు సపరివారుడై నివసించు చున్న ఆ వట వృక్షమిట్లు వర్ణింపబడినది.

'ఒక యడవిలో గొప్పకొమ్మలచేత భూమియు నాకాశంబును దిక్కులు నాక్రమించి సూర్యకిరణములు సొరగూడని యాకుజొంప ములచేత బూర్ణమయి యుదకముతో గూడుకొన్న మేఘము యొక్క రూపమును ధరించి, చూచువారికి నాశ్చర్య కరమై, మహా సర్పములకును సమస్త పక్షులకు నాశ్రయమైన యొక మఱ్ఱిచెట్టు గలదు'

మహాకాక పరివార నివాసోచితమైన ఈ వర్ణనమునకుగూడ జంపూ కర్తల యనువాదములే మూలమున దగినవి

ఈ యనువాదయిత పంచతంత్ర హితోపదేశములందలి పెక్కు నీతిశ్లోకముల ననువదించినాడు. భావస్పష్టతతో దేట తెనుగున నతడను వదించిన విధ మత్యంత హృదయంగమముగా నున్నది. కొన్ని యుదా హరణములు :

1) యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమ వివేకతా
ఏకైకమప్యనర్థాయ కిముయత్ర చతుష్టయమ్
హిత–ప్రాస్తావిక–శ్లో 12

'యౌవనము, ధనము, దొరతనము, అవివేకము అను నీ

నాల్గింటిలో నొకటొకటే యనర్థమును బుట్టించును. ఈ నాల్గు గల్గినచోట జెప్పవలసిన దేమి?'

2) అశ్వః శస్త్రం శాస్త్రం వీణావాణీ నరశ్చ నారీచ
పురుష విశేషం ప్రాప్తా భవంత్య యోగ్యాశ్చ యోగ్యాశ్చ

పం. తం—మి. ఖే—శ్లో 119

'గుఱ్ఱమునకు, ఆయుధమునకు, శాస్త్రమునకు, వీణకును, వాక్కునకును, స్త్రీకిని, నేర్పరియైయున్న పురుషునికి నొకా నొక పురుషుని బొందుటచేత యోగ్యత గల్గును. ఒకానొక పురుషుని బొందుటచేత నయోగ్యత గలుగును'.

3) ఉత్తరాదుత్తరం వాక్యం వదతాం సంప్రజాయతే
సువృష్టి గుణసంపన్నా ద్బీజా ద్బీజ మివాపరమ్

పం. తం—మి.ఖే—శ్లో 64

'మంచివర్షము కురిసిన విత్తనము వలన పొలముల పైర్లు పుట్టు చున్నదో యటులనే బాగుగా నుత్తరము చెప్పినట్లయిన వానివలన మఱియొక యుత్తరము పుట్టుచున్నది'.

4) నగోప్రదానం న మహీప్రదానం
నచాన్నదానం హి తథా ప్రధానమ్
యథా వదంతీహ బుధాః ప్రధానం
సర్వప్రదా నేష్వభయ ప్రదానమ్

పం. తం—మి. ఖే.—శ్లో 313

'గోదానంబును, భూదానంబును, నన్నదానంబును, సువర్ణ దానంబు నభయ వాగ్దానమునకు సరిగావని పెద్దలు చెప్పుదురు'.

5) కాయః సన్నిహితాపాయః సంపదః క్షణభంగురాః
సమాగమాః సాపగమాః సర్వేషామేవ దేహినామ్

పం. తం.—మి సం—శ్లో 191

'దేహమున కెప్పుడు నపాయము సన్నిహితమయి యుండును. సంపదకు వెంబడిగా నాపదలు వచ్చుచుండును. కూటమికి దోడనే యెడబాయుట సంభవించును. ఉత్పత్తిగల సర్వము నకును నాశము కలిగియే యుండును'.

ఈ విధముగ బంచతంత్రమిందు సంపూర్ణముగ సరళమైన వచనమున ననువదింప బడినది. కాళహస్తి తమ్మారావుగారి ప్రచురణమున భాష వ్యావహారికచ్ఛాయలు గల్గియున్నది. వావిళ్ల వారి ప్రచురణమున భాష సులక్షణముగా నున్నది.

### *10 ఉల్లంగి రామచంద్రరావుగారి యనువాదము :*

ఆరుద్రగారు సమగ్రాంధ్ర సాహిత్యమున ఉల్లంగి రామచంద్ర రావుగారు పంచతంత్రమును పద్యకావ్యముగ ననువదించినారని పేర్కొనిరి[7]. గ్రంథ మలభ్యము. నిడుదవోలు శివసుందరేశ్వరరావు గారు దూబగుంట నారాయణకవి యనువాదమునకు బరిచయ తంత్రము వ్రాయుచు ఈ యనువాదమును గూర్చి యభిప్రాయ భేదములతో నిట్లు పేర్కొనినారు[8]. 'ఉల్లిగుండం రామచంద్రరావు సంధి విగ్రహ ములు వచనరూపముగా రచించిరని నిడుదవోలు వేంకటరావుగారును, పద్యకావ్యముగా నున్నదని కేతుమళ్ల వారు, ఆరుద్రయు వ్రాసిరి. ఏది నిజమో!'

### *11 మల్లాది లక్ష్మీపతిశాస్త్రిగారి యనువాదము :*

ఆధునికులలో ప్రౌఢకవిగా గుర్తింపదగిన బ్ర॥ శ్రీ॥ మల్లాది లక్ష్మీపతిశాస్త్రిగారు, పరవస్తు చిన్నయసూరి రచించిన నీతిచంద్రికను 'నిర్వచన నీతిచంద్రిక' అను పేర ననువదించినారు. వీరు మొదట నీతి చంద్రికను మాత్రమే నిర్వచనముగ ననువదింప దలంచి యుందురు. మిత్రలాభం, మిత్రభేదమను రెండు ప్రకరణములుగా గ్రంథము వెలు వడినది. అనంతరము వీరు సంధి విగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్య కారిత్వమను మూడు ప్రకరణములతో బంచతంత్రమందలి మిగిలిన

7 సంపుటము 6 – పుట 131 – 8 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ – పుట 39

మూడు పరిచ్ఛేదములనుగూడ నిర్వచనముగ ననువదించినారు. ఇట్లు నిర్వచన నీతిచంద్రిక యనుపేర వీరు పంచతంత్రమును సంపూర్ణముగ తెనిగించి రెండు భాగములుగ ప్రచురించినారు.

మిత్రలాభ ప్రకరణాంతమున తమ రచనా విధానమును వారిట్లు పేర్కొనినారు.

ఇమ్ముగ నాంధ్రభాష రచియించిన చిన్నయసూరి గద్య కా
వ్యమ్ముగ నీతిచంద్రిక దయాకర చెప్పితి నేను పద్య కా
వ్యమ్ముగ నుండ నిర్వచన ఫక్కిగ నందరిది గొమ్ము మిత్ర లా
భమ్మను సంకితం బిదియె భవ్యమతీ! గయికొమ్ము రాఘవా!

సంఖ్య 323

ఇట్లే మిత్ర భేద సంధి విగ్రహాదుల చివరను పేర్కొనబడినది.

రెండు భాగములందును ఆదిని దేవతాస్తుతి గలదు. ఇష్టదేవతగా రామచంద్రుని లక్ష్మీపతి శాస్త్రిగారు తొలిభాగమున నిట్లు స్తుతించినారు.

శ్రీరమణుద్వితీయమున తన చేడియ సీతనుగూడ తాను సం
సారివలెన్ నటించుచు సమస్త జగత్పరిరక్షణ ప్రియా
భారము నూని భద్రగిరిపై నివసించెడి లోకమోహనా
కారుడు రాముడిచ్చుత నఖండ శుభంబులు మాకజస్రమున్.

రెండవ భాగము నాదిని రామభద్రుని విష్ణుస్వరూపునిగ గవి గారిట్లు నుతించినారు.

మంత్రమ్ము జగద్రుద్ర ముఖ్యసురసంసేవ్యమ్ము శాపత్రయో
ద్దామారణ్య దవానలం బఘచయాబ్జశ్రేణి జంఝానిల
స్తోమమ్ము వ్యయ మోక్ష కల్పలతికా సుస్తోకపత్రీభావమ్ము శ్రీ
రామ బ్రహ్మపదమ్ము గొల్తు నఖిలార్థంబుల్ ప్రసాదింపఁగన్.

నిర్వచన నీతిచంద్రిక రెండు భాగములను లక్ష్మీపతిశాస్త్రిగారు రామచంద్రునకే యంకిత మొసంగినారు. మిత్రలాభాది ప్రకరణారంభములందు రాముని సంబోధించుచు పద్యములు రచింపబడినవి.

ఇష్టదేవతా ప్రార్థనమున లక్ష్మీదేవి, శివుడు, పార్వతి మున్నగు దేవతలు స్మరింపబడిరి. రెండవ భాగమున కవిగారచ్చ తెనుగుపదములతో బసవేశ్వర స్వామి వైభవమును వర్ణించినారు.

మొలచులిఱ్ఱాలు గెలుచుఁగొన ముష్టినవాల్ వెలిబూది పూతమేల్
కలపము, మేఁపులంకఁ బెనఁగంబడు పాపనగల్, జటాళిలే
నెల, నినువాకయున్ దళుకు లీనఁగఁ గుత్తుక జే వెసంగ నె
వ్వాలి కఱసే సొసంగు శివు చిన్నెల సన్నెదఁ బున్నె మొంగనన్.

ఈ పద్యము పాల్కురికి సోమనాథుడు వృషాధిప శతకమున రచించిన 'బలుపొడ తోలు సీరయును బాపసరుల్ ...' అను పద్యమును దలపించుచున్నది. అట్లే లక్ష్మీపతిశాస్త్రిగారు ఆంజనేయ స్వామిని స్తుతించుచు రెండవ భాగమున రచించిన

ఇంచిన వేడ్కమీఱ నుతియించెద రామకథా ప్రసంగముల్
మించినచోట చే ఘనుఁడు మూర్ధము హస్తయుగమ్ముఁ జేర్చి నే
త్రాంచలసీమ జారఁగ ముదశ్రులు బిందులు స్రుక్కుచుండు న
క్కాంచన ధారుణీధ్ర సమకాయ రుచిందగు నాంజనేయునిన్

అను పద్యము లోకప్రసిద్ధిగాంచిన క్రింది శ్లోకమున కనువాదప్రాయ మనదగినది.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్

మొదటి భాగమున బూర్వకవిస్తుతి లేదు గాని రెండవభాగమున మాత్రము వాల్మీకి వ్యాసులు, కవిత్రియము, శ్రీనాథుడు స్మరింపబడిరి.

సంస్కృత పంచతంత్ర మందలి పెక్కుకథలీ యనువాదమున విడువబడినవి. ఇంచుమించు చంపువానువాదకులు విడిచిన కథలనే లక్ష్మీపతి శాస్త్రిగారును విడిచినారు. చంపూకర్తలు రచించిన మిత్రభేద మందలి ఆషాఢభూతి కథకు సంబంధించిన నాపితునికథను, కాకోలూకీయమందలి కామాతురునికథను, వృద్ధవణిక్కథను, చోరునికథను, వీరధనునికథను

రథకారుని అనుకథలనుగూడ ఈ కవిగారు విడిచినారు. బాలురకు నట్టి కథలు బోధింపరాదను సంకల్పముతో వాని ననువదింపకుండిరని యూహింపవచ్చును.

మొదటి భాగము నీతి చంద్రికకు సన్నిహితమై యున్నది. నీతిచంద్రిక యందలి పెక్కు పంక్తులు పద్యరూపమును దాల్చినవి. పదములుగూడ యథాతథముగా ననువదింపబడుట విశేషము. కొన్ని లక్ష్యములు:

1. మిత్రలాభమున లఘుపతనకుడు చిత్రాంగునితో పల్కుట:

'మంచి వారికి సహితము దుష్టులవలన భయముగలదు. పోగాలము దాపించినవారు దీపనిర్వాణ గంధము నరుంధతిని మిత్రవాక్యమును మూర్కొనరు కనరు వినరని పెద్దలు చెప్పుదురు, ప్రత్యక్షమున ముందిచ్చకము లాడి పరోక్షమందు గార్యహాని చేయు సంగాతిని పయోముఖ విషకుంభము వంటివాడు అట్టివాని సాంగత్య మవశ్యము మానుకోవలెను. అనగా విని హరిణము నిట్టూర్పు విడిచి యుల్లసిల్లెను”

మంచి వారికైన మహిలోన దుష్టుల
వలన భయంబలపడును గాదె
చేటుగాలము దాపు చెందిన వాడాప్త
వాక్యము దీప నిర్వాణ గంధ
మును, నాయరుంధతిన్వాస మూర్కొనంగన
రని చెప్పుదురు పెద్దలది నిజంబు
యెదుట నిచ్చక మాడి పిదపఁ బరోక్షమం
దునఁగార్య విఘ్నంబు నొనరుచుఁ జెలి
భువి పయోముఖ విషకుంభమునకు నుద్ది
యట్టి దుర్జన సాంగత్య మతిరయమున
విడుచుటయ శ్రేయమనిన నాఖువులువిని
యనియె నిట్టూర్పు విడిచి యా హరిణ మిట్లు పద్య 131

2. మిత్రభేదమందలి బకము-కర్కటకమును కథలో బక వాక్యములు :

'సకలదోషంబులకు మూలంబైన లోభంబు విసర్జింపవలయును. సర్వభూతంబుల యందు సదయుండయి యుండవలయును. అలోభంబును, భూతదయయును లేనివానికి సర్వధర్మంబులన్నిష్ఫలంబులయ్యె నిరర్థకంబులగు. జీవనంబు క్షణభంగురంబు గావున మోసపోక పురుషుండు కాలంబు పుచ్చక యుత్తమ ధర్మంబు లనుష్ఠింపవలయును.

అన్ని దోషంబులకు మూలమైన లోభ
మును విడిచి వేయుటయు సర్వభూత దయము
ముఖ్యములలోభ యుక్తియు భూత దయయు
లేనిచో నన్యధర్మంబు లూనవేల?

క్షణ భంగురంబు మనుగడ
క్షణిక పగిది మోసపోక కనుగలిగి యను
క్షణ ముత్తమ ధర్మంబులు
క్షణమును బొలి పుచ్చకుండ సలుపంగదగున్

పద్య—184, 85

3. మిత్రభేదమందలి టిట్టిభదంపతుల కథలో టిట్టిభుని దంభోక్తులు :

కువలయ నివహంబునకు దుహిన కిరణుండును పుండరీకషండంబునకు చండభానుండును చాతక వ్రాతంబునకు జీమూతంబు నెట్లట్లు శకుంత సంతానంబునకు నాగాంతకుండు ప్రభుండు. అతండు నిజపక్ష విక్షేప జాతవాతోద్ధూత కాండ కాండ చండబలుండు, తదాశ్రయుల మసల నీజలాశయుండు చెనకి మయిమయిం బోవనోపునే? ఏల యూరీల నాతరం బెఱుంగక కొఱమాలిన విచారములం జిత్తంబు వాత్తించెదు? సమాహిత చిత్తంబున నుండుము.?

కలువలగమికి వెన్నెలతోఁడునుం బుండ
    రీకషండమునకుఁ గోకమిత్రుఁ
డును జాతక వ్రాతమునకు జీమూతంబు
    నెట్లట్లు నీడజ బృందమునకు
వినతా తనూజుండు విభుఁడాతఁ డాత్మీయ
    పక్ష విక్షేపజ పవనహతి స
ముద్ధూత కాండ కాండోద్ధతుఁడతని యా
    శ్రియుల మామనలసీ జలధి చనక
మయియయింబోవ నోపునా? మగువ మిన్న
యేల యీలీలనాతర హెచ్చుఁగఁ గోరి
మాలిన విచారముల నూని మానగునొకో?
చిత్తమందు సమాహిత చిత్తవగుము- పద్య 405

శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు పరవస్తు చిన్నయసూరి రచించిన నీతిచంద్రికను నిర్వచనముగ ననువదించిన విధము పండితపరిశీలనార్హముగా నున్నది. అనువాదము సరళము ప్రసన్నతా బంధురముగా సాగినది.

సంస్కృత పంచతంత్రమందలి కాకోలూకీయాది తంత్రముల నాంధ్రీకరించునపుడును కవిగారు అన్వయ సౌలభ్యమునకు భావసారళ్యమునకు ప్రాధాన్య మొసంగినారు. పదాడంబరము మృగ్యము. కాకోలూకీయమందలి గజయూథపతి - శశ మను కథలో దూతగా వచ్చిన శశము గజయూథపతిచే నెవ్వడవని ప్రశ్నింపబడి తానచట వచ్చిన కార్యము నతినిపుణముగ నెఱింగించిన విధమును కవిగారిట్లు రచించినారు.

ఎక్కడనుండి వచ్చితివి యేమిటి కెయ్యది పేరునాఁగ దా
నిక్కరణిన్ వచించె శశమే శశిదూత నతండు వంపఁగా
నిక్కడ కేగుదెంచితి గజేంద్రవరా! విజయుండు నాదుపే
రక్కమలారి యోషధుల కన్నిటికిం బ్రభువాతఁడుంగవే
పద్య 83

కవిగారి యనువాద విధాన మిట్టిదని చెప్పుట కిట్టి పద్యముల నెన్నింటినేని చూపవచ్చును.

నీతిచంద్రికానువాదమున శ్రీ శాస్త్రిగారు పాత్రచిత్రణమున జూపిన ప్రతిభ యసన్య సామాన్యమైనది. చంపూనువాదకులకు దీసిపోని ప్రజ్ఞ గలవారనిపించుచుందురు. మిత్రభేదమందలి ఆషాఢభూతి వర్తనమును కవిగారు మనోహరముగ నిట్లు చిత్రించినారు.

సాగిలఁబడి లేచిసామిగా! యని ముకు
ళిత కరుండగుచు నాయతికి మఱుఁగు
వడక పరిక్క కొదింగి వాకుచ్చు ధర్మంబు
లేక తానుఁడు నోరా సూకొనుచు వి
లక్షునివలెఁ గదల్పక ప్రసరించిన
నయనంబులం జిరంతన స్వకీయ
ధర్మసంశయముఁ బోఁదట్ట వలంతి యా
పరిస్తుత పరిస్తావ భావమునకు
శ్లాఘనమానుఁడు నోలెఁ జలిత మస్తకుఁడౌచు
శ్రవణ విఘ్నం బొనర్చఁజాలకున్న
వాని మాదిరి జనుల సంభాషణముల
బొమలు ముడిగొన సీత్కార పూర్వకముగ
నడ్డగించుచు నుత్క్షిప్త హస్త సంజ్ఞ
నిర్భరానంద పరవశుని గతిఁజెందె

పద్య 148

లోకమునను సాహిత్య లోకమునను ప్రసిద్ధినొందిన ఆషాఢభూతి కపట స్వభావము సహజసుందరముగ ఇందభివర్ణింపబడినది.

అనంతామాత్యకవిగారి పంచతంత్రమందు దేవశర్మ రాజసంభావనమున కేగునపుడు పొందిన మానసికోల్లాసమును గవిగారిట్లు హృదయంగమముగ రచించినారు.

ఎందుల కంపితి నిల్లాలి నేనేగఁ
బసిబాలు రక్షించు వారలెవ్వ
రెన్నఁడే తెంచునో పున్నెంపు వాసరం
బెన్నఁడు పిల్చునో నన్ను నృపతి
యెన్నడిచ్చునో దానమెన్నడు నాకు భా
గ్యమ్ము గల్గునో యంచునాస మిగుల
నూఁడియుం దటి వచ్చియుండఁగా నక్కటా!
యరుగు టెంచుట కిప్పుడనువు దప్పె
నంచు జింతించి బిడ్డగాఁ బెంచినట్టి
ముంగినింబట్టి దానిని ముద్దుపట్టి
చుట్టానుం దిప్పి శిశునోము నట్టుజెప్పి
సంజ్ఞగా ద్వారమున నిల్పి చనె నతండు

పద్య – 17

ఇట్లు పాత్రల మానసిక స్థితిగతుల చిత్రణలో గవిచూపిన సామర్థ్య మనుపమము.

లక్ష్మీపతి శాస్త్రి గారు వర్ణనలను సందర్భ సముచితముగ నిర్వహించిన విధముగూడ ప్రశంసనీయముగా నున్నది. తమ గ్రంథమందలి సంధివిగ్రహ పరిచ్ఛేదారంభమున కథాభాగమునకు రంగస్థల సదృశమైన వటవృక్ష వైభవమునిట్లు వర్ణించినారు.

బారులుదీరి శాఖలు నభంబును దట్టిదిశల్ గ్రసించుచున్
ధారుణినాని సూర్య కిరణంబులకుం జొరరాక జొంపమై
మీఱి విహాయసావళికమేయ సుఖావహ సద్మ మాచుఁ జె
న్నారెడి నొక్క కాననమునందు వటంబొకఁ డద్భుతంబుగన్

పద్య 6

మూలమున వటవృక్షము 'అనేకశాఖా సనాథః, అతి ఘనతర పత్రచ్ఛన్నః' అనియుండ ననువాదము వివరణాత్మకముగా నిర్వహింపబడినది. ఆ తంత్రమునందే ఘూకపతి క్రూరాకృతి యిట్లభి వర్ణింపబడినది.

కూరిమము మానసంబు దలకుం గలిగించెడి నూపసహ్యమా
కారమెయుంగు మిక్కిలి వికారము వెల్గున గోడి గొందులం
దూరు దివాంధమె ట్లరులందోలి స్థిరంబుగ రాజ్యలక్ష్మి బెం
పారంగఁ జేయఁజాలు నెడరైన తెఱఁగ్ మదిఁ జక్కనెంచుఁడి
పద్య 64

గజయూథపతి-శశము అను కథలో భయంకర మగు ననావృష్టిని కవిగారిట్లు వర్ణించినారు.

నదుల నెల్లెడ నిసుమె కండ్ల బడుచుండఁ
గొండలందెల్ల నెరగలి మొంగు దోఁచెఁ
బచ్చ కప్పూరమయ్యెను బచ్చియోఁడు
లెండమావుల వెన్నంటె మృగములపుడు పద్య 67

గీతపద్యమున అనావృష్టి సమయ సన్నివేశమును జిత్రించిన కవిప్రతిభ యభినంద్యము.

ఈ యనువాదమున సమయోచితముగ 'కాయమున్మున నమ్మ దాకినట్లైలె, హాహాహారిగ, మదిగట్టున్ రట్టుగాసీక, చంకన బెట్టు కున్న మున్నగు తెనుగు పలుకుబడులు ప్రయోగింపబడిన విధము పుత్తడికి తావియబ్బినట్లున్నది.

లక్ష్మీపతి శాస్త్రిగారు నిర్వచన నీతి చంద్రికను రచించుచు పంచతంత్ర హితోపదేశములలోని పెక్కు నీతి శ్లోకముల ననువదించిన విధముగూడ మిక్కిలి ప్రశంసనీయముగా నున్నది. కేవలము యథా మూలముగా గాక అనువాదమున గొంత స్వాతంత్ర్యము నవలంబించుట వారి ప్రత్యేకతగా గుర్తింపవచ్చును. ఎల్లయెడల గవిగారి సామర్థ్యము ప్రస్ఫుటముగా గాననగును. కొన్ని లక్ష్యములు :

1) మృద్ఘట ఇవ సుఖభేద్యః దుస్సంధానశ్చ దుర్జనో భవతి
సుజనస్తు కనకఘట ఇవ దుర్భేదః సుకర సందిశ్చ
పం. తం — మి. సం — ౧

ఈయది నాదునిశ్చయ మికేటికి దుర్జను మృద్ఘటంబుగా
నే యెడనైన సంధి యొనరింపన సాధ్యము గాని భేదమున్
జేయుట తద్ద లాఘవపుఁ జేఁతసుమీ యిది వైపరీత్యమౌ
నాయత బుద్ధి! సజ్జనుని యందున హేమఘటంబు రీతిగా

మి–లా–పద్య 149

2) ఏక ఏవ సుహృద్ధర్మః నిధనేఽప్యనుయాతి యః
శరీరేణ సమం నాశం సర్వమన్యత్తు గచ్ఛతి

హితో–మి–లా–శ్లో 70

దార సుతాప్త బంధువులు దారు దయుందన వెంట వత్తురే?
దారుణ పాశబంధముల ధర్ముని దూతలు గొంచుఁ బోవుచో
వారక ధర్మ మొక్కటియె వచ్చును ప్రాణము నీడఁ దోడుగా
నేరక మున్ను నేఁ బడితి నిక్కమెఱుంగ జెడుంగ నేటికిన్

మి. లా–పద్య 106

3) స్థానభ్రష్టా న శోభన్తే దన్తాః కేశా నఖా నరాః
ఇతి విజ్ఞాయ మతిమాన్ స్వస్థానం న పరిత్యజేత్

హితో–మి. లా–శ్లో 107

నర దంత కేశ నఖములు
వఱలవు తమ మనికి పట్లు వదలిన గుఱిశి యీ
సరణి నెఱిఁగి తన నెలవుం
దొరఁగ న్వలెనన్న కోర్కె దొరఁగ న్వలయున్

మి. లా–పద్య 161

4) స్పృశన్నపి గజో హన్తి జిఘ్రన్నపి భుజఙ్గమః
హసన్నపి నృపో హన్తి మానయన్నపి దుర్జనః

పం. తం.–కాకో–శ్లో 81

మూర్కొనుచునే భుజంగముఁ బొలియఁజేయు
మేలమాడుచునే రాజు నేలఁగలుపు

వినయము నటించుచు నెమ్మూర్ఖుఁ డణగఁద్రొక్కఁ
జాలు చునె సంహరించు దంతావళంబు

సం. వి-పద్య 81

5) రోహతే సాయకై ర్విద్ధం ఛిన్నం రోహతి చాసినా
వచో దురుక్తం బీభత్సం న ప్రరోహతి వాక్ క్షతమ్

పం.తం-కాకో-శ్లో 109

కటువు శరమ్ముచే నయిన గాయమునూనను మంచి గొడ్డటన్
నఱికిన గొమ్మ లేజిగురునం బొలుపారును బచ్చవారు ము
న్మురముగ దావవహ్నిఁ బడి మాడిన పచ్చిక నిష్ఠురోక్తులన్
విఱిగిన మానసం బతుకునే? పదివేల విధాల హార్తినన్

సం. వి-118

6) సందర్భోచితముగ శ్రీ శాస్త్రిగారు భర్తృహరి నీతిశతక
మందలి శ్లోకమునకు గావించిన యనువాదము :

క్వచిత్పృథ్వీ శయ్యః క్వచిదపి చ పర్యంక శయనః
క్వచిచ్ఛాకాహారః క్వచిదపి చ శాల్యోదన రుచిః
క్వచిత్కంథాధారీ క్వచిదపి చ దివ్యాంబర ధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చసుఖమ్

ధైర్యపద్ధతి-శ్లో 714

కటికునేలలఁబండు గార్య సాధకుఁడొక్క
తఱి యొక తఱిఁ బండు పఱుపుల పయిఁ
గూరగాయలె తిను గూడుగా నొక్కచో
నొక్కచో దినును శాల్యోదనంబుఁ
గ్రింతల బొంతను గప్పు నొండొక మొడ
నునుబట్టుచేల దాల్చునొక యెడను
సుఖదుఃఖములకు నించుక తావు మదినీక
నిత్యసంతోషిగా నెగడుచుండు

సధిక సామర్థ్య మొప్పార నమరియున్న
వాడు సయుతము దనపగవారిఁ గొల్చి
తగిన సమయంబు సేకూరఁ దడయకపుడె
కెరలి విమతుల సులువుగా గెలుపుఁగొనును

సం. వి—పద్య 207

ఇట్లు మధురముగ బంచతంత్రిమును లక్ష్మీపతిశాస్త్రిగారనువదించుట ముదావహము. సర్వ్యచనముగ ననువదించుట వీరి ప్రత్యేకత. అట్లే రెండవ భాగమునకు నీతిచంద్రిక యను నామకరణమును గావించుట బట్టి చిన్నయసూరి నీతిచంద్రికకిది శేష గ్రంథముగ బరిగణింప దగినదని చెప్పవొప్పను.

## 12 గ్రంథాలయములందలి యనువాదములు :

శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారు, మూలబగుంట నారాయణకవి పంచతంత్ర ముద్రిత ప్రతికి పీఠిక వ్రాయుచు నందు గొన్ని లిఖితరూపమునమన్న పంచతంత్రానువాదములను జేర్కొని నారు[9]. వాని వివరములు :

1) పంచతంత్ర వచనము. తాటాకు ప్రతి ఆర్. నెం. 990. మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ పట్టిక
2) (పై పట్టికలో) ఆర్. నెం. 53
3) ఆర్ 84 పంచతంత్ర కథ తాటాకు
4) డి 1422 పంచతంత్ర కథ తాటాకు, అసంపూర్తి.
5) డి 1423 పంచతంత్ర కథ తాటాకు, సంపూర్తి.
6) డి 2980 పంచతంత్ర కథ తాటాకు, అసంపూర్తి.
7) నెం 6969 శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తాటాకు, సంపూర్తి

9 ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమి ప్రతి. పీఠిక పుట 37

## 13 పత్రికానువాదములు :

పంచతంత్ర కథలు బాలుర కెంతయో యాసక్తిదాయకములు నుత్కంఠ ప్రదములు నగుటచే బెక్కు మాసపత్రికలో నాంధ్రీకరింప బడినవి. వానిలో 'చందమామ'లో విద్వాన్ విశ్వంగారును, 'ఆంధ్ర ప్రదేశ్'లో శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును నాంధ్రించిన పంచ తంత్రానువాదములు ప్రశంసార్హములు. చందమామ, బాలమిత్ర మున్నగు పత్రికలలో నేటికిని బంచతంత్రము బొమ్మలలో రంగు రంగుల బొమ్మలతో వచనమున ననువదింపబడుచునే యున్నది. ఈ శతాబ్దికే చెందిన విశ్వాత్ముల నరశింహ మూర్తిగారు బాలురకు బొమ్మల కథలుగా మిత్రభేద మిత్రలాభములను, బాపు తక్కిన భాగ మును జిత్రించిరనియు ఆ చిత్రములకు నండూరి రామమోహనరావు గారు సాహిత్యమును వ్రాసిరనియు శ్రీ ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్య మున దూబగుంట నారాయణకవిని గూర్చి వ్రాయు సందర్భమున బేర్కొనినారు[10]. ఆ పుటలోనే పంచతంత్రమందలి 'తగవుతీర్చిన పిల్లి కథ'ను మహాబలిపురములో శిల్పులు గండరించిరని ఎ.ఎస్.పి. అయ్యరు గారు గుర్తించిరనియు ఆరుద్ర సూచించినారు. పంచతంత్రము బొమ్మల రూపమునను శిల్పముల రూపమునను వ్యాప్తినొందుట గ్రంథప్రాశస్త్య మును నిరూపించుచున్నది.

## 14 ప్రసిద్ధాంగ్లానువాదములు :

సంస్కృత పంచతంత్రము నాంగ్లమున ననువదించిన వారిలో 'Franklin Edgerton', 'Arthur W. Royer' అను మహాకవులు ప్రథమగణ్యులు. ఇరువురి యనువాదములు నించుమించు ఏకకాలము ననే వెలువడినవి. క్రీ. శ. 1924వ సంవత్సరమున రెండును వాదములును ముద్రితములు. ఒక్కొక్క గ్రంథమున నొక్కొక్క విశిష్టత గలదు.

ఎడ్గర్టన్ మహోదయుని యనువాదమునకు సుప్రసిద్ధమైన పీఠిక గలదు. అందతడు పంచతంత్ర విహంగము ప్రపంచ సాహిత్య

10 సంపుటము — 6 — పుట 131

విహాయసమున నెట్లు విహరించినదో వివరించినాడు. రైడరుగారి యను వాదమున బీతిక రేఖామాత్రముగా నున్నది. ఎడ్జర్టన్‌గారి యను వాదము సంపూర్ణముగ వచనమున సాగినది. సంస్కృత పంచతంత్ర శ్లోకములుగూడ వచనముననే యనువదింప బడినవి. రైడర్‌గారి యను వాదము గద్యపద్యాత్మకముగ జంపూపద్ధతిలో నిర్వహింప బడినది. శ్లోకములు పద్యములుగ గూర్పబడినవి.

కథాస్వీకరణమునను రెండనువాదములలో వ్యత్యాసమున్నది. ఆంధ్ర చంపూకర్త లేయే పంచతంత్ర కథల ననువదించినారో ఆయా కథలు మాత్రమే ఎడ్జర్టన్‌గారి యనువాదమున గలవు. వారు విడిచిన కథలీ యనువాదమున మృగ్యములు. ఏదియో యొక తెనుఁగు పంచ తంత్రానువాదమును ఎడ్జర్టన్‌గా రాంగ్లీకరించి రనఁజాలుగుగాని చంపూ కర్తలకు లభించిన సంస్కృత ప్రతియే ఎడ్జర్టన్‌గారికి లభించి యుండు నేమో యని యూహింప వచ్చును. రైడర్‌గారి యనువాదమున సంస్కృత పంచతంత్రమందలి కథలన్నియు గనుపించుచున్నవి. చంపూ కర్తలనువదింపక విడిచిన మిత్రభేదమందలి దంతిల గోరంభులకథ, విష్ణురూప ధూర్తకౌలికుని కథ, చటకదంపతులు – కుంజరమును కథ, సుహృల్లాభమందలి సాగరదత్తుడను వణిజుని పుత్రుని కథ, వృష భాండములు–నక్క యనుకథ యింకను దక్కిన తంత్రములలోని యిట్టి పెక్కుకథలు రైడర్‌గారి యనువాదమున గలవు. నేడు లభ్యమగు చున్న సంస్కృత పంచతంత్ర ప్రతి కీయనువాద మత్యంత సన్నిహిత ముగ నున్నది.

ఉపలభ్యమానమగు విష్ణుశర్మ కృతమగు పంచతంత్ర ప్రతిలో గాని నారాయణకవి కృతమగు హితోపదేశమునగాని మిత్రప్రాప్తి తంత్రమందలి చింత్రాంగుడను మృగముయొక్క పూర్వ జీవిత చరిత్ర కనుపింపదు. దూబగుంట నారాయణకవి యాంధ్రీకరణమున ఆ కథ యుండుటచే నది యాతని స్వీయమని తలంపబడినది. కాని యా చిత్రాం గుని పూర్వ జీవితోదంతము ఈ రెండాంగ్లానువాదములందు నున్నది.

దీనినిబట్టి ఆ కథగలిగిన సంస్కృత పంచతంత్రప్రతి ఈ యాంగ్లాను వాదకులకు లభించి యుండునేమోయని యూహింప వీలున్నది. అట్లే ఎలుక గజమిథునమును రక్షించుట యనుకథ భానుకవి యాంధ్రీకరణమున మిత్రలాభ తంత్రానువాదమున గనుపించుచున్నది. అది మూలమైన పంచతంత్ర సంస్కృత గ్రంథమున మృగ్యమగుటచే భానుకవి స్వీయముగ రచించియుండునని పరిగణింపబడినది గాని ఆ కథ రైడర్ గారి యాంగ్లానువాదమున గలదు. బహుశః ఆ కథగల సంస్కృత పంచతంత్ర ప్రతి రైడర్ గారికి లభించి యుండెనేమో? చెప్పజాలము.

ఆంగ్లానువాదకులు పంచతంత్ర నామములను ఆంగ్లమున బరివర్తించుట వారి ప్రత్యేకతగా గుర్తింపదగినది. కంబుగ్రీవః అని పంచతంత్రమున నుండగా ఆంగ్లానువాదకు లిరువురును 'Sheel-Neck' అని యాంగ్లీకరించినారు. అట్లే పంచతంత్ర మిత్రభేదమందలి మత్స్యత్రయకథలోని 'అనాగత విధాతా, ప్రత్యుత్పన్న మతిః, యద్భ విష్యః' అని మత్స్యనామములు రచింపబడగా ఎడ్జర్టన్ గారి యనువాదమున 'Forethought, Ready wit, Come-what-will' అను పేళ్లు గలవు. రైడర్ గారి యనువాదమున 'Come-what-will' అను పేరునకు బదులు 'Fatalist' అని గలదు. తక్కినవి సమానమే. రైడర్ గారి యనువాదమున సంస్కృత నామాంగ్లీకరణము మిక్కుటముగా గలదు. అందు దేవశర్మ యనుపేరు 'godly' అనియు, ఆషాఢభూతి యనుపేరు 'June' అనియు రచింపబడెను.

ఎడ్జర్టన్ గారి యనువాదమున భాష సరళముగను బహుజన సులభ గ్రాహ్యముగ నున్నది. వారి శ్లోకానువాదముగూడ వ్యాఖ్యానపద్యముగ సాగినది. స్పష్టత వారి యాంగ్లానువాదమున నంతటను వెల్లివిరియుచున్నది. రైడర్ గారి యనువాదమున ఆంగ్లభాషా సహజములైన నుడికారములు పెక్కులు గలవు. భాష జటిలముగ నున్నది. రచనమున ప్రౌఢిమ యెల్లయెడల ప్రస్ఫుటమగు చుండును. ఇరువురి శ్లోకానువాద విధాన పరిశీలనకు గొన్ని యుదాహరణములు :

1) కనక భూషణ సంగ్రహణోచితో
యది మణిస్త్రపుణి ప్రతిబధ్యతే
న స విరౌతి, న చాపి న శోభతే
భవతి యోజయితుర్వచనీయతా    మి. భే—శ్లో 81

ఎడ్జర్టన్ గారి యనువాదము—

'If a gem worthy to be encased in an ornament of gold be set in tin, it makes no complaint and does not cease to be resplendent; but blame falls on him who uses it so'

-Page 30

రైడర్ గారి యనువాదము—

'If set in tin, a gem that would
Adorn a golden frame
will never scream, nor fail to gleam
Yet tells its wearer's shame'

-Page 32

2) న గోప్రదానం న మహీప్రదానం
న చాన్నదానం హి తథా ప్రధానమ్
యథా వదంతీహ బుధాః ప్రధానం
సర్వప్రదానేష్వభయప్రదానమ్    మి. భే—శ్లో 313

ఎడ్జర్టన్ గారి యనువాదము—

'Not a gift of cow, nor a gift of land, nor yet a gift of food, is so important as the gift of sefety, which is declared to be the great gift among all gifts in this world'
-page 58

రైడర్ గారి యనువాదము—

' The wise declare and understand
No gift of cow or food or land
To be among all gifts as grand
As safety granted on demand'    -page 118

3) కాయః సన్నిహితాపాయః సంపదః క్షణభంగురాః
సమాగమాః సాపగమాః సర్వేషామేవ దేహినామ్

మి-సం-శ్లో 191

ఎడ్జర్టన్ గారి యనువాదము—

'The body embodies disaster fortune plays the tune of misfortunes; associations have their disassociations every thing that is born dies'

-page 102

రైడర్ గారి యనువాదము—

'The body, born, is near its doom
And riches are the source of gloom;
All meetings end in partings; yes
The world is all one brittleness.' -page 246

4) శస్త్రహతా న హి హతా రిపవో భవంతి
ప్రజ్ఞాహతాస్తు రిపవః సుహతా భవంతి
శస్త్రం నిహంతి పురుషస్య శరీరమేకం
ప్రజ్ఞా కులం చ విభవంచ యశశ్చ హంతి

కాక-శ్లో-241

ఎడ్జర్టన్ గారి యనువాదము—

'An arrow shot by an archer may kill a single man, or it may not. A clever decive launched by a clever man may destroy a kingdom along with the king.

- page 135

రైడర్ గారి యనువాదము—

'It is not the sword destroys a foe
'It is wit that utterly lays low
Swords kill the body; wit destroys
Fame, family and regal joys' -page 322

5) రామస్య వ్రజనం, బలేర్నియమనం పాండోస్సుతానాం వనం
వృష్ణీనాం నిధనం, నలస్య నృపతే రాజ్యాత్ పరిభ్రంశనమ్

నాట్యాచార్యక మర్జునస్య పతనం సంచిత్య లంకేశ్వరే
సర్వం కాల వశాజ్జనోఽత్ర సహతే కః కం పరిత్రాయతే

కాకో-శ్లో 252

ఎడ్జర్టన్ గారి యనువాదము—

'When one reflects on Rama's banishment, the humiliation of Bali, the dwelling in the forest of the sons of Pandu, the destruction of the Vrsnis, king nala's loss of his kingdom, the dwarf exhistance of visnu and the slaying of Arjuna, and (what happend to Ravana) the lord of ceylon (it is clear that) man undergoes all (that befalls him) by the power of destiny and none can save any one from it' -page 137

రైడర్ గారి యనువాదము—

'Remember Rama wandering far
Remember Nala's sinking star;
With Bali's bonds, the vrshni's tomb,
And Lanka's – monster monarch's doom;
The Pandu's forest-borne disaster,
And knightly Arjun, dancing-master.
Time brings us woe in countless shapes.
What savior is there? who escapes? -page 325

ఈ విధముగ ఎడ్జర్టన్ రైడర్ అనువారిచే పంచతంత్ర మాంగ్లమున ననువదింపబడినది. ఆ యాంగ్లానువాదములు పాశ్చాత్యులకే గాక ఆంధ్రేతరులైన భారతీయులకు గూడ బంచతంత్ర కావ్యప్రాశస్త్యమును దెలుప గలవు.

సంస్కృతమున విష్ణుశర్మచే రచింపబడిన పంచతంత్రము తెనుగులో పెక్కు శతాబ్దుల నుండియు భిన్నవిధములుగ ననువదింపబడుచు బహుళ వ్యాప్తినందినది. నారాయణకవి, భానుకవి, వేంకటనాథకవి నైకవిధ పద్యరచనా శిల్పచమత్కృతులతో జంపూకావ్యములుగా నాంధ్రీకరించి చిరయశస్సు నార్జించుకొనినారు. తక్కినవారెందరో తేట తెల్లముగ ననువదించి కృతకృత్యులైనారు.

# ఉపసంహారము

సంస్కృత పంచతంత్రము పలుమార్పులతో బెక్కు రూపములను సంతరించుకొని బహుభారతీయ భాషలోని కనువదింపబడి పాశ్చాత్య దేశము లందును ప్రవేశించి అందును నైక భాషానువాదములతో విలసిల్లి ప్రపంచకథానకసాహిత్యమున ప్రముఖపాత్ర వహించుచున్నది.

తెనుగున లభ్యములగు పంచతంత్రానువాదము లన్నింటను దూబగుంట నారాయణకవి, భానుకవి, బైచరాజు వేంకటనాథుడు అను ముప్వురు మహాకవులు గావించిన యనువాదములు పరమ రమణీయములు. కథాకథనమున, నీత్యుపదేశమున, వర్ణనా నిర్వాహణమున ఆ యనువాదకులు ముప్వురును దమ ప్రత్యేకతను నిలుపుకొనినారు.

ఆ పంచతంత్రానువాదకకవిత్రయమున బైచరాజు వేంకటనాథుడు గావించిన యనువాదము పరమ ప్రాబంధికముగా నున్నది. ప్రతిఘట్టము ప్రబంధకవుల రచనా విన్యాస బాహుళ్య బంధురముగ రూపొందింపబడినది. ఆతని పదప్రయోగమునను, వర్ణనా నిర్వాహణమునను భట్టబాణుని కవితా ప్రౌఢిమలు ప్రస్ఫుటమగుచుండును. ఆతని కవితా చమత్కారవైభవ ప్రదర్శనము సుమనో మనోహరము. ఆ కవి చంద్రుడు అనువాద రచనకు బూనుకొనక స్వతంత్ర కావ్యరచనమునకే యుపక్రమించియున్నచో పెద్దన తిమ్మనాదులవలె **బహుళ ప్రచార** ప్రసిద్ధులు పొందియుండెడివాడు. ఆతని సర్వతోముఖ స్వతంత్రకావ్యరచనా వైదగ్ధ్య నిరూపకమనదగినది చతుర్థాశ్వాస మందలి భువనమోహిని యను రాజపుత్రిక జయసేనుని బెండ్లాడిన కథ. సర్వాంగ పరిపుష్టమైన ఆ ఒక్క కథయు ఒక ఏకాశ్వాస ప్రబంధముగ గణింపదగ్గది.

ఇంచు మించు వందసంవత్సరములలోపున నున్న నారాయణకవి, భానుకవి, వేంకటనాథుడు పంచతంత్రమునే చంపూ కావ్యముగ రచించుట అభినంద్యము. ఆంధ్రకథానక సాహిత్య చరిత్రలో జిరస్థాయులుగ నిలువదగిన ఆ మహాకవులు ధన్య చరిత్రులు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశః కాయే జరామరణజం భయమ్

—శమ్.

# ముఖ్యోపజీవ్య గ్రంథ సూచిక


సంస్కృతము:

శ్రీమద్రామాయణము — వాల్మీకి
శ్రీమన్మహాభారతము — వ్యాసమహర్షి
అగ్నిపురాణము — వ్యాసమహర్షి
ఋగ్వేద సంహిత
ఔచిత్య విచారచర్చ — క్షేమేంద్రుడు
కావ్యాదర్శము — దండి
కావ్యాలంకారము — భామహుడు
ధ్వన్యాలోకము — ఆనందవర్ధనుడు
నాట్యశాస్త్ర వ్యాఖ్య — అభినవగుప్తుడు
పంచతంత్రము — విష్ణుశర్మ — వేదం వారి ప్రచురణ
ప్రతాపరుద్రీయము — విద్యానాథుడు — వావిళ్ల వారి ప్రచురణ
రసగంగాధరము — జగన్నాథుడు
లింగాభట్టీయము — వావిళ్ల వారి ప్రచురణ
వక్రోక్తి జీవితము — కుంతకుడు
సాహిత్య దర్పణము — విశ్వనాథుడు
హితోపదేశము — వావిళ్ల వారి ప్రచురణ – 1969.

ఆంధ్రము:

అప్పకవీయము — కాకునూరి అప్పకవి
ఆంధ్రకవి తరంగిణి (సంపు - 8, 9) — చాగంటి శేషయ్య
ఆంధ్రకవిత్వ చరిత్ర (సంపు - 1) — భోగరాజు నారాయణ
ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు — ఆంధ్ర సారస్వత పరిషత్ప్రచురణ – 1968
అర్థ విజ్ఞాన సర్వస్వము — శీలప్ప రామకృష్ణశాస్త్రి

కథలు — గాథలు (సంపు - 3) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
కుమార సంభవము — నన్నిచోడుడు
చరిత్రకెక్కని చరితార్థులు — ఆచార్య బి. రామరాజు — షష్ట్యబ్దపూర్తి సంఘ ప్రచురణ - 1985
నరసభూపాలీయము — భట్టుమూర్తి
నిర్వచన నీతిచంద్రిక (రెండు సంపుటములు)—మల్లాది లక్ష్మీపతిశాస్త్రి
నీతి కథామంజరి — కందుకూరి వీరేశలింగం పంతులు
నీతిచంద్రిక — చిన్నయసూరి-వావిళ్ల వారి ప్రచురణ - 1966
నీతిచంద్రిక సంగ్రహము — కందుకూరి వీరేశలింగం పంతులు
నీతిచంద్రిక సంధి — కందుకూరి వీరేశలింగం పంతులు
పంచతంత్రము — దూబగుంట నారాయణకవి - వావిళ్ల వారి ప్రచురణ - 1963
పంచతంత్రము — దూబగుంట నారాయణకవి - అకాడమీ ప్రచురణ - 1980
పంచతంత్రము — బైచరాజు వేంకటనాథుడు - వావిళ్ల వారి ప్రచురణ - 1924
పంచతంత్రము (వచనానువాదము) — వావిళ్ల వారి ప్రచురణ—1973
పంచతంత్రి — భానుకవి — Madras Government Oriental Manuscripts Series No. 19 — 1951
ప్రబంధ రత్నావళి — వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంకలన గ్రంథము
బాలకవి శరణ్యము — గిడుగు వేంకటరామమూర్తి సంతులు
బాలవ్యాకరణము — పరవస్తు చిన్నయసూరి
భారతి (సంపుటము 18) — కాశీనాథుని నాగేశ్వరరావు
రామాయణ కల్పవృక్షము — విశ్వనాథ సత్యనారాయణ
వాఙ్మయ ప్రసూనమంజరి — డా. నేలటూరి వేంకటరమణయ్య
విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర — తేకుమళ్ల అచ్యుతరావు
విజ్ఞాన సర్వస్వము (సంపుటము-3)— తెలుగుభాషా సమితి ప్రచురణ

విరాటపర్వము — తిక్కన
వీరేశలింగ గ్రంథావళి (సంపుటము - 8)
సకలనీతి సమ్మతము — మడికి సింగన
సమగ్రాంధ్ర సాహిత్యము (సంపుటము - 6)
సింహాసన ద్వాత్రింశిక — కొఱవి గోపరాజు

ఆంగ్లము :

A descriptive catalogue of the Telugu manuscripts in the Tanjore Maharaja Serfoje's Saraswathimahal Library
A history of Sanskrit Literature by Arthur A. Macdonell
Encyclopaedia of Amaricana
Encyclopaedia of Britannica
Panchatantra translated by A. W. Ryder — 1973
Panchatantra translated by Franklin Edgerton — 1973
Preface of Hitopadesa of Narayana Pandit — Edited by M. R. Kala — 1967
The Students Sanskrit — English dictionary by S. A. Aptae